Punukollu Radha
Krishna Row

# విప్రదాసు

శ్రీ శరశ్చంద్రుని నవల

PARA ASHOK KUMAR





అనువాదం

పురాణం కుమారరాఘవశాస్త్రి బి. ఎ.

# వి ప్ర దా సు

[శరత్ నవల]






అనువాదం

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి, బి. ఏ.



సోల్ శెల్లింగ్ ఏజంట్లు

వెరైటీ ఏజన్సీస్

ప్రతి వెల

2½ రూపాయలు

ప్రథమ ముద్రణము

ప్రతులు 1000





ప్రకాశకులు

బిజిమళ్ళ విశ్వనాథం

నేలకొండపల్లి



సెప్టెంబరు 1946

# 1

బలరామపురం గ్రామం ఊరివెలుపల మైదానంలో మజదూర్ కిసాన్‌సభ జరిగింది. ఆ నాడు ఆదివారం. సెలవుదినం కావటంచేత రైల్వే కూలీలుకూడావచ్చి సమావేశంలో పాల్గొన్నారు. సభకు కొత్తకళ వచ్చింది. కలకత్తానించి ప్రసిద్ధ ఉపన్యాసకులు కొందరు వచ్చారు: దేశంలోని ఆర్థిక - సాంఘిక - తరతమ విభేదాలను ఖండిస్తూ తీవ్రంగా ఉపన్యసించారు. వందేమాతరం వినాదాలు మిన్నుముట్టినవి. కార్యక్రమంలో చివరి అంశం ఊరేగింపు.

బలరామపురం స్వయం సమృద్ధమైన గ్రామము. పిల్లమీందారులు, పెద్ద జమీందార్లు, సంపన్న గృహస్థులు ఉన్నారు. ఒకమూల మహమ్మదీయ కర్షకులు కాపురముంటూన్న గల్లీ ఉంది. అక్కడికి సమీపంలోనే కొందరు అస్పృశ్యులు, బెస్తవాళ్ళు నివసిస్తున్నారు. గంగానదినించి ఒక శాఖ అటు ప్రవహించినదట ఎప్పుడో పూర్వం. ఇప్పు డక్కడ రెండు మైళ్ళ చదరం గలిగిన ఒక చెరువుఉన్నది. ఆ చెరువు ఒడ్డునే వారి గుడిసెలు ఉన్నవి.

ఆ గ్రామంలో అందరికన్నా ధనవంతుడు యజ్ఞేశ్వర ముఖోపాధ్యాయ్. ఆయనమేడముందుగా ఊరేగింపు సాగిపోతున్నది. ఎర్రజెండాలు ఎగురుతున్నవి. జయశబ్దాలు అంబరాన్ని చుంబిస్తున్నవి. అప్పుడా మేడ రెండవ యంతస్తులో ఒక బలిష్ఠుడైన యువకుడు నిల్చి ఉత్సవాన్ని చూస్తూఉన్నాడు. ప్రజలదృష్టి అతనిపై పడింది. మరుక్షణమే ఆ కోలాహలం శాంతించింది. "ఏమిటా ఇది?" అనుకుంటూ ముందునడుస్తూన్న నాయకులు వెనక్కు తిరిగిచూచారు. వారి చూపులుకూడా మేడమీదికి ప్రాకినవి. ఆ యువకుడొక స్తంభంచాటుకు తప్పుకున్నాడు.

"ఎవరావ్యక్తి?" అని ఎవరిదో ప్రశ్న.

"విప్రదాసుబాబు" అని జవాబు.

"విప్రదాసుబాబు! ఈ గ్రామ జమీందారు!"

"ఔను. ఆయనే"

నాయకులు పట్నాలనించి వచ్చినవాళ్ళు. వారికేమీ పరవాలేదు. "ఓస్, ఇదా సంగతి?" అంటూ అలక్ష్యంగా పలికి, చేతులెత్తి బిగ్గరగా వినాదాలు చేశారు.

"మాతృభారతికి జై"

"మజదూర్ కిసానులకు జై"

"వందే మాతరం"

కాని ప్రజలావినాదాలను అంది పుచ్చుకోలేదు. చాలమంది పెదవులు విప్పనేలేదు. నలుగు రైదుగురు మాత్రం క్షీణకంఠస్వరాన ఏమైనా జయశబ్దాలు పలికినా అవి మేడమీది విప్రదాసుకు వినిపించగలిగినవి కాదు. నాయకులు అవమానితులైనట్టు భావించుకున్నారు. "ఆయన ఒక మామూలు పల్లెటూరి జమీందారు. ఆయనంటేనే ఇంత భయం ఎందుకు? అలాటివారే మన పరమ శత్రువులు. నిరంతరమూ వారు మన రక్తాన్ని పిండుకుని తాగుతున్నారు. మనం నిజంగా యుద్ధం చెయ్యవలసినది వారితోనే" - అన్నారు కోపం తెచ్చుకుని.

కాని ఆ దురుసుమాటలు అంతటితోనే ఆగిపోయినవి. వారి తూణీరములలో అంతకన్నా వాడి బాణాలే ఉన్నవి. కాని వాటిని వారు ప్రయోగింప లేకపోయారు. ఆ గుంపులోనే ఎవరో మెల్లిగా అన్నాడు - "ఆయనగారి అన్నయ్యే".

"ఎవరి అన్నయ్య?"

ఒక పాతికేళ్ళ యువకుడు జండాపుచ్చుకుని ముందు వెడుతున్నాడు. "మా అన్నయ్యే" అన్నాడతడు. అతని పట్టుదలవల్లనే. అతని ఉత్సాహంవల్లనే ఆ నాటి వారి కార్యక్రమం జయప్రదంగాసాగింది. అయిన ఖర్చంతా ఆతడే భరించాడు.

"ఓహో. మీ అన్నయ్యగారా? మీరూ ఇక్కడ జమీందార్లే అన్నమాట!"

యువకుడు లజ్జాన్వితుడై నమిత వదనుడైనాడు.

# 2

"నిన్నమీరు కావించిన ఉత్సవం బాగుంది. ఎంతో ఆకర్షణీయంగా ఉంది. ఉత్సాహావేశాలు పొంగి ప్రవహించినవి. మీ వినాదాలన్నీ సమంజసంగా ఉన్నవి" అన్నాడు విప్రదాసు తమ్ముడితో ఆ మర్నాడు.

ద్విజదాసు జవాబేమీ చెప్పలేదు.

"అయితే ఈ ఊరేగింపు నన్ను భయపెట్టేందుకేనా ?"

"కేవలం విన్ను భయపెడతామనే కాదు. ఊరేగింపును చూచినా చూడకపోయినా భయపడవలసినవారు ఎలాగూ భయపడి తీరుతారు"-అన్నాడు ద్విజదాసు శాంతంగా.

విప్రదాసు మందహాసం చేశాడు. "నేను ఆ రకం మనుష్యులలో చేరినవాణ్ణి కాదు. ఆ సంగతి మీ ఉత్సవంలో పాల్గొన్న చాలామందికి తెలుసును. లేకపోతే మేడమీద వరాండాలోకివచ్చి ఎందుకు నిలబడిచూస్తాను. లోపలే కూచుంటే మీకేకలు వినిపించవూ ? మీ యెర్రని పచ్చని జండాలకూ; ఘాటైన ఉపన్యాసాలకూ నేను బేజారెత్తిపోయేవాణ్ణి కాదు. మొరిగే జంతువులు కరువజాలవని నాకు బాగాతెలుసు."

అందుకు ద్విజదాసు జవాబు చెప్పకండా ఊరుకోలేకపోయాడు. వస్తుతః అతనిది శాంతస్వభావం. అన్నగారంటే మంచిగౌరవం వుంది. ఇంకో ప్రసంగమైతే యెదురు చెప్పేవాడు కాదేమో! పైగా ఈ సంభాషణను ఇంతవరకూ రెచ్చగొట్టింది తానే. అదీగాక లోగడదినం ఊరేగింపులో పాల్గొన్న ప్రజలకు విప్రదాసును చూడగానే గొంతులు మూగపడిపోయినవి. అది ద్విజదాసుకు లజ్జావహమైంది. అన్నాడు మృదువుగానే—"మొరిగే జంతువులు అంతకన్నా యెక్కువచేసేదేమీ వుండదని మాకూ తెలుసు. కాని ఈ ప్రపంచంలో కరిచే జంతువులుకూడా వుంటాయనీ, సమయం వచ్చినప్పుడవి కాటు వేయగలవనీ మీకుతెలియదేమో!"

విప్రదాసు ఆశ్చర్యంగా తమ్ముని కేసి చూచాడు. "ఔను, నిజమే" అన్నాడు.

ద్విజదాసు ఇంకా యేమో చెబుదామనుకున్నాడు. కాని జంకి ఊరుకున్నాడు. అన్నగారిని చూచికాదు, బైటనించి అమ్మగారి కంఠస్వరం వినిపించింది.—

"తలుపులు బిగించుకుని లోపల కూచున్నారేమి నాయనా? సంధ్య పొర్లుతట్టి, పిలిస్తేనేగాని లోపలికివచ్చే ఆస్కారంలేదు. చచ్చిపోతున్నాను ఇంట్లో ఈ యిరోపీయ ఆచారాలతో. అబ్బబ్బ!"

ద్విజదాసు గాభరాపడుతూ వెళ్ళి తలుపు తీశాడు. విప్రదాసుమంచం మీదినించి లేచి నిల్చున్నాడు. ఒక ప్రౌఢ యువతి—వితంతువు—గదిలోనికి వచ్చింది. ఆమెకు సుమారు నలభై సంవత్సరాల వయస్సు వుంటుంది. మితిలేని చక్కదనం. కొంచెం పీలగా వుంటుంది మనిషి. వైధవ్యరేఖ ముఖంలో ప్రస్ఫుటంగా ముద్రితమై వుంది. ఆమె తన చూపులను చిన్న కొడుకుమీదినించి పెద్దకుమారుని వైపు ప్రసరించింది.

"నాయనా, విపిన్! ఈ నెల ఏకాదశీ నిర్ణయం విషయంలో పంచాంగకర్తలు తలా ఒక రకంగా రాశారు. కాస్త మన పురోహితుని పిలిపిస్తావూ? ఆయనమతం యేమిటో తెలుసుకుందాం"

విప్రదాసు మందహాసం చేశాడు. పిలిపిస్తా నమ్మా! కాని ఏమి లాభం? యెవరిమతం యెలావున్నా నువుమాత్రం రెండురోజులూ వుపవాసం వుండకుండా మానవుకదా!"

ఆమెకూడా నవ్వింది. "వుపవాసాలు చేసి చచ్చిపోదామని యెవరికీ వుండదు. కాని ఏమి చేస్తాం మరి? ఉపవాసం ఉంటేగాని పుణ్యం రాదు. ఉండకపోతే శాశ్వత నరకమేగతి. అయితే ఒరే అబ్బాయీ! గొప్పపండితుడెవరో కలకత్తాలో భాగవతం పురాణం చెబుతూన్నట్టు వార్తాపత్రికలో ప్రకటించారటగా! కోడలు చెప్పింది నాకు. ఎలాగైనా ఆ మహనీయుని పాదధూళితో మన యిల్లు పావన మయేలా చూద్దూ!"

నీకోరిక "ఉపేక్షిస్తానా అమ్మా!"

"నాకోరికేగాని మీకు వినాలని లేదన్నమాట! ఎన్నాళ్ళయింది మన యింట్లో కథా కాలక్షేపం జరిగి!"

"మూడునెలలుకూడా కాలేదమ్మా!" అన్నాడు విప్రదాసు చిరునవ్వుతో.

"మూడునెలలేనా? పురాణశ్రవణం లేకండా మూడునెలలుమాత్రం వుండవచ్చునా? ఇంకోసంగతిరా అబ్బాయి! నాయిద్దరు పినతల్లుల వద్ద నించీ ఉత్తరాలు వచ్చాయి. కైలాసనాథ మానసరోవరం చూచిరావాలి; ఈ సారి తప్పక వెడతాను.

"కాని అమ్మా! నీయిద్దరు కొడుకులలో ఒక్కడినైనా వెంట తీసుకుపో. కేవలం నీపిన తల్లులమీద భరోసాపెట్టుకుని వెళ్ళనద్దు; నాకిష్టం లేదు. నేను ఎన్నికష్టాలైనా సహించగలను. మా అమ్మకు ఏ మాత్రం ఇబ్బంది కలిగినా నేను సహించలేను."

అమ్మకన్నులు చెమ్మగిల్లినవి. "భయం ఏముందిరా నాయనా! మానసరోవరానికి వెళ్ళేమార్గంలో మృత్యువు సంభవిస్తే అంతకన్నా మీ అమ్మకు గావలసినదేమిటి? అది మహాపుణ్యం కాదుట్రా! కాని నువు నావెంట రావటానికి వీల్లేదు కదా! ఈయిల్లు, సంసారం—ఈనిర్వాహక మంతా నువులేకపోతే ఎవరు నెత్తిమీద వేసుకుంటారు? చిన్నకొడుకును తీసుకుపోవటం నాకిష్టంలేదు. వీడు బ్రాహ్మణుడై పుట్టాడు; సంధ్యా వందనం మానేసి ఎన్నాళ్ళో అయింది. ఇది తినవచ్చు, ఇది తినకూడదు అన్న నియమంకూడా పాటిస్తున్నట్టులేదు. అదీగాక నిన్న వీడేమి చేశాడో విన్నావా?"

"వినలేదే! ఏంచేశాడేమిటి?" అన్నాడు విప్రదాసు ఎరగనట్టు.

"వినే ఉంటావులే. ఇంకా వీడికి నీ కళ్ళుమప్పే తెలివితేటలు రాలేదు. వాడు తినేది నా అన్నం; కట్టేది నా గుడ్డ; కలకత్తాలో స్నేహితులకు ఖర్చుపెడుతున్నది నాడబ్బు; ఆ స్నేహితులను తీసుకువచ్చి నా ప్రజల్ని మోసం చేస్తున్నాడు కూడాను. కలకత్తాలో వీడు చేస్తున్న ఖర్చును అరికట్టాలిరా."

"ఆదెలాగమ్మా! కలకత్తాలో చదువుకుంటున్నాడాయెను. మనం డబ్బు పంపకపోతే చదువు...."

"చదువు రాకపోతే ఏమీ పరవాలేదు. ఒకప్పుడు మన జమీందారీ స్కూలు పిల్లలు సమ్మె కట్టివచ్చి 'పాశ్చాత్య విద్యాభ్యాసంవల్ల దేశం సర్వనాశనమై పోతున్న'దని మొండికెత్తినప్పుడు నువ్వు వాళ్ళను శిక్షిం చావుకాదూ! ఇప్పుడు నీ తమ్ముడు చేస్తున్నపని అదే. చూస్తూ ఊరు కుంటావా?"

"విద్యార్థులు క్లాసులు తప్పుతూ విద్యా విధానాన్ని విమర్శిస్తే నాకు కోపం వస్తుంది. మన ద్విజబాబులాగ యమ్. యే ప్యాసైన తరువాత ఆంగ్ల విద్యావిధానాన్ని ఎంతతీవ్రంగా ఆడిపోసినా నేను తప్పుగా భావించను."

"మరి ఈ సంగతేమిటి ? నాడబ్బు పాడుచేసి నాప్రజల్ని మోసం చెయ్యటం !"

ఇంతవరకూ ద్విజదాసు మౌనంగానే ఉన్నాడు. ఈ సందర్భంలో మాత్రం కాస్త నోరు చేసుకున్నాడు. "విన్న సభకూ ఊరేగింపుకూ అయిన ఖర్చులో మీ జమీందారీ సొమ్ము ఒక్క పైసకూడా లేదు" అన్నాడు.

ఆమె గదిలోకి వచ్చిన లగాయతు చిన్నకొడుకుతో మాటాడనూ లేదు; అతనికేసి చూడనూలేదు. ఇప్పుడైనా విప్రదాసును లక్షించి- "అయితే ఈ అభాగ్యుడికి ఆ డబ్బంతా ఎక్కడినించి వచ్చిందో అడుగు నాయనా ! ఏమేనా గొప్ప వ్యాపారం చేస్తున్నాడా యేమిటి ?"

అదే సమయాన తలుపావల గాజుల చప్పుడయింది. విప్రదాసు చెవియొగ్గి విన్నాడు. "అదిగో నమ్మా, నీ ప్రశ్నకు జవాబు. నీ యింటి కోడలే రూపాయలు పోగుచేసి యిచ్చేస్తూంటే ఇక అడ్డగించే వారెవరు ?"

అప్పు డామెకు అసలు విషయం స్ఫురణకు వచ్చింది. "అంతకూ కారకురాలు సతీదేవి. గొప్ప యింటిబిడ్డ తండ్రి ఒక జమీందారు. సాలుకు ఆరువేల రూపాయలు కూతురుకు పుట్టింటినించి వస్తుంది. మరిదికి అమె డబ్బు అడిగిందే తడవుగా ఇచ్చేస్తుంది. వీడు గొప్ప గుణవంతుడని కామాలు ఆమె అనుకోటం !.... విపిన్ ! నీ పెళ్ళి సంబంధం నిశ్చయించు కోటానికి ఆనాడు వియ్యంకుడుగారు స్వయంగా వచ్చాడు. వారితో సంబంధం మనకు వద్దని మీ నాన్నగారితో నే నప్పుడే చెప్పాను. వారి వంశంలో వాడే అనాధరాయ్. ఆయనగారు భార్యతోసహా ఇంగ్లండు వెళ్ళి వచ్చినవాడు. వాళ్లు ఎంతకైనా తగుదురు; వారికి ఏదీ అసాధ్యంకాదు."

విప్రదాసు యధా పూర్వంగా నవ్వుతూ ఉండిపోయాడు. మారు చెప్పలేదు. అనాధరాయ్ చేసిన పనివల్ల ఆ వంశంలోని తన భార్య సతీ దేవికికూడా అమ్మ కళంకం కట్టింది. ఆయన ఇంగ్లండు వెళ్ళివచ్చిన సంగతి ఆమె ఎప్పటికీ మరచిపోదు.

"సరే కానీయండి ఈసారి నేను యాత్రవెళ్ళక తప్పదు. వెళ్ళి కైలాస నాధుని దర్శనం చేసుకుని తిరిగి వస్తాను. అప్పుడుగాని చిన్న వాడి పని పట్టను" అంటూ ఆమె గది విడిచి వెళ్ళిపోయింది.

"మరి యేమంటావు ద్విజూ! అమ్మతో నువ్వుకూడా వెళ్ళవూ? ఆమె ప్రయాణం నిర్ణయించుకుంది. ఆపటం కష్టం" అన్నాడువిప్రదాసు తమ్మునితో.

"నీకు తెలుసుగా నాకు కైలాస నాధులమీదా. వైకుంఠ నాధుల మీదా విశ్వాసం లేదని! అదీగాక నన్ను వెంటబెట్టుకుని ఆమె స్వర్గానికి వెళ్ళేందుకుకూడా సమ్మతించదు. ఆ మాట ఆమె ముఖతః నువుకూడా విన్నావుగా!"

"ఔనుగాని పండితమహాశయా! నువు వెడతావా, వెళ్ళవా, ఆ సంగతి చెబుదూ!"

"నన్ను ఊరికే చంపకండి" అని విసుక్కుంటూ ద్విజబాబు గదివిడిచి నిష్క్రమించాడు.

విప్రదాసు ఒక నిశ్వాసం విడిచాడు. "దేశసేవ అంటే ఇలాగే ఉంటుంది. కన్నతల్లి మాటకూడా మన్నించటమంటూ ఉండదు" అని గొణుక్కున్నాడు.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. ఆమె విప్రదాసు కన్నతల్లికాదు. సవతి తల్లి. విప్రదాసు పుట్టిన సంవత్సరం లోపుగానే కన్నతల్లి పరమ పదించింది. తరువాత యజ్ఞేశ్వరబాబు దయామయిని వివాహం చేసుకున్నాడు. విప్రదాసు ఆమె ఒడిలో పెరిగి పెద్దవాడైనాడు. ఆమె తన కన్న తల్లి కాదన్నసంగతి విప్రదాసుకు బాగా ఊహ వచ్చేవరకూ తెలియదు.



# 3

ద్విజ దాసుకు వదినగారంటే అమిత గౌరవం, ఇంట్లో మరెవ్వరి మీదా అతని కంత అభిమానం లేదు. ఆమె అతనికి అడిగిన దానికంటే ఎక్కువగా డబ్బు ఇస్తుంది. వయసులోకూడా ఆమె ద్విజబాబుకన్నా కొన్ని నెలలు పెద్ద. అందుచేత ఆమె అతన్ని పేరుపెట్టే పిలిచేది. అందుకు ద్విజబాబు చిన్నప్పుడు కోపగించుకునే వాడు; అమ్మతో వెళ్ళి మాటి మాటికీ ఫిర్యాదు చేశేవాడు.

పన్నెండేళ్ళ వయసులోనే సతీదేవి ఆ యింటి కోడలై వచ్చింది. అందరూ ఆమె నెంతో ఆదరంగా చూచేవాళ్ళు

" చాల అన్యాయం కాదుటమ్మా కోడలా! నీ మరిదిని పేరుపెట్టి పిలుస్తున్నావుట! "- అని నవ్వుతూ మామగారు అడిగేవారు.

" అన్యాయం ఏముందండీ? నేను అతనికన్నా చాల పెద్దదాన్ని కాదూ? "

" చాల పెద్ద! ఎంత పెద్దేమిటి? "

" నేను వైశాఖంలో పుట్టాను; అతడు భాద్రపదంలో పుట్టాడు "

అత్తగారు పకపక నవ్వేది. " వాడు భాద్రపదంలో పుట్టాడని నాకే జ్ఞాపకంలేదే! ఈసారి వాడువచ్చి నాతో ఫిర్యాదు చెయ్యనీ చెబుతాను. వెధవను చెవులు పిండేస్తాను "

అలాగ న్యాయస్థానంలో ఓడిపోయి, కోపం వచ్చి ద్విజదాసు మూతి ముడుచుకుని వెళ్ళిపోయేవాడు. అత్తగారు కోడల్ని దగ్గరకు తీసుకుని—" వాడు వట్టి మూర్ఖుడు తల్లీ! ఏమీ తెలియదు. పోనీ 'చిన్నబాబూ!' అని పిల్చావంటే ఉబ్బిపోతాడు. అప్పుడప్పుడు అలా పిలుస్తూ ఉండు "-అని స్నేహ పూర్వకంగా చెప్పేది.

" సరేలెండి అత్తయ్యా! అప్పుడప్పుడు అలాగే పిలుస్తాలెండి "

ఆ నాడు సతీదేవి పన్నెండేళ్ళ బాలిక. ఈ నాడామె గొప్ప యింటి గృహిణి. అత్తగారు వితంతు వైనప్పటినించీ జపతపాల్లో మునిగి వుంటు న్నది. చిన్నతనంలో అత్తగారు ఉపదేశించిన మాటలే నేడు గార్హ స్థ్యంలో ఆమెకు ఎంతో ఉపకరిస్తున్నవి.

మజదూర్ కిసానుల ఊరేగింపు టుత్సవంజరిగి పక్షంరోజులు గడిచిపోయినవి. ఒకనాటి ఉదయం సతీదేవి ద్విజబాబు గదిలోనికివచ్చి పిల్చింది ; " చిన్నబాబూ !...."

" చాలు చాలు, నువ్వేమీ చెప్పనక్కరర్లేదు. ఇంతవరకు జరిగిన నాటకం చాలు. సరే, అలాగే చేస్తాను "

" ఎలాగు చేస్తావు ? "

" నువు ఆజ్ఞాపించినట్లే. కాని అన్నయ్యకిది న్యాయంకాదు "

" అన్యాయం ఏమిటో చెప్పుకాస్త. వింటాను "

" నా కేమీ తెలియదనుకోకు. ఇప్పుడే అన్నయ్య గదిముందునించి వస్తున్నాను. లోపల అమ్మా, మీరూ పన్నుతూన్న షడ్యంత్రం నేను గ్రహించ లేకపోలేదు. అన్నయ్య స్వయంగావచ్చి నాతో చెప్పకూడదేం ? విన్ను రాయబారం పంపిస్తాడా ? ఇది అన్యాయంకాదా ? "

సతీదేవి నవ్వింది. " ఇందులో అన్యాయం ఏమీలేదు చిన్నబాబూ ! మీ అన్నయ్యేవచ్చి చెబుతారనుకో, ' నాకు వీలుకాదు ' అని చెప్పేస్తావు. నాతో ఆమాట అనలేవుగా ! అది వారికి తెలుసు. అందుచేత నన్ను పంపించారు.

" అక్కడే ఉంది కిటుకు. సరే, నన్నేమి చెయ్యమంటావిప్పుడు ?"

" మీ అమ్మగారు యాత్ర వెడతారు. నువు వెంట వెళ్ళాలి "

ద్విజబాబు క్షణం ఆగి ఆలోచించుకున్నాడు. " యాత్ర ముగించు కుని తిరిగి వచ్చేసరికి పక్కా మూడు నెలలైనా పడుతుంది. నాపనులన్నీ పాడైపోవూ ? ఆ సంగతేమైనా ఆలోచించావా మరి ? "

" పరవాలేదులే. అంతమాత్రాన పెద్దనష్టమేమీ లేదులే. ఈసారి నువ్వేమీ అడ్డు చెప్పకు. కొత్త కొత్త ప్రదేశాలు చూచి రాగలవు "

" నువు చెబుతున్నావు కాబట్టి సరే వెడతాను. కాని ఆనాడు అమ్మ ఏమన్నదో తెలుసునా అన్నయ్యతో ? కలకత్తాలో నా చదువు కయ్యే ఖర్చు పంపించవద్దని చెప్పింది "

సతీదేవి మందహాసం చేసింది. "ఏదో కోపంలో అన్నదనుకో. అన్నప్పటికీ ఆమె నీకు తల్లి"

"ఆ నాటినించీ నే నేమని నిశ్చయంచేసుకున్నానో తెలుసా? నేను ఒంటరిగాణ్ణి. పెళ్ళిచేసుకోవలసిన అవశ్యకత నాకు లేదు; చేసుకోనేమో కూడాను. నాకు ఖర్చు ఏముంటుంది? కావలిస్తే పిల్లలకు ట్యూషన్‌లు చెప్పుకుని సంపాదించుకుంటాను. అంతేగాని వీళ్ళ జమీందారీలో వచ్చే డబ్బు ఒక్క పైసాకూడా నేను అడగను"

సతీదేవి మందహాసం చేసింది. "నువు అడగనక్కర లేకుండానే దానంతట అదే వస్తుంది. రాకపోయినా నువు ట్యూషనులు చెప్పుకోవలసిన పనిలేదు. నేను బ్రతికి వుండగా నీకు ఏలోటూ రానీయను"

క్షణమాత్రం ద్విజబాబు కనురెప్పలు బరువెక్కినవి. తన్నుతాను నిగ్రహించుకున్నాడు "అయితే ఆమె ప్రయాణం ఎప్పుడు నిశ్చయించుకుందేమిటి? నేనుకూడా వెంట వెళ్ళక తప్పదన్నమాటేనా? కాని నావంటి మ్లేచ్ఛునితో కలసి వైకుంఠానికి కూడా వెళ్ళేందుకు తనకిష్టంలేదని ఆనాడు అమ్మ స్పష్టంగా చెప్పింది. విన్నావా వదినా?"

సతీదేవి సమాధానం చెప్పలేదు.

"సరే. నీ ఆజ్ఞ మీరలేను. ఇంకేం, నువు వెళ్ళి వాళ్ళను నిశ్చింతగా ఉండమని చెప్పు"

సతీదేవి నవ్వింది. "నన్ను పంపినప్పుడే వారికిచింత తీరిపోయింది. నేను నీకోసం వస్తూ వుంటే మీ అన్నయ్య అమ్మతో అంటున్నారు;" ఇక భయం లేదమ్మా! ప్రయాణానికి అన్నీసిద్ధం చేసుకో. నీకోడలు రాయబారం సఫలం చేసుకునే వస్తుంది. ఆమెముందు మనవాడి తర్కంచెల్లదు. తలవంచుకుని 'సరేలే' అంటాడు. చూస్తావుగా! అని"

ద్విజదాసుకు కోపం వచ్చింది. "నన్ను వెర్రిపుల్లయ్య కింద కట్టేశారన్నమాట. తాము సిగ్గుమాలి ప్రవర్తించారని నేనన్నట్టు అన్నయ్యతో చెప్పవమ్మా వదినా!"

"చెప్పి ప్రయోజనం ఉండదు చిన్నబాబూ! ప్రజల రక్తాన్ని పీలుస్తూవుండే జమీందార్ల నీతి అలాగే ఉంటుంది మరి! సిగ్గేమిటి, ఎగ్గేమిటి? తమపని సానుకూలం కావటం.... అంతేవారికి కావలసింది. ఈ జమీందారీలో సగభాగస్తుడివై ఉండి నువు అందులో ఒక్కపైసా తీసుకోవటానికి కూడా సంకోచిస్తున్నావు. ఒక విధాన నాకువిచారం; మరొక

విధాన సంతోషం. సరే, నువు అమ్మగారిని తప్పక తీర్థయాత్ర చేయించి తీసుకురావాలి సుమీ. నీకేమీ పరవాలేదు, నేను వున్నాను "

ద్విజదాసు లేచివచ్చి వదినగారి పాదధూళి శిరసున స్వీకరించాడు.

" నాపని ఒకటి చెయ్యాలి నువు చిన్నబాబూ ! "

" నీపని ! అయితే అసలు చెయ్యను వదినా ! "

సతీదేవి నవ్వింది. " పెద్దపనేమీ కాదులే. తీరా చెప్పిన తరువాత 'నావల్ల కాదు పొమ్మం 'టావేమో సుమీ ! "

" చెప్పుమరి ! "

" నాకొక మ్లేచ్ఛ పినతండ్రి వున్నాడు. సయాం పినతండ్రి కాదు ; మా నాన్నగారి పినతండ్రికొడుకు. ఆయన ఇంగ్లండువెళ్ళి వచ్చాడు. ఆసంగతి మొదలే తెలిస్తే నన్ను ఈ యింటివారు కోడలుగా అంగీకరించే వారే కాదనుకో. నువు వినే వుంటావు. మీ అమ్మగారు చెప్పకుండా వున్నారా ? "

" చాలాసార్లు చెప్పింది. కొన్ని లక్షలసార్లు. "

" ఔను. ఆయన బొంబాయిలో వుంటున్నాడు. ఆయనకొకకూతురు అక్కడే చదువుకుంటూంది. ఇంకా పై చదువులకోసం వచ్చేసంవత్సరం ఇంగ్లాండు వెడుతుందిట. "

" ఆఁ అలాగా ! "

" ఔను. ఆమె ఇక్కడికి వస్తానని రాసింది. కాని ఇంతదూర ప్రయాణం ఒంటరిగా చెయ్యటం నాకిష్టంలేదు. "

" ఏం ? వచ్చి దిగబెట్టేవాళ్ళెవరూ లేరా ? "

" లేరు. బాబాయికి సెలవు దొరకలేదుట. "

ద్విజదాసు వెంటనే అంగీకారం తెలుపలేదు ; ఆలోచిస్తున్నాడు.

" నా పెళ్ళప్పుడు ఆమెకు ఎనిమిదేళ్ళు. తరువాత ఆమెను కలకత్తాలో ఒకసారిచూశాను. అప్పటికామె మెట్రిక్ ప్యాసై కాలేజీలోచేరింది. ఆమె అంటే నాకు చాలప్రేమ చిన్నబాబూ ! నువు కష్టం అనుకోక ఒక్కసారివెళ్ళి ఆమెను తీసుకు రావాలి "

" అమ్మ ఒప్పుకుంటుందా మరి ! "

సతీదేవి ముఖంలో వ్యాకులత పొడసూపింది. " అడిగి చూశాను. ఇప్పటికి ఆమెగారు జవాబేమీ చెప్పలేదు. అయినా అడ్డుచెబుతారనుకోను.

అదీగాక ఆమె తీర్థయాత్ర వెడుతుందాయె. ఆ రెండుమూడు నెలలూ ఆ పిల్ల వచ్చి నాదగ్గర వుంటుంది. "

అత్తగారు అంగీకరించక పోయినా సతీదేవి చెల్లెల్ని పిలిపించుకోవాలనే చూస్తున్నది. అది ద్విజబాబు గ్రహించాడు. అడిగాడు— "మీ పినతండ్రి బ్రాహ్మణమతస్థుడా ?"

" కాదు. హిందూమతంకూడా ఆయన్ను వెలిపెట్టింది. కాగా తానే మతస్థుడో ఆయనకే తెలియదు. రోజులుమాత్రం గడిచి పోతున్నవి"

" వెళ్ళి తీసుకు రావటానికి నాకభ్యంతరంలేదు. కాని అమ్మవుండగా మాత్రం ఆ అమ్మాయిని ఇక్కడికి పిలిపించటం మంచిదికాదు. అమ్మ ఎలాంటి మనిషో నీకు బాగానే తెలుసు. , రోజూ మడీ, మైలా అంటూ ఏదోకాండ జరక్కమానదు. నువు చెల్లెలి పక్షం వహించి చివాట్లు తినవలసి వస్తుంది. కాబట్టి మేము తీర్థయాత్రకు బైలుదేరి వెళ్ళాక ఆమెను పిలిపించుకో. అది మంచిది."

ఔను. అదివిజమే. కాని 'బయలుదేరి వస్తున్నా'నని ఆ అమ్మాయి రాసింది. 'ఇప్పుడురావద్దు. మరొకమాటువద్దువుగాని' అని జవాబురాస్తే ఏమంత బాగుంటుందీ ?" సతీదేవికి ఏమీ పాలుపోలేదు. "నా చెల్లెలు కనుక పిలిపిస్తున్నాననిఅనుకోకు చిన్నబాబూ ! అప్పుడు కలకత్తాలోకొన్ని నెలలపాటు కలిసి ఉన్నాంగా ! అందంలోగాని, గుణంలోగాని అటువంటి పిల్ల ప్రపంచంలో అరుదు. పైకి ఆమె ఆచారవ్యవహారాలు ఎబ్బెరికంగా కనిపించవచ్చు. కాని కొన్నాళ్ళపాటు ఇక్కడ ఉన్నట్టయితే మీ అమ్మగారికి మ్లేచ్ఛ బాలికలయెడఉండే అసహ్యం మటుమాయమై పోగలదు."

" ఆ కొన్నాళ్ళయినా గటవటం కష్టమే. అమ్మ ఆ పిల్లను కన్ను విప్పి చూడనైనా చూడదు."

" కాని ఆ పిల్ల సౌందర్యమే ఆమెను ఆకర్షించి వేస్తుంది."

ద్విజదాసు మాటాడలేదు. "వందనాదేవిని ప్రపంచంలో యెవరూ అవహేళన చెయ్యలేరు. మీ అమ్మకూడా చెయ్యలేదు" - అన్నది సతీదేవి.

ద్విజదాసు ఆశ్చర్యాన్వితుడైనాడు. "వందనాదేవి ! పేరు నేనెప్పుడో విన్నాను వదినా ! ఉండు వార్తాపత్రికలో బొమ్మ...."

వాక్యం పూర్తికాలేదు. దాసీ వచ్చి "మీరు ఇక్కడ ఉన్నారా అమ్మగారూ ! మీ బాబాయిగారంట, బొంబాయినించి వచ్చారు; వారి

కూతురుకూడా వచ్చారు. పెద్దబాబుగారు ఇంట్లోలేరు. మేనేజరుగారు వారిని లోనికి తీసుకువచ్చి గది చూపించారు " అని చెప్పింది.

ఇది అనుకోకండా సంభవించిన ఘటన. " అరె, అలాగా ! " అంటూ ఆతృతగా తుపాను గాలికెరటంవలె ' సతి ' వెళ్ళిపోయింది. ఆమె వెనుకనే ద్విజదాసు మెల్లిగా వెళ్ళాడు.



# 4

కౌమారదశలో ఉన్న ఆ సజ్జనుడు కుర్చీలో కూచున్నాడు. నిండు పాశ్చాత్య ఫేషన్‌లో ఉన్నాడు. ఆయన కూతురు పక్కనే నిల్చుని గోడ మీద కాళీమాత పటం తదేకంగా చూస్తోంది. ఆమె వేషంచూస్తే భారతీయ యువతిగా కనిపించదు; పాశ్చాత్య తరుణిలాగానూ లేదు. శరీరచ్ఛాయ పచ్చని పసిమి. వెన్నలాగ మృదువైన శరీరం. నిర్దుష్టమైన అవయవ నిర్మాణం. ఇంతకుముందు సతీదేవి ఆమె సౌందర్యాన్నిగూర్చి ద్విజ బాబుకుచెప్పిన మాటల్లో అత్యుక్తిలేదు.

" వచ్చారూ బాబాయి ! ఎన్నాళ్ళకు మీకీ కూతురు జ్ఞాపకం వచ్చింది ! " అంటూ సతీదేవి గదిలోకి వచ్చింది.

ఆయన లేచివచ్చి ప్రేమగా ఆమె తల నిమిరాడు. నవ్వుతూ " ఒక్క సారైనా బాబాయిని రమ్మని రాశావుటే అమ్మాయి ! తీరా స్వయంగా నేనేవస్తే నిష్ఠూరాలాడుతున్నావా ? " అన్నాడు. ఇంతలో అక్కడికి ద్విజబాబు రావటంచూచి ' వా రెవరు ? ' అని అడిగాడు.

సతీదేవి వెనక్కుతిరిగి చూచింది. "అతడు నా మరిది, ద్విజ బాబు" అని చెప్పింది.

ద్విజబాబు దూరంనించే ఆయనకు నమస్కరించాడు. వందనాదేవి అక్కగారికి ప్రణామంచేసి నవ్వుతూ అన్నది. "ఓహో వీరి తీవ్ర ఉద్యమంవల్లనే కాదూ జమీందారీవిధానం అంతరించిపోనున్నది? నువు ఉత్తరంలో రాశావుకదూ 'వీరిలాంటి భయంకర దేశభక్తులు నభూతోనభవిష్యతి' అని?"

"నే నెప్పుడు రాశానూ?"

"అప్పుడేమరచి పోయావుటే అక్కా!"

"ఛా, నే నెప్పుడూ అలా రాయనే లేదు. నీవు పొరపాటు పడుతున్నావు"

ఇంతవరకూ ద్విజదాసు ఏమిమాట్లాడ్డానికీ సంకోచిస్తూ జడునివలె ఉండిపోయాడు. అపరిచితమైన ఆ మహిళామూర్తితో ఎలా సంభాషణ ఆరంభించాలో అతనికి పాలుపోలేదు. ఇదివర కెన్నడూ అతనికట్టి సన్నివేశము సంభవించి యుండలేదు. ఈ నవాగత తరుణీమూర్తి ఎంత స్వేచ్ఛగా, సహజంగా, నిస్సంకోచంగా మాటలు విసిరింది! దానితో అతని జడత్వం మటుమాయమైపోయింది. ఒక అనిర్వచనీయ ఆనందం అనుభవించాడు. స్త్రీలకుకూడా స్వేచ్ఛ, సుశిక్షణ అవసరమే. అలాగని అన్నగారితోనూ అమ్మతోనూ అతడెన్నోసార్లు వాదించాడు. వాళ్ళుకూడా మానవులే - అని తాను అంటూండేవాడు. "కాబట్టి వాళ్ళకుకూడా చదువు, స్వాతంత్ర్యం ఉండవలసిందే. వంటింటి కుందేళ్ళనుగా అట్టిపెట్టటం అన్యాయం' అని ఇదివరకల్లా వాదిస్తూఉండేవాడు. వందనాదేవిని చూచాక ఇప్పుడతనికొక కొత్తభావం పొడసూపింది: "స్త్రీ పురుషునికి అత్యంత ఆవశ్యకమైన వస్తువు. కాగా ఆమెకుకూడా శిక్షా స్వాతంత్ర్యాలు తప్పనిసరిగా అవసరం. ఆమెను వంచించి పురుషుడే వంచితుడౌతున్నాడు."- ఈ నిగూఢసత్యం ఇదివరకెన్నడూ అతనికి అవగతమై ఉండలేదు. వందనాదేవిని లక్షించి నవ్వుతూ ఇలా అన్నాడు - "మీ మాటే నిజం. మా వదినే పొరపాటుపడింది. ఈ విషయాన్ని గురించి మీ రిద్దరూ వివాదపడటం అనవసరం."

మరి కాసేపాగి వదినగారికేసి తిరిగాడు. "అలా నన్ను పరిహాసం చేస్తూ రాస్తావటమ్మా వదినా? సరే కానీయండి. మీరంతా నన్నుదూరంగా

నెట్టివేస్తున్నారు. నేను కూడా నాహక్కులన్నీ వదిలివేసుకుంటున్నాలే. మీ జాగీరు అక్షయ మౌగాక! కావలిస్తే ప్లీడర్ని పిలిపించండి. ఈ జమీందారీ మీద నా హక్కులన్నీ వదులుకున్నట్టు ఇప్పుడేపత్రం రాసియిచ్చేస్తాను."

ఆ ప్రౌఢవ్యక్తి ఆశ్చర్యంగా తలయెత్తి చూచాడు. "సతీ! నీ మరది భయంకర దేశభక్తుడా?"

"ఔను. చాల భయంకర—"

"నువు మాట అంటే చాలు. జాగీరు వదలుకుంటాడా?"

"అతడు స్వయంగానే అంతపనీ చేయగలడు. అతనికి, అసాధ్యం అనేది లేదు"

"నిజమేనా? సర్వాన్నీ శాశ్వతంగా త్యజించి వేయగలడా?"— కుతూహల చిత్తయై వందనాదేవి అడిగింది.

"నిజమే, అబద్ధమేమీ లేదు. ఈ జమీందారీ మీద నాకు ఆశలేదు. దేశంలో నూటికి తొంభై మందికి పైగా అన్నంలేక మాడుతున్నారు. ఉదయంనించి సాయంత్రంవరకూ చెమటోడ్చి కష్టించినా కబళం దొరకటంలేదు. ఏ పరిశ్రమా లేకండా ప్రాసాదంలో కూచుని భక్ష్య భోజ్యాలు ఆరగిస్తూండటం నాకిష్టంలేదు; నాకు గొంతుక దిగదు కూడాను. ఈభాగ్యమంతా వట్టిపోయినప్పుడే నాకు మనశ్శాంతి. అందరికి మల్లే నేనుకూడా కాయకష్టంచేసి కూడు తింటాను. ఆ కూడైనా దొరక్కపోతే వాళ్ళలాగే ఆకలితో విల విల కొట్టుకొని మరణిస్తాను; స్వర్గానికి పోతాను. అంతే గాని ఈ భోగభాగ్యాలు నాకు అక్కర్లేదు."

వందనాదేవి నిర్నిమేషదృష్టిని ఆ యువకుని అవలోకిస్తూ, తదేకధ్యానంగా విన్నది.

సతీదేవి విచలిత అయింది. మరిదికి అంతకన్నా మాటలురావు. ఎప్పుడు చూచినా అదే కంఠస్థమైన ఉపన్యాసం ఒప్పజెబుతాడు. "చిన్నబాబూ! ఈ వక్తృత్వ ప్రదర్శనం ఇప్పుడేనా? బాబాయి ఇంకా దంతధావన చేసినట్టులేదు. వందనా! పద, మేడమీదికి పోదాం" అన్నది.

"ఇంకా అల్లుడు కనిపించాడు కాదే!" అన్నాడు బాబాయి.

"ఏదో అవసరమైన పనిమీద బైటికి వెళ్ళారు. వచ్చేసరికి ఆలస్యం ఔతుందేమో!"

"మీ అత్తగారు ఇంట్లో లేరా యేమిచే అక్కా!—" అడిగింది వందనాదేవి.

"ఉన్నారు; రెండు మూడు రోజుల్లో మానసరోవరం తీర్థయాత్ర వెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు. ఉదయాన్నే దేవతార్చనా అదీ ఉంటుంది. కాస్త పొద్దుఎక్కిన తరువాతవచ్చి కనిపిస్తుందిలే"

"ఎప్పుడూ పూజా పునస్కారాల్లోనే మునిగి వుంటుందిట కాదూ!"

"ఔను"

"ఇంటి వ్యవహారాలేమి పట్టించుకోదట, నిజమేనా?"

"ఇంటిభారం అంతా నామీదే పడింది"

వందనాదేవికి కుతూహలం హెచ్చింది. "ఆమె మీ ఆయనగారి సవతి తల్లి అని అంటారు. ఔనా?"

"నాకేం తెలుసు? చూచానా పెట్టానా? బహుశః ప్రజలు అబద్ధమే చెప్పుకుంటున్నారేమో!"

ఆ మాటకు ద్విజదాసు అందుకుని అన్నాడు- "ఔను, అబద్ధమే చెప్పుకుంటున్నారు. ఆమె అన్నయ్యకు సవతితల్లికాదు. నాకే సవతితల్లి. దానికేంగాని, మీరు లేచి స్నానం అదీ చేద్దురుగాని రండి....వారిని పైకి తీసుకురావమ్మా వదినా"—అని పలికి పోబోతున్నాడు. ఇంతలో తల్లి ఎదురు వస్తోంది. చూచి అతడు విహ్వాలుడై నిల్చిపోయాడు.

బంధువులు వచ్చారని తెలియగానే దయామయి పూజ ఆపి వచ్చేసింది. వైధవ్యంవచ్చి పడినప్పటినించీ ఆమె ఆత్మీయులు కానివారిఎదుటికి రావటంలేదు. పరదాచాటునేఉండి మాటాడేది. ఈ సమయంలోమాత్రం ఆమె సరాసరి గదిలోకి వచ్చింది. మేలి ముసుగుఉన్నా ముఖం పూర్తిగా కనిపిస్తూనే ఉంది.

"మా బాబాయి, వారి కూతురు వందనా వచ్చారు అత్తా!"—అంటూ అకారణంగా ఆ సమయాన సతీదేవి ఆమెకు పాదాభివందనం చేసింది. అందుకు దయామయి లోలోన కాస్త ఆశ్చర్యపడినా పైకి ప్రకటించలేదు. సతీదేవి చుబుకము పుణికి అంగుళులు ముద్దు పెట్టుకుంది. ఆశీస్సు పలికింది. మరుక్షణం ఆమె దృక్కులు వందనాదేవిపై ప్రసరిల్లినవి. ఎందుకో ఆమె ముఖం రవంత వాడువారింది. వందనాదేవి కూడా అక్క ననుసరించి ఆమెకు పాదాభివందనం చేసింది. కాని దయామయి ఆ పిల్లను స్పృశించలేదు. పైగా స్పర్శ సోకుతుందేమోనని ఒక అడుగు వెనక్కు వేసింది. 'దీర్ఘాయుష్యమస్తు' అని అస్పష్టంగా దీవిం

చింది. తరువాత పక్కకు తిరిగి 'నమస్కారం వియ్యంకుడుగారూ! మీ పాదధూళితో మాగృహం ఇవాళ పావనమైంది.'' అన్నది.

అనాధరాయి ప్రతినమస్కారం చేశాడు. ''అనేక కారణాలవల్ల ఇదివరకెప్పుడూ రావటానికి వీళ్ళు చిక్కలేదు. ఈసారి ముందుగా మీకు తెలుపకుండా అకస్మాత్తుగా వచ్చినందుకు క్షమించాలి''

నా పూజ ఇంకా పూర్తికాలేదు. మళ్ళీ వచ్చి కలుస్తాను. అమ్మా కోడలా! వీరిని పైకి తీసుకుపో. ఆహారవిహారాల్లో ఏమీలోపం రాకండా చూడు. విపిన్ రాగానే నావద్ద కొకసారి పంపించు''— అంటూ దయామయి లోపికి పోయింది. ఆమె చూపిన సౌజన్యంలో పైకి ఏమాత్రమూ లోటు కనిపించినదిలేదు. కాని పండువెన్నెల కాస్తూంటే కారుమొయిలు ఒకటి నీలాకాశాన ఈ ప్రక్కనించి ఆ ప్రక్కకు పయనించినట్టు తోచింది వారికి.

---

## 5

వందనాదేవి స్నానాదికాలు ముగించుకున్నది. తండ్రిగారు అప్పటికే ముస్తాబై పడకకుర్చీలో వారి వార్తాపత్రిక చదువుకుంటున్నారు. ఆపక్కనే ఒక చిన్న టేబిల్ దగ్గర విల్చుని ద్విజదాసు పాతవార్తా పత్రికలను తారీఖువారీగా పేరుస్తున్నాడు. ప్రయాణంమూలాన రెండురోజులనించీ అనాధరాయ వార్తా పత్రికచూడేలేదు. కూతురు గదిలోనికి రాగానే— ''అమ్మాయి! రెండుగంటల బండికి కలకత్తా వెడదాం. అక్కయ్యగారింటో కొన్నాళ్ళు ఉండాలని నీకు కోరిక ఉంటే తిరుగుప్రయాణంలో నిన్నిక్కడదింపి ఒంటరిగానే బొంబాయిపోతాను. ఏమంటావు?'' అని అడిగాడు.

"కలకత్తాలో మీపని ఎన్నాళ్ళు పడుతుందేమిటి ?"

"ఏడెనిమిది రోజులకుమించదు"

"అయితే నన్ను బొంబాయి మళ్ళీ ఎవరు తీసుకువచ్చి దిగబెడ తారూ ?"

"అప్పటికేదో యేర్పాటు చెయ్యవచ్చులే" అని కాసేపు ఆలోచించి మళ్ళీ ఇలా అన్నాడు— "పోనీ, ఈ ఏడెనిమిదిరోజులూ మీ అక్కయ్యదగ్గిర ఉండు. నేను కలకత్తా వెళ్ళి తిరిగివచ్చి నిన్ను బొంబాయి తీసుకు పోతాను. అలాచేస్తే యేం ?"

"అక్కయ్య నడిగి చెబుతాను ఉండండి"

"వదిన ఇప్పుడు వంటఇంట్లో వుంది"— అంటూ ద్విజదాసు ముందుకు వచ్చి చేతిలో పేపర్ల కట్ట చూపుతూ చదువుతావా ?" అని అడిగాడు.

"వార్తాపత్రికా ? నేను చదవను"

"వార్తా పత్రిక చదవవూ ?"

"ఊహుం. నాకు రుచించదు. సాయంత్రం వేళల మానాన్నకథలు చెబుతాడు. వింటాను, అంతే"

"నువు వార్తాపత్రిక అవశ్యం చదువుతావని భావించాను సుమీ ! అన్యాయం !"

"మీ దేశభక్తులలో ఎవరెవరు ఎంత సేవచేస్తున్నదీ,ఆంగ్లేయపాలకు లందుకు ఎంతగా కన్నెర్ర చేసుకునేదీ— ఈ విషయాలంటే నాకు కుతూహలం లేదు. మానాన్నకు ఆ సంగతులన్నీ కావాలి. చూడు. ఎంతదీక్షగా, తన్మయుడై, బాహ్యం మరచి ఎలా చదువుతూన్నాడో !"

వందనాదేవి పలికిన మాటల్లో 'నాన్న' అన్నశబ్దం మాత్రం అనాదరాయి చెవిని పడింది. "ఉండు అమ్మా ! నీ ప్రశ్నకు జవాబు ఆలోచిస్తున్నాను, చెబుతా" అన్నాడు.

ఆమె నవ్వుకుంది. ఆలోచిస్తూనే, "వార్తాపత్రిక చదువుతూనే పొద్దు కూకించేస్తావు ; కానీ. తొందరలేదులే" అని ద్విజదాసు వైపుతిరిగి— "మీయింట్లో పెద్ద లైబ్రరీ ఉన్నదని అక్కయ్య చెప్పింది. చూదాంపద !"

ఇద్దరూ బయలుదేరారు. మేడ మెట్లు ఎక్కుతున్నారు. "లైబ్రరీ అయితే పెద్దదే. నాది మాత్రంకాదు. మా అన్నయ్యది. ఎక్కడెక్కడి

పుస్తకాలూ ఆయన ఆజ్ఞానుసారంగా కొని తెచ్చినవాణ్ణి మాత్రమే నేను."

"అయినా పుస్తకాలన్నీ చదివే ఉంటావుగా!"

"నేను అసలు చదవను. ఈ లైబ్రరీ యజమానే చదువుతాడు. ఆయనశక్తి, బుద్ధి విస్మయ జనకములు"

"అంటే—మీ అన్నయ్యేగా?"

"ఔను. ఆయన ఏ విశ్వవిద్యాలయంలోనూ చదువుకోలేదు. పేరు చివరడిగ్రీ ఏమీలేదు. అయినా అంతవిద్యావంతుడు ఈ దేశంలో అరుదు. మీ బావగారే; కాని నువు ఆయన్నెప్పుడూ చూడలేదు"

"చూడ్డానికి ఎలా వుంటారేమిటి?"

"అన్నింటిలోనూ నాకుపూర్తిగా వ్యతిరేకం. నేను రాత్రి, ఆయన పగలు; నేను నలుపు. ఆయన పసిడిచాయ; మంచి బలవంతుడు. కత్తిసాములో తుపాకివేటలో ఆయనకుసాటి ఈ ప్రాంతంలో ఎవరూ లేరు. మా అమ్మ ఒక్కతె తప్ప..... ఆయన ముఖంలోకి చూస్తూ మాటాడగల తాహతు ఎవరికీలేదు"

"మా అక్కయ్యకు కూడా లేదా?"- నవ్వుతూ అడిగింది వందన.

"లేదు, మీ అక్కయ్యకుకూడాలేదు"

"చాల క్రోధస్వభావం కామాలేం?"

"కాదు - కాదు. రోషంగాని, కోపంగాని ఆయన ప్రదర్శించినది ఎన్నడూలేదు."

"అన్నగారియెడ మీకు చాల భయభక్తు లున్నాయనుకుంటాను. కాదూ?"

ద్విజబాబు వెంటనే జవాబు చెప్పలేదు. "ఆ ప్రశ్నకు జవాబు మరెప్పుడైనా చెబుతాను"

"అంటే?"

"ఏ ముందీ? ఇప్పుడే చెప్పేస్తే మున్ముందు చెప్పవలసినది ఏమీ ఉండదు."

అదిచాల పెద్ద లైబ్రరీ. అక్కడఉన్న అలమారాలు, బల్లలు, కుర్చీలు ఎంతో కిమ్మతు గలవి. పుస్తకాలను అందంగా పేర్చారు. బొంబాయిలో ఇంతకన్నా పెద్ద లైబ్రరీలనే వందనాదేవి చూచింది. కాని ఈ చిన్ని గ్రామంలో ఇంత లైబ్రరీ ఒకటి ఉండటం ఆమెకు ఆశ్చర్య మని

పించింది. గ్రామంలో ఉంటూ ఒక వ్యక్తి తనకోసంగాను ఇన్ని పుస్తకాలను సమకూర్చుకున్నాడా?

"మీ అన్నయ్య నిజంగా ఇన్ని పుస్తకాలు చదువుతారా?"

"చదువుతాడు. చదివేశాడు కూడాను. అలమారాలకు తాళాలు వెయ్యము. ఏ పుస్తకమైనా తీసి చూడు. ఆయన దాన్ని చదివిన చిహ్నం ఏదో కనిపించకమానదు"

"ఆయన కంతతీరిక యెక్కడిదీ? రాత్రింబవళ్ళు ఇదే పనా?"

"ఎబ్బే! ఎస్టేటు వ్యవహారాలు లేవూమరి! మహా పెద్దజమీందారీ కాకపోయినా మరీ చిన్న జమీమాత్రం కాదుకదా! ఎస్టేటు రహస్యాలన్నీ ఆయనకు తెలుసు. ఎక్కువగా పుస్తకాలు ముందువేసుకు కూచునే అలవాటు ఇప్పుడు ఉన్నట్టు కనిపించదు. మా తండ్రిగారు బ్రతికి వున్నప్పుడు మాత్రం అన్నయ్యకు అస్తమానం అదేపని. ఆయన వ్యవహారమంతా నీకన్నా నాకే ఎక్కువ ఆశ్చర్యంగా వుంటుంది. ఒక అసాధారణవ్యక్తి యని చెప్పాలి. వాళ్ళను మనం అర్థం చేసుకోలేం. నువు ఆయన్ను ఎరుగవు. నే నేమిచెప్పినా అతిశయోక్తిగా ఉంటుందేమో! అందుచేత ఆయన్నుగురించి ప్రసంగం కట్టిపెడదాం. భగవంతుడు ఇతర్లను స్తోత్రం చేసేందుకే మనకి నోరు ఇవ్వలేదు"

వందనాదేవి నవ్వింది. "అన్నయ్యను విడిచి తమ్ముడుగారి స్తుతి ఇక ఆరంభించుదా మనా?"

ద్విజబాబుకూడా నవ్వాడు. "ఔను. అలాగే కోరిగ్గా ఉన్నమాట నిజం. కాని అవకాశం దొరకవద్దూ. ఎరిగివున్న వాళ్ళముందు గొప్పలు చెప్పుకున్నా వాళ్ళు వినరు. అపరిచితులముందు కోతలు చెలామణీ ఔతాయిగాని నా కా సాహసంలేదు; భయం వేస్తుంది"

"పోనీ ప్రయత్నంచేసి చూడు. స్వోత్కర్ష పురుషులకు ఉగ్గుపాలతో వచ్చే విద్య. ఆలస్యంవద్దు. ఊఁ. ఆరంభంచెయ్యి."

"ఉహుఁ. నా చేతకాదు. కూచుని పుస్తకాలు తీసుకుని చదువుకుంటూఉండు. వెళ్ళి వదినను పిల్చుకు వస్తాను"

"భలే వాడివే! నన్ను ఒంటరిగా దిగవిడిచి వెడతావా? పుస్తకాలకేం, చాలా చదివాను. కథ చెప్పు, వింటాను."

"ఏం కథ?"

"నీ కథే"

"అయితే ఉండు. కిందికివెళ్ళి మాంచి 'వక్త' ను పంపుతాను"

"అక్కయ్యనా ? అక్కర్లేదు. ఆవిడ చెప్పదలచినదంతా ఉత్తరాల్లో రాసేసింది. అదంతా నిజమో, అబద్ధమో ఇప్పుడు నాకు తేలిపోవాలి"

"అదంతా నువు విశ్వసించకు. పన్నెండణాల వంతుకు పైగా అన్నీ అబద్ధాలే; సందేహంలేదు. సరేగాని, నువు ఇంగ్లండు వెడతావుటగా !"

తన్ను గురించి తాను చెప్పుకోగల శక్తి ద్విజదాసుకు లేదు అని వందనాదేవి గుర్తించింది. ఇంకా పట్టుపట్టి అడగటం ఆమెకిష్టం లేకపోయింది. అన్నది - "మా నాన్న వెళ్ళమంటున్నాడుమరి ! నువుకూడా ఎందుకు రాకూడదూ ?"

"నాకు సొమ్ము ఎక్కడినించి వస్తుంది ? అక్కడ ట్యూషన్‌లు చెప్పుకుంటే కాలక్షేపం జరుగ దనుకుంటాను. ఇకపోతే ఈ ఖర్చంతా వదినెమీద వెయ్యటం బాగుండదు. నేను వెడదా మనుకోటం కేవలం అడియాస."

వందనాదేవి నవ్వింది. "భలే బీద పలుకులు పలికావు. వెళ్ళాలంటే నువు ఒక్కడివేగాదు. ఈ గ్రామంలో సగంమందిని వెంటతీసుకుపోగల బంగారు పిచ్చుకవు. సరే, అన్ని యేర్పాట్లు నేను చేస్తాను. నువు ఇంగ్లాండు ప్రయాణానికి సిద్ధపడు"

"లాభంలేదు, అంతా అన్నయ్య ఇష్టం; నా దేమీలేదు"

"అక్కయ్య ఒకసారి రాసింది: స్వయంసముపార్జితం కాని ధనం ఒక్క పైసాకూడా తీసుకోవుటగా ! నిజమేనా ?"

"అది మానవ ధర్మం. అంతేగాని నా కెవరిమీదా కోపంలేదు. అయినా అదొక్కటే కారణం కాదు"

"ఇంకా కారణాలేమిటో నేను "తెలుసుకోకూడదా ?"

ద్విజదాసు మాటాడలేదు. వందనాదేవి అతని ముఖంలోకి చూస్తూ కాసేపాగి ఇలా అన్నది. నిన్ను గురించి నేను ఇదివరకే చాలా విన్నాను. ప్రథమసందర్శనంలోనే నిన్ను నే నెన్నిసార్లో చూచియున్నట్టనిపించింది నాకు. మా అక్కయ్యకు అన్ని సంగతులూ చెబుతావు. నాకుచెప్పకూడదా ? అక్కయ్యలాగే నేనుకూడా నీకు ఆత్మీయురాలను కాదా ?"

ద్విజదాసుకంఠం మరింత మూగపడిపోయింది. చెబుదామనుకున్న ఎన్నో సంగతులు కంఠందగ్గిరగూడు కట్టుకున్నవి. ఒక అపరిచితబాలికతో ఇలా ఏకాంతంగా సంభాషించటము అతని జీవితంలో అదే మొదటిసారి. తలెత్తి గోడమీది గడియారంవైపు చూచాడు. తాము అక్కడికివచ్చి గంట దాటి పోయింది. అన్నయ్య వచ్చేశాడేమో! అమ్మగారి పూజాపునస్కా-రాలు ముగిశాయేమో. తమ కోసం కింద వెతుక్కుంటున్నారేమో! అతడు వ్యాకులచిత్తుడైనాడు. ఆమెను విడిచి హఠాత్తుగా వెళ్ళనూలేక, అక్కడ నిలువనూలేక మ్రాన్పడి పోయాడు.

"చెప్పవూ?"

"చెప్పవలసి వస్తే మొట్టమొదట నీకే చెబుతాను. ఇంతవరకు మా వదినెకు కూడా చెప్పలేదు."

"అబద్ధం ఆడుతున్నావు. నేను నమ్మను"

"నిజమే. వదినెకుకూడా తెలియదు."

"ఎందు వల్ల?"

"ఆస్తి నా చేతిలోకివస్తే అంతా నాశనమైపోతుందని మా నాన్నకు భయంగా ఉండేది"

"అందుకు కారణం"

"ఒకప్పుడు నన్ను రక్షించేందుకు గాను ఆయనకు చాలా డబ్బు ఖర్చు అయింది."

ఆ విషయం ఒకసారి సతీదేవి వుత్తరంలో సూచించింది; ఇప్పుడది వందనాదేవికి జ్ఞాపకం వచ్చింది. అడిగింది — "మీ నాన్నగారు విల్లు ఏమైనా రాశారా?" అని

"అదంతా అన్నయ్య కే తెలుసు. రాయలేదని అన్నయ్య చెబుతాడు మరి!"

"నీకేమీ ఇవ్వకుండానే మీ నాన్న గారు విల్లురాసివుంటారని నాఊహ"

"ఆయన స్వయంగా ఐతే అలాగే రాసివుండేవారు. కాని అన్నయ్య అలాగ రాయనీయలేదు"

"అన్నయ్య రాయనీయలేదా? ఆశ్చర్యం!"

మా అన్నయ్యను నువు ఎరగవులే. ఆనాడుచీకటి పడింది. నౌకర్లు వచ్చి దీపం వెలిగించలేదు. గదిలో ఏవో పుస్తకాలు వెతుకుతున్నాడు. పక్క గదిలోనించి కొన్ని మాటలు వినిపించాయి. 'వద్దు, అలా చెయ్య

వద్దు, అంటున్నాడు అన్నయ్య. నీకు తెలీదు; నువ్వేమీ అడ్డుచెప్పకు. తాత తండ్రులు ఆర్జించియిచ్చిన యీ ఆస్తి నాశనమై పోవటం నాకిష్టం లేదు. పరలోకంలోకూడా నాకు శాంతి ఉండదు' అన్నాడు నాన్నగారు. అప్పటికీ అన్నయ్య 'వద్దు, అలా చెయ్యవద్దు' అనే అన్నాడు. 'ఐతే అంతా నీ పేరనే రాసిపోతాను. నీ యిష్టప్రకారం వాడికి ఇవ్వదలిస్తే ఇవ్వు. లేక పోతే ఇవ్వనక్కర్లేదు' అన్నాడు నాన్నగారు. ఆ తరువాత మరి రెండు సంవత్సరాలు ఆయన జీవించేఉన్నారు. కాని ఆయనబుద్ధి మారలేదని నా నమ్మకం

"ఈ విషయం మరెవరికేనా తెలుసా ?"

"ఎవరికీ తెలియదు. ఆ చీకటిలో కనపడకండా ఉండి విన్నాను కనుక నా కొక్కడికే తెలుసు"

వందనాదేవి చాలసేపటి వరకు మౌనంగా ఉండి "మీ అన్నయ్య నిజంగా అసాధారణవ్యక్తే" అన్నది.

"ఔను. ఇకనేను కిందికి వెడతాను. ఏమైన పుస్తకాలు చదువు కుంటూ ఉండు"

"ఇప్పుడు పుస్తకాలమీదికి బుద్ధిపోవటంలేదు. పద, నేనూ వస్తు న్నాను. ఇంకా ఏడెమిది రోజులు ఉంటానుగా! చాల పుస్తకాలుచదవచ్చు"

"అయితే మీ నాన్నగారితో కలకత్తా వెళ్ళవా యేమిటి ?"

"వెళ్ళను. ఆయన తిరిగి వచ్చాక ఇద్దరమూ కలిసి బొంబాయి వెడతాం"

"ఆయన తిరిగి వచ్చాక నువ్వింకా కొన్నాళ్ళిక్కడ ఉండి మరి వెళ్ళాలని నాకోరిక"

"మొదట అలాగే అనుకున్నాం. కాని నన్ను తిరిగి బొంబాయి తీసుకుపోయి ఎవరుదిగబెడతారు ? నువు వస్తానంటే ఉంటాను"

"కాని నేనిక్కడ ఉండనే మరి! రేపు సోమవారమే మా అమ్మను కైలాసం తీర్థయాత్రకు తీసుకు వెడుతున్నాను"

వందనాదేవి నేత్రాలు ఆనందోత్సాహాలతో ప్రకాశించినవి. కైలాసం వెడుతున్నారా ? అది చాల వింతప్రదేశమని చెబుతారు. మీతోపాటు ఎవ రెవరు బయలుదేరుతున్నారు ?"

"చెప్పలేను. ఇంకా ఒకరిద్దరువస్తే రావచ్చు"

"నన్నుకూడా తీసుకు వెడతారూ ?"

ద్విజదాసు సంకోచిస్తూ శాంతంగా ఇలా అన్నాడు—

"మా వదిన నీకు చాల విషయాలు తెలిపింది; కాని ఒక్కసంగతి మాత్రం ఎన్నడూరాసిందికాదు. మాది పచ్చి సనాతన హిందూగృహం అనీ, ఇక్కడి ఆచారవ్యవహారాలు చాల కఠోరములనీ ఆమె నీకు తెలిపియుండవలసింది"

"ఔను, ఆ సంగతి ఎన్నడూ రాయలేదు"

"నే నొక్కణ్ణి తప్ప ఈ యింట్లో నువు ముట్టుకున్న నీళ్ళు కూడా తాగరెవరూ."

"మీ అన్నయ్య కూడా?"

"ఉహూం ఆయనకూడా తాగడు"

"మా అక్కయ్య?"

"ఆమెకూడా తాగదు. మేము వెళ్ళాక నాలుగైదు రోజులు నువు ఇక్కడ ఉండగలవు. కాని మా అమ్మ ఇక్కడే ఉంటే మాత్రం నువు ఒక్క రోజకూడా ఇక్కడ ఉండలేవు."

"నిజమేనా?" — వందనాదేవి ముఖం చిన్నబోయింది.

ఇంతలో "చిన్నబాబూ! వందనా! ఏంచేస్తున్నారిద్దరూ పైన?" అని కిందినించి సతీదేవి పిలుపు వినిపించింది.

"వస్తున్నా వదినా!" అంటూ ద్విజదాసు ముందడుగు వేశాడు.

"ఈ సంగతులన్నీ నాకు తెలియవుసుమీ! ముందుగా చెప్పినందుకు ధన్యవాదం" — అన్నది మెల్లగా వందనాదేవి.

# 6

వందనాదేవి కిందికి దిగివచ్చింది. బైటిగదిలో తండ్రిగారు భోజ నంముందు కూచున్నాడు. టేబిల్ మీద వెండికంచం పెట్టి వడ్డించారు. పక్కనే మంచి ఒడ్డూ పొడుగూగలిగిన అత్యంత సుందరుడైన వ్యక్తి నిల్చునిఉన్నాడు. అతని అవయవపుష్టి, శరీరకాంతి చూచి .... ఆయనే విపిన్‌బాబు అని వందనాదేవి గ్రహించింది. అటువైపు తలుపుచాటుగా సతీదేవి నిల్చునిఉంది. " వారే మీ బావగారు " అని చెబుతూ నమస్కారం చెయ్య మని సంకేతం ఇచ్చింది.

నిజానికి సంకేతం ఇవ్వవలసిన అవసరంలేదు. బావగారికి నమస్కారం చెయ్యాలని వందనాదేవికి తెలియకపోలేదు. తనంతతానే పాదాభివం దనంచేసేదే. కాని హఠాత్తుగా ఆమెహృదయం ఎదురుతిరిగింది. ద్విజదాసు ద్వారా వారి అసాధారణ విద్యాబుద్ధులవర్ణన వినియుండకపోతే మామూలు మర్యాద నడిపేదే. అక్కగారు సంకేతం ఇచ్చిందికాబట్టి దూరంనించే చేతులు జోడించింది. ఆ జోడించటంలోనే ఉపేక్షాభావం వ్యక్తమైంది. మరుక్షణమే తండ్రివైపుతిరిగి " నేను రాకండానే భోజనం చేస్తున్నావేం నాన్నా ! " అని అడిగింది.

" నాకు రైలువేళ కావచ్చింది అమ్మ ! నీకు తొందరలేదుగా ! నేను వెళ్ళాక మీరు తీరిగ్గా భోజనంచేద్దురుగాని "

వందనాదేవి సతీదేవికేసి తిరిగింది. " అదేమిటి అక్కా ! అంత విలువైన వెండికంచం మైలపడిపోవటంలేదూ ! మానాన్నకు ఎనామెల్ కంచంలోనో మట్టిమూకుడుకోనో వడ్డిస్తే సరిపోకపోయింది ? "

కూతురు మాటలకు తండ్రి వ్యాకులపడ్డాడు. ఆయన చాల సరళ స్వభావంగల మనిషి. తానే ఏదో పెద్ద అపరాధం చేసినవాడులాగ లజ్జితుడై

"అరె, పొరపాటయిందే! నాకు తోచలేదుసుమీ! సతీదేవి ఏదీ? ఒక డిష్‌లో వడ్డించేస్తే పోయేది...."అంటూ భోజనం ఆపి కూచున్నాడు.

విప్రదాసు క్రోధగంభీర వదనుడైనాడు. తన్ను ఇంతగా ఇదివర కెవరూ అవమానించి యుండలేదు. వందనాదేవి పలికినమాట ఆచారపరాయణులందరికీ, ముఖ్యంగా తనకు చెంపపెట్టు. ఆమె బుద్ధిపూర్వకంగానే ఆ బాణం విసిరింది. ఈ దురభిసంధి ఆమె మస్తిష్కంలో ఎవరిమూలాన సంచితమైనదో విప్రదాసు ఊహించుకుని విచలితుడైనాడు. కాని తన్ను తాను విగ్రహించుకున్నాడు. మందహాసం తెచ్చుకున్నాడు. "మీ అక్కయ్య చెప్పలేదా : ఇది హిందూ గృహం అని? ఇక్కడ ఎనామెల్ కంచాలు, మట్టిమూకుళ్ళు ఉండటానికి వీల్లేదని ఆమె చెప్పలేదూ!"

"కాని మరి విలువైన వెండికంచం పాడైపోతున్నదే!"

అనాధరాయి గాభరా పడుతూ-"నేను వినటం-మళ్ళీ కాస్త నెయ్యిరాసి వెచ్చబెట్టేస్తే-" అంటూ ఆగిపోయాడు.

విప్రదాసు ఆయన మాటను వినిపించుకోలేదు. పూర్వంలాగే వందనాదేవిని లక్షించి-"మా యింట్లో వెండికంచాల కేమీ కరువులేదు. ఎందునా ఉపయోగపడకుండా కూడా కావలసినన్ని ఉన్నాయి. మీ నాన్నగారు మాకు గురుతుల్యులు, మాననీయులు; వారిని గౌరవించే విషయంలో వెండికంచాలను లెక్కచేస్తామా? మీరు వచ్చినందువల్ల కొన్ని మైలపడిపోతే పోనీ, పరవాలేదు" అని చిరునవ్వు నవ్వుతూ-"మీ అక్కయ్యలాగే నువ్వూ ఒక సనాతనుల యింటికోడలివైతే....మీ నాన్నగారు వచ్చినప్పుడు మట్టి మూకుడులోనే వడ్డించుదువుగానిలే. ఆ తరువాత దాన్ని విసరిపారవేయవచ్చు. నష్టం ఉండదు. ఏమంటావు వందనా?" అన్నాడు.

"నేనైతే మా నాన్నకు బంగారు కంచం పెట్టనూ!"

విప్రదాసు నవ్వాడు."నిజంగా పెట్టేదానివైతే ఆగొప్పలు చెప్పుకోనే చెప్పుకోవు. మీ నాన్నగారిమీద నీకే అంతప్రేమ ఉందనుకోకు. ఇంకొకతె కూడా తన బాబాయిని నీకన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నదనే నానమ్మకం"

ఇప్పటికి అనాధరాయి ప్రసన్నచిత్తుడైనాడు. "ఔనౌను. మా అన్నయ్య చనిపోయేసరికి 'సతి' చాల చిన్నది. అప్పుడు నేను విదేశాల్లో నౌకరీ చేస్తున్నాను. ఆ తరువాత స్వదేశానికి తిరిగి వచ్చాను.

సంఘం నన్ను వెలిపెట్టింది. అయినా సతీదేవి నన్ను చూస్తేసరి పరిగెత్తుకువచ్చి ఒడిలో వాలేది—"

"ఆ సంగతులన్నీ ఇప్పుడెందుకు నాన్నా!" అంటూ వందనాదేవి అడ్డువచ్చింది.

"ఉండమ్మా! నాకా సంగతులన్నీ జ్ఞాపకం వస్తున్నాయి. ఒకసారి సతి నా కంచంలో నాతోపాటు భోజనం చేస్తోంటే వాళ్ళమ్మ చూచి—"

"ఓ నాన్నా! నువ్వేమి చెబుతున్నావో నీకే తెలియదు. అక్కయ్య నీతో ఎప్పుడు - నువు పొరపాటు పడుతున్నావు."

"పొరపాటుకాదు వందనా! ఆ సంగతి నలుగురికి తెలిస్తే ఏమి గల్లంతు అవుతుందోనని మీ అమ్మ ఆనాడు ఎంతో భయంతో——"

"నీకు ఇవాళ రైలు అందుతుందని తోచదు. ఇప్పుడు గంట ఎంత అయిందో తెలుసా?"

అనాధరాయి గాభరాపడి, చేతిగడియారం చూచుకుని శాంతించాడు. "ఇంకా చాల 'టైము' ఉంది, పరవాలేదు. నువు ఊరికే గాభరా పెడతావు"

విప్రదాసు నవ్వుతూ "రైలు ఇప్పుడెక్కడ వస్తుంది. మీరు విశ్రాంతిగా భోజనం చెయ్యండి. నేను మిమ్మల్ని స్టేషనుకు తీసుకువెళ్ళి రైలెక్కించి వస్తానుగా!" అని చెప్పి విప్రదాసు గదివిడిచి వెళ్ళిపోయాడు.

తలుపు చాటునించి సతీదేవి ముందుకువచ్చింది. "విన్నావా అక్కా! మానాన్న....ఇక్కడి పరిస్థితులు తెలియక ఎలా మాటాడేశాడో!" - రహస్యంగా అడిగింది వందనాదేవి.

"విన్నా లే"

"ఆ మాటలు మీ అత్తగారి చెవినిపడితే నీకు ఇబ్బందికాదూ?"

"అయితే అయిందిలే"

"మీ ఆయన కూడా స్వయంగా విన్నారు. వారుమాత్రం విన్ను ఏమీ అనకుండా ఊరుకుంటారా?"

సతీదేవి నవ్వింది. "నిజంగా అందులో నా అపరాధం ఏమైనా ఉన్నట్టయితే వారి దండన సంతోషంగా స్వీకరిస్తాను. ఆ తప్పొప్పుల విచారణ వారిపై విడిచి నేను నిశ్చింతగా ఉంటాను - బాబాయి! ఏమైనా వడ్డించనా?"

"కడుపు విండిపోయింది తల్లీ! నా కింకేమీ అక్కర్లేదు" - అంటూ అనాధరాయి భోజనం ముగించి లేచాడు.

ఆయనకు రైలు టైము కావచ్చింది. గుమ్మంలో జట్కా ఉంది. అటు వరండాలో మోటారుఉంది. పరుపు చుట్టపెట్టి నౌకర్లు తెచ్చి జట్కాలో పెట్టారు. ఆ సమీపంలోనే అనాధరాయి విప్రదాసుతో మాటాడుతూ నిల్చున్నాడు. వందనాదేవి దుస్తులు మార్చుకుని అక్కడికి వచ్చింది. "నాన్నా! నేనూ నీతో వచ్చేస్తున్నాను" అన్నది తండ్రితో.

తండ్రి ఆశ్చర్యపోయాడు. "ఈ యెండలో స్టేషన్‌దాకా నువు రావటం దేనికీ?"

"స్టేషన్ దాకానేకాదు. కలకత్తా వచ్చేస్తున్నాను"

"అదేమి మాట! ఇంకా కొన్నిదినాలు నువు ఇక్కడ ఉంటావని అనుకుంటున్నానే' - అన్నాడు ఆశ్చర్యంగా విప్రదాసు.

"ఉండను"

"మరి నువు భోజనమైనా చెయ్యలేదు!"

"చెయ్యను. కలకత్తావెళ్ళాక చేస్తాను"

"మీ అక్కయ్యకు చెప్పావా?"

"చెప్పలేదు ఆనక తెలుస్తుందిగా!"

"భోజనమైనా చెయ్యకండా నువు ఇలా వెళ్ళిపోతే మీ అక్కయ్య చాల నొచ్చుకుంటుంది సుమీ!"

"ఎందుకూ నొచ్చుకోటం? ఆమె నన్ను బొట్టూ. కాటుక పెట్టి పిలిస్తే వచ్చినదాన్ని కాదు."— అంటూ చరచరా వెళ్ళి బండిలో ఎక్కి కూచుంది.

ఏదోగడబిడ జరిగింది! ఏమీ జరక్కపోతే ఈ పిల్ల ఇలాహఠం చెయ్యదే! - అనుకున్నాడు అనాధరాయి. విప్రదాసు వైపుతిరిగి- "కొన్నాళ్ళు ఇక్కడే వాళ్ళఅక్క దగ్గిర ఉంటుందనే నేనూ అనుకున్నాను. అకస్మాత్తుగా మనస్సు మార్చుకుని బండీయెక్కి కూచుంది. ఇకదిగదు"-అన్నాడు.

విప్రదాసు మాటాడలేదు. బండి బయలుదేరింది. వందనాదేవి దృక్కులు మేడమీది లైబ్రరీగది కిటికీవైపు ఆకర్షితములైనవి. అక్కడ కిటికీ చువ్వలు పట్టుకుని ద్విజదాసు తనకేసి చూస్తూ నిల్చియున్నాడు.

—౦౦౦—

# 7

స్టేషన్‌కు వెళ్ళిన తరువాత.... పైన ఎక్కడో ఏదోదుర్ఘటన జరిగిందనీ, రైలు ఇప్పుడప్పుడే రాదనీ.... సమాచారం తెలిసింది. స్టేషన్ మాస్టరుకు జ్వరంవచ్చి ఆనాడు రాలేదు. ఎవరో కొత్తవాడు అరవాయన 'రిలీవింగ్‌హేండు' పనిచేస్తున్నాడు. అతడు స్పష్టంగా ఏమీచెప్పలేదు. 'గంటఆలస్యం కావచ్చు, లేకపోతే రెండుగంటలు ఆలస్యంకావచ్చు' అన్నాడు.

"పోనీ ఇవాల్టికి మీరు ప్రయాణం మానుకుంటే యేం." అన్నాడు విప్రదాసు అనాధరాయితో.

"ఏమీలేదు. కాని—"

వందనాదేవి అర్ధోక్తిలో అందుకుని- బయలుదేరి వచ్చాక మళ్ళీ వెనక్కుపోవటం బాగుండదునాన్నా" అన్నది.

"ఎందుకు బాగుండదు వందనా? నువుభోజనం చెయ్యకండా బయలుదేరి వచ్చావు. ఎప్పుడు వస్తుందో రైలు చెప్పలేం. కలకత్తావెళ్ళేసరికి చాలపొద్దు పోవచ్చు. రోజంతా ఉపవాసం చేస్తావా?"- మృదువుగా మందలించాడు విప్రదాసు.

"నాకు ఆకలిలేదు. తిరిగి ఇంటికివెళ్ళినా నేను భోజనం చెయ్యను"

"మా అమ్మాయి తీరు అంతా వేరు లెండి; హఠంచేసిందంటే.... దానికి అంతూ పొంతూ ఉండదు" అన్నాడు అనాధరాయి అప్రసన్నుడై.

విప్రదాసు మరి బలవంతం చెయ్యలేదు. మాటాడకండా ఊరుకున్నాడు.

*  *  *  *

అది పెద్దస్టేషన్‌కాదు. అయినా ఒక 'వైటింగ్‌రూమ్' వుంది. అక్కడికి వెళ్ళిచూస్తే లోపల ఒక బంగాళీ యువకుడు, అతని భార్య వున్నారు. ఆతడు బారిస్టరో. డాక్టరో, ఇంగ్లాండులో ప్యాసైవచ్చిన ప్రొఫె

సరో అని అనుకునేట్టుగా వున్నాడు. ఈ పల్లెప్రాంతానికి ఎందుకు వచ్చాడో అర్థంకాదు. పడకకుర్చీలో పడుకున్నాడు. కుర్చీ చేతులమీదకాళ్లు చాచుకున్నాడు. సగం నిద్రలో, సగంమెళుకువలో ఉన్నట్టు తోచింది. ఎవరోవస్తున్నట్టు అడుగుల చప్పుడువిని కళ్ళువిప్పి చూచాడు. ఆయన భార్య కుర్చీలోనించి లేచి జంకుతూపక్కకు తప్పుకుంది. ఆమె ఇంకా తెల్లదొరసానిగా మారినట్టులేదు.

ఆ గదిలో ఇంకో పడకకుర్చీకూడా వుంది. తండ్రిని అందులో కూచోబెట్టి వందనాదేవి తానొక బల్లమీదకూచుంది. "మీరుకూడా ఇక్కడ కూచోండి విపిన్‌బాబూ! తప్పులేదు. బల్ల పెద్దదే లెండి. ఇంతమాత్రానికే మీకులంపోదు" అన్నది విప్రదాసును లక్షించి.

అనాథరాయి నవ్వాడు. "అయితే విప్రదాసుకు మడి-మైల విచారణ యెక్కువగా వుందేమిటి?"

విప్రదాసు మందహాసం చేసి ఊరుకున్నాడు.

"మా అమ్మాయి మాట నిజమేనా అయితే?" అన్నాడు అనాథ రాయి.

"మీ అమ్మాయి భోజనంకూడా చెయ్యకండా చాలక్రోధావేశంలో వుంది. కోపంలో ఉన్నప్పుడు ఆడవాళ్ళ నోటివెంట వచ్చేమాటలను పుర స్కరించుకుని ఏమీ నిర్ణయించకూడదు."

"నేనేమీ కోపంగాలేను" అన్నది వందనాదేవి.

"కోపమేలేకపోతే నువ్వు కలకత్తాప్రయాణం ఆపుకుని ఇంటికే తిరిగివస్తావు. అదీగాక మనమంతా ఒకేబండిలో ఎక్కి వచ్చాంకదా! కులం పోయేట్టయితే అప్పుడే పోయిందిగా! ఇప్పుడు మళ్ళీ 'బెంచీమీద కూచోవటం' మాట నువ్వు ఎత్తటంలో అర్థం ఏమిటి?"

"పోనీయండి, మీరు ఇంటికివెళ్ళి మమ్మల్ని ముట్టుకున్నందుకు స్నానం చేస్తారా, చెయ్యరా, చెప్పండి?"

"చేస్తానో, చెయ్యనో స్వయంగా నువ్వే చూద్దువుగాని ఇంటికి తిరిగి రారాదూ!"

"నాకు తెలుసు. మీ అమ్మగారికి పాదాభివందనం చెయ్యబోతే .... నేను ఎక్కడ తగులుతానో అని వెనక్కు వెనక్కు పోయారు. మీ కెర గరూ!" - వందనాదేవి ముఖం క్రోధరంజిత మైంది.

"ఆమెను నువుబాగా ఎరగవు. కొన్నాళ్ళుంటే అంతర్యం తెలుసుకోగలవు" - అన్నాడు శాంతస్వరాన విప్రదాసు.

"నేను నమ్మను"

విప్రదాసుకు కష్టం కలిగింది. యెంతచెప్పినా ఆమె విశ్వసించే స్థితిలోలేదు. ఇంకా తెలియజెప్పవలసిన అవసరమూలేదు; అది సమయమూ కాదు. వాదం పెంచకండా ఊరుకోవటంకంటే గత్యంతరం కనిపించ లేదతనికి.

ఇంతలో పడకకుర్చీలోని అపరిచితవ్యక్తి ఆవలిస్తూ లేచి కూర్చు న్నాడు. "మీరేకాదూ జమీందారు విప్రదాసుబాబు?" - అని అడిగాడు.

"చిత్తం"

"మీ పేరు నేను విన్నాను. ఇక్కడొక పల్లెటూరు మా ఆవిడ పుట్టిల్లు. ఈ ప్రాంతాలకు వచ్చినప్పుడల్లా ఇక్కడికి వచ్చిపోతుంటాము. నేను పంజాబులో ప్రాక్టీసు చేస్తూంటాను"

విప్రదాసు అతవికేసి ధ్యానపూర్వకంగా చూచాడు. తనంత ఈడు వుంటుందతనికి .... ఒక అర్ధసంవత్సరం అటో, ఇటో.

"విన్ననే మిమ్మల్నిగురించి అనుకున్నాం. ప్రజలు మిమ్మల్ని చాల భయంకరులని చెప్పుతుంటారు. అంటే ఖరాఖండీ మనుష్యులని వారి ఉద్దేశం. మీరు మంచి ఆచారవంతులని చాలమంది బ్రాహ్మణులు మెచ్చుకోవటంకూడా విన్నాను."

అపరిచితవ్యక్తి ఇంత చొరవగా మాటాడ్డంచూచి వందనాదేవి, ఆమె తండ్రి ఆశ్చర్యపోయారు. విప్రదాసు జవాబేమీ చెప్పలేదు; అన్య మనస్కుడై ఉన్నాడు. అతని మాటలు వినిపించుకున్నాడో లేదో కూడా.

"ప్రతివానికీ వాస్తవికశిక్షణ అవసరం అని నా మతం. మీరు ఒక్కసారి యూరప్ వెళ్ళి రాకూడదూ? అక్కడి స్వాతంత్ర్య వాయువులు పీల్చివస్తే తప్ప మన మనస్సుకు స్వేచ్ఛ లభించదు. అప్పుడుగాని మనకు సంస్కారాలు వదలిపోవు. నేను అయిదు సంవత్సరాలు ఉన్నా నక్కడ" అన్నాడు అపరిచితవ్యక్తి.

"మీరు నిజం చెప్పారు" - అన్నది వందనాదేవి ఆవేశంగా.

ఆ మాటతో అపరిచితవ్యక్తికి మరీ ఉత్సాహం కలిగింది, "ఇది ప్రజాయుగం. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ - ఈ వ్యత్యాసాలేమిటి? నాన్సెన్స్. ప్రతీవ్యక్తికీ తన హక్కులు తాను పొందే అధికారం ఉంది.

నాకే డబ్బు ఉంటేనా - మీ జమీలోని ప్రజలనందర్నీ నా ఖర్చుమీదే యూరోపు పంపించేవాణ్ణి. తమ హక్కులేమిటో వాళ్ళకప్పుడు బాగా తెలుస్తాయి"

ఈ మాటలు వందనాదేవికి రుచించలేదు కామాలు. అడిగింది - "మా బావగారు ప్రజల్ని పీడిస్తున్నారని మీకెవరు చెప్పారు. మీ మామ గారిపై వీరు జరిపిన అత్యాచారం ఏమీ లేదు కద!"

"ఓహో, వీరు మీ బావగారా? బాగుంది. ఎబ్బే వీరిపై మా మామ గారు చాడీలేమీ చెప్పలేదు" అంటూ భార్యకేసి తిరి గి" నీ చెల్లెళ్ళు ఆ అమ్మాయిలా ఉంటే ఎంత బాగుండును?" అని మళ్ళీ వందనాదేవితో - "నువు ఇంగ్లాండు వెళ్ళివచ్చావా? వెళ్ళకపోతే ఒకసారి తప్పకుండా వెళ్ళిరా అమ్మాయి! స్వాతంత్ర్యము, సాహసము, శక్తి ఎలా వుంటాయో కళ్ళారా చూచి రా .... ఈ సారి మా ఆవిడనుకూడా తీసుకు వెడదామను కుంటున్నాను" అన్నాడు.

ఇంతలో రిలీవింగ్ స్టేషను మాష్టరు వచ్చి - "సిగ్నల్ అయింది. రైలు వచ్చేస్తోంది" - అని చెప్పాడు.

అందరూ గబగబాలేచి ప్లాట్‌ఫారంమీదికి వచ్చారు. రైలువచ్చి ఆగింది. బండి అంతా నిండుగా ఉంది. అవి సెలవుదినాలు కావటంచేత ఎక్కడెక్కడి వాళ్లూ యాత్రలు వెడుతున్నారు. ఒక్కటే ఫస్టుక్లాసుడబ్బా; ఒక్కటే సెకండుక్లాసు డబ్బా. కలకత్తాలో ఏవో పోటీపందేలు చూడ బోతూన్న యూరపియన్ రైల్వే ఉద్యోగస్థులతో సెకండుక్లాసు డబ్బా నిండిపోయింది. వారిలో కొందరు ఫస్టుక్లాసు డబ్బాలోకూడా వెళ్ళి ఆక్ర మించారు. బాగా సారాయం తాగారు కామాలు, వారి ముఖాలు భయంక రంగా ఉన్నవి. వారు ఎవర్నీ బండిలో ఎక్కనీయటంలేదు. తలుపు దగ్గిర గుమికూడి "వెళ్ళండి, వెళ్ళండి" అని జడిపిస్తున్నారు. స్టేషన్ మాస్టరు వచ్చాడు, గార్డుకూడా వచ్చాడు; కాని ఏమీ చెయ్యలేక పోయారు.

"ఇక మనగతియేమిటి?" అన్నాడాపంజాబు బారిస్టరు.

"పోనీ, ఇంటికి తిరిగి పోదాం రాత్రిబండికి వెళ్ళచ్చు" అన్నది వందన భయపడుతూ.

"అంతకంటే గత్యంతరంలేదు" అన్నాడు బారిస్టరు.

"ఎందుకూ? ఆ డబ్బాలో నలుగురైదుగురు మాత్రమే ఉన్నారు. ఇంకా నలుగు రైదుగురు కూచోవచ్చు." అన్నాడు విప్రదాసు.

"కాని వాళ్ళంతా సారాయం తాగి మత్తెక్కి ఉన్నారు" అన్నాడు అనాధరాయి గాభరాపడుతూ.

విప్రదాసు మృదులశరీరం ఒక్కసారిగా ఇనుములా బిగువు తేలింది. "అది ఆ దేశస్థుల ఆచారం ; మనకేం ? ఎక్కండి, రండి" అంటూ బలమంతా ఉపయోగించి తలుపు తెరచాడు. వందనా దేవిని రెక్కపట్టుకుని లోపలి కెక్కించాడు. "మీరుకూడా ఎక్కండి లాయర్ గారూ ! మీ హక్కును నిలబెట్టుకో దలిస్తే మీ ఆడవాళ్ళతో కూడా వచ్చి ఎక్కండి. అత్యాచారియైన జమీందారు తోడు ఉన్నాడు, మీకేం భయం లేదు" - అన్నాడు.

మదిరా మత్తులైయున్న ఆంగ్లేయులంతా విప్రదాసు తీక్షణవదనం కేసి ముహూర్తమాత్రం అవలోకించి ఎవర్స్థానంలో వారు కూలబడ్డారు.

---

## 8

కాని పక్కబండీలోని సహచరులు వారికి మద్దతువచ్చి మీసాలు దువ్వారు గలగలా ఇంగ్లీషు ముక్కలేవో వల్లిస్తూ.

విప్రదాసు గార్డును సైగచేసి పిల్చాడు. "వీళ్ళు ఫస్టుక్లాసు ప్యాసింజెర్లు కాదని తోస్తున్నది. వారికి బుద్ధి చెప్పవలసిన బాధ్యత మీదిసుమీ !" అన్నాడు.

గార్డు పాపం వెనుకాముందాడుతూ నిల్చున్నాడు. స్టేషన్ మాస్టరు కూడా అక్కడే ఉన్నాడు. విప్రదాసు అతని చేతిలో అయిదు రూపాయిల నోటు పెట్టి చెప్పాడు - "నాపేరు నా నౌకర్లు చెబుతారు. మీరు వెంటనే

మీ పైయధికారులకు టెలిగ్రాం ఇవ్వండి— ఇక్కడ కొంతమంది తప్పతాగి ఆంగ్లేయ రైల్వే నౌకర్లు అక్రమంగా ఫస్టుక్లాసులో ఎక్కి కూర్చుని ఎంత చెప్పినా దిగటంలేదనీ, గార్డుకూడా తమాషా చూస్తూ నిల్చున్నాడేగాని ప్రయాణీకులకు సాయం చెయ్యలేదనీ - వెంటనే టెలిగ్రాం ఇవ్వండి "

గార్డు తనకు రానున్న ఆపద గ్రహించాడు. ఎలాగో సాహసించి ముందుకువచ్చి వాళ్ళను ఆంగ్లభాషలో మందలించాడు - " మీరు రైల్వే నౌకర్లు. రైల్వే 'పాస్' మీద వెడుతున్నారు. చిన్నా, పెద్దా గమనించి ప్రవర్తించాలి " అంటూ.

ఆ మాటలను వారు నిర్లక్ష్యం చెయ్యలేక పోయారు. దిగిపోయి పక్కపెట్టెలో ఎక్కారు. కాని వాళ్ళకు గుండెలో మంటల్లానే ఉంది. అందుచేత వెడుతూ వెడుతూ చాల అనరాని మాటలే గొణుక్కున్నారు. మన బారిష్టరు మాత్రం గార్డుదగ్గిరకుపోయి " మీరే లేకపోతే ఇవాళ మా గతి ఏమయ్యేదోకదా। చాల సాయం చేశారు " అని ధన్యవాదా లర్పించాడు.

బండి కదలటానికి గంట కొట్టారు. విప్రదాసు దిగిపోయేందుకు ఉద్యుక్తుడౌతూ - ఇక మీకేం పరవాలేదు. వాళ్ళు మిమ్మల్ని ఏమీ చెయ్యలేరు " అన్నాడు.

" సాహసించరు లెండి ; నౌకరీ పోతుందేమోనని భయం ఒకటి ఏడిసిందిగా। " - అన్నాడు బారిష్టరు.

వందనాదేవి ముందుకువచ్చి తలుపువేసింది. " నౌకరీ పోతుందన్న భయంతో వారు ఊరుకుండి పోతారని గ్యారంటీ ఏముందీ ? మీరు కూడా మాతో రావలసిందే విపిన్‌బాబూ। "

" నువే మగాడివైతే ఉద్యోగం పోతుందన్నభయం ఎలాంటిదో బాగా తెలుసుకునే దానివే " - అంటూ విప్రదాసు నవ్వి, " మరి నేను భోజనంచేసి రాలేదే ? " అన్నాడు.

" నేను చేసి రాలేదుగా। "

" అది నీకు వేడుకైంది మరి। అదీగాక ఏదో పెద్దస్టేషన్లో భోజనం దొరుకుతుంది, తినేస్తావు. "

" ఊహుం. తినను. నేనూ ఉపవాసం ఉంటాను "

" ఆ ఉపవాసంవల్ల ఎవరికీ, ఏమీ లాభంలేదు - దిగిపోతాను - బారిస్టరుగారూ। మీరు తోడు ఉన్నారుగా। కాస్త కనిపెట్టి ఉండండి. అవసరమైతే - "

అర్ధోక్తిలో వందనాదేవి అందుకున్నది - "గొలుసు పట్టుకులాగి రైలు ఆపమంటారా ? ఆపని నేను చెయ్యగలను." - అంటూ కిటికీవద్దకు వచ్చి నౌకర్లతో - "మీ పెద్దబాబు మాతో కలకత్తా వచ్చేస్తున్నారు. రేపో ఎల్లుండో తిరిగి రాగలరని అమ్మగారితో చెప్పండి" - అన్నది.

బండి కదిలింది. వందనాదేవి భావగారి దగ్గరవచ్చి కూచుంది. "మీరు మమ్మల్ని జబర్దస్తీగా రైల్లో ఎక్కించావు. వాళ్ళు బండి దిగకండా చెయి చేసుకుంటే ఏమయ్యేది ?"

"వాళ్ళ నౌకరీలు ఊడిపోయేవి"

"వాళ్ళ నౌకరీలమాట దేవుడెరుగును. ముందు మా యెముకలు విరిగేవి" అంటూ ఆమె నవ్వింది. విప్రదాసుకూడా నవ్వాడు. బారిష్టరు భార్యకుకూడా నవ్వు వచ్చింది. బారిష్టరుగారు మాత్రం గంభీరంగా కూచున్నాడు.

"రైలు ప్రయాణాల్లో ఇలాంటి యాతనలు తరచు సంభవిస్తూనే ఉంటాయి. వార్తాపత్రికల్లో చూస్తూంటాంకదూ ! అటువంటప్పుడు జబర్దస్తీగా ప్రవర్తించటం నామతంకాదు. రాత్రి బండికి వెళ్ళేవాళ్ళం ; ఏం మించిపోతుందీ ?" - అన్నాడు అనాధరాయి.

"రాత్రిబండిలోకూడా తప్పతాగిన దొరలుఉంటే ఏంచేస్తావునాన్నా ?"

"ఎప్పుడూ ఇలాగే తటస్థిస్తే మర్యాదస్థులైన వాళ్ళు ప్రయాణాలు మానుకోవటం మంచిది" - అంటూ ఆయన చుట్టవెలిగించాడు.

"మానాన్న మర్యాదస్థుల లక్షణాలు చాలాచెబుతారు" అన్నది వందనాదేవి విప్రదాసుకేసి తిరిగి. విప్రదాసు మందహాసం చేశాడు.

"చిన్నప్పుడొకసారి మీరు తెల్లదొరలను చావమోదారుటగా ! నిజమేనా ?"

"ఎబ్బే ; అట్టిఅదృష్టం నాకు లభించలేదు"

"ప్రజలకు మీరు భయంకర స్వరూపులట ! ఇంట్లో వాళ్ళకుపెద్ద పులిలా వుంటారుట ! ఔనా ?"

"ఎవరు చెప్పారునీకు"

"మా అక్కయ్య"

"ఏమి చెప్పిందీ ?"

"మిమ్మల్నిచూస్తే వొంట్లో రక్తమంతా భయంవల్ల నీళ్ళునీళ్ళుగా అయిపోతుందిట !"

"ఏం నీళ్ళు ?"

"తప్పుతాగిన తెల్లదొరలనుచూస్తే మాకు ఐనట్లు"

"అంతమాత్రం భయం ఉండవలసిందేలే. లేకపోతే ఆడవాళ్ళను అదుపులో ఉంచుకోవటం కష్టం. నీ పెళ్ళికానీ ; నాతమ్ముడికి ఆ విద్యే నేర్పుతాను"

"నేర్పండీ. నేర్పితేమాత్రం అందరికీ అన్నివిద్యలూ సిద్ధిస్తాయా ? మా అక్క అమాయికపుది కాబట్టి సరిపోయింది. నేనైతేనా ? ఇంట్లో అందరినీ గడగడలాడించనూ ?"

"అంటే- అందరిశరీరాల్లో రక్తాన్ని నీరు గారించేస్తావన్నమాట ! అంతపాటి దానివే, సందేహంలేదు. ఒక్కపూటలోనే చూపించేశావు నీ ప్రతాపం. ఇవాళ నువు చేసినపని మా అమ్మజీవితంలో మరచిపోదు."

వందనాదేవి ఉత్తేజిత అయింది. "మీ అమ్మగారు ఏమిచేసిందో తెలుసా ? నేను ప్రణామం చేసేందుకు వెడితే, వెనక్కు పోయింది."

విప్రదాసు ఆశ్చమేమీ ప్రకటించలేదు. "నువు ఆమెను గురించి అంతవరకే తెలుసుకో గిలిగావు. అంతకుమించి నువ్వేమీ యెరగవు. ఆమె ఎలాటి మనిషో పూర్తిగా తెలిసినవాడు.... ఒకచిన్నవిషయాన్ని పురస్కరించుకుని ఇవాళ నువు చేసినది పెద్దపొరపాటు అని గ్రహిస్తావు"

"అందరికీ ఆత్మప్రతిష్ఠ అనేది ఉంటుంది సుమండీ"

"ఆత్మప్రతిష్ఠ అంటే నీకేమైనా తెలుసా ? పెద్దపెద్ద ఆంగ్లేయ గ్రంథాల్లో చదివావు దాన్నిగూర్చి. ఔనా ? మాఅమ్మ ఇంగ్లీషు చదువుకో లేదు. పుస్తకాలుకూడా ఆమె ఎక్కువగా చదవలేదు. ఆమె అభిప్రాయా నికీ, నీ భావనకూ పొంతన లేకపోయింది."

"నా భావాని కనుకూలంగా నేను ప్రవర్తిస్తాను. తప్పేముంది"

"తప్పేమీలేదు. కాని అలాచేస్తే పొరపాట్లు వస్తాయి. చేశావుగా ఒక పొరపాటు. విదేశీయులు రాసినపుస్తకాలే విజ్ఞాన సర్వస్వమన్న భావన తోనే భోజనమన్నా చెయ్యకుండా పరిగెత్తుకు వచ్చావు. లేకపోతే రాక పోయేదానివే. పెద్దవాళ్ళను అవమానించటానికి సంకోచించేదానివే. ఆత్మ మర్యాద, ఆత్మాభిమానము- అన్నమాటల భేదము తెలుసుకునేదానివే."

ఆ భేదము తెలిసినా, తెలియకపోయినా.... వందనాదేవికి ఒక విషయం మాత్రం బాగా తెలిసివచ్చింది. ఆనాటి తనవ్యవహారం విప్రదాసుకు కష్టమనిపించింది ; ముఖ్యంగా అతని తల్లికి అవమానం జరిగింది కాబట్టి.

మరి రెండుమూడు నిమిషాలవరకు ఎవరూ మాటాడలేదు. "అమ్మగారి లాగే మీరు కూడా సనాతనాచారపరులన్న మాటేనా?"- అని వందనాదేవి అడిగింది చివరకు.

"ఔను"

"మీకుకూడా మడి, మైల...."

"ఉన్నవి."

"నమస్కారం చేసేటప్పుడు మీరుకూడా వెనుకడుగు వేస్తారన్నమాట."

"వేస్తాను. కాని అందుకు సమయాసమయాలుఉన్నాయి మాకు. అవి తెలిసి ప్రవర్తిస్తాము."

"మా అక్కయ్యనుకూడా మీ నియమాల్లో బంధించి వేస్తున్నారన్నమాట!"

"ఆ సంగతి మీ అక్కయ్యనే అడుగు. అయినా ఆమెకూడా పారివారిక నియమాలను మన్నించవలసిందే"

వందనాదేవి నవ్వింది. "అంటే-పెద్దపులిని చూచి భయపడకండా మాత్రం రోజులు గడవవన్నమాట!"

"ఔను, పగటిబండిలో తప్పతాగిన తెల్లదొరలనుచూచి భయపడి రాత్రి బండికి వెళ్ళరూ? అలాగే. అది సాధారణ ప్రకృతి నియమం"

"మా అక్క స్త్రీ. అబల. అందుచేత మీ నియమాలతో ఆమెను బందీ చేయగలిగారు. కాని ద్విజబాబు మీ పారివారిక నియమాలను పాటించడటగా! అది మీ కిష్టమేనా మరి?"

విప్రదాసు ముఖవైఖరిలో మార్పేమీలేదు. "కొన్ని గూఢ రహస్యాలు ఉన్నాయి. అవి యోగ్యులకేతప్ప అందరికీ చెప్పేందుకు వీల్లేదు"

"ద్విజబాబుకు తెలుసా?"

"సమయం వచ్చినప్పుడు తెలుసుకో గలడు. నాలో శారీరకంగా గాని, మానసికంగాగాని పక్షపాత భావంలేదని వాడికి తెలుసు."

ఆ మాటతో వందనాదేవి ముఖం ఉదాసీనమై పోయింది. అది విప్రదాసు గ్రహించాడు. ఇంతలో అనాధరాయి కూతుర్ని పిలిచి మంచినీళ్ళు ఇమ్మన్నాడు. ఆమెలేచి మంచినీళ్ళిచ్చి వచ్చింది. పూర్వ విషయాన్నే విప్రదాసుతో చర్చించేందుకు ధైర్యం చాలలేదు. విషయం మార్చి - "మీ

అమ్మగారిమాట ఎలావున్నా.... నేను భోజనం చేయకండా వచ్చేసినందుకు మా అక్కయ్య నొచ్చుకుంటుందేమోనవి నాకు బాధగాఉంది" - అన్నది.

"మీ అక్కయ్య నొచ్చుకుంటుందేమో నన్నది పెద్ద విషయమా? మా అమ్మకు కష్టంగా ఉన్నదేమో నన్న సంగతి గణనీయం కాదేం? వహవా! యదార్థం తెలియక చాలమంది తలక్రిందుగా మాటాడుతూంటారు సుమీ!"

సూర్యాస్తమయమైంది; చీకటి పడుతోంది. వందనాదేవికి విప్రదాసుముఖ కవళిక కవిపించలేదు. కిటికీలోనుంచి బైటికిచూస్తూ చాలసేపు మౌనంగానే ఉంది. అసలు మామూలుగా ఈ వేళకల్లా రైలు 'హవడా' స్టేషన్ చేరవలసింది. ఇవాళ ఇంకా రెండు మూడు గంటలకుగావి ఆ స్టేషన్‌కు చేరేట్టులేదు. విప్రదాసు జేబులోవించి నోటుబుక్కు తీసి ఏదో రాసుకుంటున్నాడు.

"నేనొకసంగతి అడుగుతాను, చెబుతారూ"- అన్నది వందనాదేవి.

"ఏమిటది?"

"మాలాటి వాళ్ళందరికి 'ఆత్మ ప్రతిష్ఠ' ను గురించి కాలేజీ పుస్తకాల్లో చదివిన మిడిమిడి జ్ఞానమే నన్నారుగా! పుస్తకాలే చదవని మీ అమ్మగారు "ఆత్మ ప్రతిష్ఠనుగురించి ఎక్కడ అభ్యసించిందో!"

విప్రదాసు ఆశ్చర్యంగా చూచాడు, జవాబు చెప్పలేదు.

"మీ అమ్మగారు పెద్దవారు. నేనా మాట కాదవను. కాని ప్రపంచంలో 'వృద్ధత్వం' కన్నా మించింది లేనేలేదా?"

ఈ సారికూడా విప్రదాసు మాటాడలేదు.

"మేము ఇవాళ మీరు పిలిస్తే వచ్చిన అతిధులంకాదు. ఆ సంగతి తెలుసుకోవటానికి పాశ్చాత్య పుస్తకాలు చదువుకో నక్కర్లేదు. అది తెలిసికూడా మీరు నన్ను అవమా వించటానికి వెనుతీయలేదు"

విప్రదాసు ఉలకలేదు, పలుకలేదు.

"ఇప్పటికీ నేనామెను క్షమాపణ వేడుకుంటాను. మా అక్కయ్యకు కష్టం కలగకండా ఉండటమేనాకు కావలసింది. నా తలిదండ్రులు ఇంగ్లండు వెళ్ళి వచ్చారు. మా నాన్న ఒక దొరఅనీ, మా అమ్మ ఒక దొరసాని అనీ - తప్ప అంతకన్నా వారినిగురించి మీ అమ్మగారికి తెలియదు. అయినా నా తలిదండ్రులను పురస్కరించుకుని ఆవిడగారు మా

అక్కయ్యను ఏవగించు కుంటుందిట. నన్ను కూడా ఇవాళ బాగానే అవమానించింది. అది అవమానం కాదని ఎవరంటారు ? .... వందనాదేవి కన్నులు చెమ్మగిల్లినవి.

"ఆమె నిన్ను అవమానించలేదు" అన్నాడు విప్రదాసు మెల్లిగా.

"తప్పకండా అవమానించింది"

విప్రదాసు కొంచెం ఆగి - "ఉహుం. అమ్మ నిన్ను అవమానించ లేదు. అయినా యీ విషయంలో నీకు సంజాయిషీ చెప్పవలసింది అమె. తర్కించి ప్రయోజనం ఏమిటి ? ఆమెనే అడిగితే తెలిసిపోతుంది"

వందనాదేవి కిటికీలోనుంచి బైటికిచూస్తూ కూచుంది. విప్రదాసు ఇంకా ఇలా అన్నాడు - "చాలకాలంక్రితం ఒకసారి మా నాన్నకూ మా అమ్మకూ వాగ్వాదం జరిగింది. ఏదో చిన్న విషయంమీదే అది ఆరంభ మయింది. కాని చాల గలభా అయింది ఆ రోజున. ఆ నాడు నాకు అర్ధ మయింది - మా అమ్మ ఏమీ చదువుకోకపోయినా 'ఆత్మ మర్యాద' తెలిసిన మనిషి అని.

వందనాదేవి తిరిగిచూచింది. మాతృగర్వంతో అతని ముఖం ఉజ్వలంగా ప్రకాసించింది. ఆమె యేమీ మాటాడలేదు. మళ్ళీ కిటికిలోనించి బైటికిచూస్తూ ఉండిపోయింది.

"చాలరోజుల క్రితం ఒకసారి నేను మా అమ్మను అడిగాను - "ఇంత ఆత్మ మర్యాద ఉంది నీలో, ఎక్కడ నేర్చుకున్నావమ్మా ! అని"

"ఏమన్న దామె ?" — ముఖంతిప్పకుండానే వందనాదేవి ప్రశ్నించింది.

"నేను మా అమ్మకు సయాంకొడుకును కాదు. నీకుతెలిసేవుంటుంది. ద్విజబాబు, కళ్యాణి అని ఒక ఆడపిల్ల ఆమెకన్నబిడ్డలు. మా అమ్మ ఏమన్నదంటే — 'నాయనా ! మీ ముగ్గుర్నీ నా ఒడిలోపెట్టి పెంచి పెద్దచేయవలసిన భారం నాకుపప్పచెప్పిన మీ నాన్నగారే 'ఆత్మమర్యాదాపాఠంకూడా నేర్పారు. మరింకెవరూకాదు' అని. ఆమెలోని ఆ ఆత్మగౌరవం వల్లనే .... నేనుఅమె సవతిబిడ్డడి నన్నసంగతి ఎవ్వఁకీ ఎప్పుడూ తెలియలేదు. నామాట నీకు అర్థమైందా వందనా ?"

కాసేపాగి విప్రదాసు ఇంకా ఇలా అన్నాడు : "మనం నమస్కారం చేస్తే ఎదుటివాడు ఏ చేయి యెత్తి స్వీకరించాడు.... ఎంతదూరం వెనక్కువెళ్ళి నిలబడ్డాడు.... ఎంతగా తలవంచి నమస్కారం చేశాడు — ఈ మొద

లైన విషయాలమీద వివాదాలు ప్రతి దేశంలోనూ ఉన్నవి. అహంకార మదాన్ని నీ పాశ్చాత్య పుస్తకాల ప్రతిపేజీలోనూ ఆస్వాదించ గలవు. మా అమ్మ కొత్తగా కాపురానికి వచ్చినప్పుడు సవతికొడుకును నేనొకణ్ణి ఉన్నందువల్ల ఆశ్రితులు, ఆత్మీయులు, స్వజనులు చాల మంది ముఖాలు ముడుచు కున్నారు. కాని ఆమె యావత్తు విషాన్నీ అమృతంగా మార్చివేసింది. తానీ యింటి యజమానురాలినన్న అభిమానంతో కాదు; మాతృమర్యాదతో. ఈ తత్వము కేవలం మన భారతీయులకే అనుభూతము. విదేశీయుల కిది అర్థంకాదు. వార్తాపత్రికలు చదివి వారు మనల్ని బానిసలని పిలుస్తారు. పైకి వారి కలా కనిపిస్తాం మనం. ఈ దాస్యపు ముసుగులోనే మనస్త్రీలు 'అన్నపూర్ణ' 'రాజేశ్వరీ' మూర్తులు. అది పాశ్చాత్యు లెరుగకపోవచ్చు: నీకైన తెలియదా ?"

వందనాదేవి భీతహరిణం వలె అతనికేసి చూస్తూఉండిపోయింది. బారిస్టరుగారు ఇంతలో పెద్దగా "హవడా స్టేషను వచ్చేసింది." అని కేక పెట్టాడు.

"అమ్మయ్య," అని నిట్టూర్పు విడిచాడు. అనాథరాయి.

"ఇక్కడ దిగటం నాకిష్టంలేదు! తిరిగి ఇంటికి వెడదాం. అత్త గారి దగ్గిరకుపోయి—'నేను పొరపాటు చేశాను, క్షమించండి' అని వేడుకుంటాను"- అన్నది మృదువుగా వందనాదేవి. విప్రదాసు ఏమీ పలుకలేదు: నవ్వి ఊరుకున్నాడు.

అందరూ రైలుదిగారు. "గ్రాండు హోటలుకు వెడదాం. నేను వస్తున్నట్టు టెలిగ్రాంకూడా ఇచ్చాను" అన్నాడు అనాథరాయి. విప్రదాసు ముందు గ్రాండు హోటల్ పదం ఉచ్చరించటం వందనాదేవికి లజ్జాకర మనిపించింది.

పంజాబు బారిస్టరు మాత్రం రైలు అంత 'లేటు'గా వచ్చినందుకు చాలకోపం ప్రకటించాడు. విసుక్కున్నాడు. "నేను ఇక్కడినించి బి. యన్. లైనుమీద వెళ్ళాలి. వైటింగురూమ్ కంటే నాకు వేరు శరణ్యంలేదు" అని గొణుక్కున్నాడు.

"విపిన్‌బాబూ! నువుకూడా మాతోపాటు...." అంటూ సంకోచిస్తూ ఏమో అనబోయాడు అనాథరాయి.

"గ్రాండు హోటలుకా ?"- అంటూ విప్రదాసు నవ్వాడు.

"బహూబాజారులో ద్విజబాబు బస ఉంది. అక్కడమన వాళ్ళు కొందరు ఉన్నారు. మీరుకూడా అక్కడికే రాకూడదూ?"

వందనాదేవికి సంతోషమైంది. "అందరం అక్కడికే పోదాం. పదండి" అన్నది. ఆమె ఆనందానికి మేరలేకపోయింది. ఆ ఉత్సాహంలో బారిస్టరు గారినీ, ఆయన భార్యనూ కూడా తీసుకుని మోటారెక్కి వెళ్ళారు.

---

# 9

వందనాదేవి ఉదయాన్నే లేచి ఆ భవనాన్నిచూచి ఆశ్చర్యపోయింది. ఏదో మగవాళ్లు ఉండే ఇల్లు కాబోలు ననుకుంది మొదట. ఎక్కడచూచినా చెత్త, పెంట.... మెట్లమీద ఉమ్మి....పగిలిపోయిన వస్తువులు .... మాసినగుడ్డలు .... గోడలమీద సాలిగూళ్ళు - అంతా అస్త-వ్యస్తంగా ఉంటుందని అనుకుంది. రాత్రి వచ్చేసరికి బాగా చీకటిపడింది. ఆమె యేమీ పరీక్షగా చూడలేదు. ఇప్పుడు చూస్తుంటే ఎంత ఆశ్చర్యంగా ఉంది! పెద్దభవనం చాలగదులు ఉన్నవి. అన్నీ పరిశుభ్రంగా ముచ్చటగా ఉన్నవి. ద్వారం ఆవల ఒక ప్రౌఢ వితంతువు వచ్చి విలబడి ఉన్నది. ఎవరో పురానా యింటి వ్యక్తిలా కనిపించింది. ఆమె ముందుకువచ్చి వందనాదేవికి నమస్కారం చేసింది. "అమ్మాయిగారూ! స్నానాలగది చూపిస్తాను వస్తారా? నేను ఈ యింటి దాసీని" అని చెప్పింది.

"మా నాన్నగారు లేచారా?"

"లేదు. పొద్దుపోయి పడుకున్నారాయెను.అలస్యంగా లేస్తారేమో."

"మాతోకూడా ఇద్దరు దంపతులు వచ్చారు. వారో?"

"వారూ ఇంకా లేవలేదు"

"మీ పెదబాబుగారో ? ఇంకా నిద్రపోతూనే ఉన్నారా ?"

దాసీది మందహాసం చేసింది. వారు గంగా స్నానంచేసి వచ్చారు. సంధ్యావందనం చేసుకున్నారు బయట గదిలో వెళ్ళి కూచున్నారు. కబురు చేయమన్నారా ?"

"అక్కర్లేదు"

మధ్యన ఒక వరండా దాటి స్నానాలగదికి వెళ్ళాలి. వెడుతూ వెడుతూ "పడకగది పక్కనే స్నానాలగది ఏర్పాటు చెయ్యలేదేం ?" అని అడిగింది వందనాదేవి.

"అది అమ్మగారి ఆచారానికి పడదు. అమెగారు అప్పు డప్పుడు కాళీమాత దర్శనానికని కలకత్తా వస్తూఉంటారు. వచ్చినప్పుడల్లా ఇక్కడే బస."

ఇక్కడకూడా అమ్మగారి ప్రతాపమేనా ? కఠోర నియమావళి ఇక్కడా ఉన్నదీ ?

"నీ పేరేమిటి ? నువు తప్ప ఇక్కడ మరెవరూ పరిచారికలు లేరా ?" అని అడిగింది వందనాదేవి.

"లేకేం, ఉన్నారు. అంతా క్రింద పనులలో నిమగ్నులై వుంటారు. మీకేమి కావలసివచ్చినా నన్ను పిలవండి అమ్మాయిగారూ ! నాపేరు అన్నపూర్ణ. పల్లెటూరిదాన్నేమో. పనిపాటల్లో పొరపాట్లు వస్తే క్షమించండి"

ఆమె వినయపూర్వక సంభాషణకు వందన ప్రసన్నచిత్త అయింది. "మీదేవూరు ?"

"బాబుగారి వూరే బలరామపురం. నాకొడుకును పెదబాబుగారే చదువు చెప్పించి తమ కిందనే ఉద్యోగం ఇచ్చారు. వాడు భార్యతో కూడా అక్కడే ఉంటున్నాడు. వాడికి బాగానే గడుస్తున్నది. వారిదయ !"

వందనాదేవికి కుతూహలం కలిగింది. "ఇంకా నువు నౌకరీ ఎందుకు చేస్తున్నావు. కొడుకు దగ్గిరే ఉండకూడదూ ?"

"కాని బాబుగారితో నేనొకమాట అని వున్నాను - 'నాకొడుకు చదువుకుని యోగ్యుడైతే ఇతర పిల్లల్నికూడా అలా యోగ్యులను చేసేం దుకు పాటు పడతాను' అని. మా గ్రామంనించి చాలమంది పిల్లలు

ఇక్కడ వచ్చి చదువుకుంటున్నారు. వాళ్ళందరినీ నేను గాక మరెవరు కనిపెట్టుకుని వుంటారు చెప్పండమ్మా!"

"వాళ్ళంతా ఈ భవనంలోనే ఉంటారు."

"ఔను. ఇక్కడే అందరికీ బస. కాలేజీకివెళ్ళి చదువుకుని వస్తుంటారు"

వందనాదేవి స్నానాలగదిలో ప్రవేశించింది. అక్కడ అన్ని యేర్పాట్లూ బాగానే ఉన్నాయి. స్పర్శదోషం తగలకుండా ఉండేందుకుగాను అవసరమైన యేర్పాట్లన్నీ చేశారు. అక్కడ ఉండవలసిన తివాచీ రాతితో చేశారు. ఆసనం కూడా అశ్మనిర్మితమే. ఈ యేర్పాట్లన్నీ అమ్మగారి కోసమే. గంగాజలం నిలువ ఉంచేందుకు కామాలు రెండు బిందెలు ఉన్నాయి; ఎంతో పరిశుద్ధంగా తోమబడి తళతళ మెరుస్తున్నాయి. అమ్మ గారు ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు. ఆమె లేదుకదా అని పరిచారి కలు ఏ మరుపాటున ఉండరు. ఆమె ఇక్కడ ఉన్నట్టుగానే ఎవరిపనివారు యంత్రాల్లా చేసేస్తుంటారు. ఎప్పుడూ ఏమీ లోటు కనిపించదు. ఈగృహ వ్యవహారాల్లో అమ్మగారి ప్రభావం ఎంత తీవ్రంగా ఉన్నది! వందనాదేవి చాలసేపటివరకూ అదే ఆలోచిస్తూ నిల్చుండిపోయింది. భారత నారీ మణుల దుఃఖపూర్ణ జీవనగాధలను ఆమె పుస్తకాల్లో చదివింది. తానూ స్త్రీ కావటంవల్ల ఆ కథలవల్ల ఆమె హృదయం వేదనాపూర్ణమైంది. కాని ఈ నాడు ఈ ఇంట్లో అమ్మగారి రాజ్ఞీత్వం కళ్ళారా చూస్తూ ఆ కథలను నమ్మవలెనో, అక్కర్లేదో ఆమెకు పాలుపోవటం లేదు.

అన్నపూర్ణ నవ్వుతూ లోపలికి వచ్చింది. "చప్పున స్నానం కానీయండమ్మా! అంతా భోజనశాలలో మీకోసం ఎదురు చూస్తున్నారు.

"మీ పెద్దబాబుగారు బైటి గదిలోనించి లోపలికి వచ్చారా?"

"వచ్చారు"

"మాతోపాటు భోజనం చేస్తారా?"

"వారు మామూలుగా రెండురూములు కానిదే భోజనం చెయ్యరు. అదీగాక ఇవాళ ఏకాదశి. మధ్యాహ్నం సంధ్యావందనం అయాక పళ్ళుఫల హారం చేస్తారేమో!"

"వారు బ్రాహ్మణ వితంతువా యేమిటి? ఈ ఉపవాసాలెందుకు. నిన్నకూడా రైల్లో ఉపవాసమే"

" ఎన్నాళ్ళు ఉపవసించినా ఉపవాస చిహ్నమే వారిలో కనిపించదమ్మాయిగారూ! వారి అమ్మగారు అంటారుకదా - 'మా వాడు పూర్వ జన్మలో తపశ్శాలి. అందువల్లనే వాడికి ఈ జన్మలో ఉపవాససిద్ధి లభించింది ' అని "

వందనాదేవి కిందికి వచ్చింది. పూరీలు, మిఠాయిలు. వడ్డించారు. భార్యా సహితంగా పంజాబు ప్లీడరుగారు భోజనంముందు కూచున్నాడు. అనాథరాయి వార్తాపత్రిక మడిచివేసి భోజనానికి సిద్ధమౌతున్నాడు. కూతురు రాగానే - " ఇంత ఆలస్యం చేశావేం అమ్మా!" అని అడిగాడు.

విప్రదాసు అక్కడే కూచుని ఉన్నాడు - "మీరు భోజనం చెయ్యరా " ? అని అడిగింది వందన

" నా కింకా వేళ కాలేదు, మీరు కానీయండి " అన్నాడు విప్రదాసు నవ్వుతూ.

వందనాదేవి తండ్రినీ, బారిష్టరుగారినీ లక్షించి - ' నా కివాళఎందుకో ఆకలిగాలేదు, మీరు భోజనం చేయండి.మీకోసం ' టీ ' కాస్తాను ' అంటూ ఆ పనిలో నిమగ్న అయింది.

" ఏమీ! ఒంట్లోబాగులేదా అమ్మా!" అన్నాడు అనాథరాయి. బారిష్టరుబాబు తెల్లబోయాడు. పరిచారిక భయం భయంగా చూచింది.

" ఒంట్లోబాగులేకపోవటం కాదునాన్నా. ఏమిటో, ఆకలి కావటం లేదు " - అన్నది టీ తయారు చేస్తూ వందనాదేవి.

" అయితే పోనీలే ; రాత్రిపొద్దుపోయి భోజనం చేశావు. బాగా అరగలేదు కామాలు. " అన్నాడు తండ్రి.

" అంతే ఐవుంటుంది. ఆనక విపిన్‌బాబుతోపాటు భోజనం చేస్తాను. "

విప్రదాసుముఖం క్షణమాత్రంగా ఎందుకో ముడుచుకుంది.

" ఇవాళ ఏకాదశి ; బాబుగారు ఇవాళ పళ్లమాత్రమే ఫలహారం చేస్తారు " - అన్నాడు నౌకరు.

ఆ మాట ఇదివరకే వినియున్నది కాబట్టి వందనాదేవి ఆశ్చర్యం అభినయిస్తూ - " చాలతేలిక భోజనం! నాకూ అదే మంచిది. ఔనుకాదూ విపిన్ బాబూ!"

విప్రదాసు నవ్వి ఊరుకున్నాడు.

బాజారుకువోయి అవీ ఇవీ కొనుక్కొని వందనాదేవి తండ్రితో కూడా తిరిగివచ్చేసరికి సాయంత్రం మూడుగంటలయింది. బారిస్టరుబాబు భార్యతోసహా విక్టోరియా స్మారకభవనం, మ్యూజియం - ఇత్యాది చూడ దగిన ప్రదేశాలన్నీ దర్శించిరావటానికి వెళ్ళాడు. ఇంకా తిరిగి రాలేదు. ఆరాత్రికే ప్రయాణం పెట్టుకున్నాడు మొదట. తరువాత ప్రోగ్రాం మార్చు కున్నాడేమో ఎవరికి తెలుసు ?

అనాధరాయి దుస్తులు మార్చుకునేందుకు తనగదిలోకి వెళ్ళాడు. అన్నపూర్ణ వందనాదేవి దగ్గిరకు నవ్వుతూ వచ్చింది. " అమ్మాయిగారూ ! ఇవాళ ఇంతవరకూ మీరేమీ తినలేదు. మీకోసం పళ్ళు, ఫలాలు తెప్పిం చాను.కాళ్లుచేతులు కడుక్కొని రండి. ఆరగింతురుగాని "

" పెద్దబాబుగారు ఏరీ ? "

" వారికోసం మీరు కనిపెట్టుకుని కూచోనవసరం లేదు. ఉపవా సాలు వారికిబాగా అలవాటు "

" వారేరీ అసలు ? "

" కాళీమాతను సందర్శించిరావటానికి దక్షిణేశ్వరం వెళ్ళారు. ఈ పాటికి వస్తూవుండాలి "

" సరే, వారినికూడా రానీ; మిగిలిన వారిసంగతి ఏమిటిమరి ? యేమేమి వండావు. పద, అన్నపూర్ణా ! మీవంటయిల్లు కాస్తచూపించు నాకు "

" నేను వంటేమీ చెయ్యలే దమ్మాయిగారూ ! హోటలునుంచి తెప్పించ వలసిందే "

వందనాదేవి ఆశ్చర్య పడ్డది. " అదేమిటి ? "

" బాబుగారు అలాగే చెయ్యమన్నారు మరి ! "

" నువుహోటలునుంచి తెప్పించే అఖాద్యసామగ్రి అంతా ఈయింట్లోనే పెట్టుకుని వారు భోజనంచేస్తే - ఆసంగతి తరువాత మీ అమ్మగారికితెలిస్తే-"

ఎలా తెలుస్తుంది లెండి. కిందిగదిలో ఏర్పాట్లు జరుగుతున్నాయి. హోటలునుంచి భోజనం వస్తుంది "

" పెద్దబాబుగారి అజ్ఞప్రకారం ఎవరా ఏర్పాట్లు చేయిస్తున్నది ? నాకు కాస్తచూపించు "

విప్రదాసు కలకత్తాలోకూడా పెద్దవ్యవసాయం చేయిస్తున్నారు. ఆ పరిశ్రమకు సంబంధించిన గుమాస్తాలు, మేనేజరు, ఆ యింట్లోనే కింది

భాగంలోని గదుల్లో వుంటారు. అన్నపూర్ణ వందనాదేవిని అక్కడికి తీసుకువచ్చింది.

వందనాదేవి మేనేజరును గుర్తించింది. "భోజనం పంపించమని మీరు హోటల్లో చెప్పివచ్చారా ?"

'ఔను' అని తల ఊపాడు మేనేజరు.

"పంపించనక్కర్లేద'ని తిరిగి కబురు చెయ్యండి"

మేనేజరు చకితుడైనాడు - "పెద్దబాబుగారు వచ్చాక-"

"అంతవరదాకా ఈ తమాషా సాగటానికి వీల్లేదు. ఆయనకు కోపంవస్తే నామీద చూపించమనండి. మీకేమీ భయంలేదు వెళ్ళి హోటల్లో చెప్పిరండి - భోజనం పంపించనక్కర్లేదని. ఆలస్యం చెయ్యకండి" అని ప్రత్యుత్తరం ఆశించకండా తిరిగి పోబోతున్నది.

మేనేజరు కంగారు పడ్డాడు. విప్రదాసు ఆజ్ఞతిరస్కరించరానిది. తాను అంతపని చెయ్యటం అసంభవం. ఈ అపరిచిత బాలిక ఆజ్ఞకూడా అనుల్లంఘనీయంగానే ఉందే! కాసేపు ఏమిచెయ్యటానికి తోచక స్తబ్ధుడై నిల్చి చివరకన్నాడు - "అయితే వెళ్ళమంటారా ? భోజనం పంపనక్కర్లేదని చెప్పిరానా ? కాస్త అడ్వాన్సు ఇచ్చాంకూడాను"

"ఇస్తే పరవాలేదులెండి" అంటూ వందనాదేవి అచ్చోటువీడి వెళ్ళిపోయింది.

సాయంత్రమయేసరికి విప్రదాసు ఇంటికి తిరిగి వచ్చాడు. జరిగిన సమాచారమంతా విన్నాడు. సంతోషించాలో, కోపపడాలో అర్థంకాలేదు. సరాసరి వంటయింట్లోకి వెళ్ళాడు. అప్పటికి వంటఅంతా అయిపోయింది. ఒకపీట మీదకూచుని వందనాదేవి అజమాయిషీ చేస్తున్నది. ఇకముందు జరుగవలసిన వడ్డనయేర్పాట్లు ముదలకిస్తున్నది.

విప్రదాసు రాగానే ఆమె నవ్వుతూ లేచి నిల్చుంది. "కోపావేశంలో పాపం మేనేజరుగారిని ఉద్యోగంలోనించి తమరు బర్తరఫ్ చెయ్యలేదు గద !"

"విప్రదాసు అంతముక్కోపియని నీకెవరు చెప్పారు ?"

"పెద్దపులివాసన ఆమడదూరంవరకూ వ్యాపిస్తుందని చెబుతారు"

"మరి అతిధులకోసం అంతకన్నా నేను చేయదగ్గిన ఉపాయం ఏముందీ ?"

"అట్లని హోటల్లో అయినవాళ్ళూ, కానివాళ్లూ వండినపదార్థాలన్నీ ఈ యింట్లోకి తెప్పిస్తారా? మీ అమ్మగారికి తెలిస్తే ఏమంటారు?"

ఆసంగతి విప్రదాసు ఆలోచించకపోలేదు. కాని ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. "ఆమెకీసంగతి ఎలాతెలుస్తుందిలే!" అన్నాడు.

"బాగానే తెలుస్తుంది. నేనేఉత్తరం రాస్తాను."

"ఎందుకూ?"

"ఎందుకా? ఎన్నడూ చెయ్యనిపని నలుగురు అతిథులకోసం చేస్తారా?"

విప్రదాసు చాలప్రసన్నచిత్తుడైనాడు; చాల ఆశ్చర్యపోయాడు కూడాను. "వందనా! నువు విన్నటినుంచీ భోజనమే చేశావుకాదు. ఇంకానీకోపం చల్లారలేదా?" - అతని కంఠస్వరం స్నేహపూర్ణంగా ధ్వనించింది.

"మీరు నాకు కోపం ఎందుకు తెప్పించారు మరి? మీకోసం పళ్లు తెప్పించాను. చప్పున సంధ్యావందనం చేసుకువిరండి, తిందురుగాని. మళ్ళీ మీరు నాకు కోపం తెప్పించారంటే నేను ఇవాళకూడా ఏమీ తినను. ముందే చెబుతున్నా"

"సరే అయితే" - అని విప్రదాసుపైకి వెళ్ళాడు.

ఒకగంట అయాక పళ్లు, మిఠాయి ఒక రాతిపళ్ళెంలో పెట్టుకొని పైకి వెళ్ళింది. ఒక పీట, మంచినీళ్ళచెంబు తీసుకుని అన్నపూర్ణకూడా ఆమెతో వచ్చింది.

విప్రదాసు ఆశ్చర్యాన్వితుడైనాడు - "అదేమిటి? మళ్ళీ స్నానం చేశావా వందనా?"

"మీరు ఫలహారం కానీయండి" అంటూ ఆమె పళ్లెం అతని ముందు పెట్టింది.



## 10

విప్రదాసు పీటమీద కూచున్నాడు. "మాటిమాటికీ స్నానంచేస్తే సుస్తీ పడతావుసుమీ!"

"పడితే పడతాను. 'నువుముట్టుకున్నది నేను తినను' నువ్వేచ్ఛ రాలివి - అని మీరు నన్ను అనకండా ఉండేట్టు ప్రవర్తిస్తాను."

"నువు ఎలాప్రవర్తించినా దురాత్ముడు అనేది అనకమానడు"

"మీరుదురాత్ములుకాదు, భయంకరులుకాదు; మా అందరికిమల్లేనే దోష-గుణ యుక్తులయిన మానవులు."

"హోటలునించి భోజనం రాకండా చేశావెందుకు? వారంతా ఇంగ్లండు వెళ్ళివచ్చిన వారు; అలాంటి భోజనమే వారికి ఇష్టం."

"ఇష్టం, అభ్యాసం ఎలావున్నా వారు మన వంగదేశ ప్రజలు. డిన్నర్‌లేక వంగదేశీయు దెవడూ మరణించినట్టు నేను వినలేదు. మీరు పలికే మాటలన్నీ హృదయంలోనించి వస్తున్నట్టు కనిపించటంలేదు. లేక పోతే మీ అమ్మగారికి తెలియనీయకండా ఆపని చేయటానికి ఇచ్చగిస్తారా? ప్రజలు మిమ్మల్నిచూచి అనవసరంగా భయపడుతున్నారు. వారు నిజంగా భయపడవలసినది మీ అమ్మగారికి, మీకుకాదు."

"మా అమ్మను వంచించి ఈ పని చేస్తున్నానని నీ కెవరు చెప్పారు?" - విప్రదాసు అడిగాడు నవ్వుతూ.

"ఎవరో ఒకర్ని అడిగి తెలుసుకున్నాలెండి. అలా జరిగితే మా అక్కకు ఎంతకోపం వస్తుంది? నా మూలాన్నే ఈ అనాచారం జరిగిందని ఆమె నన్ను శపించదూ! మిమ్మల్ని అలా చేయనిస్తానా?"

"నువు మాకుటుంబానికి పరమ ఆత్మీయురాలివి. నీ చేతిభోజనం నేను తింటానో, తిననో - ఆవిషయంకూడా ఆమనిషిని అడిగి తెలుసుకున్నావా? లేకపోతే ఇప్పుడే చప్పున అడిగి తెలుసుకురా" అంటూ పళ్ళెం కొంచెం

ముందుకు నెట్టాడు - అడిగి తెలుసుకుని వచ్చేవరకు ఫలహారం ముట్ట నన్నట్టుగా.

వందనాదేవి ముఖం లజ్జారుణమైంది. "నేను వెళ్ళి అడగ దలు చుకోలేను; మీరు తింటే తినండి, లేకపోతే మానెయ్యండి"

"కాని మా యింట్లో నువు ఉపవాసం చెయ్యటం నా కిష్టంలేదు" అంటూ ఫలహారం చెయ్యటానికి ఉద్యుక్తుడైనాడు.

"మైలభోజనం చేస్తున్నారు, మరి ఎలాగ?" అని అడిగింది వందనాదేవి కాసేపాగి.

"ఇంటికివెళ్ళాక గోమయం తిని ప్రాయశ్చిత్తం చేసుకుంటాను"- అంటూ విప్రదాసు పకపక నవ్వాడు. ఆ నవ్వటంవల్ల ఆ మాట నిజమో, పరిహాసమో అర్థంకాక వందనాదేవి నిస్తబ్ధ అయింది.

"మా అమ్మకు ఏదో సమాధానం చెప్పుకోగలను. మీ అక్క య్యతో రాజీపడగలనవిమాత్రం ధైర్యంలేదు. ఎందుకో నువు ఊహించుకో లేవా? పెళ్లిఅయాక నీకు తెలుస్తుందిలే" అంటూ విప్రదాసు నవ్వాడు. అంతటితో ఫలహారం ముగిసింది, లేచాడు.

క్రింద ఆంగ్లేయపద్ధతిని అతిధులకు డిన్నర్ వడ్డించటం అయింది. వారి భోజనాలుకూడా అయినవి. పనిఅంతా ముగించుకుని వందనాదేవి పడుకుంది. ఏమేమో ఆలోచనలు వచ్చాయి - విప్రదాసు తనపట్ల అంత చనువుగానూ ఉండటంలేదు. బెట్టుగానూ ప్రవర్తించటంలేదు. దగ్గిర బాంధవ్యమే అయినా మితిమించిన పరిచయం చూపటంలేదు. అమ్మగారికి ప్రణామం చెయ్యబోతే ఆమె వెనక్కు పోయింది. అది తన్ను అవమా నించినట్టుగా భావించి ఆ యింట్లో భోజనం చెయ్యకుండా కోపంతో వచ్చే సింది. తన మనస్సును ఆ ముసలావిడ ప్రవర్తన గాయపరచింది; ఐనా ఆ సన్నివేశాన్ని తాను ఎప్పటికైనా మరచిపోగలదు. కాని విప్రదాసు చేసిన దానికి ప్రతీకారం ఏమిటి? తాను తాకిన పళ్లు, మిఠాయి - తినటమైతే తిన్నాడు. కాని అప్పటిపరిస్థితులకు వశుడై తిన్నాడు, అంతే. బుద్ధి పూర్వ కంగా తినలేదు. బలరామపురంలో తాను గావించినకాండ మళ్ళీ ఇక్కడ కూడా చేస్తుందేమోనని భయపడి తిన్నాడు. ఒక పిచ్చిదాని బారినుండి ఎలాగో తప్పించుకు బయటపడదామని బలవంతంగా తిన్నాడు. ఇంటికి వెళ్ళి ప్రాయశ్చిత్తం చేసుకుంటాడట! నిజమేనేమో!

వందనాదేవికి నిద్రపట్టలేదు. "జీవన ప్రపంచంలో విప్రదాసు మార్గంవేరు; నా పంథా వేరు. ఇద్దరమూ హఠాత్తుగా ఒకచోట కూడవలసి వచ్చింది. అందుచేత సంఘర్షణ తప్పలేదు. పోనీ, ఏ ముంది ఇందులో ?" అని మనస్సును శాంత పరచుకోవాలని ఆమె వ్యర్థప్రయత్నంచేసింది. విప్ర దాసుచేసిన అవమానం ఆమెకు మరపురావటంలేదు.

ఎప్పుడు నిద్రపట్టిందో ఆమెకే తెలియదు. కాని అది సుషుప్తి కాదు. కొంత సేపటికి మెళుకువ వచ్చింది. ఇంకా తెల్లవారలేదు. నిద్ర చాలని అలసభావం ఆమె కన్నుల్లో ద్యోతకమౌతున్నది. మళ్ళీ నిద్ర పట్టించుకో లేకపోయింది. లేచివచ్చి వరండాలో కటకటాలవద్ద నిల్చుంది. ఆకాశం అంధకార మయమైవుంది. పై వీధుల్లో అప్పుడప్పుడు బండ్ల చప్పుడు వినిపిస్తున్నది. బజార్లు జనశూన్యంగాఉన్నవి. ఆ మేడలో అంతా నిశ్శబ్దమే. ఆ పక్కనే అమ్మగారి పూజా మందిరంఉంది. అందులో దీపం వెలుగుతూనేవుందికామాలు. ఒక వెలుగుకిరణం తలుపుసందుగుండా వచ్చి ఎదుటవున్న స్తంభంమీద పడింది. నౌకర్లు దీపం ఆర్పటం మరచిపో యారేమోనని వందనాదేవి అనుకుంది. మరుక్షణమే 'విప్రదాసు లోపల వుండి పూజ చేసుకుంటున్నాడేమో' అన్న ఆలోచన పొడసూపింది.

కుతూహలం బలవత్తరమైంది. ఆకస్మాత్తుగా అంత రాత్రివేళ అతని కంటబడితే తనకే చిన్నతనంగా ఉంటుంది. అయినా కుతూహలం ఆపుకో లేకపోయింది.

ధ్యాననిష్ఠను గురించి ఆమె పుస్తకాల్లో చదివింది. అంతేగాని కళ్ళారా ఎన్నడూ చూడలేదు. ఆ చీకటిలో, ఆ నిశ్శబ్దంలో ఇప్పుడామెకు ఆదేదృశ్యం పొడగట్టింది. విప్రదాసు రెండుకళ్ళూ మూసుకుని ఆసన బంధ ధీరుడై కూచున్నాడు. దీపపుకాంతి అతని ముఖంపై పడింది. ఇంకొక సమయంలో విప్రదాసును ఆ స్థితిలో చూచి వున్నట్టయితే ఆమెకు కడు పుబ్బ నవ్వు వచ్చేదే. కాని అప్పటి నిద్రాలసములైన ఆమె కన్నులను ఆ దృశ్యం ముగ్ధపరచింది. అలాచూస్తూ నిల్చుంది చాలసేపు. తూర్పువైపు ఆకాశం తెల్లబారింది. దాసదాసీజనం నిద్రలేచేవేళ కావచ్చింది. వెంటనే ఆమె తిరిగిపోయి తన గదిలో పక్కమీద వాలింది. మరుక్షణమే గాఢ నిద్ర పట్టింది.

అన్నపూర్ణవచ్చి తలుపుతట్టింది. "చాల పొద్దెక్కింది. లేవండి అమ్మాయిగారూ!"

వందన గాభరాపడుతూ లేచివచ్చి తలుపుతీసింది. నిజానికి అప్పటికే చాల పొద్దెక్కింది. "ఇవాళకూడా వాళ్ళు నాకోసం కాచుకుని వున్నారా? తెల్లవారగానే వచ్చి లేపకపోయినావా? ఇప్పుడు నాస్నానం అదీ అయ్యేసరికి ఇంకో గంటన్నా పడుతుంది"

లజ్జా సంకుచితమైన ఆమె ముఖాన్నిచూస్తూ అన్నపూర్ణ మందహాసం చేసింది - "పరవాలేదులెండి అమ్మాయిగారూ! వారంతా భోజనాలు చేసేశారు. మీ యిష్టంవచ్చినంతసేపు స్నానం చెయ్యండి. ఎవరూ అభ్యంతర పెట్టరు"

"మీ మాటలతరహా అంతా ఆదొక రకంగా ఉంటుంది సుమీ!" అని నవ్వుతూ వందనాదేవి స్నానాలగదికి వెళ్ళింది.

మరి రెండుగంటల తరువాత ఆమెకు విప్రదాసు కనిపించాడు. అప్పుడే కచేరీపని ముగించుకుని బైటికివచ్చాడు. "టీ తాగావా?"

"తాగాను."

"వారంతా కనిపెట్టుకుని నీకోసం ఉండలేకపోయారు"

"అందుకు వారిమీద నేను తప్పుపట్టటంలేదుగా!"

విప్రదాసు నవ్వాడు. "స్వభావతః నీలో వీరత్వం ఉంది, నాకు తెలుసు. మీ అక్కాచెల్లెళ్ళకు సూర్యచంద్రుల కున్నంత భేదంఉంది. విద్య పూర్తి చేసుకోటానికి ఇంగ్లండు వెడుతున్నావుటగా! వెళ్ళి రాగానే నాకు కబురు చెయ్యిసుమీ! ఒకసారివచ్చి నిన్ను చూస్తాను"

వందనాదేవి మందహాసం చేసింది. ప్రత్యుత్తరం చెప్పలేదు.

"ఆదేశంలో ప్రజలు పగలు రెండు ఝాములైతేగాని నిద్ర లేవరట. నాకాపద్ధతి అభ్యాస సాధ్యం అయేదికాదులే. నీకుమాత్రం ఆసాధన తేలిగ్గానే సిద్ధించవచ్చు ఇప్పటినించే అలవాటులో ఉన్నట్టుందే!"

వందనాదేవి ఈసారి కూడా నవ్వేసింది. కాని తదేకంగా అతని ముఖాన్ని అవలోకించింది. అది మామూలు శిష్టాచార సంపన్నమైన ముఖాకృతి. సరదాగా సంభాషించటంలోనూ, హాస్యపు చణుకులు విసరటంలోనూ అందరిలాగే ఈయనకూడా. అయినా లోగడ రాత్రి ప్రార్ధనమందిరంలో చూచినప్పుడు అతనిలో ఏదో నిగూఢ రహస్యాకృతి గోచరించిందే! ఆమె కౌతూహలానికి మేర లేకపోయింది.

"వారంతా ఏరీ బావగారూ! ఒక్కరూ కనిపించరేం?"

"ఉంటే ఎందుకు కనిపించరూ! మామగారూ, సపత్నీక బారిస్టరు బాబూ వెళ్ళిపోయారు - హౌడా స్టేషన్‌కు - బొంబాయి ప్యాసెంజరులో సీట్లు రిజర్వు చేయించుకుని రావటానికి"

"ఆ యవసరం బారిస్టరుగారికి ఉంటే ఉండవచ్చును. మానాన్న ఎందుకు వెళ్ళాడు? నాతో చెప్పకండానే-"

"చెప్పటానికి అవకాశం ఏదీ? తిరిగి వచ్చాక చెబుదామనుకున్నారేమో! ఉదయాన్నే బొంబాయి ఆఫీసునుంచి టెలిగ్రాంవచ్చింది, ఏదో చాల అవసరమైనపని యని వారి ముఖకవళికనుబట్టి ఊహించుకున్నాను.

"నేను అప్పుడే బొంబాయి వెళ్ళను"

"ఔను వెళ్ళవు"

వందనాదేవి అతనికేసి ప్రశ్నార్థకంగా చూచింది.

"మీ అక్కయ్యకు టెలిగ్రాం ఇవ్వు. మరిదివి తీసుకుని వెంటనే వచ్చేస్తుంది. అతిథి సత్కార బాధ్యతవించి నాకూ రవంత విముక్తి లభిస్తుంది."

వందనాదేవి సంకోచించింది. "మా అక్కయ్య రావటానికి మీ అమ్మగారు ఒప్పుకుంటారా? ఆమె నామీద బాగా మండిపోతూ ఉండాలి"

"టెలిగ్రాం ఇచ్చి చూడరాదూ పోనీ. ఫారం తెప్పించనా?"

వందనాదేవి క్షణకాలం ఉత్సుకదృష్టిని అవలోకిస్తూ నిల్చింది. కాని చివరకు ఏమాలోచించుకున్నదో మరి—

"వద్దు, నేను టెలిగ్రాం ఇవ్వను" అనేసింది.

"పోనీలే అయితే" అని విప్రదాసు వెళ్ళిపోయాడు.

అక్కడ భోజనంచేసే టేబిల్‌మీద తండ్రిగారికి వచ్చిన టెలిగ్రాం పడిఉన్నది. వందన విప్పి చూచుకుంది. బొంబాయి ఆఫీసునుంచేవచ్చింది. అర్జంటు టెలిగ్రామే.

వందనాదేవి తనగదిలోకి వెళ్ళింది. అలమారలో వస్తువులు సరిగా అమరుస్తూఉంది.

విప్రదాసు ఇంకా తిరిగిరాలేదు. చాలసేపు దాటింది. అన్నపూర్ణ వచ్చింది. 'మీపేర టెలిగ్రాం వచ్చింది అమ్మాయి గారూ!'

'నాకు టెలిగ్రాం ?' అంటూ ఆశ్చర్యపడుతూ వందనాదేవి చెయి చాచి అందుకుంది. బలరామపురంనించి అమ్మగారు ఇచ్చిన తంతి అది. తండ్రిగారితోపాటు బొంబాయి వెళ్ళిపోకండా కొన్నాళ్ళు బలరామపురం వచ్చి ఉండవలసిందనీ—కోడలినీ, ద్విజబాబునూ తీసుకొని తాను ఆరాత్రి బండికే యాత్ర వెడుతున్నాననీ—ఆమె తెలియజేసింది.



# 11

రాత్రిబండికి బయలుదేరి అక్కయ్య రేపు ఈపాటికల్లా వచ్చేస్తుంది: ద్విజదాసుకూడా వచ్చేస్తున్నాడు. వందనాదేవి సంతోషానికి మేరలేదు. టెలిగ్రాం తీసుకుపోయి అన్నపూర్ణకు చదివి వినిపించింది. తండ్రిగారు ఎప్పుడు వస్తారా, ఈ కబురు ఆయనకు ఎప్పుడు చెబుదామా అని ఆతృతగా ఉంది. విప్రదాసు ఇంట్లోలేడు. ఇంతకుముందే బైటికెక్కడికో వెళ్ళాడని కబురు తెలిసింది. ఇదంతా ఆయనచేసిన తంతే అయివుండవచ్చు: అందు చేత ఆయనకు ఈకబురు చెప్పవలసిన పనిలేదు. అయినా రాగానే చెబు దామనే ఆమెకు ఉబలాటం, కాని ఎలా చెప్పాలి ? అని భాష, శైలి ఆలోచించుకుంది. తద్వారా ఆనందం సహజంగా ప్రదర్శితము కావలసిన మార్గం బంద్తై పోయింది.

ఈ జమీందారు కరాకండి మనిషి; ధార్మికుడు. అతనిపట్ల ఆమెకు ప్రప్రధమంలోనే ఏదో అసహ్యాభావం గలిగింది. ఇప్పటికీ ఆయన తనకు అర్థంకాలేదు. కాని తనలోమాత్రం ఒకరకమైన పరివర్తన కలుగుతున్నది. ఇతర్లతోటి అతని వ్యవహారాలు పరిమితంగా ఉంటాయి. ఎక్కువగా

మాటాడడు. చాల శిష్టంగా, మధురంగా ప్రవర్తిస్తాడు కాని జమీందారీ ఠీవిమాత్రం అడుగడుగునా వెల్లివిరిస్తూనే ఉన్నది. అందరితో కలిసిమెలిసి వున్నా అందరికీ దూరంగానే ఉంటాడు. ఆశ్రితులు దాసదాసీజనం, బంధువర్గం-అందరికీ ఆయనంటే శ్రద్ధాభక్తులు ఉన్నవి. అయినా అందరూ ఆయనకు భయపడుతూనే ఉంటారు. 'పెద్దబాబుగారు అన్నదాత, రక్షకుడు, యజమాని, కష్టాల్లో ఆదుకుంటాడు.' - అని వారి భావన ఆపదలు వస్తే అందరూవెళ్ళి ఆయనముందు మొరబెట్టుకుంటారు ఇంట్లో పెండ్లి పేరంటాలప్పుడు మాత్రం వెళ్ళి ఆయన్ను ఆహ్వానించే దమ్ములు ఎవరికీ లేవు.

వందనాదేవి అందుకుకారణం తెలుసుకోవాలని ప్రయత్నించింది. అన్నపూర్ణవట్టి అమాయికపు మనిషియనుకుని వెళ్ళి ఆమెను అడిగింది. 'అందరికీ ఆయనంటే భయం, నాకూ అంతే' - అని మాత్రమే అన్నపూర్ణచెప్పింది. ఎవరినడిగినా అదేమాట చెబుతున్నారు. 'భయం' అనే అంటువ్యాధిని ఈ పురుషుడు తన పరిజనంలో వ్యాపింపజేశాడు. ఆనాడు రైల్లో ఒక్కసారిమాత్రం ఆతడు తన భయంకరస్వరూపాన్ని ప్రదర్శించాడు, అది కేవలం క్షణమాత్రమే. వెంటనే తన పూర్ణరూపంలో ఆ కళను అంతర్హితం చేసి వేశాడు. తరువాత రైల్లో ఉన్నంతసేపూ చాలమధురంగా తనతో సంభాషించాడు ఆయన ఈ యింటికి పెద్దబాబు.

హఠాత్తుగా ఇంతలో కిందఏదో గందరగోళం సాగింది. ఎవరో పరిగెత్తుకుని వచ్చిచెప్పారు. అనాధరాయి స్టేషనునించి కుంటివాడై తిరిగి వచ్చాడు. వందనాదేవి కిటికీలోనించి చూచింది. బారిస్టరు, ఆతనిభార్య ఇద్దరూ ఆయన్ను బండిలోనించి దింపుతున్నారు. ఆయన పాదానికి 'బేండేజి' కట్టారు. ప్లాటుఫారంమీద ఆగుంపులో ఎవరో ఒక పెద్ద ట్రంకుపెట్టె ఆయనకాలుమీదికి విసిరి వేశారట. వెంటనే ఆయన్ను స్టేషనునించి బైటికి తీసుకువచ్చి సమీపంలోవున్న ఆసుపత్రిలో కట్టుకట్టించారు. పెద్ద ప్రమాదం ఏమీలేదు. కాని కొన్నిరోజులపాటు ఆయన లేచి తిరగటానికి మాత్రంవీల్లేదు.

మర్నాడుసాయంత్రానికి సతీదేవి వచ్చింది. వందనాదేవి స్వాగతం ఇవ్వటానికి వచ్చింది. కాని మోటారులోనించి దిగుతూన్న అత్తగారిని చూచి జంకింది. పొంగిన ఆనందం చల్లారింది. దయామయికి ఎలాగో నమస్కారంచేసి పక్కకు తొలగి నిల్చింది. దయామయి ఆమెను సమీ

పించి చుబుకము పుణికి ముద్దుపెట్టుకుంది. నవ్వుతూ - "కులాసాగావున్నావుటే పిల్లా!" అన్నది.

"కులాసాగానే వున్నాను. మీరు కొంచెం చిక్కినట్టు కనిపిస్తున్నారే!"

"చిక్కిపోక ఏమౌతుతాను చెప్పుమరి! నాబిడ్డ - పిచ్చిపిల్ల కోపం వచ్చి అన్నమైనా తినకండా పారిపోయింది. అది మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చేదాకా నాకు శాంతి వుంటుందా తల్లీ!"

వందనాదేవి నీరసంగా నవ్వింది. "కోపంతో పారిపోయి వచ్చానని మీరెలా అనుకున్నారు?"

"కడుపుచల్లగా నలుగురు బిడ్డల్ని కని, పెంచి పెద్దవాళ్ళను చేశాక నీకూ తెలుస్తుంది - బిడ్డకుకోపం వచ్చినప్పుడు తల్లికి ఎలా వుంటుందో" - అన్నది దయామయి మధుర స్వరాన. వందనాదేవి ఏమీ బదులు చెప్పలేకపోయింది. ఈ సారి వంగి అత్తగారికి పాదాభివందనం చేసింది, లేచివిల్చుని- "మానాన్నకు చాలసుస్తీగా ఉంది" అనిచెప్పింది.

దయామయి గాభరా పడ్డది. "అరె! చికిత్సాలోపంజరగటం లేదు కదా! పద, అమ్మా! ఎక్కడున్నాడు? మొదట ఆయన్నుచూచి మరి ఇంకోపని చూచుకుంటాను."

వందనాదేవి అక్కయ్యను, అత్తగారిని తండ్రిగారి గదికి తీసుకు పోయింది. ఇవాళ ఆయనకు గాయం అంతబాధగా లేదు. ఆగంతులను చూడగానే ఆయన లేచి పక్కమీద కూచున్నాడు.

"ఎలా ఉన్నారు వియ్యంకుడుగారు! కాలికి ఏం గుచ్చుకుందేమిటి?" అంటూ దయామయి ఆతృతగా అడిగింది.

"గుచ్చుకోటంకాదు" అంటూ రాయిసాహెబు ప్లాటుఫారంమీద సంభవించిన దుర్ఘటన నివేదించాడు.

"ఏదోవిధికృతం; అయిందేదో అయింది. కొన్నాళ్ళపాటు కూతుళ్ళచేత పనిపాటలు చేయించుకుంటూ ఈ గదిలో బందీగా ఉండిపోండి. అందుకే మీ పెద్ద కూతుర్నికూడా తీసుకువచ్చాను. ఇద్దరూ వంతులవారీగా మీకు సేవచేస్తూ ఉంటారు" - అంటూ నవ్వుతూ చెప్పింది దయామయి.

అనాథరాయి మందహాసం చేశాడు.

"ఇప్పుడే మోటారు దిగాం. ఇంకా కాళ్లు, చేతులు కడుక్కోలేదు. మళ్ళీ దర్శనం చేసుకుంటాను" అంటూ దయామయి వెళ్ళిపోయింది.

మరొక మోటారులోనించి ద్విజదాసు, విప్రదాసు కుమారుడువాసు దిగారు. వందనాదేవి బలరామపురం వచ్చిన నాడు కుర్రవాడు పాఠశాలకు వెళ్ళి వున్నాడు. మళ్ళీ ఆమె వెంటనే కలకత్తా వచ్చేసిందాయెను. కుర్రవాణ్ణి కలవటం పడలేదు. వాసు నాయనమ్మను విడిచి ఉండలేదు. అందుచేత తానూ బయలుదేరి వచ్చేశాడు.

పిన తండ్రి కుర్రవాడికి వందనాదేవిని చూపించి పరిచయం చేశాడు అతడు ముందుకు వచ్చి పిన్నికి నమస్కారం చేశాడు. కాని ఆమెపాదాలకు చెప్పులు ఉన్నవి. అదిచూచి అతడు విస్మితుడైనాడు. కాని ఏమీ అనలేదు. ఎనిమిది తొమ్మిది సంవత్సరాలు ఉంటాయి. కాని కుర్రవాడికి అన్ని సంగతులూ తెలుసు.

వందనాదేవి స్నేహపూర్వకంగా వాసును దగ్గరకు తీసుకుంది. "నేనెవరో నీకు జ్ఞాపకం ఉన్నానా?"

"జ్ఞాపకం లేకేం పిన్నీ! చూడగానే గుర్తించేశాను. ఆనాడు మా ఇంటికి వచ్చావు. కోపంవచ్చి వెళ్ళిపోయావు. మళ్ళీ తిరిగి వచ్చావు కాదు"

"కోపంవచ్చి వెళ్ళిపోయానని నీకెలా తెలుసు?"

"మా బాబాయి బామ్మతో చెబుతోంటే విన్నాను"

వందనాదేవి ద్విజదాసు కేసి తిరిగింది. "నాకు కోపంవచ్చినట్టు నీకుకూడా ఎలా తెలిసిందీ?"

"నాకేకాదు; మా యింట్లో అందరికీ తెలుసు. అదీగాక వచ్చిన కోపాన్ని నువు అణుచుకోటానికి ప్రయత్నించనూ లేదు"

"నాకు కోపం వచ్చిందని అందరికీ తెలుసు. అందుకుకారణం కూడా ఎరుగుదురా?"

"అందరూ ఎరక్కపోయినా, నాకు మాత్రంతెలుసు. ఆనాడు మీ నాన్నగారికి ఒక్కరికే వేరుగా టేబిల్‌మీద అన్నంవడ్డించారు. అందుకేగా"

"ఆ కారణాన్ని పురస్కరించుకుని నేను కోప్పడటం ఉచితమే కదూ!"

"అలాగే తోస్తున్నది. కాని వాళ్ళ కంతకన్నా ఉపాయాంతరం లేదు మరి!"

"నువు మానాన్నతో సహపంక్తిని భోజనం చేస్తావా?"

"నాకు అభ్యంతరంలేదు. కాని అన్నయ్య వద్దంటే మాత్రం...."

"మానేస్తావన్నమాట! విన్నా అభ్యంతర పెట్టెగల అధికారం మీ అన్నయ్యకు ఉన్నదని నీ విశ్వాసం. ఔనా?"

"ఉన్నదో లేదో ఆయనకేతెలియాలి. కాని ఆయన ఆజ్ఞను ఉల్లంఘించటం అనుచితమని మాత్రం నాకు తెలుసు."

"నీ కర్తవ్యమని నిశ్చయించుకున్నదాన్ని నిర్వహించే సాహసం నీకు లేదన్నమాట!"

క్షణకాలం ఊరుకుండి ద్విజబాబు ఇలా అన్నాడు - "మనం ప్రస్తుతము చర్చిస్తున్నది సాహసానికిగాని, దుస్సాహసానికిగాని సంబంధించిన విషయం కాదు. వస్తుతః నేను పిరికి వాడినేమీ కాదు. అన్నయ్య నిషేధాజ్ఞను ఉల్లంఘించాలనే తలంపేనాకు కలుగదు. చిన్న తనంలో నాన్న గారిని ధిక్కరించి తిరిగాను. అందుకు బాగానే దెబ్బలు తగిలాయనుకో. కాని మా అన్నయ్య ప్రకృతివేరు. ఎవరూ ఆయనమాటను ఉపేక్షించలేరు"

"ఉపేక్షిస్తే ఏ మౌతుంది"

"ఏమౌతుందో నాకైతే తెలియదు. కాని ఆప్రశ్న మా కెవరికీ, ఇంతవరకూ పుట్టలేదు మరి!"

"దేశంకోసం అన్నగారికి ఇష్టంలేని పనులనూకూడా నువు చేస్తావని మా అక్కయ్య ఉత్తరాల్లో రాసింది. ఇలాంటి వాడివి ఎలా చేయ గలవు?"

"ఆయనకు ఇష్టంలేని పనులుచేస్తే చేశానేమో. కాని ఆయన నిషేధాజ్ఞను ఉల్లంఘించి నేనెప్పుడూ ఏమీ చేయలేదు."

వందనాదేవి కాసేపు ఊరుకుని ఇలా అన్నది— "మా అక్కయ్య రాసిన ఉత్తరాల్ని బట్టి విన్న నేను మరొకలా ఊహించు కున్నాను. ఇప్పుడు తెలిసింది. నీ దేశభక్తి ఎంత లావుపాటిదో! ఈ నీ ఆడంబర దేశభక్తి కార్యకలాపంలో మీ వారికి వచ్చే నష్టం ఏమీలేదు. ఎస్టేటులో ఒక్క దమ్మిడీకూడా పాడుకాదు. మీ వదినెగారు నిర్భయంగా ఉండ వచ్చు"

ద్విజదాసు నవ్వాడు. "ఇంతకూ మా వదినె కెందుకు ఆపద రావాలి? రావాలని నీ కోరికా?"

వందనాదేవి చకితఅయింది. "ఛీ, నేను అలా ఎందుకు కోరతాను? వారికేమీ భయంలేదు; నిశ్చింతగా ఉండవచ్చు- అని మాత్రమే నే నంటు న్నాను."

"ఆ విషయంలో నువ్వేమీ చింత పెట్టుకోనక్కర్లేదు. వారు నిర్భయంగానే ఉన్నారు. మా అన్నయ్య విషయంలో మాత్రం నీ కొక మాట నిస్సందేహంగా చెబుతాను: ఆయన జీవితంలో భయమనేది ఎలా వుంటుందో ఎరగడు. అది ఆయన ప్రకృతికి విరుద్ధం"

"అంటే– భయమనే వస్తువును ఇంట్లో ఆయన మినహా మీరందరూ పంచుకున్నారన్న మాట!" అంటూ వందనాదేవి నవ్వింది.

ద్విజదాసు కుడా నవ్వాడు. "మేమే కాదు; ఇంకా ఏమైనా మిగిలి వుంటే నువుకూడా పంచుకుంటావు. మూడు నాలుగు రోజులు ఆయనతో కలిసి వున్నావు; అయినా ఆయన్ను అర్థం చేసుకోలేక పోయావు కదా!"

"ఔను. నువు అర్థం విడదీసి చెబుతావని ఆశిస్తున్నా"

"అయితే నవు నా శిశ్రూషచెయ్యి. మొట్ట మొదట ఆ తొడుక్కున్న చెప్పులు విడిచి పారెయ్యి"

ఇంతలో నౌకరు వచ్చాడు. "అమ్మగారు మిమ్మల్ని అందర్నీ పైకి పిలుస్తున్నారు."

వెడుతూ వెడుతూ వందనాదేవి అడిగింది– "మీ అమ్మగారు హఠాత్తుగా ప్రయాణమై వచ్చారేం? కారణం?"

"యాత్రా సందర్భం ఒకటి ఉన్నదనుకో. నిన్ను తిరిగి బలరామపురం తీసుకు వెళ్ళాలనికూడా ఆమె ఉద్దేశమై ఉన్నది. 'రా' నని మాత్రం చెప్పకుసుమీ!"

"సరే, వస్తాలే"

"మా అమ్మ ముందు నిన్ను 'మిస్ రాయిసాహెబ్!' అని పిలవటానికి వీల్లేదు. నువు నా కంటే చిన్న దానివి. మా వదినెకు చెల్లెలివి. అందుచేత పేరుపెట్టే పిలుస్తాను. కోపగించుకుని మరో కాండ జరిగించకు సుమీ!"

వందనాదేవి నవ్వింది. "సరే కోప్పడనులే. పేరు పెట్టేపిలు. పరవాలేదు. మరి నేను నిన్నేమని పిలవాలి?"

"నన్ను 'ద్విజబాబు' అనే పిలు. మా అన్నయ్యను మాత్రం 'విపిన్‌బాబూ!' అని పేరు పెట్టి పిలవకు. అందరూ ఆయన్ను 'పెద్దబాబూ!' అంటారు. నువ్వూ అలాగే పిలు. ఇది నీకు రెండో పాఠం"

"అలా ఎందుకు పిలవాలి?"

"తర్కానికి దిగకు మరి! కారణం తరువాత చెబుతాను. ఇప్పుడు కాదు"

"ఇదివరకు లేనిది ఇప్పుడలా పిలుస్తే ఆయన ఆశ్చర్యపోడూ?"

"ఆశ్చర్య పడితే వచ్చేనష్టం ఏమీ ఉండదు. అలా పిల్చావంటే మా వదినె, అమ్మ, ఇతర్లూ– అంతా సంతోషిస్తారు."

"సరే, అలాగే కానీ"

మెట్టు ఎక్కుతూండగానే వందనాదేవి చెప్పులు విడిచేసింది. నమ్రతగా గదిలో ప్రవేశించింది. ద్విజదాసు ఆమె వెనకాలే వెళ్ళాడు. వాసుకూడా వచ్చాడు. గోడ అలమారలో వస్తువులు సరిచేస్తూ ఉన్నది దయామయి. అన్నపూర్ణ తాను పెట్టిన ఖర్చులేవో విపరిస్తూంది.

"కాళ్ళు, చేతులు కడుక్కున్నావా? బట్టలు మార్చుకున్నావా?"– అని అడిగింది దయామయి ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే.

'ఆఁ' అన్నది వందనాదేవి.

"అయితే కాస్త వంటయింట్లోవుండి ఆ వ్యవహారంఏమిటో చూడు తల్లీ! భోజనానికి చాలమంది ఉన్నాం. వంటబ్రాహ్మణులు ఏమిచేస్తున్నారో ఏమిటో! పూజచేసుకుని నేనూవస్తున్నాను"

వందనాదేవి బొమ్మలాచూస్తూ నిల్చుంది.

"ద్విజబాబుకు ఒంట్లో బాగులేదు. ఉదయంనుంచి ఏమీ తినలేదు. వాడికేదైనా పథ్యంచేసి పెట్టాలి"– అంటూ దయామయి అన్నపూర్ణను తీసుకుని పూజామందిరానికి వెళ్ళిపోయింది....వందనాదేవి ప్రతి వచనాన్ని ఆశించకుండానే.

"నీకు సుస్తీగా ఉందేమిటి?"– అడిగింది వందన.

"కాస్త జ్వరం జ్వరంగా ఉందిమరి!"

"ఏమి తింటావు అయితే?"

"సగ్గుబియ్యం జావ కాకుండా ఏదైనాసరే"

"నేను వంటయింట్లో అడుగుపెడితే గడబిడ ఐపోదూ!"

"పరవాలేదు. అన్నపూర్ణ నిన్నుగురించి మంచిగా చెప్పినట్టున్నది. మా అమ్మకు ఆమె మాటలమీద విశ్వాసం. ఆమె అంటే ఎంతో ప్రేమ. నేటితో 'మ్లేచ్ఛబాలిక' అన్న కళంకం నీకు మాసిపోయింది"

"ఆశ్చర్యంగా ఉందే"- అన్నది వందన కాసేపు మౌనంగా ఉండి.

"ఔను, నాకూ ఆశ్చర్యంగానే ఉంది. ఇది అంతా అన్నపూర్ణ ప్రభావం అవి నా అనుమానం ఏమైనా కానీ - ఆలస్యం చెయ్యకు. భోజనాల ఏర్పాట్లు చూడు, పద."



# 12

కైలాసయాత్ర కష్టతరమనీ, మార్గం చాల దుర్గమ మనీ చాల మంది చెబుతున్నారు. దయామయికి ఉత్సాహం తగ్గింది. గంగాస్నానం చేస్తూ; దక్షిణేశ్వరం, కాళీఘాట్ మొదలైన ప్రదేశాలు చూస్తూ కలకత్తా లోనే గడిపింది.

సాధారణంగా పనిపాటలు తెలిసినవాళ్ళమీదనే కార్యభారం పడుతుంది. గృహ నిర్వహణబాధ్యత అంతా వందనాదేవిపై పడింది. సతీదేవి ఏ పనీ చెయ్యటంలేదు. అన్నీ చెల్లెలికే పురమాయించి తాను అత్తగారితో కలిసి తిరుగుతోంది. కాని అప్పుడప్పుడు వచ్చి - "నువుకూడా రావే వందనా! ఎవరితో ఏమి మాటాడవలసి వచ్చినా నువు వెంట ఉంటే మాకు విశ్రాంతి" - అంటుంది; తోడు తీసుకుపోతుంది కూడాను.

ఒకనాడు వారు 'విక్టోరియా మెమోరియల్' చూచి వచ్చారు. దయామయి విప్రదాసుతో - "నువు ఏమైనా అను. చదువనూ రాయనూ నేర్చిన ఆడపిల్లల తరహాయే వేరు" - అన్నది ఉత్సాహంగా.

"ఏం జరిగిందేమిటి?" అన్నాడు విప్రదాసు. ఆమె అన్నమాట వందనాదేవిగురించే నని అతడు ఊహించుకోలేక పోలేదు.

"ఏం జరిగిందంటా వేమిటి ? ఎవరో దొరగారు వచ్చి జబర్దస్తీగా మా బండిని ఆపుచేయించాడు. మా అదృష్టం బాగుంది. వందనాదేవి కూడామాతోఉంది. ఆమె ఇంగ్లీషులో ఏమిచెప్పిందో ఏమిటోమరి.... దొరగారు శాంతించి వెళ్ళిపోయాడు. లేకపోతే మాగతి ఏమయ్యేదో ఆలోచించు. పోలీసు స్టేషనుకు వెళ్ళవలసి వచ్చేది. ఎంత నామర్దా! నీ పంజాబ్ డ్రయివర్ వట్టి పశువు."

"ఏం ? అడ్డంగాపెట్టి తోలాడా ?"

ఇంతలో వందనాదేవి అక్కడికివచ్చి నిల్చుంది.

"ఇప్పుడు నీసంగతే విపిన్‌తో చెబుతున్నాను అమ్మా! ఎలాగైనా చదువు, రాత వచ్చిన ఆడపిల్లల తరహావేరు. నువు లేకపోతే మేమంతా ఎంత ఆపదలో పడిపోయేవాళ్ళం ? డ్రయివర్‌దే తప్పు. మోటారు నడిపే నేర్పులేదు. గొప్పలకు పోతాడు మళ్ళీ."

విప్రదాసు నవ్వాడు. "డ్రయివరుకు కూడా చదువనూ రాయనూ వచ్చునుగా!"

అందరూ నవ్వారు. "ఆ తప్పు డ్రయివరుదిగాని, అతని విద్యది కాదు" అని వందనాదేవి దయామయికేసి తిరిగి - "ఇంకా వంటయింట్లో పనివుంది అత్తా! ద్విజబాబుకోసం విన్న వంట బ్రాహ్మణుడు తయారుచేసిన రొట్టె చాల కటువుగా ఉందిట. తినలేక పోయాడు" అంటూ వెళ్ళిపోయింది.

దయామయి ఆమెకేసి స్నేహపూర్ణంగా చూచింది.

"ఒక్క చదువేకాదు, పిల్లకు అన్నీ వచ్చు. ఒరే, విపిన్! ఆమెకు రాని పనే లేదురా! మాటలు ఎంత తియ్యగా చెబుతుందనుకున్నావు! ఇంటి భారంఅంతా ఆమెపైపెట్టి నిశ్చింతగా ఉన్నాను, చెప్పద్దూ!"

"మ్లేచ్ఛ బాలిక యని ఏవగించుకోవటం లేదుకదా!"

"నువు అస్తమానం అదేమాట! అది మ్లేచ్ఛ బాలిక ఎలా ఔతుంది. వాళ్ళ అమ్మ ఒకసారి ఇంగ్లండు వెళ్ళివచ్చింది. లోకులు ఏమేమో అన్నారు. అంతేగాని.... లేకపోతే మన వందనాదేవి బంగాళీపిల్ల కాకపోయిందా ? ఇంట్లోకూడా కాళ్ళకు జోడు వేసుకుంటుందంటావు ? ఏం వేసుకుంటే ? విదేశాల్లో వేసుకోవటం లేదూ ? ఇకపోతే.... ఘోషా లేకండా తిరుగుతుందంటావు ? అందులో మాత్రం తప్పేముంది ?

బొంబాయిలో ముసుగులు వేసుకోరు. చిన్నప్పటినించీ ఏది అలవాటైతే అదే ఆచరిస్తూ ఉంటాం. నాకు పెద్దకోడలు ఎలాంటిదో, ఈ పిల్లా అంతే. తండ్రితోకూడా వెళ్ళిపోతానంటున్నది మరి! ఆమె వెడతా నంటూంటే నాకు దుఃఖం వస్తోందిరా అబ్బాయీ!"

"అలా దుఃఖం పెట్టుకుంటే ఎలా అమ్మా! వందనాదేవి మన యింట్లో ఉండిపోవటానికి వచ్చిందామరి! నాలుగు రోజులు ఉంటుంది, వెళ్ళిపోతుంది"

"కానసుకో, కాని ఆ పిల్ల ఎప్పుడూ మన యింట్లోనే ఉండిపోతే బాగుండును."

"ఎలావుంటుందీ? అలా వీలౌతుందంటావా? పిచ్చి మమతలు పెట్టుకోకమ్మా!"

ఆ మాట దయామయికి రుచించలేదు.

బలరామపురం వెళ్ళాలన్న ఆలోచనేలేదు ఎవరికీ. పెళ్ళి ఇల్లులా ఉంది. ఆటపాటలతో, కథలు కబుర్లతో కాలం గడిచిపోతున్నది. దయామయికూడా అందరితో కలిసి మెలసి కులాసాగా ఉంటున్నది; పరియాచకాలాడుతున్నది; ఆమెహృదయం నిరంతర ఆనంద విస్ఫూర్తితమై ఉంది. స్వాభావికమైన గాంభీర్యగుణం ఏమైందోమరి! అప్పుడప్పుడామె సతీదేవికి ఏవేవో సైగలుచేస్తూ ఉంటుంది. వాటిభావం ఆ అత్తాకోడళ్ళకే తెలియాలి. కొంతవరకు అన్నపూర్ణ గ్రహించగలదు.

పంజాబు బారిస్టరు ఇన్నాళ్ళూఉండి లోగడదినమే భార్యతోకూడా ప్రయాణమై వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు దయామయి ఆ దంపతులను 'మరొకసారి ఎప్పుడైనా కలకత్తాలోగాని, బలరామపురంలోగాని మాతో వచ్చి ఉండండి' అని ఆహ్వానం చెప్పింది. అనాధరాయికి గాయం బాగా నయమైంది; వచ్చేవారం ప్రయాణం పెట్టుకున్నాడు. "వందనాదేవి కొన్నాళ్ళు బలరామపురంలో మాతోపాటు ఉంటుంది, ఏమంటారు?" అని అడిగింది దయామయి. అనాధరాయి 'సరే' నన్నాడు.

విప్రదాసుకు కోర్టు వ్యవహారం ఏదో తగిలింది. ఒక దావా నడుస్తోంది. వాయిదా దగ్గరకు వచ్చింది. అందాకా కలకత్తాలోనే ఉండేందుకు నిశ్చయించుకున్నాడు. పనులు ఎక్కువగా ఉన్నాయి. ఇంటికి ఎప్పుడో వస్తున్నాడు; ఎప్పుడో వెళ్ళిపోతున్నాడు. ఇవాళ ఆదివారం; ఇంట్లోనే

వున్నాడు. దయామయి నవ్వుతూ వచ్చింది. "ఒక తమాషా విన్నావా విపిన్ !"

విప్రదాసు ఏదో దస్తావేజు చూస్తున్నాడు. తల్లి రాగానే లేచి నిల్చున్నాడు - "ఏమిటమ్మా తమాషా ?"

"మన ద్విజబాబు, వాడి స్నేహితులు కలిసి ఇవాళ మీటింగుచేసి ఉపన్యాసా లిద్దామనుకున్నారు. పోలీసులు నిషేధించారు. అయినాసరే మీటింగుచెయ్యాలనే మనవాళ్ళు పట్టుపట్టారు. పోలీసులు లాఠీచార్జీ చేస్తారేమోనని నా గుండెలు అవిసిపోయాయి" -

"వెళ్ళాడా తమ్ముడు ?"

"వెళ్ళలేదు; ఆ సంగతే నీతో చెబుదామని వచ్చాను. ద్విజు ఎవరు చెప్పినా విన్నాడు కాదు. వదినెగారి మాటకూడా తోసివేశాడు. చివరకు మన వందనాదేవి చెబితే విన్నాడు"

"నిజంగానా ?" - అన్నాడు విప్రదాసు ఆశ్చర్యపడుతూ

"ఔను, నిజమే. వాళ్ళిద్దరికీ ఏదో ఒడంబడిక ఒకటి జరిగినట్టుగా ఉంది. ఆమె ఇంట్లో చెప్పులు తొడుక్కోకూడదు; మన యింటి నియమాలను ఉల్లంఘించకూడదు— అని ద్విజు షర్తుపెట్టాడు. అందుకు బదులుగా ఆమె కోరిక మన్నించి నడుచుకుంటావని మన ద్విజు మాటయిచ్చాడు కామాలు, వందనాదేవి వచ్చి— "ద్విజబాబూ ! మన షర్తులు జ్ఞాపకం ఉన్నాయా ! నువు ఇవాళ మీటింగుకు వెళ్ళవద్దు — " అన్నది. "సరే" అన్నాడు ద్విజు. అంతటితో నాగుండెబరువు తీసివేసినట్టయిందిరా విపిన్ ! ఏమి చేస్తాడో ఏ జగడాలు తెస్తాడో ! తండ్రిలేడు. నాకు మనశ్శాంతి లేదు !

విప్రదాసు మాటాడలేదు. ఆమె ఇంకా ఇలా అన్నది —

"ఇదివరకుదాకా కాలేజి, చదువు, పరీక్షలు - అంటూ ఏదో జంజాటం ఉండేది. ఇకమీదట అంతా స్వేచ్ఛ ! ఏమితెచ్చి పెడతాడో ఇంటిమీదికి ! మన వంశానికి ఏమి కళంకం తెస్తాడో !"

విప్రదాసు నవ్వాడు. "భయంలేదమ్మా. ద్విజు కళంకం తెచ్చే పని ఏమీ చెయ్యడు."

"అలాగే అనుకుంటూ ఉండు. ఎప్పుడో జైల్లో పడతాడు తప్పదు. నీకు లేదూ ఆ భయం ?"

"ఔను. కాని జైల్లో కళంకం లేదమ్మా. చేసే పనిలో ఉంటుంది కళంకమనేది. కళంకంతెచ్చే పనిమాత్రం మనవాడు చెయ్యడు. ఎప్పటి

కైనా నేనే జైలుశిక్ష అనుభవించవలసి వస్తుందనుకో. అది నీకు లజ్జాకరమా ? ' విపిన్ వంశానికి కళంకం తెచ్చాడు ' - అని అంటావా ? "

ఈమాట దయామయికి శూలంలా వచ్చి తగిలింది. విధి అతని నోట అలా పలుకుతున్నదా యేమిటి ? ఆమె విచలిత అయింది. తాను చేతి మీదుగా విపిన్‌బాబును పెంచింది. పెద్దవాడిని చేసింది ; అతని వ్యవహారం ఆమెకుబాగా తెలుసు. ధర్మంకోసం ఎంత పనియైనా చేస్తాడు. ఎటువంటి ఆపదలనైనా లక్ష్యం చెయ్యకుండా అన్యాయాన్ని ఎదుర్కొంటాడు. ఒకసారి.... పద్ధెనిమిదేళ్ళ వయసులో.... ఒక ముసల్మాన్ సంఘం తరుపునఉండి ఒక భయంకరమైన కాండ సాగించాడు. అప్పటి ఆగలాటాలో ఎలా బ్రతికి యింటికి వచ్చాడో.... ఇప్పటికీ తలుచుకుంటే గుండె బ్రీలిపోతుంది. మొన్న రైల్లోజరిగిన సంఘటన వందనాదేవి చెప్పింది. అదివిన్నప్పటినించీ దయామయికి మరీ భయంగాఉంది. ద్విజబాబు విషయమై ఆమె మనస్సు చింతాన్వితమై వుంటుంది : అలాగే విపిన్‌బాబు విషయంలో ఎప్పుడూ భయాన్వితమై వుంటుంది.

" ఇప్పుడు పోయిందా అమ్మా కులానికి కళంకం వస్తుందేమోనన్నభయం ? హఠాత్తుగా ఎప్పుడో నేనూ జైలుకు వెళ్ళాల్సి వస్తుంది " అన్నాడు విప్రదాసు.

దయామయి వ్యాకులచిత్త అయింది. " అలాంటిమాటలు మాటాడకురా నాయనా ! నేను బ్రతికివుండగా నువుజైలుకు వెళ్ళటమా ? ఇన్నాళ్ళనించీ ఇన్ని దేవుళ్ళకు నామొక్కిన మొక్కులనీ వృధాపోతాయా ? ఈ మన సంపద అంతా ఎందుకూ కొరగాకుండానే పోతుందా ? నా సర్వస్వం అమ్ముకునియైనాసరే నిన్ను కాపాడుకుంటానురా విపిన్ ! "

విప్రదాసువంగి ఆమెకు పాదాభివందనం చేశాడు. దయామయి అతన్ని తనచేతుల్లోకి తీసుకుంది. " ద్విజు యేమై పోయినా నాకు చింత లేదు. నువుమాత్రం నాకు దూరమై పోయిననాడు గంగలోపోయి దూకుతాను. నిన్నువిడిచి నేనువుండలేను. " - ఆమెకన్నులవెంట అశ్రుబిందువులు రాలినవి.

" అత్తగారూ ! " - అంటూ వందనాదేవి వచ్చింది. దయామయి కొడుకును విడిచి పక్కకు తిరిగి, నవ్వుతెచ్చుకుని, కన్నీళ్ళు తుడుచుకుంది. వందన ఆశ్చర్యపడుతూ నిల్చింది.

చాలరోజులయింది నాబిడ్డదిని ఒడిలోతీసుకుని. అందుకోసంఇప్పుడు...." అన్నది దయామయి.

"ఈ ముసలిబిడ్డడినా ? అందరితోవెళ్ళి చెప్పేస్తాను వుండండి "- అన్నది వందన.

"'ముసలి' అన్నశబ్దం నీనోటివెంట రానీకు తల్లీ ! నేను కొత్తగా మా ఇంటికి కాపురానికి వచ్చినప్పుడు....మా అత్తగారు అప్పటికి బ్రతికే వుంది.....ఆమె నన్ను పిల్చి....తన ఒడిలో ఉన్న విపిన్‌బాబును చూపించి.... "ఇదుగో నీ పెద్దకొడుకు ; పని పాటల్లోవుండి వాడికి పాలు పోశాను కాదు ; తీసుకుపోయి వాడిని పాలుపోసి నిద్రపుచ్చు ; తరువాత మరోపని చూచుకో "- అంటూ నాకు ఒప్పజెప్పింది. ఆపని నేను చెయ్య గలనో లేదో తెలుసుకుందామని ఆమె అలానన్ను ఆజ్ఞాపించివుండవచ్చు"- అని ఆమె నవ్వింది మళ్ళీ.

"అప్పుడు మీ రేమి చేశారు అత్తా !"

"మేలిముసుగులోనించి చూచాను. బంగారుబొమ్మలా పిల్లవాడు ఆమె ఒడిలో ఉండి ఆశ్చర్యంగా నాకేసి చూస్తున్నాడు. పిల్లవాణ్ణి ఎత్తు కుని పరుగెత్తి పోయాను. నా వెనుకనే పరిచారిక లిద్దరు వచ్చారు. నా గదిలోకి వెళ్లాను. పాలుపట్టుకుని రండని పరిచారికలను పంపించాను. పిల్లవాడికి పాలుపోసిన తరువాతనే మరోపని ! చుట్టుపక్కల ఆడవాళ్ళు ఏ మేమో అన్నారు. నాకు సిగ్గులేదని కూడా కొందరు దూషించారు. ఆ మాటలన్నీ నేను లెక్క చెయ్యలేదు. ఎవరు యెన్ని అనుకుంటే నాకేం - అనుకున్నాను. నాకొక రత్నందొరికింది. ఆ రత్నాన్ని నాచేతుల్లో నించి ఎవరూ లాక్కు పోలేరు. ఆ రత్నమే మా విపిన్. వీణ్ణి నువు ముసలి వాడంటావా ?"

ముప్పయి సంవత్సరాల నాటి సంగతి జ్ఞాపకం వచ్చి ఆమెకన్నులు అశ్రుపూర్ణములయినవి ; పెదవులపై చిరునవ్వు వెలుగుతున్నది. అప్పటి ఆమె ముఖకవళిక వందనాదేవికి అపూర్వంగా కనిపించింది. అకృత్రిమ వాత్సల్యస్వరూపం ఎలాటిదో ఆయువతికి జీవితంలో ప్రథమ పర్యాయంగా బొడగట్టింది.

"అత్తగారూ ! మీయిద్దరు కొడుకులలో ఎవరిమీద మీకు ఎక్కువ ప్రేమ ? చెప్పండి "- అని అడిగింది వందనాదేవి భావావేశాన్ని నిగ్ర హించుకుని.

దయామయి నవ్వింది. "ఆవిషయం చెప్పకూడదుతల్లీ! శాస్త్రం విషేధిస్తున్నది."

కొత్తగా వచ్చి నాలుగురోజులపాటు ఉండిపోయే వందనాదేవితో ఈ పూర్వవిషయాలన్నీ దయామయి ప్రసంగించటం విప్రదాసుకు నచ్చ లేదు. అన్నాడు - "చెప్పినానీకు అర్థం కాదువందనా! నువు కాలేజీలో చదువుకున్న ఆంగ్ల గ్రంథాలలో ఈ విషయాలేమి లేవు కదూ! అమ్మ మాటలు నీకు విచిత్రంగా ఉంటాయి. ఎందుకులే ఆగొడవలునీకిప్పుడు?"

"విపిన్‌బాబూ! నువుకూడా బోలెడన్ని ఆంగ్లగ్రంథాలు చదివావు. ఈ గొడవలు నీకెలా అర్థమైనాయి మరి?"

"అమ్మహృదయం మేమెరుగుదుమని చెప్పామా? మాకూ తెలి యదు వందనా? ఆ విగూఢ రహస్యాలు మా అమ్మకేతెలుసు. ఆమె చది విన పుస్తకాలు వేరు; వాటిలో భాషవేరు; వ్యాకరణంవేరు. అవన్నీ అమ్మకే తెలుసు; మరెవరికీ తెలియవు-అమ్మతో ఏమోచెప్పాలని వచ్చావు; చెప్పవేం?"

"వంట విషయమై - ఏమికూరలు చేయమంటారో అడిగిపోదా మని వచ్చాను. వెడతాను; మీరుకూడా వెంటనేరావాలి అత్తగారూ! సర్వంమరచి బిడ్డడిని ఒడిలో పెట్టుకుని కూచునేరు!" అంటూవిప్రదాసు కేసి ఒక కటాక్షం విసిరి వందనాదేవి వెళ్ళిపోయింది.

ఎందుకో దయామయి హృదయం ఉదాసీనమై పోయింది. "విపిన్! నీకు ధర్మాధర్మాలు బాగా తెలుసు. అమ్మ మనస్సును కష్టపెట్ట రాదు - అని యెరుగుదువా?" - అని ద్వైధీభావ కంఠస్వరాన అడిగింది.

"అడగదలచినమాట తేటతెల్లంగా అడగరాదూ అమ్మా! ఉపో ద్ఘాతం దేనికీ?"

"నువు జైలుకు వెళ్ళవలసి వస్తుందేమో నన్నమాట ఎందు కన్నావురా విపిన్! ఆ మాటతో నాకు యాత్రవెళ్ళాలన్న ఉత్సాహం నశించింది. ఇక ఇల్లు కదల్లేను."

విప్రదాసు నవ్వాడు. "నిన్ను యాత్ర పంపించటం నాకూ యిష్టం లేదమ్మా! కాని యాత్ర వెళ్ళనీకుండా ఆపినదోషం నామీద వెయ్యకుసుమీ! జైలుకు వెళ్ళినంతమాత్రాన వచ్చే కళంకం ఏమీ లేదని సూచించటానికే - అలా అన్నాను."

"కాని ఆమాట నాకు మరపురాదు. నువు ఏదో ఆషామాషీగా మాటాడేవాడివికాదు. జైలు శిక్షకు పాల్పడ వలసినంత పని ఏమైనా చేశావా? చెయ్యాలనుకుంటున్నావా? నిజం చెప్పు."

"నే నేమీ చెయ్యలేదు. మానవహృదయంలో ఏవేవో కోరికలు ఉత్పన్న మౌతూ ఉంటాయి. అవన్నీ స్పష్టంగా నిర్దేశింపగలనూ అమ్మా!"

"నాగుండె ఇవాళ ఎంతగా కొట్టుకుంటున్నదో నువు గ్రహించావా? నిన్ను పెంచాను; పెద్దవాణ్ని చేశాను - నాచేతుల మీదుగా. ఈ ముసలి తనంలో నన్ను ద్రోహం చేస్తావా? -" ఆమె నేత్రాలు అశ్రుపూర్ణ ములై నవి.

"అనవసరంగా ఏదో అమంగళాన్ని శంకించి అలా భయపడతా వెందుకమ్మా! నేను ఎన్నడైనా నీతో చెప్పకండా ఏపనియైనా చేశానా?"

"చెయ్యలేదు, నిజమే, కాని నిన్న ద్విజూను పిలిచి 'ఎస్టేటు వ్యవహారాలన్నీ ఆకళింపు చేసుకో' మని చెబుతున్నా వెందుకు?"

"పెద్దవాడై నాడు. కాస్తనాకు సహాయంగా—"

"మాటలతో నన్ను బోల్తా కొట్టడానికి ప్రయత్నించకు విపిన్. వాడిలో ఏమి సామర్థ్యం ఉందనీ? వాడి సహాయం కావాలీ నీకు? అంత అలసిపోయావేం? నీ మనసులో మాట దాచకండా చెప్పరా!"

విప్రదాసు జవాబేమీ చెప్పలేదు. దయామయి మళ్ళీ ఇలా అన్నది- "మన హిందూ సంఘం పుణ్యకార్యాచరణలతో, ధర్మ నియమాలతో సుసంఘటితమై ఉన్నది. ఇక్కడ అనాచారం వల్లపడదు. నీకు పదిహే డేళ్ళ వయసులో పెళ్ళిచేశాను. అప్పుడు నీ ఇష్టానిష్టాలతో నేను నిమిత్తం పెట్టుకోలేదు. ద్విజబాబు పెళ్ళిచేసుకోనంటున్నాడు. ఎం. ఏ. ప్యాసైనాడు. మంచి-చెడ్డ తెలుసుకోగలడు. జబర్దస్తీగా వాడికి ఒక పిల్లను తెచ్చి ముడి వెయ్యలేము. వాడు ఒక యింటివాడు కాకపోతే.... వాడి మీద నాకు ఉన్న నమ్మకం కూడా చెడుతుంది. మీ నాన్నగారి ఆస్తిలో ఒక్క దమ్మిడీ వాడు ముట్టుకునేందుకు నేను ఒప్పుకోను. తెలిసిందా?"

"పెళ్ళి చేసుకోనని ద్విజు ఎప్పుడన్నాడు?"

"అనేకసార్లు అన్నాడు: పెళ్ళికోసం తహతహలాడేవాళ్లు ఇల్లాళ్ళను వెతుక్కుంటారు. నాకెందుకూ? నేను దేశసేవ చేస్తాను-అంటున్నాడు. మీరంతా.... నేనిక్కడికి వచ్చినప్పటినించే తింటూ, తిరుగుతూ సుఖంగా

ఉంటున్నా ననుకుంటున్నారు కామాలు! నాగుండె కుమిలి పోతున్నది. పైగానువ్విప్పుడు 'జైలు' మాట తెచ్చావు. నాకెలావుంటుందిచెప్పు!"

"వాళ్ళవదినె చెబితే 'కాదు' నడులే అమ్మా!"

"ఏమో, దానిమాటకూడా వినేట్టు లేదు"

"వింటాడు, తప్పకండా వింటాడు."—అని నవ్వుతూ విప్రదాసు "మరి పెళ్ళికూతురుకోసం వెతకనా?" అని అడిగాడు.

వందనాదేవి నవ్వుతూ లోపలప్రవేశించింది. "మీరు రానే లేదు; ఎంతసేపని కూచోనూ మీకోసం?" అన్నది అత్తగారితో

"వస్తున్నానదు, తల్లీ!"

"అమ్మా! మన అక్షయబాబు కూతుర్ని ఎరుగుదువుగా! అందానికి తగ్గ గుణం వుంది. ద్విజూ అడ్డు చెబుతాడని నేను అనుకోను. వెళ్ళి చూచి, మాటాడిరానా?"

"వద్దు-వద్దు. అప్పుడేకాదు" అంటూ దయామయి క్షణమాత్రంగా వందనాదేవికేసి చూచింది. "సతీదేవి ఉద్దేశం ఏమిటో మరి! కోడల్ని అడక్కుండా నేను ఏమీ చెప్పను ఈ విషయంలో"

వందనాదేవి తన సుందర-శాంత-వీక్షణాలను ఇద్దరిపై బరపుతూ- "తప్పేముంది అత్తగారూ! వాళ్ళు కలకత్తాలోనే ఉన్నారుగా. అక్కయ్యను కూడా తీసుకుని వెళ్ళి చూచివద్దాం"— అన్నది.

దయామయి వెంటనే ఒక నిర్ణయానికి రాలేకపోయింది.

"ఔనమ్మా! అక్షయబాబు స్వధర్మనిష్ఠ కలవాడు; సంస్కృతాధ్యాపకుడు. పిల్ల స్కూళ్ళలో, కాలేజీలలో చేరలేదు గాని ఇంటివద్దనేబాగా చదువుకుంది. ఒకసాగి నన్ను వాళ్ళింటికి ఆహ్వానిస్తే వెళ్ళాను. ఆ అమ్మాయితో చాలవిషయాలు మాటాడాను. తండ్రి ఆమెకు ప్రేమగా మైత్రేయి అనిపేరు పెట్టుకున్నాడు. అది సార్థక నామధేయమే అయిందని నాకు నమ్మకం కలిగింది. వెళ్ళిచూచిరండి అమ్మా! నీకోడలు వొప్పుకోకపోతుందా యేమిటి? అదీగాక పిల్లచాల రూపవతి"

దయామయికి నవ్వువచ్చింది. కాని ఆమె నవ్వలేదు. ఏదోమాటాడాలనుకుంది; కాని మాట పెగల్లేదు.

"దగ్గిరేగా! ఒకసారి వెళ్ళి మైత్రేయిని చూచి వద్దాం పదండి అత్తా!"- అన్నది మరొకసారి వందనాదేవి.

ఈ నిమిషాన వందనాదేవి ముఖంలో సహజలావణ్యరేఖ మామ మైంది. కొంచెం ముఖంనల్లబారింది. ఈసంగతి దయామయి కనిపెట్టింది.

"దగ్గిరేనవి నాకూ తెలుసు. కాని నాకు తీరిక లేదమ్మా ఇవాళ. పద. వంటవిషయంచూదాం" అంటూ దయామయి వందనాదేవి చెయి పుచ్చుకుని వెళ్ళిపోయింది.

# 13

సంధ్యావందనం ముగించుకుని విప్రదాసు తన పుస్తకాలయంలో ప్రవేశించాడు. అప్పుడే టపా వచ్చింది. ఉత్తరాలన్నీ చూచుకో బోతు న్నాడు. ఆ సమయంలో దయామయి వచ్చింది. "భలేమాటలు నేర్చావురా విపిన్ !"

విప్రదాసు కుర్చీలోనించి లేచి నిల్చున్నాడు, "నేనేమన్నానమ్మా ?"

"అక్షయబాబు కూతుర్ని చూచివచ్చాం"

"కురూపి అంటావా ?"

"కురూపికాదులే. అందగత్తెల్లోనే లెఖ్ఖ. నిజమే. కాని నా పెద్ద కోడలితో సాటిరాలేదు. అందంలో మన వందనాదేవినికూడా పోలదు."

విప్రదాసు ఆశ్చర్యపోయాడు. "అయితే మీరు మైత్రేయిని కాదు చూచింది ; ఇంకెవర్నో చూచి వచ్చారో ."

దయామయి నవ్వింది. "భలేమాట ! వెళ్ళాం. మాటాడేము. వాళ్ళమమ్మల్ని ఎంతోమర్యాదచేశారు. నాకోడళ్ళకు ప్రియమార మిఠాయీ లేవో పెట్టారు. చదువు సంధ్యలవిషయంలో వందనాదేవి ఆ అమ్మాయిని యేవేవో ప్రశ్నలడిగింది. ఆమె యేమేమో సమాధానాలు చెప్పింది. ఇంత కాండా జరిగించి మేము వస్తే-మేము చూచినది మైత్రేయి కాదంటావా ?"

"వందనాదేవి అడిగిన ప్రశ్నలకు బహూశా ఆ అమ్మాయి సరిగా జవాబులు చెప్పలేక పోయిందేమో ! వందనాదేవి కాలేజీలో చదివింది, పరీక్షలు ప్యాసైంది, అస్తమానం చదువు సంధ్యలలో నిమగ్నమై కాలం

గడిపింది. అంతచదువూ మైత్రేయి ఇంటిదగ్గిరే వుండి నేర్చుకుంది. వాళ్ళిద్దరికీ ఉన్నభేదం నాకూ నీచిన్న కొడుక్కూ ఉన్నట్టిదే"

"అలా అనకురా విపిన్! ద్విజు పక్కగదిలోనే ఉన్నాడు; విన్నాడంటే సిగ్గుపడతాడు; మళ్ళీ ఇంటిమొగం చూడకండా పారిపోతాడు- కాలేజీలో చదువుకుంటేనేగాని విజ్ఞానం అలవడదని నేనటంలేదు. అన్ని ప్రశ్నలకూ మైత్రేయి వినయంగా, మృదువుగా జవాబు చెప్పింది; బాగానే ఉంది. బండిలో తిరిగి వస్తూంటే వందనాదేవి ఆమెను చాలా చాలా ప్రశంసించింది. కాని నేననేది ఏమంటే - గార్హస్థ్య నిర్వహణకు అంత లావు చదువులు దేనికి? నాపెద్దకోడలు ఎలాటిదో చిన్నకోడలూ అలాటిదే దొరికితే కాలం జరిగిపోదూ! లేకపోతే విద్యాగర్వంతో పిన్నాపెద్దలను లెక్కచెయ్యని కోడలెందుకూ?"

విప్రదాసు నవ్వాడు. "పరవాలేదులే అమ్మా! మిడిమిడి చదువులే దుంపతెగేస్తాయిగాని నిండుకుండ అణిగేవుంటుంది. మైత్రేయి ఆచార వ్యవహారాల్లో వినయ పూర్వకంగానే ప్రవర్తిస్తుందని నాపమ్మకం."

దయామయి ఆ యుక్తిని కాదనలేదు. "నీమాట నిజమే. కాని మన పల్లెటూరిలో ఆమె విద్యాధిక్యతను గణించేదెవరు? అందరూవచ్చి చూచి ఆమెను నాపెద్ద కోడలితో పోల్చిపెదవి విరుస్తారు. నాకు మతి పోయిందంటారు, అది నేను సహించలేనురా విపిన్!"

విప్రదాసు కాసేపు మౌనంగా ఉన్నాడు. "మరి అక్షయబాబుకు ఏమని కబురు చేద్దాం? మా అమ్మ ఇష్టపడలేదని కబురు చెయ్యనా?"

దయామయి సంకోచించింది. "వద్దురా విపిన్! అలాకబురు చెయ్యటం మంచిదికాదు. అయినా వుండు; కోడలేమి చెబుతుందో కనుక్కుంటాను."

"అక్షయబాబు మనకు పరాయివాడు కాదు. మనలో కలిసినవాడు. ఇంకా ఆలోచిస్తానంటావా, సరే. కాని నీపెద్దకొడుకు పెళ్ళి చేసినప్పుడు నీ యిష్టప్రకారం చేశావు. ఎవరితోనూ సంప్రదించలేదు. కాని ఈ సారి ఇంతగా కోడలి సహా కావలసి వస్తున్నదేం?"

దయామయి నవ్వింది. "నేను ముసలిదాన్ని అయినాను. ఇంకా ఎన్నాళ్ళు బ్రతికివుంటాను? గృహభారమంతా ఇకమీద నా పెద్దకోడలి మీద ఉంది. ఆమె అభిప్రాయం తీసుకోకండా ఏమీ చెయ్యకూడదు. సరే,

మేము ఆలోచించుకుని చెబుతాం; రెండు రోజులు ఆగి ఏ మాటా కబురు చేద్దువుగాని" - అంటూ ఆమె వెళ్ళిపోయింది.

ఆ వెళ్ళటం ఆమె వియ్యంకుని గదికి వెళ్ళింది. మళ్ళీ పూజా పున స్కారాల్లో కూచుందంటే ఆలస్య మౌతుందని....ఆయన ఆరోగ్యం ఎలా ఉన్నదో పరామర్శించి పోదామని వెళ్ళింది. "ఎలా ఉన్నారూ ?"

కాని ఆ గదిలో ఒకమూల ఎవరో సుందర యువకుడు వందనా దేవితో ఏదో సంభాషిస్తూ ఉన్నాడు. దొరల ఫేషన్‌లో ఉన్నాడు మనిషి. అట్టి కొత్తవ్యక్తిని చూడగానే దయామయి సంకోచించి తిరిగి పోబో తున్నది. ఇంతలో అనాధరాయి

"పారిపోతున్నారేమిటి ? రండమ్మా ! అతడు మన సుధీరబాబు. అతని ముందు సిగ్గేమిటి ? నీ కొడుకులాంటివాడు. నేను మంచం ఎక్కా నని తెలిసి మద్రాసునించి చూచి పోదామని వచ్చాడు—సుధీర్ ! ఆమె మన వందనాదేవి అక్కయ్య అత్తగారు. నమస్కారం చెయ్యి" అన్నాడు.

ప్రణామం చేసే అలవాటు సుధీర్‌కు లేదు. ఎలాగో నాలుగు అడు గులు ముందుకువచ్చి తలవంచి ఏదో ఒక విధంగా నమస్కారం చేశాడు.

సుధీరబాబును గురించి అనాధరాయి క్లుప్తంగా చెప్పాడు. "ఇతని తండ్రీ, నేనూ ఇంగ్లండులో కలిసి చదువుకున్నాం; అప్పటినించీ మేము పరమ మిత్రులం. సుధీర్‌కూడా ఇంగ్లండువెళ్ళి చాల పరీక్షలు ప్యాసై వచ్చాడు. ఇప్పుడు మద్రాసులో 'శిక్షావిభాగం' లో మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. పెళ్ళి కాగానే సుధీర్ వందనాదేవిని తీసుకుని ఇంగ్లండు వెళ్ళటానికి నిశ్చయం ఐంది. అక్కడ ఇష్టమైతే వందనాదేవి కాలేజీలో చేరుతుంది. లేకపోతే దేశం చూచి తిరిగి వచ్చేస్తారు—సుధీర్ ! మీరు రేపు అగస్టు-సెప్టెంబరులలో వెళ్ళేట్టయితే నేను కూడా రెండు మూడు నెలలు సెలవుపెట్టి వస్తాను-ఏమంటావు వందనా ! బాగుందా ?"

"బాగులేకేం నాన్నా ! నువుకూడా ఉంటే మంచిదికాదూ !"

అనాధరాయి ఉత్సాహితుడై నాడు—" అప్పటికి మీ పెళ్ళి అయిన తరువాత ఇంకో నెల వ్యవధికూడా ఉంటుంది. గడబిడలేకుండా ప్రయాణం కావచ్చు"

వందనా సుధీరులు తల ఊపి సమ్మతి తెలిపారు.

ఇప్పుడు తెలిసింది దయామయికి....ఆ యువకుడు అనాధరాయికి కాబోయే అల్లుడని. అందుచేతనే అతడామెకు పుత్రసమానుడని ఆయన సూచించాడు కాని ఆమె హృదయాంతరాళం ఎందుకో ఆందోళితమైంది. కాని తాను విప్రదాసంత వాని తల్లి, పవిత్ర ముఖర్జీ వంశస్థురాలు. వెంటనే తన్ను తాను సంబాళించుకుంది. "నాయనా సుధీర్ ! అసలు మీది ఏవూరు?"

"ఇప్పుడు బొంబాయిలో స్వగృహం ఒకటిఉంది. పూర్వం ఎప్పుడో దుర్గాపురం మా స్వస్థానమని నాన్నగారు చెబుతూ ఉండేవారు. కాని ఇప్పుడు మా కక్కడ ఏమీలేదు"

"బర్ద్వాన్ జిల్లాలో దుర్గాపురమేనా?"

"ఔను. కాల్నా దగ్గిర చిన్న పల్లెటూరు. ఇప్పుడది మలేరియా జాడ్యంతో పాడుపడి పోయింది."

"మీ నాన్నగారి పేరు?"

"శ్రీరామచంద్రవసు"

దయామయి చకిత అయింది. "మీ తాతగారి పేరు హరిహరవసు కాదూ!"

అనాధరాయి ఆశ్చర్యపోయాడు. "వాళ్ళను నువు ఎరుగుదువా ఏమిటమ్మా!"

"ఔను, ఎరుగుదును. దుర్గాపురం మా మాతామహుల ఊరు. చిన్నప్పుడు నేను అక్కడే తాతగారి దగ్గిర పెరిగాను. మా తాతగారి యిల్లువున్న వీధిలోనే వీరి యిల్లు కూడాను. సుధీర్ ! మళ్ళీవచ్చి మాటాడతాను. పూజకు వేళ అయింది. నువు భోజనం చెయ్యకుండా మాత్రం వెళ్ళకుసుమీ!"

సుధీర్ నవ్వాడు. "వెళ్ళనని ఇదివరకే విప్రదాసుబాబుకు మాట యిచ్చాను."

"సరే అయితే" అంటూ ఆమె వెళ్ళిపోయింది. వందనాదేవి కేసి ఒక్కసారైనా చూడలేదు; ఒక్క మాటైనా పలుకలేదు.

మరునాటి ఉదయం విప్రదాసు సంధ్యావందనం చేసుకుని అమ్మ గారి పాదధూళికొరకు ఆమె గదికి వెళ్ళాడు. అక్కడ పెట్టె, బేడా అన్నీ సర్ది ఉన్నాయి. అతనికి ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటమ్మా! ఎక్కడికి ప్రయాణం?"

"తొమ్మిదిన్నర బండికి బయలుదేరి వెడితే చీకటి పడకముందే ఇంటికి పోతాను. ఎల్లుండి కామాలు నీకు కోర్టువాయిదా: నువు రాలేవు. ద్విజూతో చెప్పు, మమ్మల్ని దిగబెట్టి వస్తాడు."

ఆమె కన్నులు ఎర్రగా ఉన్నవి. ముఖం వాడిపోయింది. రాత్రి అంతా ఏమితుపాను వీచిందో ఆమె హృదయంలో. విప్రదాసు భయగ్రస్తుడైనాడు. "హఠాత్తుగా బయలుదేరు తున్నావు: అంత అవసరం ఏమి వచ్చిందమ్మా!"

"అసలు ఒకటి రెండు రోజులు ఉండి పోదామని వచ్చాను. పది రోజులు గడిచాయి. ఇంటిదగ్గిర దేవతారాధన ఎలా జరుగుతున్నదో ఏమిటో! అయిదారు ఆవులు ఈనటానికి సిద్ధంగాఉన్నాయి. పైగా మన వాసుకు బడిలో గైరుహాజరు పడుతూవుంటుంది. ఇంకా యెన్నాళ్ళని ఉండనూ!"

ఇవన్నీ పైకి చెప్పేమాటలు. అసలు కారణం ఏదో ఉంది. ఆమె చెప్పటంలేదు. "పోనీ, ఇవాళే వెళ్ళకపోతేయేం?" అన్నాడు విప్రదాసు

"కాదురా, నాయనా! అడ్డుచెప్పకు. ద్విజూనో, మరింకెవరినో తోడు ఇచ్చి పంపించు మమ్మల్ని"

"అలాగే నమ్మా!" అని ఆమెకు పాదాభివందనంచేసి విప్రదాసు వచ్చేశాడు. తన పడక గదిలోకి వెళ్ళాడు. సతీదేవి విచారంగా కూచుని వుంది. అన్నపూర్ణ మిఠాయిపళ్ళెం, పళ్లు, పాలగ్లాసు - అన్నీ అల మారలో సర్దిపెడుతున్నది.

సతీదేవి మేలిముసుగు సవరించుకుని లేచి నిల్చుంది.

"అన్నపూర్ణా! అమ్మ ప్రయాణమై వెళ్ళిపోవాలని తొందర పడు తున్నది, కారణం ఏమైవుంటుందో నీకు తెలుసా?" అని అడిగాడు విప్రదాసు.

"నా కేమీ తెలియదు అన్నయ్యగారూ! ఉదయాన్నే నన్నుపిలిచి తొమ్మిదిన్నర గంటల బండికి వెడుతున్నాం: తొందరగా వంటకానీ - అని చెప్పారు."

విప్రదాసు భార్యనడిగాడు. 'నాకూ ఏమీ తెలియదు' అని ఆమె చెప్పింది.

విప్రదాసుకు ఏమీ పాలుపోలేదు. అన్నపూర్ణకు తెలియకపోవచ్చు. కాని అత్తగారి హృదయం కోడలికికూడా తెలియకపోవటం ఏమిటి?

విప్రదాసు కాసేపు స్తబ్ధచిత్తుడై నిల్చున్నాడు చివరకు మెట్లుదిగి కిందికి వచ్చేశాడు - "ఇవాళ అమ్మ ప్రవర్తన విచిత్రంగాఉంది. ఎప్పుడూ ఇలా చెయ్యలేదామె. ఏమిదుఃఖం ఆమెను బాధిస్తున్నదోకదా!" - అనుకుంటూ.

దయామయి ప్రయాణమై కిందికి వచ్చింది. ఇంకా బండిరాలేదు. ఏ విధమైన ఆలస్యమూ ఆమె సహించలేకండా ఉంది. ఎలాగైనా ఆ యిల్లువిడిచి బైటపడటమే ఆమెకు కావలసింది.

చివరకు రెండు మోటార్లు వచ్చాయి. ఒకదానిలో సామాను పెట్టారు; నౌకర్లు ఎక్కారు.

సూటుకేసు పుచ్చుకుని విప్రదాసు వచ్చాడు. దయామయి ఆశ్చర్య పోయింది. "ద్విజులేడూ?"

"వాడు కాదు; నేనే మిమ్మల్ని దిగబెట్టివస్తాను"

"వాడు రా నన్నాడా?"

"వాడినిగురించి నువు అలా అనటం బాగులేదమ్మా! నీ ఆజ్ఞ వాడుఎప్పుడు నిర్లక్ష్యంచేశాడు చెప్పు!"

"మరి వాడు ఏడీ! రాడేం?"

"వెళ్ళమని నేనే వాడితో చెప్పలేదు" అంటూ విప్రదాసు మంద హాసంచేసి- "నువు వ్యాకులపడుతూన్న ఆ దేవతలను, ఆవులను కళ్ళారా చూద్దామని నేనే బయలుదేరి వస్తున్నాను. మరేమీలేదు" అన్నాడు.

ఆ మాటమీద ఇంకొకప్పుడయితే ఆమెకూడా నవ్వి ఏమేమో ప్రసంగించేదే. కాని ఈ సారి ఆమె యేమీ మాటాడలేదు.

అన్నపూర్ణ వందనాదేవిని పిలపటానికి వెళ్ళింది. ఆమె అప్పుడే స్నానంచేసి తండ్రిగారి గదిలోకి వెడుతోంది. అన్నపూర్ణ కేకవిని కిందికి దిగివచ్చింది. వచ్చి అక్కడి దృశ్యంచూచి ఆశ్చర్యపోయింది.

"ఇవాళ మేము ఇంటికివెళ్ళి పోతున్నాం వందనా!" అన్నది దయామయి.

"ఇంటికా? ఎందుకూ? ఏమైంది?"

"ఏమీ కాలేదు. ఇల్లువదలిపెట్టి ఎన్నాళ్ళని ఇక్కడఉంటాం? మీ నాన్నతో చెప్పలేదు. ఇంకా ఆయన లేవలేదు. ద్విజూ ఉంటాడు, అన్న పూర్ణ ఉంటుంది, ఆయనకు ఏమీ కష్టం కలగకండా చూస్తూ ఉంటారు. రా కోడలా!" అంటూ మోటారులోఎక్కి కూచుంది.

సతీదేవి ముందుకువచ్చి వందనాదేవి చెయిపుచ్చుకుని "మేము వెళ్ళిపోతున్నాం చెల్లీ !"- అంటూ కన్నీరు వెల్లువగా ఏడ్చింది. అంత కన్నా ఆమె ఏమీ మాటాడ లేకపోయింది. కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళి మోటారులో అత్తగారిపక్కన కూచుంది.

వందనాదేవి విశ్చేష్టయై ఆశ్చర్యంగాచూస్తూ నిల్చుండిపోయింది రాతి బొమ్మవలె. ఈ హఠాత్ప్రయాణం ఆమెకు అర్థం కాలేదు.

వాసువచ్చి ఆమె పాదాలకు నమస్కరించాడు – "వెళ్ళివస్తాను పిన్నీ" అంటూ. అప్పుడామె మళ్ళీ ప్రపంచంలోకి వచ్చింది. "ఇంత వరకూ నేను అత్తగారికి గాని, అక్కయ్యకు గాని నమస్కరించలేదే।" అనుకుంది. వెంటనే వాసును ముద్దుపెట్టుకుని మోటరు దగ్గరకు వచ్చి అత్తగారి, అక్కగారి పాదాలను స్పృశించింది. సతీదేవి చెల్లెలి చుబుకం పుణికింది, ఏమీ మాటాడలేదు. అత్తగారు అస్పష్టంగా ఆశీర్వదించింది. మోటారు కదిలింది.

అన్నపూర్ణవచ్చింది. "ఇక పైకిపోదాం పదండి అమ్మాయిగారూ!"

వందనాదేవి బలవంతాన తన విహ్వాల భావాన్ని నిగ్రహించుకుంది. "నువుపద అన్నపూర్ణా। వంటయింటిలో కాస్తపని ఉంది ; పూర్తిచేసుకు వస్తాను."- అనిచెప్పి వందనాదేవి లోపికి వచ్చేసింది.

అనాధరాయి తిరిగి బొంబాయి వెళ్ళనున్నాడు. అందరూ కలిసే బలరామపురం వెడదామని నిన్ననే అనుకున్నారు. కాని ఇవాళ అప్రసంగమే లేకండా హఠాత్ప్రయాణం ఏమిటి ? 'బలరామపురం వచ్చిపోండి' అని నిమంత్రణకూడా లేదే।

మరొక గంటతరువాత టీ తయారు చేసుకుని వందనాదేవి తండ్రిగారి గదిలోకి వెళ్ళింది.

"వియ్యపురాలు వెళ్ళిపోయిందిటే। నేను ఆలస్యంగా లేచాను, వెళ్ళేటప్పుడు కలశాను కాదు. ఛీ, ఛీ ఎంతపొరపాటయిందీ ? వాళ్ళేమను కుంటారో కదా।" అన్నాడు అనాధరాయి.

"మనం బొంబాయి ఎప్పుడు వెడదాం నాన్నా।"

"నిన్న వాళ్ళు బలరామపురం తీసుకువెడతామన్నారే, నువు వెళ్ళ లేదేం ?"

"నిన్ను ఈ స్థితిలో ఒంటరిగా విడిచి ఎలా వెళ్ళనూ ? ఇంకా నీకు బాగాకులాసా చిక్కలేదాయెను."

"కులాసా లేకేంఅమ్మా! నిన్ను బలరామపురంలో కొన్నాళ్ళు ఉంచి పోతానని వియ్యపురాలికి మాట యిచ్చాను. బొంబాయి వెడుతూ నిన్ను అక్కడ దిగబెట్టి పోతాను ఏం?"

"ఉహుఁ, వద్దు, దూరప్రయాణం; మిమ్మల్ని ఒంటరిగా పంపటం నాకు ఇష్టంలేదు."

"ఊరుకో పిచ్చిదానా! నీకు తెలియదు. వియ్యపురాలు ఏమంటుందీ? 'ఈ ముసలివాడు కూతుర్ని విడిచి క్షణం ఉండలేడు' అని నన్ను ఎగతాళి చెయ్యదూ!"

"భోజనం చేద్దువుగాని రా నాన్నా!" — అంటూ వందనాదేవి కిందికి వెళ్ళి పోయింది.

## 14

సాయంత్రమైంది. ద్విజదాసు గదిముందు నిలబడి వందనాదేవి పిలచింది. "ఒక సారి నేను లోపలికి రావచ్చునా ద్విజబాబు!"

"రావచ్చు: ఒకసారికాదు, వందసార్లు, వెయ్యిసార్లు రావచ్చు" అని లోపలనించి అనుజ్ఞ వచ్చింది.

వందనాదేవి తలుపులు రెండూ బార్లాతెరచి లోపల ప్రవేశించింది. అక్కడ ఒక మంచం లాక్కుని కూచుంది.

చేతిలో పుస్తకం పక్కనపెట్టి మంచం మీదలేచి కూచున్నాడు ద్విజదాసు. "ఏమిటి ఆజ్ఞ?" అని అడిగాడు.

"ఏమిటో చదువు తున్నావే?"

"దయ్యాల కథ"

"అతిథి గొప్పా, దయ్యాల కథ గొప్పా?"

"దయ్యాల కథే"

"ఎప్పుడూ పరిహాసం పనికిరాదు. మేము మీ యింటి అతిథులం. నీకు తెలుసునా ఆ విషయం?

"మీరు మా అన్నయ్య ఇంట్లో అతిధులు, అని మాత్రం నాకు తెలుసు. వారు నాకు ఇచ్చిపోయిన ఆజ్ఞ ఏమంటే — మీకు ఏమీ లోపం రాకుండా నేను చూస్తూండాలి. లోపం రాకపోయేదే. కాని ఈ దయ్యాల కథలో తత్పరుడినై పోయాను. పొరపాటయింది. అతిధులు నన్ను క్షమించవలెనని మనవి."

"నేను ప్రతిరోజూ ఇక్కడ ఎంత కష్టపడవలసి వస్తున్నదో నీ కేమన్నా తెలుసా?"

"తెలియకేం?"

తెలిసికూడా ఏమీ చెయ్యకుండా ఊరుకున్నా వన్నమాట!"

"ఏమీ చెయ్యక పోటానికి ప్రథమ కారణం చెప్పానుగా! రెండో కారణం ఏమంటే: అది నాకు అలవిగాని పని"

"ఏం?"

"చెప్పకూడదు"

"అత్తగార్తూ అక్కయ్యా హఠాత్తుగా ప్రయాణమై వెళ్ళిపోయా రెందు కనీ?"

అత్తగారి ఆజ్ఞను పురస్కరించుకుని మీ అక్కయ్య వెళ్ళింది. ఆమెదోషం ఏమీలేదు."

"మరి మీ అమ్మగారు?"

"ఆమెకే తెలియాలి"

"నీకు తెలియదా?"

"తెలియదని చెబితే అబద్ధమౌతుందేమో! ఎందుచేతనంటే. వదినె కొంత అనుమానం కలిగింది. అదినాకు రవంత తెలుసు."

"ఆ రవంత నాకు చెప్పవచ్చునా?"

ద్విజదాసు వెంటనే జవాబు చెప్పలేదు. "నా ప్రాణంమీదికి తెచ్చి పెట్టావే! నువుతెలుసుకోకపోతేయేం?" అన్నాడు చివరకు.

"నువు చెప్పాలి, తప్పదు"

"చెప్పకపోతే వచ్చే హాని యేమిటీ?"

"ఇదిగో ద్విజబాబూ! మనం ఒడంబడిక చేసుకున్నాం. నేను చెప్పి నట్టు నువ్వూ, నువు చెప్పినట్టు నేనూ నడచుకుందాం అని అనుకున్నాం. నీమాట నేను ఉల్లంఘించినది ఎప్పుడూ లేదు"—ఆమె కన్నులు అశ్రు పూరితము లైనవి. పక్కకు తిరిగి తన్ను తాను సంబాళించుకుంది.

ద్విజదాసు వ్యథితచిత్తుడైనాడు. "వాళ్ళుచేసిన వ్యవహారానికి అర్థంలేదు. అందుకు కారణం చెప్పటం నా ఉద్దేశంకాదు. నిజానికి మా అమ్మ నీమీద కోపం తెచ్చుకునే వెళ్ళిపోయింది. కాని నీ తప్పేమీ లేదు. తప్పంతా మా అమ్మదే. మా వదినకూడా నిరపరాధి. అనవసరంగా ఆ షడ్యంత్రంలో ఆమెకూడా చిక్కుకుంది. అందరికన్నా నిరపరాధిపాపం ఉన్నయ్య."

"షడ్యంత్రం అంటావేమిటి? చప్పున చెప్పు"

"షడ్యంత్రం అనేమాట సరైనది కాదేమో! మా అమ్మ ఏదో మహాభాగ్యం ఆశించింది. కాని ఏమీ లభించలేదు. అందుచేత ప్రపంచం మీదే ఆమెకు కోపం వచ్చింది. కోపం అనటానికీ వీల్లేదు. ఆశ నిరాశ అయినందువల్ల కలిగిన దురభిమానం అది"

వందనాదేవి ఏమీ పలుకలేదు. ద్విజదాసు ఇంకా ఇలా అన్నాడు- "ఒకప్పుడు మా అమ్మకు నీ మీద అత్యంత ద్వేషం ఉండింది; నీకు తెలుసు. ఏ కారణంవల్లనో ఆ భావం మారిపోయింది; నీపట్ల అత్యంత వాత్సల్యం ఉత్పన్నమైంది. రూపంలో, గుణంలో, విద్యాబుద్ధులలో, పని పాటలలో మా వదినెను తప్పించి నీతో సరివచ్చేవారు లేరనే ఆమె విశ్వసించింది. నిన్ను మ్లేచ్ఛకన్య అని అనటానికి ఎవరికీ సాహసం లేకపోయింది. చివరకు నీలాటి నిష్ఠాగరిష్ఠయైన బ్రాహ్మణతనయ ఈ సమగ్ర భారతదేశంలో ఎక్కడాలేదు--అని మా అమ్మ 'గడకట్టి భేరికాడాండ డడాండడాండ నినదంబు లజాండమునిండ మత్తవేదండము నెక్కి' చాటింది"- అంటూ ద్విజదాసు తన కవితా ప్రాగల్భ్యానికి తానే ఆనందించి పకపక నవ్వాడు.

ఆ నవ్వు వందనాదేవికి అసహ్యంగా కనిపించింది. అయినా తాను కూడా నవ్వింది.

"నవ్వుతావేం వందనా! యదార్థంలో అదే ఇప్పుడు వచ్చిన యీ విపత్తుకు కారణం"

"విపత్తు ఏమి వచ్చిందిప్పుడు?"

"జాగ్రతగా విను చెబుతాను. దయామయికి ఇద్దరు కొడుకు లున్నారు. ఆమె ఆశలన్నీ పెద్దకొడుకుమీద. చిన్న కొడుకుమీద అన్నీ అనుమానాలే. పెద్దకొడుకుమీద విశ్వాసం, చిన్నకొడుకంటే భయం. చిన్నబాబు అకర్మణ్యులలో అగ్రశ్రేష్ఠుడని ఆమె నమ్మకం. అయినా కన్న

కడుపు కాబట్టి చిన్నవాడు ఎలా బాగుపడతాడా అని విచారిస్తూనే ఉంది. చివరకు వాడిభారం యావత్తూ నీ భుజస్కంధాలమీద విడిచి విశ్రాంతగా ఈ సంసారమరుభూమిని దాటిపోదామని ఆమె ఆశించింది. కాని విధి ప్రతికూలమైంది. హఠాత్తుగా విన్న సాయంత్రం ఆమెకు తెలిసిపోయింది- వందనాదేవి భుజస్కంధం ఖాళీగా లేదని. అక్కడ సుధీర్ అనే యువకుడు సుఖాసీనుడై యున్నాడు. అతన్ని ఆ స్థానంనించి ఎవరూ కదిలించలేరు. మా అమ్మ ఆశలన్నీ మంటిపాలైనవి" అంటూ ద్విజదాసు మళ్ళీ పకపకా నవ్వాడు. గది అంతా ఆ నవ్వుతో ప్రతిధ్వనించింది.

వందనాదేవి కాసేపు మౌనంగా ఉంది. చివరకు "అలా వికట హాసం చేస్తావెందుకు ? మీ అమ్మకు అవమానం కలిగిందనా ; నీకు స్వేచ్ఛ లభించిందనా ? ఎందుకా మహదానందం ?" అని అడిగింది.

"నువు చెప్పిన రెండింటిలో ఏదీ కారణంకాదు. కాని మా అమ్మ కాలుజారి బోర్లా పడినందువల్లనే నాకు వచ్చిందని ఒప్పుకోక తప్పదు. ఈ దెబ్బతో....'బుద్ధి' అనే వస్తువు తన ఒక్కతె సొత్తు మాత్రమే కాదనీ, బుద్ధిమంతులు చాలమంది ప్రపంచంలో ఉంటారనీ....ఆమెకు పాఠం అవగతమైతే బాగానే ఉంటుంది. తాను పన్నిన ఈ షడ్యంత్రం.... నాకు కాకపోయినా....అన్నయ్యతో నైనా చెప్పియున్నట్టయితే ఈ పాటు అనుభవంలోకి రాకపోయేదే. నువు మరొకరి వాగ్దత్తమైన వధువవనీ, మీ రిద్దరూ పరస్పర ప్రేమసూత్ర బంధితులనీ నాకు తెలుసు; అన్నయ్యకూ తెలుసు. ఆ బంధం త్రెంచటం సాధ్యంకాదు, వాంఛనీయమూ కాదు."

"ఎవరు చెబితే విన్నారు మీరాగాథ అంతా ?"

"మీ నాన్నే చెప్పాడు. మేము ఇక్కడికి వచ్చిననాడే మీ ఇద్దరి ప్రేమ, నిన్ను సుధీర్‌కు వాగ్దత్తం చేసినసంగతి, కొద్ది కాలంలోనే మీ ఇద్దరికీ వివాహం జరుగనున్నసంగతి - అన్ని విషయాలు సవిస్తరంగా చెప్పి మా చెవుల్లో అమృతవర్షం కురిపించాడు. కోపగించుకోకువందనా ! ఆయన చాలా అమాయకపు మనిషి, మంచివాడు. హృదయంలోని ఆనందం పట్టలేక ఆ విషయాలన్నీ ఆత్మీయులకు చెప్పివేశాడు"

"అందుకనేనన్నమాట మైత్రేయిని చూచిరండని పంపించాడు మమ్మల్ని మీ అన్నయ్య !"

"ఆ సంగతిమాత్రం నాకు సరిగా తెలియదు. మా అన్నయ్య హృదయంలోనిమాట దేవతలకుకూడా తెలియదు. మైత్రేయి సర్వగుణ

సంపన్నురాలనీ, మా ముఖర్జీ వంశంలోనికి రాదగినదేననీ ఆయన ఉద్దేశ మైనట్టు మాత్రం నేను చెప్పగలను''

"మైత్రేయి సంబధం నీ కిష్టమేనా ?''

"ఈ ఇంట్లో అటువంటి ప్రశ్నకు తావులేదు. నేను మూడో తర గతిలో వస్తాను. అంటే - మా అమ్మ, అన్నయ్య ఏ అమ్మాయినితెచ్చి నామెడకుకట్టినా నేను కిమ్మనకండా స్వీకరింపవలసిందే; సంతోషించి ఊరు కోవలసిందే. అది ఈ యింటి సనాతనాచారం. అది మారేందుకు వీల్లేదు.

అతడు ఆ మాటలు పలికిన తీరుచూస్తే వందనాదేవికి నవ్వు వచ్చింది. "ఒకవేళ మైత్రేయినికాదని వందనాదేవినే తెచ్చి నీ మెడకు బిగిస్తే ?''

ద్విజదాసు నుదురు కొట్టుకున్నాడు. "అది ఆడియాస వందనా! దుష్టరాహువు విందు చందమామను గ్రసించివేశాడు. సుధీరచంద్రుడు ఎక్కడినించో వచ్చి నిప్పుపెట్టాడు. ద్విజదాసు బంగారు ద్వీపం అతని కళ్ళముందే భస్మీభూతమై పోయింది. ఈ అభాగ్యుని హృదయం వ్రీలి పోతుంది, వందనా! ఆ ప్రసంగం ఇక మానివేద్దాం''

నాటకంలో పోర్షన్ ఒప్పచెప్పినట్టుగా అతడు పలికిన మాటలకు వందనాదేవి నవ్వింది. "ద్వీపం అంతా తగులబడిపోలేదు ద్విజబాబూ! ఇంకా అశోకవనం విశేషంగానే ఉంది. నీ హృదయం విదీర్ణము కానక్కరలేదు''

"ఉహుం. లాభంలేదు. శ్రీరామచంద్రుడంటే - సంపూర్ణ అదృష్ట వంతుడు. ద్విజదాసు వట్టి అభాగ్యుడు. నా ఆశలన్నీ మండి, మాడి, బొగ్గయి పోయినవి''

"ఉహుం. పోలేదు''

"పోలేదేమిటి ?''

"ఏమీ పోలేదు. ద్విజదాసు అభాగ్యుడైతే, వందనాదేవి అభాగిని కాదు. నా ఆశలను భస్మీపటలంచేసే శక్తి సుధీర్‌లో లేదు; ప్రపంచంలో ఎవరికీ లేదా సామర్థ్యం, మీ అన్నయ్యకూ లేదు.''

దృఢంగా, శాంతంగా పలికింది ఆమె. ద్విజబాబు మూగవడి చూస్తున్నాడు.

"మాటాడవేం ? నా హృదయభావం నీకు అర్థంకాలేదా ?'' అన్నది వందనాదేవి.

"ఔను, అనుమానిస్తూనే వచ్చాను. కాని పూర్తిగా నమ్మకం చిక్కలే దిప్పటివరకూ"

"కాని నిన్నుగురించి నా కెప్పుడో నమ్మకం చిక్కింది. ఆ నాడు కోపంవచ్చి మీ యింట్లో భోజనం చెయ్యకండా బండియెక్కి వచ్చేస్తున్నాను. అప్పుడు నువు మేడమీద కిటికీవద్ద చువ్వలుపట్టుకుని నాకేసి చూచిన తీరు నా కెన్నటికీ మరపురాదు. అంతమాత్రం నేను అర్థంచేసుకోలే ననుకున్నావా?"

ద్విజదాసు వివిధ భావవిచలితుడై మాటాడలేదు.

"ఇప్పటికైనా పూర్తిగా నమ్మకం చిక్కిందా?" అని అడిగింది వందనాదేవి.

"ఇంకా నాలుగు చీవాట్లు పెట్టు. బాగా బుద్ధివస్తుంది. ఇకముందు కూడా ఇలాగే చీవాట్లు పెట్టడం మానవన్నమాట."

"అంతా తెలిసికూడా తెలియనట్టు నటించేవాళ్ళను చివాట్లు పెడుతూండటమే నా ఆచారం."

"తెలిసికూడా తెలియనట్టు నటించేది నేనుకాదు, మా అమ్మ. ఆమెతో ఎలా వ్యవహరిస్తావు?"

"ఆమెకు నే నేమీ బుద్ధి చెప్పవలసిన అవసరం ఉండదు. ఆమె నన్ను కూతురులా చూచుకుంటుంది. ఆమె ఇవాళ అకస్మాత్తుగా అపోహపడి వెళ్ళిపోయింది. ఎప్పటికయినా అందరికీ తెలిసిరాక పోతుందా?"- ఆమెకంఠం రుద్ధమైపోయింది; నేత్రాలు బాష్పాకులము లైనవి.

దానితో ద్విజదాసు సంశయభావం మాయమైపోయింది. ఆమె మాటలు కేవల పరిహాస కథితాలు కావని తోచింది. ఆశ్చర్యంతో, ఆ వేదనతో ఆందోళితుడైనాడు. "అదేమిటి వందనా? కన్నీళ్ళు కారుస్తావెందుకు?"

వందనాదేవి పక్కకు తిరిగి కన్నీళ్ళు తుడుచుకుంది.

ద్విజదాసు కూడా చాలసేపు మౌనంగానే ఉన్నాడు. చివరకన్నాడు- "సుధీర్ మీ కేమన్నా అన్యాయం చేశాడా వందనా?"

"మీకా అనుమానం ఎందుకు కలిగిందసలు?"

ద్విజదాసుకు ప్రతివచనం తోచలేదు. తానడిగిన ప్రశ్న నిరర్థకమైనదని తోచింది. కాసేపాగి ఇలా అన్నాడు: "సుధీర్ మీలో కలిసిపోతాడు.

ఆచారవ్యవహారాల్లో మీకూ అతనికీ భేదాలులేవు. మా ముఖర్జీ వంశంలోవి ఆచారాలు, సాంప్రదాయాలు, సంస్కారాలు నీకు విపరీతంగా ఉంటాయి. అటువంటప్పుడు ఈ కారాగారంలో వచ్చిపడాలని నీకు కోరికెందుకు పుట్టింది వందనా? నా కోసమనా? ఇప్పుడు నీకు అన్ని విషయాలూ తెలియవు ఎప్పటికైనా తెలిసివస్తాయి. అప్పుడు నీ పొరపాటు నీకు తెలుస్తుంది. ఆనాడు నీ సంతాపానికి అంతం వుండదు. నేను ఎటువంటి మనిషినని నువు అనుకుంటున్నావో నాకు తెలియదు. మా వదినె, అన్నయ్య, అమ్మ, కులదేవతలు, స్వజనులు — వీరంతా ఎలాటివారో నేనూ అంతే. వారిలో వాడినే నేనూ. వారినించి నన్ను వేరుపరచి నువు సుఖపడలేవు. ఈ మావ్యవస్థ నీకు ఇష్టమేనా మరి?"

"ఇష్టం లేకపోతే మనిషికి మృత్యువు శరణ్యం ఉండనే ఉంది. ఏ కారాగారమూ మనిషిని బంధించి యుంచుకోలేదు. అదీగాక నన్ను ఎలాటి దాన్నిగా నువు భావిస్తున్నావో నాకు తెలియదు; నా అత్త, తోడికోడలు, కులదేవతలు, స్వజనం, సంఘం - ఈ అందరికీ పరాయి దాన్నయిపోయి నా భర్తను పొందవలెనని నేను ఆశించటంలేదు. నా భర్త వారందరిలో కలిసివుండే నన్ను మన్నించవలెనని నా కోరిక"

ద్విజదాసు ఆశ్చర్యానికి మేరలేదు. "ఈ మాటలన్నీ నువు సహజంగా పలుకుతున్నవికాదు. ఎవరు నేర్పారు చెప్పుమీ!"

"ఎవరూ నేర్పలేదు ద్విజబాబూ! విపిన్‌బాబు సందర్శనంవల్లనే నాకీ పాఠాలు కంఠస్థమై పోయినవి. ఈ యింటిలో అందరికన్నా పెద్ద అమ్మగారు; ఆ తరువాత విపిన్‌బాబు; తరువాత మా అక్క; ఆమె తరువాత నువు; ఇక్కడ అన్నపూర్ణకు కూడా ఒక స్థానం ఉంది. ఈ యింట్లో నాకు కూడా ఒక స్థానం లభిస్తే.... అది అందరి తరువాత చివరిస్థానమే అయినా అది అనుచిత స్థానమని నాకు తోచటంలేదు."

ద్విజదాసు కామాట మధురంగానే ధ్వనించింది; కాని హృదయం వ్యథాభరిత మైనది. ఈ విధంగా వందనాదేవి హృదయాన్ని పరీక్షించటం అన్యాయమని తోచింది.

"ఇంత మీరివచ్చాక అమ్మతో చెప్పినా ప్రయోజనం ఉండదు. ఆమె నిన్ను కూతురులా ప్రేమిస్తున్నది, నాకు తెలుసు. అందుచేతనే నిన్ను కోడలుగా చేసుకుని....మీయిద్దరు అక్కచెల్లెళ్ళ చేతుల్లో తన కొడుకులను

ఒప్పజెప్పేసి మానసరోవర యాత్రవెళ్ళిపోదామని ఆశపడ్డది. ఒకవేళ ఈ యాత్రలోనే (మార్గం దుర్గమం కాబట్టి) పరలోకంనించి పిలుపు వచ్చినా ఆమెకు సంకోచం ఉండదు.... గార్హస్థ్యభారం మీకు అప్పగించేసి వెడుతుంది కనుక ఆమెకిక చింత ఉండదు. కాని ఆమె అనుకున్నట్టుగా జరుగలేదు. 'మా అమ్మాయిని మీ కిస్తానని' చెప్పటం కన్యాదానం చేసినట్టేనని ఆమె ఉద్దేశం. ప్రేమించి ఎవరికి మాటయిచ్చావో వాడే నీభర్త. వివాహపుతంతు జరుగలేదు గదా, అని అతన్ని మీరు త్రోసిపుచ్చవచ్చు. కాని దయామయి పుత్రుడువచ్చి ఆస్థానం ఆక్రమించడు."

ఆ మాటలువిని వందనాదేవి ముఖం పాలిపోయింది.

"మీ అమ్మ అలాగని చెప్పి వెళ్ళిందా ద్విజబాబూ!"

"ఆమె అలా అనేమనిషి కాదని నేను చెప్పను. మావదినె చెప్పటం....మా అమ్మకు మరీ కష్టంకలిగించిన సమాచారం ఏమిటంటే— సుధీర్ మన కులస్థుడు కాదుట. నిజానికి మీరు జాతిమత భేదాలు పాటించరనుకో...."

"మరి నీ వుద్దేశం ఏమిటి?"

"చెప్పాను కదూ....నేను మూడోతరగతిలో మనిషిననీ. నా ఉద్దేశంతో ఏమౌతుంది?"

రాయిసాహెబుకు భోజన సమయం అయింది. వందనాదేవి లేచి నిల్చుంది. వెడుతూ— "మానాన్న సెలవులు అయిపోయాయి. రేపు ప్రయాణమై వెళ్ళిపోతున్నారు. నేను కూడా వెడతాను ద్విజబాబూ!" అన్నది.

"నాతో చెప్పటం ఎందుకూ? నా మాటలను పురస్కరించుకుని మాత్రం వెళ్ళవద్దు సుమీ! నువు వెళ్ళాక నీమాటలన్నీ మా అమ్మకు చెప్పేస్తాను. సిగ్గుపడనులే. ఆ తరువాత నాకు మిగిలేది ఏమిటీ? హృదయంలో ఈ మనసమావేశస్మృతి; వందేమాతర మంత్రం."

వందనాదేవి జవాబేమీ చెప్పలేదు. వెళ్ళిపోయింది.

# 15

వందనాదేవి తనగదిలోకి వెళ్ళిపోయింది. మనస్సుచాల విచారంగా ఉంది. "నేను ఏ మాయలో పడిపోయినానో! సిగ్గువిడిచి, హృదయం విప్పి అంతా చెప్పాను. ఆత్మమర్యాదను పోగొట్టుకున్నాను. ద్విజదాసు యువకుడే; కాని లోతైన మనిషి. చప్పున అర్థం అయే వ్యక్తికాదు. అతని ముఖంలో ఆగ్రహమూ కనిపించలేదు; ఉల్లాసమూ లేదు. నాకు ఆశలు చూపలేదు; నన్ను ఓదార్చనూ లేదూ. తాను కేవలం మూడో తరగతి మనిషినని మాత్రం మాటి మాటికీ పరిహాసంగా అన్నాడు. ఇంట్లో అతని యిచ్ఛకు ప్రాధాన్యం లేదు. వాగ్దానమే కన్యాదానమని అమ్మ అభిప్రాయమట! సుధీర్ స్థానం దయామయికొడుకువచ్చి ఆక్రమించడట! నాకు బాగానే అవమానం జరిగింది. అంతటితో అయిందీ? నా కన్నీరుచూచి జాలి ప్రకటించి "నీ మాటలన్నీ మా అమ్మతో ప్రస్తావిస్తాలే" అన్నాడు. అంతటితో మాత్రం ముగిసిందా? కాసంత సిగ్గయినా లేకండా.... అధికారంలో అందరికన్నా ఆఖరుదాన్నే అయినా ఈ ఇంటికి కోడలినై వస్తానని చెప్పాను."

ఆమె ఆలోచన ఇక సాగలేదు; అక్కడే ఆగిపోయాయి. "ఛీ, ఛీ. ఎంతనీచంగా ప్రవర్తించాను? ఆత్మహత్య చేసుకున్నా ఈ నైచ్యం నన్ను విడిచిపోదు.

బైటనించి ఎవరో....'మిమ్మల్ని నాన్నగారు పిలుస్తారమ్మా' అని చెప్పారు. వందనాదేవి లేచి తండ్రిగారి గదికి వెళ్ళింది. "రేపే బయలుదేరి బొంబాయి వెళ్ళిపోదాం" అని పట్టుపట్టి, హఠంచేసి తండ్రిని ఎలాగైతేనేం ఒప్పించింది.

అసలు విప్రదాసు మళ్ళీ తిరిగి వచ్చాక వెడదామనుకున్నారు మొదట. అయినా ఇప్పుడు కూతురు పట్టుదలకు తండ్రి లొంగక తప్పలేదు.

రాత్రి పక్కమీద పడుకున్నప్పుడు వందనాదేవికి ఏడుపు వచ్చింది. ఆ తరువాత నిద్రపోయింది. తెల్లవారిలేచి చూచేసరికి తండ్రిగారు సామానంతా సర్దిపెట్టారు. ఫోనులో మాటాడి రైల్లో సీట్లు రిజర్వు చేయించాడు. బొంబాయి ఆఫీసుకు తాను బయలుదేరి వస్తున్నట్లు తంతి యిచ్చాడు.

ఆసాయంత్రం బండికి ప్రయాణం. నిమిషం యుగంగా ఉంది వందనాదేవికి.

తొమ్మిది గంటలయింది. వందనాదేవి తన పరుపుచుట్టి పెట్టెమీద పెడుతున్నది. అన్నపూర్ణ వచ్చి....వ్యవహారం చూచి ఆశ్చర్యపోయింది.

"ఏమిటి అమ్మాయిగారూ ఈ కథ ?"

"ఇవాళ మేము వెళ్ళిపోతున్నాము."

"రేపు వెడతామనిగా అనుకున్నారు !"

"ఊహుఁ ఇవాళే వెళ్ళాలి." అని ఆమె తన పనిలో నిమగ్న అయింది. ముఖం ఎత్తనేలేదు.

"మీ కెందుకాకష్టం. నేను సర్దుతా నుండండి"

"నా కష్టం తీర్చవలసిన అవశ్యకత నీ కేముంది ? వెళ్ళి నీపని నువు చూచుకో"

ఆ యింట్లో అందరి మీదా వందనాదేవికి కోపం వచ్చినట్టుంది !

అకారణంగా వందనాదేవి చిరాకు పడుతున్నదని అన్నపూర్ణ గ్రహించింది. నిన్నను అమ్మగారు ఇలాగే కోపంవచ్చి స్వగ్రామం వెళ్ళిపోయింది. ఇవాళ వందనాదేవికూడా అదేపని చేస్తున్నది. కోపగించుకున్న వారిపై ప్రతికోపం చూపించటం అన్నపూర్ణ స్వభావంకాదు. ఆమెకు సహనశక్తి ఎక్కువ; సౌమ్యురాలు. మెల్లిగా కుంఠితస్వరాన అన్నది. "నాదే పొరపాటు అయింది అమ్మాయిగారూ ! పొద్దు పొడువగానే వచ్చి మిమ్మల్ని నిద్రలేపలేక పోయాను"

"అందుకు నీ క్షమాపణ నేను కోరటంలేదు. అట్టి క్షమాపణలు ఏమైనా వుంటే మీ యజమానులకు చెప్పుకో పోయి. ద్విజబాబు తన గది లోనే ఉన్నాడు. ఆయనతో వెళ్ళి చెప్పుకో"-అని వందనాదేవి ఒకసారి మాత్రం తలెత్తిచూచి, మళ్ళీ నమితవదనయై తనపనిలో తాను నిమగ్న అయింది.

వందనాదేవి తండ్రికి ఒక్కతే కూతురు. అందుచేత ఎంతో గారాబంగా పెరిగింది. పిసంఎత్తు మాటకూడా పడే స్వభావంకాదు ; స్వాభి

మానం జాస్తి. అట్లని ఇతర్లను మాట అనే మనిషికూడా కాదు. ఇవాళ ఎందువల్లనో నోరుజారి అన్నపూర్ణకు నొప్పికలిగే మాటే అన్నది. అన్న తరువాత ఆమెకు పశ్చాత్తాపం కలిగింది.

"రాత్రి డాక్టరుగారు వచ్చివెళ్ళాక గదిలో గోడకానుకుని కూచున్నాను. నిద్రపోకూడదనే అనుకున్నాను. కాని అలా కూచున్నదాన్ని కూచునే నిద్రపోయాను. నాకే తెలియదు. లేచి చూచేసరికి చాల పొద్దెక్కింది. మీరు మాత్రం నా యజమానులు కాదా అమ్మాయిగారూ! నేను ఎప్పుడైనా ఏదైనా అపరాధం చేస్తే చెప్పండి....ఉండండి నేను సర్దుతాను లెండి"

చివరిమాటలు వందనాదేవికి వినిపించినట్టులేదు. "డాక్టరుగారు ఎందుకు వచ్చారు?"-ఆశ్చర్యంగా అడిగిందామె.

"నిన్నరాత్రి ద్విజబాబుకు బాగా జ్వరం వచ్చింది. అసలు ఇక్కడికి వచ్చినప్పటినించీ సుస్తీగానే వుంటున్నాడు కాని తోసివేసుకుని తిరుగుతున్నాడు నిన్న అమ్మగారిని తీసుకుని స్వగ్రామం వెళ్ళవలసి వచ్చింది కాదూ! అప్పుడు నన్ను పిలిచి చెప్పాడు—'అన్నపూర్ణ అక్కా! ఈ జ్వరంతో నేను లేవలేని స్థితిలో ఉన్నాను. నాకు జ్వరంవచ్చిన సంగతి మా అమ్మకు ఏమాత్రమూ తెలియనీయకు సుమీ! మా అన్నయ్యతో మాత్రం చెప్పి ఆయనే వాళ్ళవెంట వెళ్ళేలాగు చూడు' అని చెప్పాడు. ద్విజబాబును నేను ఈ చేతులమీదుగా పెంచాను. అన్ని సంగతులూ నాతో చెబుతాడు. 'అదేమిటి అబ్బాయిగారూ! మీకు జ్వరంవచ్చిన సంగతి దాచిపెట్టటం బాగుంటుందా?' అని అడిగాను. ఎంత పెద్ద యిబ్బంది వచ్చినా తోసివేసుకుని తిరగటమే అతని స్వభావం. లెక్క చెయ్యడు. నవ్వుతూ అన్నాడు— "నువు వాళ్ళతో ఏమీ చెప్పకు. ఈ జ్వరం దానంతట అదే నయమైపోతుంది, పరవాలేదు.' తల్లికీ అతనికీ ఎక్కువగాపడదు. ఆమెతో కలిసి వెళ్ళటానికి సంకోచిస్తూ ఇదొక సాకు చెబుతున్నాడేమోనని నేననుకుని ఊరుకున్నాను. పెద్ద బాబుగారే వాళ్ళను తీసుకుని వెళ్ళిపోయాడు. తరువాత ఆ రోజంతా ద్విజబాబు నిద్రతోనే గడిపాడు. రెండు గంటలవేళ నేను వెళ్ళి 'ఎలా ఉంది చిన్నబాబూ!' అని అడిగాను. 'కులాసాగానే ఉంది' అన్నాడు. కాని అతని ముఖంచూస్తే నాకు గాభరా అయింది. 'డాక్టర్ని పిలిపిస్తా'నన్నాను. 'వద్దు - వద్దు. అనవసరంగా అన్నయ్యకు జరిమానా వేస్తానంటావేం?'

అన్నాడు. విన్ననల్లా ఒక్క ముద్దకూడా కొరకలేదు; కఠిన ఉపవాసమే. పక్కమీదినుంచి లేవలేదు. 'కులాసాగానే ఉన్నదంటున్నారు. అస్తమానం అలా పడుకున్నవారు పడుకన్నట్టే ఉన్నారేం?' అని అడిగాను. అతడు నవ్వుతూ - 'ఇలా మంచంమీద పడివుండటంకంటే మించిన పుణ్యం ప్రపంచంలో మరేమీ లేదని శాస్త్రం చెబుతున్నది. తద్వారా కైవల్యం లభిస్తుందిట. ఇప్పుడు కాస్త పారలౌకిక చింతలో ఉన్నాలే. నువ్వేమీ భయపడనవసరం లేదు' అన్నాడు. అంతా తమాషాగా మాటాడేస్తూంటాడు. మాటల్లో మేటి. నాకు కోపంవచ్చింది. కాని మనస్సులో భయం వదలలేదు. అతడు పుస్తకంఒకటి అందుకుని చదువుకో మొదలు పెట్టాడు నేను వచ్చేశాను."

అన్నపూర్ణ కాసేపు ఊరుకుని మళ్ళీ ఇలా అన్నది - "రాత్రి పదిగంటలప్పుడు నా గదితలుపు ఎవరోవచ్చి తట్టారు. 'ఎవరది?', అని ఉలికిపడ్డాను. 'నేనే అన్నపూర్ణ అక్కా! తలుపు తియ్యి' అని మాట వినిపించింది. ఆతృతగా వచ్చి తలుపు తెరిచాను. ఎవరు? ద్విజుబాబు! కన్నులు ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. ఆపాదమస్తకం వొణికిపోతున్నాడు. కంఠస్వరం నీరసంగా ఉంది. అప్పటికీ పెదవిమీద చిరునవ్వు రేఖ వెలుగుతూనే ఉంది అన్నాడు - 'అక్కా! నీ చేతుల్లో పెరిగాను. నాకీ రాత్రి నిద్ర పట్టటంలేదు' అన్నాడు. నా గుండె....

అన్నపూర్ణ ఇక మాటాడలేక పోయింది. కళ్లు చెమ్మగిలినవి. తిన్నగా హృదయోద్వేగాన్ని అణచుకుని అన్నపూర్ణ మళ్ళీ ఇలా చెప్పింది. "అప్పుడు నేను అతన్ని తిన్నగా మంచంమీద పడుకోబెట్టి.... డాక్టర్ని పిలిపించి.... మందుత్రాగించి.... అమ్మాయిగారూ! అదంతా నా కిప్పుడొక దుస్స్వప్నంలా ఉంది"- అన్నపూర్ణ పైటచెంగుతో ముఖం తుడుచుకుంది.

"నా కేమీ తెలియదే! నన్ను వచ్చి ఎందుకు లేపలేదు అన్నపూర్ణా!"- అన్నది వందన మెల్లిగా.

"మిమ్మల్ని గాభరా పెట్టటం నాకిష్టం లేకపోయింది"

"ఇప్పుడెలా ఉన్నాడు?"

"కొంచెం జ్వరం తగ్గింది. నిద్రలేవలేదు. బహుశః సాయంత్రం పడేవరకూ నిద్ర మెలకువరాదని డాక్టరు చెప్పాడు. పెద్దబాబుగారు ఎప్పుడు వస్తారా అని చూస్తున్నాను."

"కబురుచేశావా యేమిటి?"

"చెయ్యలేదు. అక్కర్లేదు, ఆయనే వచ్చేస్తారు - అన్నాడు మేనేజరు దత్తజీ."

"ద్విజబాబు దగ్గిర ఎవరన్నా ఉన్నారా మరి?"

"ఇద్దరు నౌకర్లు ఉన్నారమ్మా!"

"డాక్టరు మళ్ళీ ఎప్పుడువస్తాడు?"

"సాయంత్రంపదేముందే వస్తానన్నారు. భయపడాల్సిన అవసరం లేదన్నారు."

వందనాదేవి తండ్రిదగ్గిరకుపోయి "ద్విజబాబుకు జ్వరంవచ్చింది" అని మాత్రమే చెప్పింది.

రాయ్‌సాహెబు ఉలికిపడ్డాడు. "అరె, నాకు తెలియదే!"

"మనకు నిద్రాభంగం చేయటానికి యెవరూ సాహసించలేక పోయారు."

"అయితేమరి.... టిక్కట్లు కొనుక్కు రావడానికి మనిషిని పంపాను. సీట్లు రిజర్వు చేయించాను. మన ప్రయాణానికి విఘ్నం వచ్చిందే మరి!"

"విఘ్నం ఏముంది నాన్నా! మనం ఇక్కడ ఉండి ద్విజబాబుకు చేయవలసిన ఉపచారం ఏముందీ?"

"లేదనుకో....అయినా....బాగుండదు"

"అలా అనుమానాలు పెట్టుకుని రోజులు గడిపేస్తున్నావు. నాకేం బాగులేదు. ఇవాళప్రయాణం ఆపుచెయ్యవద్దు"— అంటూ వందనాదేవి మూతి ముడుచుకుని వెళ్ళిపోయింది.

సాయంత్రం కావచ్చింది. ఇంకారెండుగంటల్లో వందనాదేవి ప్రయాణమై వెళ్ళిపోనున్నది. అన్నపూర్ణ ఆమెగదిలోకి వచ్చింది.

"ద్విజబాబుకు ఎలాఉంది." అని అడిగింది. వందన

"కులాసాగానే ఉంది; నిద్రపోతున్నాడు"

"మేం వెళ్ళిపోతున్నాం. ఈ సమయంలో ఇంట్లో ఎవరూ లేరాయెను. ఒకరు నిద్రపోతున్నారు; ఒకరు ఇంకా రానేలేదు."

"పెద్దబాబుగారు రాత్రి తొమ్మిది గంటల బండికి వచ్చేస్తారు. ఆయన వస్తే మాకు ప్రాణంవచ్చినట్టు. అందాకా గుండెలు కొట్టుకుంటూనే ఉంటాయి"

"మరి భయమేమీ లేదన్నావుగా అన్నపూర్ణా ?"

"భయం అయితే లేదనుకో. అయినా పెద్దబాబుగారు ఇంట్లో వుంటే అదొకయెత్తు. అప్పుడు మామీద ఏమీభారం వుండదు. ఉన్నభారం అంతా ఆయనమీదే ఉంటుంది. ఎంత బుద్ధిమంతుడో అంత ఆలోచనా పరుడు. ఎంతసాహసపరుడో అంత గంభీరుడు. ఆయన ఇంట్లోవుంటే, మా అందరికీ వటవృక్షచ్ఛాయను విశ్రమించినట్లు ఉంటుంది"

అదీకథ ! ఎవరినోటవిన్నా విప్రదాసు గుణకీర్తనమే. అన్నపూర్ణకు ఆ పాట అలవాటైపోయింది. ఇంకొకసమయంలో అయితే వందనాదేవి వ్యంగ్యవాక్యం ఒకటి విసిరేదే. కాని ఇప్పుడేమీ మాటాడకండా ఊరుకుంది.

"ఇక మన ద్విజబాబు సంగతి ! అన్నకీ తమ్మునికీ భూమ్యాకాశాలకున్న అంతరం ఉంది" అంటూ మళ్ళీ ఆరంభించింది అన్నపూర్ణ.

"ఎందువల్ల ?"-ఆశ్చర్య కుతూహలాలతో వందనాదేవి అడిగింది.

"నిజంగానే అమ్మాయిగారూ ! తనమీద ఏమీ బాధ్యత పెట్టుకోడు; నిశ్చింతగా ఉంటాడు. బేపరవామనిషి. ఏ మాత్రమూ గాంభీర్యంలేదు. మీ అక్కయ్యగారు ఆయన్ను శరత్కాల మేఘంతో పోలుస్తారు. అందులో జలం ఉండదు, మెరుపు ఉండదు. కేవలం ఆకాశంలో ఆడుతూ పోతుంది. ఈయనగారుకూడా ఆడుతూ - నవ్వుతూ కాలం గడిపేస్తూంటాడు. అనేక మందికి అప్పు చెల్లించినట్టుగా దమ్మిడీ పుచ్చుకోకండానే రసీదులిచ్చి పంపించేస్తాడట !

"విపిన్‌బాబు కోపం చెయ్యరూ మరి ?"

"ఎందుకు చెయ్యరు ? బాగానే చేస్తారు. అందరికంటే అమ్మగారు బాగా నోరుచేసుకుని కూకలువేస్తారు. దానితో ఆయన ఇంట్లో లేకండా ఎక్కడికో మాయమైపోతాడు. ఎన్నాళ్ళకూ ఇంటికిరాడు. మీ అక్కయ్యగారు గోరాడగా. గోరాడగా చివరకు అంతాకలిసి, ఎక్కడవున్నాడో పత్తా తెలుసుకుని ఇంటికి పట్టుకువస్తారు. ఇలా ఎన్నాళ్ళని సాగుతుంది అమ్మాయిగారూ ! పెళ్ళిఅయి, పిల్లలు పుడితే....అప్పుడు దారికి వస్తాడని మా ఆశ !"

"అయితే చప్పున పెళ్ళిచేసుకోమని చెప్పరాదూ ?"

"చెబితేమాత్రం ఏమి లాభం ? వినడుగా. నా గొడవంతా మీకెందుకు పొండి - అని విసుక్కుంటాడు. ఒక్క వదినెగారి మాట మన్ని

స్తాడు, అంతే. ఆమెకు మరిదిగారిమీద ఎంత అపేక్ష అనుకున్నారు! ఆమె అంటుందికదా!....' మనం విందులారగించటం? మన ద్విజబాబు ఉపవాసాలు చెయ్యటమూనా? నా స్వంతానికి అయిదారువేల రూపాయల అయివేజు వస్తుంది. దానితో మే మిద్దరమూ బీదవాళ్ళలాగే రోజులు గడుపుతాం. పెద్దబాబుగారు లక్షలు పెట్టుకుని సుఖంగా ఉండవచ్చు. మేము ఆయన్ను ఒక్కపైసా అడగము.' అని"

ఆ మాటలువిని వందనాదేవి అమందానందం పొందింది. తన అక్కయ్య అలా అనటం ఆమెకు సంతోషం అయింది, కఠిన నిబంధనా పూరితమైన హిందూసంఘంలో అలాంటిమాట ఏ యువతియైనా అనటానికి వీలుందా?

అన్నపూర్ణ చెప్పినదంతా ఆమెకొక కథలాఉన్నది. అన్నపూర్ణ ఈ యింట్లో కేవలం దాసీకాదు. ఆమె ద్విజదాసుకు అక్కయ్య. అతడు ఇప్పటికీ తన రహస్యాలన్నీ ఆమెకు చెబుతాడుట! ఆమెతండ్రి వీరి ఎస్టేటు లోనే నౌకరీచేశాడు. వారి పోషణలోనే ఆమె కొడుకు విద్యావంతుడై వారిదగ్గిరే ఉద్యోగానికి కుదిరి జీవనం చేసుకుంటున్నాడు. అన్నపూర్ణ కిప్పుడీ దాసీత్వం చెయ్యవలసిన అవసరమేమీలేదు. అయినా ఇంకా మాయ విడలేదు. ఈ యింట్లో అంతా ఒక రకంగా సన్నిహితులై కలిసి - మెలిసి వుంటారు. నిన్న ద్విజదాసుకూడా అన్నాడు - 'మా అమ్మ. అన్నయ్య. వదినె, కులదేవతలు - వీ రందరితోనే నా ఉనికి. వీ రందరినించీ వేరుచేసి నువు నన్ను పొందలేవు' అని. తల్లి అంటే పడనివాడుకూడా అ మాట అన్నాడు. ఇప్పుడు వందనాదేవికి ఆ మాటలయర్థం స్పష్టంగాస్ఫురించింది.

ఇంకా ఈ యింటి వ్యవహారాలను అడిగి తెలుసుకుందామని వందనాదేవికి కుతూహలం కలిగింది. కాని ఇంతలో నౌకరు వచ్చాడు. 'అమ్మాయిగారూ! ఆరుగంటలైంది. ఇంకో గంటలో స్టేషనుకు వెళ్ళిపోలవాట. నాన్నగారు. మిమ్మల్ని చప్పున సిద్ధంకమ్మంటున్నారు"

అనాధరాయి కిందికి వచ్చాడు. కూతుర్ని కేకవేశాడు. ఇష్టం లేక పోయినాసరే, అన్యాయంఅయినాసరే వెళ్ళవలసిందే. హఠంచేసి ప్రయాణం నిర్ణయించింది తానే. గదివిడిచి బైటికివచ్చింది. "మళ్ళీ ఏనాటికైనా ఈ యింటికి నేను రావటం తటస్థిస్తుందా?" అనుకుంది. "ఇక్కడ గడిచిన ఈ నాలుగురోజులూ జీవితంలో ఒక సుఖస్వప్నం లా ఉండిపోవలసిందేనా?" అనుకుంది.

ద్విజదాసు గదికి పక్కగా వెడుతూ.... ఒకచే కిటికీ తెరచివున్నది. అందులోనుంచి లోపలికి చూచింది. కాని ద్విజదాసు కనిపించలేదు.

దత్తజీ మోటారు దగ్గిర నిల్చున్నాడు. అనాధరాయి కొన్ని రూపాయలు తీసియిచ్చి నౌకర్లకు పంచిపెట్టమన్నాడు. ఇలా అకస్మాత్తుగా వెళ్ళవలసి వచ్చినందుకు దుఃఖం ప్రకటించాడు. వెంటనే ద్విజదాసుకు యెలా వున్నదీ వుత్తరం రాయండన్నాడు.

బండీ యెక్కబోయేముందు వందనాదేవి అన్నపూర్ణను పక్కకు పిల్చింది. 'నువు ద్విజబాబును పెంచావు; పెద్దచేశావు. ఈ ఉంగరం నీ కోడలి కిచ్చుకో' అంటూ తన ఉంగరంతీసి ఆమెవేలికి తొడిగింది. తరువాత వెళ్ళి మోటారులో కూచుంది.

మోటారు బయలుదేరింది. అక్కడవున్న నౌకర్లు, దత్తజీ నమస్కారాలు చేసారు.

వందనాదేవి దృక్కులు మేడపైకి ప్రాకినవి. అక్కడ కిటికీవద్ద తనకేసి చూస్తూ ద్విజబాబు చువ్వలు పుచ్చుకుని నిల్చోలేదు. జబ్బుగా ఉన్నాడు, నిద్రావివశుడై ఉన్నాడు.

# 16

ఇంటికి వచ్చాక జరిగిన సమాచారమంతా సతీదేవి ఒక ఉత్తరం రాసి, అత్తగారికి తెలియకుండా—భర్త మళ్ళీ కలకత్తా వెడతాడుగా—ఆయన కిచ్చి వందనాదేవికి అందజెయ్యా లనుకుంది.

ఆనాడు రెండుగంటల బండికి విప్రదాసు తిరుగు ప్రయాణం నిర్ణయించుకున్నాడు. అంతకు ముందుగానే.... ఒకసారి తనగదికి వచ్చిపొండని భర్తకు కబురుచేసింది సతీదేవి.

విప్రదాసు వచ్చాడు. ఆ వెంటనే దయామయికూడా వచ్చింది. కొడుకూ కోడలూ ఏకాంతంగా ఉండగా ఆమె ఇదివరకెన్నడూ అలా

రాలేదు. సతీదేవి సిగ్గుపడ్డది. విప్రదాసుకూడా ఆశ్చర్యపోయాడు. మేలి ముసుగు సరిచేసుకు వెళ్ళిపో బోతున్నది.

"పోబోకు ఉండు అమ్మాయి! నువులేకండా చూచి నీచెల్లెల్ని నిందించటం నాకిష్టంలేదు. నువుకూడా ఉండు—ఒరే విపిన్! నేను ఎందు కంతగా వ్యాకులపడి కలకత్తా నించి వచ్చేశానో నీకు తెలుసునా?"-అని అడిగింది దయామయి.

"సరిగా తెలియదమ్మా! ఏదో గడబిడ జరిగివుంటుందని ఊహించాను: అంతే"

"గడబిడ ఏమీ జరగలేదు. కాని జరిగేదే. దుర్గామాత నన్ను రక్షించింది. వియ్యంకుడు బొంబాయి వెళ్ళిపోయాక వందనాదేవి మరికొన్నాళ్ళు ఇక్కడికి వచ్చి మనతోపాటు ఉండిపోయేందుకు నిర్ణయమైంది. కాని ఆపిల్ల కేమన్నా బుద్ధి అనేది ఉంటే మన యింటికి ఇక రానేరాదు; తండ్రితోనే ఎకాయెకి బొంబాయి వెళ్ళిపోతుంది. వెళ్ళిపోకపోతే 'వెళ్ళ' మని నువు గట్టిగా చెప్పివెయ్యి—నువ్వేమీ మనస్సుకు కష్టం పెట్టుకోకమ్మా సతీ! అటువంటి చెల్లెల్ని వనవాసం పంపించి వెయ్యాలి: ఇంట్లో తెచ్చి పెట్టుకోకూడదు."

విప్రదాసు నిరుత్తరుడై నిల్చున్నాడు. అతని ఆశ్చర్యానికి మేరలేదు.

"నేనా పిల్లను ఎంత అపేక్షగాచూచాను! మనలోకలసిపోయే పిల్లే అనుకున్నాను. నడవడిలోగాని, మాటల్లోగాని, చేతల్లోగాని పొరపాట్లు ఉండేవే. కాని కాలేజీ చదువుమూలాన్ని వచ్చిన ఈ లోపాలన్నీ-చంద్ర బింబాన్ని ఆవరించిన మేఘాలు గాలికివలె—అవే పోతాయని అనుకున్నాను. వెయ్యి దుర్గుణాలు ఉండనీగాక! మన సతీదేవి చెల్లెలుకదా! కాని తనంత తానే వరుని వరించటమూ? ఆ వరుడు ఒక కాయస్థుడా? బ్రాహ్మణ కులంలో పుట్టటమేమిటీ? ఈ పని బాగుందా? ఇంత అధఃపతనమా?"

"అదా కథ! వాళ్ళు జాతిమత భేదాలను పాటించరన్న సంగతి నీకు మొదలే తెలుసుగదా అమ్మా!"

"విన్నాను. కాని ప్రత్యక్షంగా ఇంతపని చేస్తుందనుకోలేదు. అంతా చూచాను. నా గుండె ఆమెపట్ల ద్వేషభావంతో నిండిపోయింది. ఇంతద్వేషం కలుగుతుందని నేను కలలోకూడా అనుకోలేదు. సరే ఏద

వనీ; తనయిష్టం వచ్చినట్టు కులకనీ? నాదేం పోయింది. కాని ఆపిల్ల మనయింటికి రావటం నాకిష్టంలేదు"

విప్రదాసు మాటాడలేదు.

"మాటాడవేంరా విపిన్!"

"నేను చెప్పేదేముంది? నీ ఆజ్ఞ అయిపోయిందిగా. ఆమె మన యింటికి రావటానికి వీల్లేదని!"

ఆమాటతో దయామయి ద్వైధీభావంలో పడ్డది.

"ఆ ఆజ్ఞ అనుచితమని నీ అభిప్రాయమా?"

"ఔనమ్మా! వందనాదేవి చేసిన అన్యాయం ఏముంది ఇందులో. వాళ్ళ ఆచారవ్యవహారాలు మన సాంప్రదాయానికి భిన్నములనీ, వాళ్ల జాతి మత విభేదాలను పాటించరనీ—నీకు తెలిసిన రహస్యాలే. అయినాకూడా నువు ఆమెను మనయింటికి ఆహ్వానించావు, అపేక్షగా చూచావు. 'వాళ్ల అలా చెబుతారేగాని, చెయ్యరు' అని నువు అనుకున్నావు. అదే పొరపాటు. అందుకే ఇప్పుడు నీ హృదయానికి గాయం తగిలింది"

"అయితే కావచ్చు. కాని ఆమె వివాహవిషయం నువుకూడా విన్నావుగా! నీ ఉద్దేశం ఏమిటి? చెప్పు. కాస్త వింటాను."

విప్రదాసు మందహాసం చేశాడు. "ఆమె వివాహం ఇంకా కాలేదు వివాహం చేసుకున్న తరువాతైనా నాకామెమీద ద్వేషం కలగదు. వారు ఏది తమకు మంచిదని విశ్వసిస్తున్నారో అలాగే ప్రవర్తిస్తున్నారు. ఎవర్నీ వాళ్ళు మోసగిస్తున్నది లేదు. జాతి మత విభేదంలో తమకు నమ్మకంలేదనీ, హిందువులకు గుడ్డినమ్మకాలు చాల ఉన్నాయనీ....పైకి ఆడంబరంగా మాటలు చెబుతూ సమయం వచ్చేసరికి....అన్నమాటల మీద నిలబడలేక దాక్కునే వారిని చాలమందిని చూచాను. కాని మనసులో ఏముందో అదే బయటకుచెప్పి, అలాగే ప్రవర్తించేవారిని నేను అధికంగా గౌరవిస్తాను. కోపగించుకోకమ్మా! మన ద్విజూ ఈ తరగతికి చెందినవాడే!"

దయామయికి ఈమాటలు రుచించకపోలేదు. "వాడు అలాటి నమ్మకద్రోహియేలే. కాని విపిన్! నువు వందనాదేవిని ద్వేషించటం లేదన్నావుకదా! ఆమె తాకిన వస్తువు తినవేం? ఆమెను నేను వంటయింటి పనులమీద వియోగిస్తే నువు అక్కడికి వెళ్ళటమే మానేశావు, నా గదిలో భోజనం చేస్తూవచ్చావు. నాకు తెలియదనుకున్నావా?"

"తల్లికి తెలియనిదేముంటుంది అమ్మా! నేను జాతిమతభేదాన్ని పాటిస్తాను. ఆమె ముట్టిన వస్తువు నేను తినను. ఏరోజున నాకా జాతిభేదం నశిస్తుందో ఆరోజున నిస్సంశయంగా తింటాను"

"నువు తినవన్న సంగతి వందనాదేవికి తెలియదు. తెలియకండానే ఉంచాలని నేను ఎంత ప్రయత్నించాను? ఇక ముందైనా ఆమెకు తెలియ కూడదుసుమీ! తెలిస్తే చాల నొచ్చుకుంటుంది. నీమీద ఆపిల్లకు చాల భక్తి-శ్రద్ధలు ఉన్నాయి"

"ఆమెకు నామీద భక్తిశ్రద్ధలు ఉన్నాయో, లేవో.... నాకు తెలి యదు గాని — ఆమె ముట్టినది నేను తిననివి మాత్రం ఆమెకు బాగానే తెలుసు."

తెలిసికూడా అంతఅభిమానురాలు నిన్ను గౌరవిస్తున్నదే! ఎందు వల్లనబ్బా!"

"ఆమె అత్యంత బుద్ధి మంతురాలు. చాలవిషయాలు ఆమెకు తెలియకండా దాచి పెట్టవలెనని మీరు ప్రయత్నించటమే పొరపాటు"

"అందుకనే కామాలు ఆమె అంతహరం చేసేది!"— అన్నది దయామయి కాసేపు ఊరుకుని.

"ఏమి హరం అమ్మా!"

"నేను విధవరాల్ని. ఇంతపిండిచేస్తే నాభోజనం వెళ్ళిపోతుంది. కాని ఆమె ఏంచేసే దనుకున్నావు? తరహాతరహాలకూరలు తెప్పించేది బాజారునుంచి. స్వయంగా కత్తిపీట పెట్టుకుని తరిగేది. మన బ్రాహ్మణ వంటమనిషిచేత పదిపన్నెండు కూరలైతే వండించి తీసుకు వచ్చి తిని పించేది. తింటూంటే మనవంట మనిషికి ఇంతరుచిగా వండటం ఎలా చేతనైందా అనిపించేదిరా విపిన్!"

విప్రదాసు నవ్వాడు, "అదా కథ! నాకు తెలియదుసుమీ! మన అతిథుల వంటఇంట్లోనించి ఆ కూరలన్నీ మన వంటయింట్లోకి చిందిపడ్డా ఏమో అనుకునేవాణ్ణిసుమీ! భగవంతుడురక్షించి అలాజరుగలేదు, నయమే. ఇంతకూ ఏమిచెప్పావుమరి? నాకు రైలువేళ అయింది. వెళ్ళాలి. వందనా దేవి ఇక్కడికి రావటం నీకు సమ్మతం కాదన్నమాటేనా?

దయామయి కోడలికేసి చూచింది. "నువు యేమంటావే అమ్మాయి!"

మరీ చిన్నప్పుడు సతీదేవి అత్తగారిసమక్షంలోనే భర్తతో మాటాడేది. కాని పెద్దఅయాక ఆ యాచారం మానివేసింది. కాని ఇవాళ ఊరుకుండలేక పోయింది. 'పోనీయండి అత్తా! వందన ఇక్కడికి రావలసిన అవశ్యకత ఏముందీ?' అన్నది మెల్లిగా.

దయామయి కోరిన జవాబు అదికాదు. ఆమాటకామె ప్రసన్నురాలు కాలేకపోయింది. "గొప్పయింటిపిల్ల అభిమానపడుతుందంటావా?"

"అది కాదత్తా! మనం అలా కోపంగా వచ్చేశాం. ఇప్పుడుమళ్ళీ పిలిపించటం దేనికీ?"

"ఏదో పొరపాటయిందనుకో. దిద్దుకో కూడదూ?"

"దిద్దుకోకూడదనటం లేదు నేను. అంతఅవసరం ఏమివచ్చిందీ? మొదటినించీ ఆమె ఇక్కడికి రావాలనే కుతూహలపడుతూ వచ్చింది. మనమే సంకోచించాం. ఇప్పుడామెను పిలిపించుకుంటేమాత్రం ఏమిలాభం? ఆమె మన వంటయింటిలోకి వచ్చిందంటే మీ పెద్దబ్బాయిగారు ఆ చాయలకే రారాయెను. ఎందుకూ ఆమెను రమ్మనమనటం?"

"నామీద ఆనేరం మోపవలసినది నువుకాదు; నీచెల్లెలు"—అంటూ విప్రదాసు నవ్వి-"అయినా కూడా ఆమె నన్ను మన్నిస్తుంది, తెలుసునా? అందుకు మా అమ్మేసాక్ష్యం" అన్నాడు.

సతీదేవి తలయెత్తి భర్తకేసి చూచింది. అత్తగారక్కడ ఉన్న దన్నసంగతి కూడా మరపు తగిలిందికామాలు! "మీఅమ్మగారేకాదు; నేనుకూడా సాక్ష్యమే. స్త్రీలు ఒకర్ని గౌరవించటం ఆరంభించాక తప్పులెన్నటం మరచి పోతారు. దేవతలు ఎన్నికష్టాలైనా కలిగించనీ, దేవతా పూజ మానివెయ్యరు. మాబాగుకోసమే ఇలా కష్టపెడుతున్నారు— అని తలపోసి ఊరుకుంటారు" అంటూ అత్తగారికేసి తిరిగి- "వందనకు మీరన్నాకూడా ఎంతగౌరవమో, ఎంతప్రేమో మీకూ తెలుసును. మీ రామెకు వంటయింటిభారం వొప్పజెప్పారు. మిమ్మల్ని అవహేళన చేసినట్టుగా ఉంటుందని వచ్చినవాళ్ళకెవరికీ అభోజ్యపదార్థాలు వండించనేలేదు. అటువంటి దానిమీద మీకెందు కంతకోపం? మనం ఏదో ఆశపడ్డాం. ఆ యాశ విఫలమై పోయింది, అంతే"—అంటూ గబగబా వెళ్ళిపోయింది.

తల్లీ కొడుకు లిద్దరూ ఆశ్చర్యపోతూ నిల్చున్నారు. సతీదేవి మతిలో ఉందోలేదో నవి అనుమానం కలిగింది.

"మీరు వందనాదేవిని ఎందుకంతగా ప్రేమించారు? మీరు పడ్డ ఆశ యేమిటి?" అని అడిగాడు విప్రదాసు.

దయామయి సంతాపం ప్రకటించింది. అసలు విషయం చెప్పలేక పోయింది. "ఇప్పుడు కాదురా విపిన్! మరొకప్పుడు చెబుతాలే" అని మాత్రం అన్నది.

"మరి అక్షయబాబు కూతురు సంబంధంమాట ఏ మాలోచించావు? వాళ్ళకు ఏమని కబురు చెయ్యను?"

"నా మటుకు నాకు ఏమీ అభ్యంతరం లేదు. మీ రాలోచించుకుని మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండి" అంటూ దయామయి అక్కడినించి వెళ్ళిపోయింది.

విప్రదాసు సందేహిస్తూ నిల్చున్నాడు. ఆమె స్పష్టంగా ఏమీ చెప్ప లేదు. ఇంకా అడిగి తెలుసుకోటానికి అది సమయమూ కాదు.

విప్రదాసు కలకత్తా వెళ్ళాడు. ఇల్లు ఖాళీగాఉంది. వందనాదేవి తండ్రితోసహా వెళ్ళిపోయింది. అతడు నొచ్చుకున్నాడు. కాని అంత ఎక్కువగా వ్యాకుల పడలేదు. వందనాదేవి అంత అకస్మాత్తుగా ఎందుకు ప్రయాణమై వెళ్ళిపోయిందో అన్నపూర్ణకుకూడా తెలియదు. 'అనాధరాయి ప్రయాణానికి తొందరపడలేదు; కూతురే ఆయన్ను తొందరచేసింది' అని అన్నపూర్ణ చెప్పింది.

ఆమాట విని విప్రదాసు నొచ్చుకున్నాడు. వందనాదేవి కేవలం అతిధిగా మాత్రమే వచ్చింది. ఉండటం వెళ్ళిపోవటం ఆమె యిష్టం, తన కామె మీద ఏమి అధికారం ఉందీ? అయినా కూడా ద్విజదాసు కంత జ్వరం వచ్చి బాధపడుతోంటే మరి రెండురోజు లుండిపోకూడదూ? విప్రదాసుకు విచారం కలిగింది. విచారంకాదు కోపమేనేమో! వందనాదేవి చూపిన ఆ కాఠిన్యానికి ప్రతీకారం చెయ్యవలెనన్న ఇచ్ఛ పొడమినదేమో! కాని మనసులో మాట బయటికిచెప్పే స్వభావం కాదతనిది. ఆ భావం హృదయంలోనే అణచివేసు కున్నాడు.

మరి నాలుగు రోజులకు హైకోర్టునించి జ్వరంతోనే ఇంటికి వచ్చాడు. మలేరియా జ్వరమేమో, కళ్ళు ఎర్రబడి పోయాయి. తలనొప్పి జాస్తిగా ఉంది.

"అన్నపూర్ణ అక్కా! నాకు ఈ మధ్య ఎన్నడూ జ్వరంరాలేదు. జ్వరపిశాచాన్ని తప్పించుకు తిరిగాను. ఈ సారి ఆ పిశాచం నన్ను

పూర్తిగా శిక్షించేట్టు కనిపిస్తున్నది. ఇది తేలిగ్గా నయమయేట్టు తోచటం లేదు" అన్నాడు ఇంటికి రాగానే.

అన్నపూర్ణ వ్యాకులచిత్త అయింది. అయినా అధైర్యం ప్రకటించ కండా-"పరవాలేదు బాబూ! మీ పుణ్యశరీరం దైత్యదానవ పిశాచాలకు లొంగేదికాదు. రెండుమూడు రోజుల్లో నయమైపోతుంది. అయినా డాక్టర్ని పిలిపిస్తాను" అన్నది.

"సరే పిలిపించు" అంటూ విప్రదాసు పక్కవేసుకుని పడు కున్నాడు.

అన్నపూర్ణకు ఏమీ తోచలేదు. ఇంటివద్దనించి 'వాసు' కు జ్వరం వస్తున్నదని కబురు వచ్చింది. ద్విజదాసు వెంటనే బయలుదేరి వెళ్ళాడు. దత్తజీకూడా ఊళ్ళోలేదు. ఎస్టేటు పనిమీద ఎక్కడికో వెళ్ళాడు. అన్న పూర్ణ తాను ఒక్కతే ఏమి చెయ్యగలదు? ఉదయాన్నే వచ్చి-"నేను ఒక మాట చెబుతాను బాబూ! కోపం రాదుకదా?" అని అడిగింది.

"నీ మాటలకు నేనెప్పుడన్నా కోపగించుకున్నానా అన్నపూర్ణ అక్కా!"

అన్నపూర్ణ అతని పక్కమీద కూచుండి మృదువుగా తల నిమురుతూ. "నా ప్రాణమైనా యిచ్చి నేను రోగికి సేవ చెయ్యగలను. కాని పల్లెటూరిదాన్ని; నాకేమీ తెలియదు. ఇంటికికూడా ఇంకా కబురు చెయ్య లేకపోయాను. అక్కడ వాసుబాబుకు జ్వరం వస్తోందాయెను. సతీదేవి కుర్రాణ్ణి విడిచి ఎలావస్తుందీ? పోనీ, వందనాదేవికి కబురుచేస్తే బాగుండదూ?"

విప్రదాసు నవ్వాడు. ఇక్కడికి బొంబాయి క్రోసు అనుకున్నావా? ఆమడ అనుకున్నావా? ఆ మూలనించి ఈమూలకు వందనాదేవి ఉప్పు తీసుకుని వచ్చేసరికి ఇక్కడిగంజి చల్లారేపోతుంది"

"వందనాదేవి కలకత్తాలోనే ఉంది; ఇంకా బొంబాయి వెళ్ళలేదు"

"వందన కలకత్తాలోనే ఉందా?"

"ఔను; వాళ్ళ పెత్తల్లిగారింట్లో. పెత్తండ్రి పంజాబులో పెద్ద డాక్టరు. కూతురు పెళ్ళిచేదామని ఈదేశం వచ్చేశారు. వాళ్ళు రైలు దిగటం; మనవాళ్ళు రైలుఎక్కటం ఒక్కసారే జరిగింది. పెత్తల్లి వందనాదేవిని చూడగానే ప్రయాణం ఆపి బలవంతంచేసి ఇంటికి తీసుకు

వచ్చింది. అనాధరాయి మాత్రం ఆరోజుఉండి మర్నాడు బొంబాయి వెళ్ళి పోయాడు. వందనాదేవి పెత్తల్లి కూతురుపెళ్ళి అయేవరకూ ఉంటుందిట"

"నీకు ఈ సంగతులన్నీ ఎలా తెలిశాయి ?"

వాళ్ళంతా చిన్న ద్విజబాబుకు ఎలావుందో తెలుసుకుని పోదామని వచ్చారు. నిన్న మధ్యాహ్నమప్పుడు రెండు గంటలవేళ మేడమీది వరాండాలో చీరకుట్టుకుంటూ కూచున్నాను. రెండు జట్కాలు వచ్చి మన యింటి ముందు ఆగాయి. స్త్రీలు పురుషులు చాలమంది దిగారు. వాళ్ళలో వందనాదేవికూడా ఉంది. మొట్టమొదట ఆమెను గుర్తించలేకపోయాను. వేషం పూర్తిగా మారిపోయింది. ఆడపిల్లలాగేలేదు, నేను విస్తుపోయాను. అంతా తిన్నగా పైకి వచ్చారు. ఇంకా ఒకపక్షం రోజులు కలకత్తాలోనే ఉంటానని వందనాదేవి చెప్పింది. సినీమాలు, నాటకాలు, షికార్లు-చాల కులాసాగా కాలం గడుపుతున్నదట! రోజురోజుకూ కొత్తకొత్త ఆట పాటలుట! వినోదాలుట!

"మన వాసుకు సుస్తీగా ఉందని కబురు చెప్పావా ఆమెకు?"

"చెప్పాను. పరవాలేదు. నయమౌతుందిలే- అన్నది"

విప్రదాసు కాసేపు మౌనంగా ఉన్నాడు. "ఇక్కడికామెను కబురు చెయ్యవలసిన ఆవశ్యకత ఏమి వచ్చింది అన్నపూర్ణ అక్కా! రెండు మూడురోజుల్లో నాకు జ్వరం నయమై పోతుంది. నువ్వేకాస్త కనిపెట్టి ఉండలేవూ!"

"ఎందుకు కనిపెట్టి ఉండను బాబూ! మీ ఆరోగ్యం కన్నా నాకు కావలసిన దేముందీ? అయినా వందనాదేవికి కాస్త తెలుపుడు చెయ్యటం మంచిదనుకుంటాను. లేకపోతే సతీదేవమ్మ గారికి మనసు కష్టంగా ఉండవచ్చు."

"వందన ఎక్కడవున్నదో మరి తెలుసా?"

"మన నౌకరుకుతెలుసు. నిన్నవాళ్ళవెంబడి వెళ్ళి దిగబెట్టివచ్చాడు."

చాలసేపటివరకూ విప్రదాసు మాటాడలేదు. చివరకన్నాడు- "సరే కబురు చెయ్యి. కాని ఆ వినోదాలు. ఆ షోకిళ్ళు విడిచి వస్తుందంటావా? వస్తుందని నాకుమాత్రం నమ్మకంలేదు."

"నిన్న ఆమెతీరుచూస్తే నాకూ నిరాశగానే ఉంది. అయినా కబురు చేస్తాను"

"నీయిష్టం" అన్నాడు విప్రదాసు నిరుత్సాహంగా.

# 17

వందనాదేవి తండ్రితో సహా బొంబాయికి ప్రయాణమై హవడా స్టేషన్ చేరగానే పెత్తల్లి కనిపించింది. ఆమె తన కూతురు పెళ్ళి చెయ్యటానికి కలకత్తాలో స్వగృహానికి వస్తూంది. బొంబాయి ప్రయాణం ఆపి వందనాదేవిని ఇంటికి తీసుకు పోవటంలో పెత్తల్లికి పెద్దకష్టమనిపించ లేదు. పెత్తల్లి బలవంతమేగాక....వందనాదేవి కలకత్తాలో నిల్చిపోవటానికి....ఇంకో కారణంకూడా ఉంది. ఉన్నబంధువులంతా ఈ ప్రాంతంలోనే ఉన్నారు. కాని ఆమె చిన్నప్పటినించీ బొంబాయిలో పెరిగింది. ఇక్కడి వారి ఆచార వ్యవహారాలు ఆమెకేమీ బాగా తెలియవు. ఇక్కడినించి బంధువులు అప్పుడప్పుడు రాస్తూ ఉండే ఉత్తరాలనుబట్టి మాత్రమే ఆమె ఈ దేశప్రజల సమాచారం ఊహించుకుంటూ ఉండేది. అప్పుడప్పుడు కలకత్తా వెళ్ళి వస్తూండే వారి ద్వారా బెంగాలీ వారిని గురించి వింటూ ఉండేది. అనితాచటర్జీ, యం. యే. వినీతా బెనర్జీ, బి. యే. అనసూయ, చిత్రలేఖ, ప్రియంవద — ఈ మొదలైన చక్కని పేర్లు, ఆకర్షకములైన కథలు, ఈ ఇరవయ్యో శతాబ్దపు అక్కడి ప్రజల నాగరిక జీవనయాత్రా వివరణలు- వింటూ ఉండేది. ఎంతవరకు నిజమో, ఎంతవరకు అబద్ధమో! ప్రత్యక్షంగా చూచిందా, పెట్టిందా? కొన్ని సంగతులు ఆమెకు ఉత్ప్రేక్షలుగా ఉండేవి, కొన్ని అవిశ్వసనీయాలుగా ఉండేవి. ఇప్పుడు పెత్తల్లి వచ్చిపిలవగానే తేలిగ్గా ఒప్పుకుంది. ఈ అవకాశం పురస్కరించుకుని బంగాళీ ప్రజల ఆచారవ్యవహారాలను ప్రత్యక్షంగాచూచి పోదామని ఆమె అభిలాష.

బాలీగంజ్ పేటలో పెత్తల్లిగారి ఇల్లు. పెళ్ళికని మిత్రులు, బంధువులు చాలమంది వచ్చారు. ప్రకృతి కలకత్తాలోనే బి. యే. ప్యాసైంది. ఆమెకు చాలమంది స్నేహితురాళ్ళు ఉన్నారు. వీరందరితో వందనాదేవికి రోజులు కులాసాగా గడిచిపోతున్నవి. ఒకసారి అంతాకలిసి పిక్నిక్

పార్టీకి వెళ్ళి తిరిగివస్తూ ద్విజదాసును చూచిపోదామని వీరింటికి వచ్చారు. ఆవిషయమే అన్నపూర్ణ విప్రదాసుతో చెప్పింది.

పెత్తల్లిగారింట్లో ఇంకాపెళ్ళి ముందే ఉన్నా నిత్యం ఏవో వేడుకలు వైభవంగా సాగిపోతున్నవి. డిన్నర్లు, టి పార్టీలు, వచ్చే వాళ్ళు, పోయే వాళ్ళు కోలాహలంగా ఉంది.

నేడుకూడా మేడమీది గదిలో టీపార్టీ జరుగుతోంది. అతిధులంతా చాల మంది సమావేశమైనారు. ఇంతలో యింటిముందు విప్రదాసు గారి మోటారువచ్చి ఆగింది. అందులో నించి ఒక ప్రౌఢ యువతి దిగింది. ఆమె ఒక తెల్లని మల్లుబట్ట కట్టుకుంది. కాళ్ళకు చెప్పులు లేవు. ముసుగులోనించి ముఖంకనపడి కనపడకండా ఉంది. సంకోచిస్తూ, సిగ్గుపడుతూ మోటారు పక్కనే నిల్చుంది. ఈసాధారణ వ్యక్తి మోటారులో రావటమేమా ? అని అక్కడివారంతా ఆశ్చర్య పోయారు.

"లోపల వందనాదేవి ఉన్నదా ?" అని అడిగిందామె అక్కడ వున్న ఒక నౌకరును.

"ఉన్నారు. పైన టీపార్టీ జరుగుతోంది. లోపలికి దయచేసి కూచోండి"

"వద్దు. ఇక్కడే ఉంటాను, కొంచెం ఆమెకు కబురు చెయ్య గలవా ?"

"అలాగే. ఏమని చెప్పమంటారు ?"

"విప్రదాసు గారింటి దగ్గరనుంచి అన్నపూర్ణ వచ్చిందని చెప్పు."

కబురు అందగానే వందనాదేవి గబగబా కిందికివచ్చింది. ఆప్యా యంగా అన్నపూర్ణ చెయిపట్టుకుని, గదిలో తీసుకుపోయి కూచోబెట్టింది. ఆమె విప్రదాసుగారింటి దాసీయనీ, సాంఘికంగా తనకన్న క్రిందిశ్రేణిలోని మనిషియనీ....ఆ సమయాన వందనాదేవి మరచిపోయింది. ఆమె కళ్ళు చెమరించాయి. "నేను బ్రతికివున్నానో లేదో చూచిపోవటానికి నువుఇలా వస్తావని నేను అనుకోనేలేదు. మీరంతా నన్ను మరచిపోయే వుంటారని భావించాను."

"మిమ్మల్ని మరచిపోతానా అమ్మాయిగారూ ! పెద్దబాబుగారే నన్ను మీ దగ్గిరకు వెళ్ళి రమ్మన్నారు. ఎందుకంటే -"

" 'మీరు' అని సంబోధిస్తే నేను పలకను. విపిన్‌బాబు అయిదు రోజులాయె కలకత్తావచ్చి. ఒక్కసారి వచ్చి నన్ను చూచిపోకూడదూ? నేను బొంబాయి వెళ్ళలేదని తెలుసుకదా!"

"నేను చెప్పినదాకా తెలియదు. అయినా ఆయన చేతులనిండా ఎన్నిపనులున్నాయో మీకు తెలియనిదేముందీ? తీరిక చిక్కలేదు."

"పను లనేవి అందరికీ ఉంటాయి అన్నపూర్ణా! మొన్న నే నొక సారి అక్కడికి వచ్చాను కాబట్టి మర్యాదకోసం నిన్నొకసారి ఇక్కడికి పంపించాడు. అంతే. లేకపోతే నా ఊసే మరచిపోయివుండును. మా పెత్తల్లిగారికి మీ దొరగారికి ఉన్నంత ఐశ్వర్యం లేకపోవచ్చు. అయినా కాస్త నా కబురుతెలుసుకుపోయేందుకు ఒకసారి వారి బీదయింట్లో అడుగు పెడితే తమజాతి భ్రష్టమైపోదు; మర్యాద చెడదు. ఇలా అన్నానని ఆయ నతో చెప్పు వెళ్ళాక"

ఈ యెత్తిపొడుపు మాటలన్నిటికీ అన్నపూర్ణ జవాబు చెప్పలేదు. ఆమె వచ్చిన పనివేరు. వందనాదేవిని పిల్చుకుపోదామని వచ్చింది. జంకుతూ, గొంకుతూ తాను వచ్చినపని తిన్నగా బైటపెట్టింది. కాని వందనాదేవి ఆమె మాటలను పూర్తిగా వినిపించుకోకండా—"ఉహుం నే నెక్కడికీ రావటానికి వీల్లేదు. ఎల్లుండే మా చెల్లెలిపెళ్ళి"- అన్నది.

"ఎల్లుండేనా?"

"ఔను."

ఈ సమయంలో విప్రదాసు జ్వరం సంగతి చెప్పటం ఉచితమో, కాదో....అన్నపూర్ణ ఆలోచనలో పడ్డది.

"నన్నక్కడికి రమ్మనమని ఆజ్ఞాపిస్తూన్న వారెవరూ? చిన్నబాబు ఊళ్ళో లేడుగదా! నాకు తెలుసును. అయితే పెద్దబాబుగా రన్నమాట ఈ హుకుం జారీ చేస్తున్నది. హుకుంలు జారీచేస్తూ వారికి బుర్ర పోయింది కామాలు! నేను వారికేమీ బాకీ ఉన్నదాన్ని కాదే. వారి జమీలో నివ సిస్తూన్న దాన్నీకాదు. నాతో ఏమన్నా పనివుంటే స్వయంగానే వచ్చి మాటాడకూడదూ? మా సతీదేవి అక్కయ్య కులాసాగా ఉందా?"

"కులాసాగానే ఉన్నారు."

"మిగతా వాళ్లు?"

"కుర్రవాడికి జ్వరం వస్తున్నట్టు కబురువచ్చింది."

"ఎవరికీ? వాసు బాబుకా? ఎలా వుందేమిటి?"

"మళ్ళీ కబురు రాలేదక్కడినించి."

వందనాదేవి విచారగ్రస్తురాలైంది. "కుఱ్ఱవాడికి సుస్తీగా ఉంది. విప్రదాసుబాబు ఇక్కడే పడివున్నాడు. కోర్టులు, లానాదేవిలో, అప్పులు వసూలు చేసుకోవటం—ఇవే ఆయనకు పిల్లవానికంటే ప్రియమైన వన్న మాట! మంచీ, చెడ్డా అక్కర్లేదా అన్నపూర్ణా మరీను!"

"రూపాయలమీద మమతకాదు అమ్మాయిగారూ! రెండురోజుల నించీ ఆయనకు కూడా జ్వరం వస్తున్నది. ఇంటివద్ద కుఱ్ఱవాడికి సుస్తీగా ఉందాయెను ఇంకా మరీ గాభరా పడతారని ఈ సంగతి కబురుచెయ్య లేదు. ఇక్కడ దత్తజీకూడా లేడు. ఢాకా వెళ్ళాడు. ఒక్కదాన్ని. జ్వరం తీవ్రస్థితికి వెడుతుందేమోనని భయంగా ఉంది. పల్లెటూరిదాన్ని; నాకేమీ తెలియదు. ఆయనకెప్పుడూ మామూలుగా జ్వరంరాదు. రాకరాక వచ్చిన జ్వరం ఏమి ఏడిపిస్తుందో! పోనీ పెళ్ళి అయాక ఒకసారి రాకూడదూ అక్కడికి?"

వందనాదేవి ముఖం వివర్ణమైంది. "డాక్టర్ని పిలిపించావా? ఏమంటాడు?"

"పరవాలేదు గాని ఇంకో డాక్టర్నికూడా పిలవండి-అంటున్నాడు"—అన్నపూర్ణ కన్నులు అశ్రుసిక్తములైనవి. వందనాదేవి చెయిపుచ్చుకుని—"ఈ రెండు రోజులు ఎలాగో గడిపేస్తాను. పెళ్ళి అయాకనైనా వస్తావు కాదూ! మా మీద కోపం పెట్టుకోకేం! నువు కోపగించుకోవలసినంత తప్పు మరింకెవరైనా చేసి యుండవచ్చునేమో గాని విపిన్‌బాబు నిర్దోషి సుమీ! నువు ఆయన్ను సరిగా అర్థం చేసుకోలేక పోయావు"—అన్నది.

"అయితే పద. వస్తున్నాను"—అన్నది వందన కాసేపు ఊరుకుని.

"ఈ పూటనే వచ్చేస్తావా?"

"అవును, పద."

"ఇంట్లో ఎవరికీ చెప్పిరావూ? వాళ్ళు తరువాత ఏమనుకుంటారో యేమో!"

"చెప్పటం. చెయ్యటం. ఆలస్య మౌతుంది అన్నపూర్ణా! పద" అంటూ ప్రత్యుత్తరం ఆపేక్షించకుండానే వెళ్ళి మోటారులో కూచుంది. అక్కడ ఒక నౌకరును పిలిచి—"నేను మా అక్కయ్యగారింటికి వెడుతున్నానని మా పెత్తల్లితో చెప్పు. అక్కడ విప్రదాసుబాబు సుస్తీగా ఉన్నాట్ట"—అని చెప్పింది.

వందనాదేవి విప్రదాసు గదిలోనికి వచ్చింది. దిండు గోడకు వేసి గోడ కానుకుని పక్కమీద కూచున్నాడు విప్రదాసు. ముఖంచూస్తే అంత తీవ్రమైన జ్వరంలా కనిపించలేదు. వందనాదేవి దూరంనించే నమస్కారం చెప్పి ఇలా అన్నది–" మా అక్కయ్య ఉంటే మీకు పాదాభివందనం చెయ్యనందుకు కోపగించుకునేది. కాని మీ పాదాలను నేను ముట్టుకుంటే మీరు మైల పడిపోతారేమో నని నాకు భయం."

విప్రదాసు మందహాసం చేశాడు. మాటాడలేదు.

"అయితే నన్నెందుకు పిలిపించారు మీరు? తమ సేవచెయ్యటానికేకదూ! తమరు మందు పుచ్చుకోవలసినవేళ అయిందని అన్నపూర్ణ చెప్పింది. కాని అదేమిటి? డాక్టరు పంపిన సీసా కనిపిస్తున్నదిగాని సంచి కట్టు వైద్యుని మాత్రలు కావే! డాక్టర్ని పిలవమని ఎవరు సలహాయిచ్చారూ?"

"అంటరాని వాడంటే ఎవరో నీకు తెలుసునా వందనా?"

"తెలుసునండీ మహాశయా! తెలుసును. తాను మనిషియైయుండి ఇతర మనుషులను ద్వేషించేవాడు, ఇతర్లనుచూచి దూరం తొలగిపోయే వాడు. వాడే అంటరానివాడు. ద్వేషపూర్ణుడు."

"సత్యాసత్యాల విభేదం తెలియక. అకారణంగా ఇతర్లపై దోషం ఆరోపించేవాడే అస్పృశ్యుడు. అట్టివారిలో అగ్రగణ్యవు నువు"

"అకారణంగా నేనెవరిమీద దోషం ఆరోపించానో మీరు కాస్త చెప్పండి దయచేసి!"

"నేను చెప్పనక్కరలేదు వందనా! సమయం వచ్చినప్పుడు నీకే తెలుస్తుంది"

"సరే, అందాకా వేచి ఉంటానులెండి" అంటూ ఒక కుర్చీ అతని మంచం దగ్గరగా లాక్కుని కూచుంది. "ఇప్పుడు చెప్పండి, ఎలా ఉంది మీ ఒంట్లో?"

"బాగానే ఉంది. జ్వరం తగ్గలేదు. రాత్రికి ఎక్కువ అవుతుం దేమో!"

"నన్నెందుకు పిలిపించారు. ఏం కావాలి మీకు నావల్ల?"

"నా కేమీ అక్కర్లేదు. అన్నపూర్ణకే భయంగాఉంది. ఎల్లుండి మీ చెల్లెలి పెళ్ళిట కాదూ? పెళ్ళి ముగియగానే ఒకసారి వస్తావుకదూ! మీ అక్కయ్య నీకొకమాట చెప్పమన్నది. అప్పుడు చెబుతాను"

"ఇప్పుడు చెప్పకూడదా ?"

"ఊహుఁ. ఇవాళకాదు."

వందనాదేవి కాసేపు మౌనంగా ఉంది. "మీకు ఎక్కువ జ్వర మేమీ లేదు. రెండు మూడు రోజుల్లో నయమై పోతుంది. ఇక్కడ నా అవసరమేమీ కనిపించటం లేదు. అయినా మీ సేవ నిమిత్తం ఉండి పోతాను. నా పెట్టె తీసుకరమ్మని నౌకరును పంపించాను. తమరు అభ్యంతర పెట్టకండేం!"

విప్రదాసు నవ్వాడు. "నువు ఇక్కడ ఉంటావంటే అభ్యంతరం ఎప్పుడైనా ఉంటుందా? కాని నీ చెల్లెలి వివాహం కామాలుగా!"

"నా వివాహం కాదుగా! నేను లేకపోతే ఆ పెళ్ళి ఆగదు"

"పెళ్ళికి నువు అక్కడ ఉండవూమరి?"

"ఊహుఁ"

"పెళ్ళికోసమనేగా నువు ప్రయాణం ఆపుకుని ఉండిపోయావు!"

"బొంబాయికి ప్రయాణమై వెళ్ళిపోతుంటే స్టేషన్‌లో మా పెత్తల్లి కలిసింది. తిరిగి వచ్చేశాను. ఎక్కడో బొంబాయిలో ఉంటూ మన సమాజం వ్యవహారాలే మాకు తెలియవు. వారూ వీరూ చెప్పిన మాటలను బట్టీ, కథలు, నవలలు చదవటాన్నిబట్టీ మాత్రమే మా కిక్కడి జీవన పరిస్థితులు అర్ధం కావాలి. ఎలాగూ ఈ దేశం వచ్చాను; ప్రకృతి వివాహం కూడివచ్చింది; ఈ అదనున ఇంకా కొన్నాళ్ళుండి ప్రత్యక్షంగా మన సాంఘిక పరిస్థితులనుచూచి అర్థం చేసుకుందామని ఉద్దేశంతో ఉండి పోయాను."

విప్రదాసు నవ్వాడు. "ఇంకా పెళ్ళి ముందే ఉందాయెను. అప్పుడే నీకు మన బంధువుల నందరినీ అర్థం చేసుకునే అవకాశం యెక్కడ లభించిందీ?"

"ఎక్కువ అవకాశం లభించలేదు; కాని లభించినంతవరకుచాలు"

"మరి నువు ఇంతవరకు తెలుసుకున్న విషయాలేమిటి? చెబు తావా? నేను వినవచ్చునా?"

వందనాదేవి నవ్వింది. "మొదట మీ జ్వరం నయంకానీయండి. సవిస్తరంగా చెబుతాను."

నౌకరు వచ్చి దీపం వెలిగించి వెళ్ళిపోయాడు. వందనాదేవి లేచి తలవైపు కిటికీ మూసివచ్చి మందు తాగించింది. "అలా కూచోటం

ఎందుకు ? పడుకోండి హాయిగా" అంటూ పక్కదులిపి, దిండు సరి చేసింది. విప్రదాసు పడుకున్నాడు. వందనాదేవి దుప్పటికప్పింది. అన్నది " ఈ జ్వరం నయమైన తరువాత మీరు శుద్ధికావటానికి ఎంత ఆవు పేడ, గంగాజలం ఖర్చు కావాలోకద. !"

" ఇంత " అన్నాడు విప్రదాసు రెండుచేతులూ చాపి. " కాని నీకు సేవ, శుశ్రూష కొంచెం కొంచెం తెలుసునే ; అదే నాకాశ్చర్యంగా ఉంది వందనా !"

" కొంచెమే తెలుసు నంటున్నారా ? మమ్మల్ని గురించి మీరింకా ఎక్కువ తెలుసుకోవలసి ఉంది విపిన్ బాబూ !"

" అంటే ?"

" అంటే— మమ్మల్ని నిందించాలంటే మాముఖాన్నే నిందించండి. ఇలా కళ్ళు మూసుకుని ఇష్టంవచ్చినట్టు నోటికి వచ్చినట్లల్లా మాటాడితే నేను ఒప్పుకోను."

విప్రదాసు నవ్వాడు. " ' మమ్మల్ని ' అంటున్నావు. ' మీరు ' అంటే ఎవరు ? ఎవర్నిగురించి నేనెక్కువగా తెలుసుకోవలసి ఉన్నది ? నువు ఎక్కడనించి ఇప్పుడు పారిపోయి వాచ్చావో.... ఆ యింటి వారిని గురించేనా ?"

" నేను పారిపోయి వచ్చానని మీకెవరు చెప్పారు ?"

" నేనే అంటున్నాను "

" మీ కెలా తెలిసిందీ ?"

" నీ ముఖం చూస్తే తెలిసింది "

వందనాదేవి క్షణమాత్రంగా అతని ముఖంలోకి చూచింది. " మీ చూపు కందని లోతులు లేవని ఒకసారి ద్విజబాబు చెప్పాడు. అప్పుడు నేనామాట నమ్మలేక పోయాను. నిజంగా పారిపోయే వచ్చానేమో.... నాకిప్పుడు ప్రాణంహాయిగా ఉంది. మీకు జ్వరం నయమయేవరకూ మీ దగ్గిరేవుంటాను. ఆ తరువాత ఎకాయెకి నాన్నగారి దగ్గిరకు వెళ్ళిపోతాను. మా పెత్తల్లిగారింటికి మళ్ళీ వచ్చినా పోను. ఉన్నాను వాళ్ళతో కొన్నాళ్ళు కలిసి మెలిసి. ఇక ఒక్క రోజుకూడా నేను వాళ్ళలో ఉండలేను."

విప్రదాసు ఆమెకేసి చూస్తూ పడుకున్నాడు. ఆమె ఇంకా ఇలా చెప్పింది. " వాళ్ళ కెప్పుడూ చీరలూ, జట్కాలు కావాలి. అస్తమానం అబద్ధపు ప్రణయానుభవాలు చెప్పుకుంటూ వుంటారు. ఆ హోటల్లో ఇలా

జరిగింది. ఈ పార్కులో ఇలా జరిగింది. - అంటూ ఒకటే గొడవ. వినివినీ నాకు తలనొప్పి వచ్చేది. ఎక్కడికేనా పారిపోదామా అనిపించేది. ఇప్పుడు నాకారోజులన్నీ అంధకార ప్రాయములై కనిపిస్తున్నవి. ఇలా వాళ్లు ఎలా జీవితం గడుపుతారు విపిన్‌బాబూ!"

"ఆ రహస్యం నాకు మాత్రం ఏంతెలుసు? వాళ్ళ మరుభూముల్లో కూడా 'ఒయాసిస్' లు ఉన్నాయేమో!"

వందనాదేవి ఒక నిట్టూర్పు విడిచింది. "జీవితం దుఃఖమయమైనదే. వారు శాంతి అనేది ఎరగరు. వారిలో ధర్మం లేదు. ఏమాటా విశ్వసించరుకదా! ప్రతిదాన్నీ తర్కిస్తారు. రోజూ వార్తాపత్రికలు చదువుతూంటారు. చాలావిషయాలు ఎరిగున్నారు. ప్రపంచంలో ఏమూల ఏ విషయం జరుగుతున్నదో వారికితెలుసు, నేనసలు వార్తాపత్రిక చదువను. అందుచేతవారు మాటాడుకునే మాటల్లో సగం నాకర్థంకావు. విని విని విసుగెత్తి ఎక్కడికోపోయి ఒంటరిగా కూచునేదాన్ని. వాళ్ళకు విసుగనేదేలేదు. వాగి వాగి ఆవేశంతో ఊగిపోతారు"

"అటువంటప్పుడు మీనాన్నగారుకూడా ఇక్కడే ఉంటే బాగుండిపోయేది. ఆయనవల్ల వార్తాపత్రికల సంగతులు నువుకూడా అడిగితెలుసుకోగలిగే దానివి. వాళ్ళలో నీకు చిన్నతనం లేకండా ఉండేది"

వందనాదేవి నవ్వింది. "ఔను. మానాన్నకు అదొకవ్యసనం. వార్తాపత్రికను ఆదినించి చివరకూ చదివేవరకూ విడిచిపెట్టడు. కాని మా ఆడవాళ్ళకు ఆ విషయాలన్నిటితో ప్రయోజనం ఏమిటీ? ప్రపంచంలో ఎక్కడ ఏమి జరుగుతున్నదో తెలుసుకుని ఆడవాళ్లు ఏమిచేస్తారూ?"

"ఆమాట మీ అక్కయ్య అంటే సమంజసంగా ఉంటుందేమో గాని నువు అనటం ఏమీ బాగులేదు వందనా?"

"మా అక్కయ్యకంటే ఎక్కువసంగతులు వాళ్ళకు తెలుసునని మీరు అనుకుంటున్నారా? అలా ఎప్పటికీ అనుకోకండి. వాళ్ళు అంతా వట్టి ఓటుకుండలు. అందుకనే మోత ఎక్కువ. వార్తాపత్రికల్లో విషయాలు మినహాయిస్తే వాళ్ళకు తెలిసిన యంశం మరేమీలేదు."

"కాని అవికూడా తెలుసుకోవాలి కదా!"

"ఏమీ తెలుసుకోనక్కర్లేదు. వాళ్ళు మా అక్కయ్యను ఎందునా పోలరు. మా అక్కయ్యకు వలె వాళ్ళకు ప్రేమించటం తెలియదు: ఆమెకువున్న భక్తిశ్రద్ధలు వాళ్ళకు లేవు. వాళ్ళకు మిత్రత్వం అంటే

ఏమిటో తెలియదు. పైకి అంతా మిత్రులే ; లోలోపల పరస్పరం ద్వేషిం చుకుంటూ ఉంటారు. పైకిచూస్తే ఎంతో నాజూకుగా, గొప్పగా కనిపి స్తారు. లోపల ఏమీలేదు. ఏమి చూచి వాళ్ళను మెచ్చుకోవాలో నాకర్థం కావటం లేదు. వాళ్ళ హృదయంనిండా బెజ్జాలే"

విప్రదాసు నవ్వాడు. "వాళ్ళమీద నీకు అంతకోపం వచ్చిందేమి వందనా ? ఎవరైనా వారిలో నీ మనీపర్సు కొట్టేశారా చెప్పుమీ !"

"కొట్టెయ్యలేదు. డబ్బు అప్పుఅడిగి తీసుకున్నారు"

"ఎంత ?"

"ఎక్కువకాదు. నాలుగైదు వందలు"

"ఎవరు ? పేరు తెలుసునా ?"

"తెలుసు. కాని మరిచిపోయాను" అంటూ వందన పకపక నవ్వింది. "ఛీ, ఛీ, కాసంత పరిచయం అయిందో లేదో డబ్బు యెలా అప్పు అడుగుతారో నాకు అర్థం కాదు. ఏమీ సంకోచం లేకండా....సిగ్గ యినా లేకండా....నోరుతెరచి అడిగేస్తారు. అది వాళ్ళకు రోజూ అలవాటే కామాలు !"

విప్రదాసు గంభీర వదనుడై కాసేపటివరకూ మారు పలుకలేదు. "వాళ్ళు నీ హృదయాన్ని విరిచేశారు వందనా ! కాని అందరూ అలాటి వారే అనుకోకు. మీ పెత్తల్లిగారింటో ఏ కొద్దిమందితోనో నీకు పరిచయ మైంది. ఇతరులు ఇంకా చాలమంది ఉన్నారు. వారినికూడా ఎప్పటికైనా చూడగలవు."

"మీరుచెప్పే మంచివాళ్ళను చూచేవరకూ నా యిప్పటి అభి ప్రాయాన్ని మార్చుకోను. ఇంతవరకు నేను చూచిన వారందరూ బాగా చదువుకున్నవారే; ప్రఖ్యాతిగాంచిన కుటుంబాలకు చెందిన వారే. కథలు, నవలలు చదివి "మా బంగాళీ యువతులు విజ్ఞానంలో పురుషులకేమీ తీసి పోరు" అని గర్వించాను. తీరా చూచాక నా ఊహ పొరపాటే అని పించింది."

"పొరపాటు ఎలా ఔతుందీ ? వాళ్ళు వేగంగా మున్ముందుకు వెడుతున్నారు; అబద్ధంకాదు"

వందనాదేవి నవ్వింది. "అబద్ధంకాదు, నిజమే. ఇటువంటి వాళ్ళు మన సంఘంలో ఏ కొద్దిమందో మాత్రం వుంటారన్నది ఒక్కటే నాకు

ఓదార్పు ఇస్తున్న అంశం. ఇలాంటి మహిళలు వేదికలెక్కి- ఉపన్యాసాలివ్వటం ఎంత విఫలమో అంత హాస్యాస్పదం కూడాను."

"అలా అనటం నీ హృదయ కాఠిన్యానికి మరొక ఉదాహరణం"

వందనాదేవి ఆ మాట వినిపించుకోలేదు. "ఇట్టి తుచ్ఛ దంబాచారులు కాని బంగాళీ మహిళలను నే నింతవరకూ చూడలేదు. అయినా ఒకరిద్దరిని మాత్రం భాగ్యవశాత్తు చూచాను. ఒకతె మా అక్కయ్య, తరువాత మీ అమ్మగారు. ఈ యిద్దర్నీ దర్శించటం వల్లనే ఈ నా కలకత్తా ప్రయాణం సార్ధకమైనట్టు భావిస్తున్నాను. అదేమిటి? నవ్వుతున్నారెందుకూ?"

"డబ్బుపోయిన విచారం మనిషిని ఒక గొప్ప వక్తనుగా చేస్తుంది సుమా! ఆ దోషం నాలోకూడా ఉందా, లేదా అని ఆలోచించు కుంటున్నాను"

"డబ్బుపోయిన విచారం ఏమిటి?"

"అదే. అయిదువందల రూపాయలనష్టం"

వందనాదేవి నవ్వింది. "ఇప్పు డిక నా కా డబ్బుపోయిన విచారం లేదులెండి. మీకు సేవ చెయ్యటానికి వచ్చానుకదా! పోయినదానికి 'డబల్' గా మీ దగ్గిర వసూలు చేస్తాను. మీ రివ్వకపోతే మా అక్కయ్య దగ్గర వసూలుచేసి తీరుతాను"

ఇంతలో అన్నపూర్ణ వచ్చింది. "ఎనిమిది గంటలయింది. విపిన్ బాబు జావ త్రాగేవేళ అయింది"

వందన గాభరాపడుతూ లేచింది. "పద, అన్నపూర్ణా! వస్తున్నాను పద! వెళ్ళమంటారా విపిన్‌బాబూ!"

విప్రదాసు నవ్వాడు. "వెళ్ళు మరి! నువు చెయ్యవలసిన సేవలో లోటుబాట్లు జరిగాయంటే మాత్రం నీ మజూరీలో తగ్గించవలసి వుంటుంది సుమీ!"

"ఊహుం. లోటుబాట్లేమీ జరగవు." అంటూ నవ్వుతూ వందనాదేవి వెళ్ళిపోయింది.

# 18

"భోజనం తయారైంది, పట్టుకురానా?"

విప్రదాసు నవ్వాడు. "ఎలాగైనా నన్ను జాతిభ్రష్టుని చెయ్యాలని చూస్తున్నావు. ఇంతవరకు సంధ్యాపూజ చేసుకోలేదు. మొట్ట మొదట దానికి సిద్ధం చెయ్యి అన్నీ."

"నేనే చెయ్యనా?"

"లేకపోతే ఎవరు చేస్తారు మరి? మా అమ్మగారి పూజాగృహం దాకా వెళ్ళేశక్తి లేదిప్పుడు నాకు. ఇక్కడే సంధ్యాపూజ చేసుకుంటాను. పూజకు అన్నీ సిద్ధం చెయ్యటంలో ఏమీ లోటుబాట్లు లేకండా ఉన్నట్టు నాకు తోచాలి. అప్పుడు భోజనం పట్టుకు రావచ్చు."

ఆ మాటలు విని వందనాదేవి ఆనందంలో మునకలు వేసింది. "ఈ పరీక్షలో నేను నెగ్గానంటే మీరు నాచేతి మీదుగా అన్నం తినాలి. తింటా ననండి మరి!"

"తింటాను. కాని నీచేతి మీదుగా నన్ను తినిపించినందువల్ల నీ కేమిటి లాభం?"

"నే నది చెప్పను" అంటూ వందనాదేవి గబగబా వెళ్ళిపోయింది.

పది నిమిషాల తరువాత ఆమె స్నానంచేసి, నీళ్ళగ్లాసు ఒకటి తీసుకుని వచ్చింది. కిటికికి తూర్పుగా ఉన్న స్థలంలో నీళ్ళుచల్లి, చేతితోరాచి, పైటకొంగుతో తుడిచి శుభ్రంచేసింది. పూజా గృహంనించి కుశాసనము మొదలైన వన్నీ తెచ్చి యధా స్థానాలలో అమర్చింది. అగరువత్తులు వెలిగించి పెట్టింది. ధోవతి, అంగవస్త్రం, కాళ్ళుచేతులు కడుక్కోటానికి నీళ్లు—అన్నీ తెచ్చి విప్రదాసుకు అందించింది. "ఇప్పుడు పూలుకోసి, మాలకట్టి తెచ్చేందుకు వ్యవధిలేదు. రేపు ఈ లోటు జరక్కుండా చూస్తాను లెండి. కాని పూజ ఒక అరగంటలో ముగించండి. ఇప్పుడు తొమ్మిది అయింది. తొమ్మిదిన్నరకల్లా పూజ ఐపోవాలి. ఆలస్యం చెయ్యకండి" అంటూ ఆమె తలుపువేసి వెళ్ళిపోయింది.

మరి అరగంటసేపటికి వందనాదేవి తిరిగి వచ్చింది. విప్రదాసు ప్రార్థన ముగించుకుని పడకకుర్చీలో పడుకుని ఉన్నాడు.

"నేను ప్యాసైనానా? ఫేలైనానా? విపిన్‌బాబూ!"

"ప్రథమ శ్రేణిలో ప్యాసైనావు. మా అమ్మనుకూడా ఓడించగలిగావు. నిన్ను మ్లేచ్ఛ బాలికయని ఎవరంటారు? మ్లేచ్ఛుల కాలేజీలలో చదివి బి. ఏ. ప్యాసై వచ్చావని నిన్నెవరూ దూషించలేరు"

"భోజనం వడ్డించి తీసుకురానా మరి?"

"తీసుకురా. కాని ముందుగా అవన్నీ సర్దివెయ్యి" అంటూ కుశాసనము మొదలైన వస్తువులకేసి చూపించాడు.

"మీరు చెప్పనక్కరలేదు. నాకు తెలియదేమిటి?"—అంటూ వందనాదేవి పూజాపాత్ర, అవీ చేతిలో తీసుకుంది. ఇంతలో బైట ఎత్తు మడమల చెప్పుల చప్పుడు వినిపించింది. ముందుగా అన్నపూర్ణవచ్చి చెప్పింది—"అమ్మాయిగారూ! మీ పెత్తల్లిగారు—"

పెత్తల్లి ఇంకా ఇద్దరు ముగ్గురు స్త్రీలు లోపలికి వస్తున్నారు. విప్రదాసు లేచి నిల్చుని—"రండి, దయచెయ్యండి" అన్నాడు ప్రార్థనా పూర్వకంగా.

"నాకు వాకట్లోనే తెలిసింది: విప్రదాసుబాబు కులాసాగానే ఉన్నాడని...."

"ఔను: కులాసాగానే ఉన్నాను"

వచ్చిన స్త్రీలు వందనాదేవిని చూచి ఆశ్చర్యపడ్డారు. కాలికి చెప్పులు లేవు. కట్టుకున్నది తడిచీర. జుట్టు దువ్వుకుని జడవేసుకోలేదు. పైగా విరబోసుకుని ఉంది. పూజా సామగ్రి రెండు చేతుల్లో పట్టుకుని ఉంది. అట్టిమూర్తిని వారెప్పుడూ చూచి యెరుగరు. ఒక స్త్రీ అలా వుండగలదని వారు కలలోకూడా అనుకోలేదు.

"మీరంతా దరవాజాదగ్గిర లేవండి. కాస్త పక్కకు తొలగండి. ఈ పూజా సామగ్రి అవతలపెట్టి వస్తాను" అన్నది వందనాదేవి.

"మైల సోకుతుందనా?"—అన్నది ఒక ఆగంతుక.

"ఔను" అని వందన వెళ్ళిపోయింది.

ఒక నిమిషం తరువాత వందనాదేవి అదే వేషంలో తిరిగి వచ్చి విప్రదాసు కుర్చీదగ్గిర నిల్చుంది.

"నువు మాతో చెప్పకుండా చెయ్యకుండా వచ్చేశావని నాకేమీ కోపంలేదు. కాని నీ చెల్లెలి పెళ్ళి ఇవాళ. నువు రావాలిమరి!" అన్నది పెత్తల్లి.

"నిన్ను పట్టుకుని ఎత్తుకుపోదామనే వచ్చాం" అన్నారు మిగిలిన యువతు లిద్దరూ.

"నేనక్కడికి రాలేను పెద్దమ్మా!" అన్నది వందనాదేవి.

"అదేమిమాట వందనా? నువు రాకపోతే ప్రకృతి ఎంత నొచ్చుకుంటుందో తెలుసునా?"

"తెలుసును. అయినా నేను రాలేను"

ఆ మాటకు పెత్తల్లి నొచ్చుకుంది; ఆశ్చర్యపోయింది. "పెళ్ళికి ఉందామనేగా నువు బొంబాయి ప్రయాణం ఆపుకున్నావు! పెళ్ళి జరుగుతున్నదనేగా మీనాన్న నిన్నిక్కడ దించిపోయింది! అయినా నువు పెళ్ళికి రానంటున్నావు. మీ నాన్నకీ సంగతి తెలిస్తే ఏమంటారు?"

"పైగా సుధీరబాబుకు ఎంతకోపం వస్తుంది? అసలు నువు చెప్పకుండా వచ్చెయ్యటం ఆయనకు నచ్చలేదు"—అన్నది వచ్చిన వారిలో ఒక యువతి.

వందనాదేవి ఆయువతికేసి తీక్షణంగా చూచింది.

"నేను రాకపోతే ప్రకృతి పెళ్ళి ఆగిపోదు. వచ్చానంటే ఇక్కడ విపిన్‌బాబును కనిపెట్టి ఉండేవాళ్ళెవరూ లేరు."

"విపిన్‌బాబు కులాసాగానే ఉన్నాడుగా! ఆయన నిన్ను పెళ్ళికి పంపకుండా ఉంచుకోటం ఉచితంకాదు"—అంటూ పెత్తల్లి విప్రదాసుకేసి చూచింది.

విప్రదాసు మందహాసం చేశాడు. "ఔను. ఆమెను వెళ్ళమని చెప్పటమేనాకు ఉచితం. వెళ్ళటమే ఆమెకు ఉచితం. వెళ్ళకపోవటం అన్యాయమే."

"ఉహుం. అన్యాయమని నేననుకోను. మీరు వెళ్ళమంటే వెడతాను. కాని రాత్రికే మళ్ళీ వచ్చేస్తాను. అందుకు మా పెద్దమ్మ ఒప్పుకుంటే సరే"

"ఒక్కరాత్రికూడా నువు అక్కడ ఉండలేవన్నమాట!"

"ఉండలేను."

"సరే. అలాగే చెయ్యి" అని పెత్తల్లి అప్రసన్నయై తిరిగి వెళ్ళిపోయింది.

"మీపెత్తల్లి కోపంతో వెళ్ళిపోయిందిచూచావా? ఒక్కసారిగా నీ మనస్సు అలా మారిపోయిందేం?" అన్నాడు విప్రదాసు.

"ఆమెకు కోపంవచ్చిందని నాకు తెలియక పోలేదు. ఆమె కోపానికి వెరచి కాదు నేను పెళ్ళికి వస్తానన్నది. వాళ్ళమాటలు, చేతలు నాకు నచ్చవు. అసహ్యంగా ఉంటాయి. ఇక నేనక్కడికి వెళ్ళలేను విపిన్ బాబూ!"

"వెళ్ళకపోతే బాగుండదు వందనా!"

"బాగుంటుందో, బాగుండదో నాకు తెలియదు. వాళ్ళలోవుంటే నాకు సుఖంలేదు, శాంతిలేదు. ఒకసారి బొంబాయిలో నేనొక పెద్దమిల్లు చూడ్డానికి వెళ్ళాను. ఎక్కడ చూచినా మరలు జోరున తిరుగుతూ బర్రుమని ధ్వని శ్రవణకంటకంగా ఉంటుంది. కాస్త అజాగ్రతగా ఉన్నామంటే చెయ్యో, కాలో, మెడకాయో ఆ చక్రాల్లో నలిగిపోగలదు. అదిగో అలాంటి మిల్లులో ఉన్నట్టు ఉంటుంది వీళ్ళసమాజంలో ఉంటే. మిల్లును చూస్తూఉంటే బాగానే ఉంటుంది. కాని త్వరగా బైటికి వెళ్ళిపోవాలనిపిస్తుంది - పోనీయండి, ఇప్పటికే ఆలస్యమైంది. మీ భోజనం పట్టుకు వస్తాను. ముందునౌకరును పంపించి ఈ స్థలం నీళ్ళు చల్లి శుభ్రం చెయ్యమని చెబుతాను" - అంటూ వందనాదేవి వెడుతూంది.

"ఇంత సూక్ష్మ పరిశీలనాశక్తి ఎవరిదగ్గిర నేర్చుకున్నావమ్మా!" అన్నాడు విప్రదాసు.

వందనాదేవి ఆ ప్రశ్నకు ఆశ్చర్య పోయింది. "ఎవరు నేర్పారో నాకైతే జ్ఞాపకంలేదు." అని కాసేపాగి - "బహుశః ఎవరూ నేర్పలేదేమో! నేనే స్వయంగా నేర్చుకున్నాను కామాలు! లేక మీ పేవాపలితమో!" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

సాయంత్రమైంది. వందనాదేవి వస్త్రాభరణాలు సింగారించుకుని విప్రదాసు గదిలోకి వచ్చింది. "విపిన్‌బాబూ! వెళ్ళి చెల్లెలుపెళ్ళిచూచి వస్తాను. పెత్తల్లిగారు ఏమనుకుంటుందో ఏమో! వెళ్ళివస్తాను మరి!"

"వెళ్ళిరా. మీపెత్తల్లి నీమీద కోపంచూపితే అందుకుమవు ఏనాటికయినా కసి తీర్చుకుంటావుగాక! పంజాబునించి బొంబాయికి త్వరలోనే నీ పెళ్ళికి ఆమెను లాక్కుపోదువు గాని"

"మా పెద్దమ్మమీద నాకేమీ కోపంలేదు. ముఖ్యంగా మిమ్మల్నే లాక్కుపోతాను. రైలుచార్జీలు నేనేపెట్టుకుంటా లెండి; భయపడకండి" అంటూ వందనాదేవి పకపకా నవ్వింది. "రాత్రినేను తిరిగి వచ్చేసరికి పొద్దుపోతుంది. మీకు జరగవలసిన యేర్పాట్లన్నీ పూర్మాయించే వెడుతున్నాను. ఏమిలోపం జరిగినా దండించనూ!"

"ఔను. నువు దడించకుండా ఊరుకున్నావంటే ప్రపంచం తల క్రిందులయి పోదూ! పెళ్ళి యింట్లో భోజనం ఊతంగా పడిందేమో శాంతంగా ఉన్నది....అనుకుంటారు"

వందనాదేవి నవ్వింది. "నాగుణగణాలు బాగా వ్యాఖ్యానించారు. సంధ్యాపూజకు అన్నపూర్ణ అన్నీ సిద్ధం చేసిపెడుతుంది. పూజ అయిన తర్వాత వంటబ్రాహ్మణుడు భోజనం తెస్తాడు. ఒక గంటతర్వాత అన్నపూర్ణ వచ్చి మందు త్రాగిస్తుంది, తలుపువేసి వెళ్ళిపోతుంది."

"సరే, బాగుంది"

"ఇక నేను వెళ్ళనా?"

"వెళ్ళిరా! నీవస్త్రధారణ చాల ఆకర్షకంగా ఉంది సుమా! ఇలాటి వస్త్రధారణమే నీకు ఎంతైనా తగివుంది, సహజంగా ఉంది. నువు ఇక్కడ ఉన్నప్పుడు మామూలుగా ధరించే తీరు కృత్రిమంగా ఉంటున్నది."

"అదేమిటి, విచిత్రంగా మాటాడారేం? ఆడవాళ్ళు చెప్పులు తొడగటం మీరు అసహ్యించుకుంటారని అందరూ అంటారే!"

"పొరపాటున అంటున్నారు. నీ చేతిఅన్నం నేను తిననని ఇదివరకు అనలేదూవారు?"

"పొరపాటు ఎలాగ? నాచేతిఅన్నం తినటానికి మీకిదివరకు అభ్యంతరం ఉండేదేగా!"

"ఉండేదే. కాని అది నిజమైన అభ్యంతరమే అయితే ఇవాళ లేదేం మరి!"

ఆ మాట వందనాదేవికి పూర్తిగా అర్థం కాలేదు. అతనిమాట అబద్ధ మనుకోటానికీ వీల్లేదు. "విసిన్‌బాబూ! ఒకసారి ద్విజదాసు చెప్పాడుగదా! 'మా అన్నయ్య మనసులో ఏముందో ఎవరూ తెలుసుకోలేరు. ఆయన పైకి పలికిన మాటలు మాత్రం అర్థమౌతాయి, కాని ఆయన హృదయంలోతు ఎవరికీ తెలియదు' ఆ మాట నిజమేనా?"

విప్రదాసు మందహాసం చేశాడు "వందనా! ఆలస్యమౌతుంది; చప్పున వెళ్ళుమరి! అక్కడ ఉండటం ఇష్టం లేకపోతే మాత్రం ఉండకు; వచ్చెయ్యి. ఏం?"

"వచ్చేస్తాను. అక్కడ వుండలేను." అంటూ ఆమె మెట్లుదిగి వెళ్ళిపోయింది.

మర్నాటి ఉదయం. "నీ చెల్లెలిపెళ్ళి నిర్విఘ్నంగా నెరవేరిందా?" అని అడిగాడు విప్రదాసు.

"ఆఁ. నెరవేరింది, విఘ్నం జరగలేదు"

"కాని నీ హఠంమాత్రం చెల్లించుకున్నావు. పెత్తల్లి ప్రార్థన నిర్లక్ష్యం చేశావు. మవు తిరిగి వచ్చేసరికి ఎంతపొద్దు పోయిందేమిటి?"

"రాత్రి మూడుగంటలైంది. మా పెద్దమ్మ ఉండి పొమ్మంది. కాని నేను ఉండలేదు. వచ్చేశాను"-అంటో కాసేపు ఆలోచనగాఉండి.... చెబుదామా, వద్దా అన్నట్టు రవంత సంకోచించి - "అక్కడ ఉన్నది నేను కొన్నిగంటలు మాత్రమే. కాని కొన్ని సంవత్సరాల్లోకూడా చేయలేని పని ఒకటి చేసేసివచ్చాను. అయిదు నిమిషాల్లో సుధీర్‌బాబుతో సంబంధం త్రెంచివేసుకుని వచ్చాను"

విప్రదాసు ఆశ్చర్యాన్వితుడైనాడు.

"మొన్న మా పెత్తల్లితో ఒక అమ్మాయి రాలేదూ! ఆమె పేరు హేమనళిని. ఆమె మూలంగానే సుధీర్‌తో సంబంధం త్రెంచివేసుకుని వచ్చాను. అబ్బ! వాళ్ళను తలచుకుంటే మళ్ళీ నాకు బొంబాయిలో మిల్లు జ్ఞాపకం వస్తుంది. వాళ్ళ ప్రేమ బాంధవ్యాలు ఒక పెద్ద గలభాలాగ వుంటాయి. అవి చూస్తోంటే మన భావిజీవన సౌధం అలా లేస్తుంది, అలాగే పునాదుల్లోకి కూలిపోతుంది కూడాను."

"సుధీర్‌తో సంబంధం వొదులుకుని వచ్చా నంటున్నావు. ఏమిటి ఆ మాటలో అర్థం?" - విప్రదాసు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"అంటే - మా సంబంధం పూర్తిగా తెగిపోయిందన్నమాట! ఇక మా యిద్దరిమధ్యా ఏమీలేదు. సుధీర్ అనవసరంగా, అసహజంగ ఉత్తేజితు డౌతూ ఉంటాడు. నన్ను చూడగానే 'నువుచాల అన్యాయం చేశావు' అన్నాడు. 'ఏమిటా అన్యాయం?' అని అడిగాను. 'ఎవరితో చెప్పకండా (అంటే - నాతో చెప్పకండా) హఠాత్తుగా మీ బావగారింటికి వెళ్ళటం తప్పు. పైగా అక్కడ విప్రదాసుబాబు ఒక్కడే ఉంటున్నాడు,

మరెవరూ లేరు ' అన్నాడు. ' అదేమిటి? అన్నపూర్ణ వదినె లేదూ?' అన్నాను. ' ఆమె కేవలం దాసీయేగా! మామూలుగా ఆమెను వాళ్ళు ' అక్కా ' అని పిలుస్తారు. నిజంగా ' అక్క ' కాదే! ' అన్నాడు. అది విని హైమ నవ్వి అన్నదిగదా - " పల్లెటూరి వాళ్ళు కాబట్టి ఏవో వరుసలు పెట్టుకుని పిల్చుకుంటారు. దాసీదాన్ని ' అక్కా ' అని పిలిస్తే దానికి మరీ పొగరెక్కి పోవటమేగాని, అంతకన్నా ప్రయోజనం ఏముంటుంది? నిజంగా అక్కయ్యతో సమానురాలై పోతుందా?" వెంటనే సుధీర్ అందుకుని - " నీకు ఇక్కడ వుండటం ఇష్టం లేదనీ, రాత్రికే మళ్ళీ వెళ్ళిపోతాననీ చెప్పావుటగా! నువు ఒంటరిగా వాళ్ళింట్లో వుండటం మాకు బాగులేదు. మీ నాన్నగారి కీసంగతి తెలిస్తే ఏమంటారు?" అన్నాడు. ' మా నాన్నగారు ఏమంటారో అన్న చింత వుండవలసినది నాకుగాని, నీకుకాదు. నేనక్కడ వుండటం ఇష్టం లేనివాళ్ళలో నువు కూడా ఒకదివేనా?' అని అడిగాను. ' ఔను ' అన్నది హైమ. ఆమె ముఖంచూచి జవాబుచెప్పటం నాకిష్టం లేకపోయింది. సుధీర్‌వైపు తిరిగాను. ' అనవసరంగా ఉద్యోగానికి సెలవుపెట్టి కలకత్తాలో నువు కాలక్షేపం చెయ్యటం నాకు ఇష్టంలేదని నేనూ అనగలను. కాని అన్నానా? ఈ విధంగా నీ మందలింపులు నిమ్మజాతికి చెందినవారికి తగును. నాగరికులమనుకుంటూన్న వారుకూడా నీ లాగ మాటాడతారేమో, నాకు తెలియదు. సరే, నేనిక్కడ వాగుతూ కూచోలేను. బండి నిల్చివుంది. వెడుతున్నాను ' అన్నాను. ' ఉచితానుచిత వివేచన, మంచి చెడ్డల విచక్షణ నిమ్మశ్రేణిలోనూ, అగ్రశ్రేణిలోనూకూడా ఉండకపోవు ' అన్నది వ్యంగ్యంగా హైమ. ' సరే ఆ వివేచనలు, విచక్షణలూ చేస్తూ మీ యిష్టం వచ్చినంతసేపు కూచోండి. నేను వెడుతున్నాను ' అంటూ లేచాను. సుధీర్ ముఖం పాలిపోయింది, చిన్నపోయాడు. మీ పెద్దమ్మగారితోచెప్పి వెళ్ళు ' అన్నాడు. ' నేను ఆమెతో ఆనాడే చెప్పేశాను. ఎంత పొద్దుపోయినా సరే.... పెళ్ళి అయిపోగానే తిరిగి వెడతా.....నని. ' రేపొకసారి నేను రానా?' అన్నాడు సుధీర్. ' అక్కర్లేదు ' అన్నాను. ' పోనీ ఎల్లుండి?' అన్నాడు. ' ఉహుఁ ' అన్నాను. పోనీ అటావు ఎల్లుండి వస్తానన్నాడు. అక్కర్లేదన్నాను. నాతో ఏదో అత్యవసరమైన విషయం మాటాడాలన్నాడు. నీకు అత్యవసరమైంది నాకు అత్యవసరం కాదు పొమ్మన్నాను. సుధీర్‌కు నా సంగతి బాగానే తెలుసు. బండిదాకా నావెంటవచ్చే

సాహసం లేకపోయింది. స్తబ్దుడై నిల్చున్నచోటనే ఉండిపోయాడు. నేను బండీ యెక్కి వచ్చేశాను.

విప్రదాసు మందహాసం చేశాడు. "ఇంత మాత్రానికేనా సంబంధం త్రెంచేసుకుని వచ్చా నంటున్నావు. ఏదో కొత్త చిటపట లాడుకున్నారు. అంతేగా ! నామాట నీకు నమ్మకం లేకపోతే మీ అక్కయ్యను అడుగు. చెబుతుంది"

వందన నవ్వలేదు. గంభీర వదన అయింది. "ఎవర్ని అడగవలసిన అవసరమూ లేదు విపిన్‌బాబూ ! మా సంబంధం తెగిపోయింది. మళ్ళీ అతకదు. నాకు నమ్మకమే."

ఆమె ముఖం చూచి విప్రదాసు విస్తుపోయాడు. "అదేమిటి వందనా ? అంత పెద్దవస్తువు నాలుగు కలహవాక్యాల మూలాన మటుమాయమైపోతుందా ? సుధీర్‌కు గాయం తగిలింది. అది ఆలోచించావా ?"

"బాగానే ఆలోచించాను విపిన్‌బాబూ ! అతని గాయం మానటానికి చాల రోజులు పడుతుంది. నాకు తెలుసు. అది మానే ఉపాయం హైమ చూపిస్తుంది. కాని నా విషయమే ఆలోచించుకున్నాను. బండిలో ఉన్నంతసేపే అనుకోకు. ఇంటికి వచ్చి పడుకున్నా నాకు నిద్రపట్టలేదు. గాభరాగా ఉన్నమాట వాస్తవమే. కాని అంతపెద్ద బాధేమీ కలగలేదు నామనస్సుకు."

"ఈ కోపం అణగిన తరువాత బాధ కనిపిస్తుంది. సుధీర్‌కోసం ఎదురుచూస్తూ కూచుంటావు" అంటూ విప్రదాసు నవ్వాడు.

వందనాదేవికి నవ్వురాలేదు. "నాకు కోపంలేదు. తెగ తెంపులు చేసుకుని వచ్చేటప్పుడు అనవసరంగా కటువుగా మాటాడి వచ్చానే.... అని మాత్రం పశ్చాత్తాప పడుతున్నాను. కాని దోషం అతనిదే నని నా విశ్వాసం." అంటూ ఆమె శాంత స్వరాన గంభీరంగా పలికింది.

విప్రదాసు అనుమానం ద్విగుణీకృతమైంది. ఆమె మాటల్లో కాపట్యంలేదు. "వందనా ! ఇప్పుడు నువు సుధీర్‌ను ప్రేమించటం లేదా ?" అని అడిగాడు.

"లేదు"

"ఒకప్పుడు ప్రేమించావుకదా ! ఆ ప్రేమ ఇప్పుడు ఇంత తేలిగ్గా అంతరించి పోయిందా ?"

"ఔను, అంతతేలిగ్గానే అంతరించిపోయింది. లేకపోతే మీతో అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమి వచ్చిందీ? ఇదివరకు నేను సుధీర్‌ను ప్రేమించానో, లేదో....మీరు తెలుసుకోవా లనుకుంటున్నారు కాదూ! ఔను, ఆరోజుల్లో నిజంగా అతన్ని ప్రేమిస్తున్నాననే అనుకునే దాన్ని. కాని తరువాత నా మనసు మరొక మహాశయుని మీదికి పోయింది. సుధీర్ మరపు తగిలాడు. ఇప్పుడు ఆ రెండో మహాశయుడు కూడా నా కంటికి కనిపించటంలేదు. ఇదంతా వింటూంటే మీకు నామీద ఏహ్యభావం కలుగుతున్నదేమో! నేను వట్టి చంచల స్వభావురాల్ని అనుకుంటూన్నారు కాదూ! అట్టి చంచల స్వభావం స్త్రీలకు లజ్జాకరమని నాకు తెలుసు. ఏ స్త్రీ అట్టి స్వభావాన్ని బైటికి చెప్పుకోదు. అందువల్ల ఆమె చరిత్ర కలుషితమై పోగలదని ఆమె ఊహ. నేను కూడా ఈ విషయాలన్నీ బైటికి చెప్పుకోక పోదునేమో! కాని ఎందు వల్లనో మీ ముందు చెప్పుకోవటానికి నాకు సిగ్గనిపించటం లేదు."

విప్రదాసు మాటాడలేదు.

"వస్తుతః హృదయంలో ఉన్నది పైకి బడబడా వాగివెయ్యటమే నా స్వభావం. అందరు స్త్రీలూ అలాగే ఉంటారని నా ఊహ. ప్రేమ పాత్రుడైన వ్యక్తి ఎవరు? జీవితమంతా వెదకినా కనిపిస్తాడా? వెదకి వెదకి పొందగలమా? ఎండమావులనుచూచి పరుగెత్తుతూండటమేనా?"

విప్రదాసు అలాగే మౌనంగా ఉన్నాడు. వందనాదేవి హృదయ కుహరం పూర్తిగా తెరుచుకుంది.

"సుధీర్‌తో నా వివాహ సంబంధం సంవత్సరం క్రితమే నిశ్చయమైంది. కాని అతని తల్లికి జబ్బు చేయటంవల్ల అప్పుడు పెళ్ళి ఆగిపోయింది. అప్పుడే వివాహం అయిపోయి వున్నట్టయితే ఇవాళ ఇంత తేలిగ్గా నా మనసు అతన్ని మరచిపోగలదా? మనసు విరిగిన తరువాత కాపురం చేయటం ఎలాగ? మనస్సును చిక్కబట్టుకోవాలి; ధర్మం పాటించాలి అంటారు. నిగ్రహాన్ని ఒప్పుకోక మనస్సు తిరుగుబాటుచేస్తే ఏమిటి గతి? మా పెత్తల్లిగారింట్లో చేరిన మహిళలలాగే పైకిమాత్రం నవ్వుతూ కులాసాగా తిరుగుతూ, లోలోపల నా కుచేష్టితాలను సాగిస్తూ, ఇతర్లను ద్వేషిస్తూ, నిందిస్తూ, కాలక్షేపం చెయ్యవలసిందేనా? మాటాడరేం విపిన్‌బాబూ!"

"నీ హృదయంలో తుపాను రేగింది. దానివేగాన్ని నేను అందుకోలేక పోతున్నాను. అందుకే మాటాడలేక ఊరుకున్నాను"

"ఉహుం. నేను ఒప్పుకోను. మీరు జవాబు చెప్పవలసిందే?"

"నువు శాంత పడనిదే నేను ఏమిచెప్పినా లాభం వుండదు. ఒక అస్వాభావికమైన అవస్థలో ఉన్నా విప్పుడు"

"నాకు మతిపోలేదే!"

"పోలేదు. కాని కాస్త చెదిరింది. ఇప్పుడు కాదు. సాయంత్రం పనిపాటలు అయాక వస్తావుగా! అప్పుడు జవాబు చెబుతాను."

"సరే, కానీయండి" అంటూ వందనాదేవి వెళ్ళిపోయింది. ఆపూట ఆమెచేయవలసిన పనికూడా చాలాఉంది. అన్నపూర్ణ కాశీఘాటుకువెళ్ళింది. పని అంతా వందనాదేవిపై పడ్డది. అక్కడ చదువుకుంటూన్న విద్యార్థుల భోజనాదికాలు అన్నీ పర్యవేక్షించవలె. ఆ రాత్రి ఆమెకు కన్నుమూయ టానికికూడా సమయం చిక్కలేదు. బాగా అలసిపోయింది.

మరునాడు సాయంత్రం విప్రదాసు సంధ్యాపూజ ముగించుకుని భోజనం చేశాడు. వందనాదేవి తన పనిపాటలు ముగించుకుని పైకి వచ్చింది. విప్రదాసు మంచం దగ్గిరగా ఒక కుర్చీలాక్కుని కూచుంది. "ఒకటి అడుగుతాను. దాచకండా చెబుతారా?" అని అడిగింది.

"అడుగు"

"మా అక్కయ్యను మీరునిజంగా ప్రేమిస్తున్నారా? చిన్న తనం లోనే ఎప్పుడో మీ వివాహం అయింది. అందుకు మీరు విచార పడటం లేదా?"

విప్రదాసు ఆశ్చర్యపోయాడు. ఆమె అలా అడుగుతుందని అతడు కలలోకూడా అనుకోలేదు. మెల్లిగా నవ్వి - "ఆ ప్రశ్న మీ అక్కయ్యనే అడిగితే సబబుగా ఉంటుంది. -" అన్నాడు.

"మా అక్కయ్యకు మాత్రం ఎలా తెలుస్తుంది. మీ మనసులో మాట ఎవరికీ తెలియదుటగా! చెప్పటానికి ఇష్టంలేకపోతే.... పోనీ చెప్ప కండి. ఏ ఉపాయంచేతనైనా నేనే కనిపెడతాను. చెప్పదలిస్తేమాత్రం సత్యం చెప్పండి సుమీ!"

"నిజమేచెబుతాను. కాని నీకెందుకు నామీద అంత అనుమానం?"

"అనుమానమే మరి? మీరు అసాధారణ వ్యక్తులు. సాధారణులు గానే కనిపిస్తూంటారు మళ్ళీ. అందరితోకలిసి మెలిసి ఉంటారు; అందరికీ అతీతులల్లే కనిపిస్తారు."

"నా భార్యను ప్రేమించటం నాధర్మం. వందనా!"

"ధర్మాన్నిమించి ఈ ప్రపంచంలో మరేవస్తువూ లేదా?"

"ఉన్నట్టు నాకు కనిపించటం లేదు"

"ఉన్నది, నాకు కనిపిస్తున్నది. చెప్పమంటారా విపిన్‌బాబూ!"

విప్రదాసు ముఖంలో....ఆ యెరుపంతా ఏమయిందో....నెత్తురు చుక్కలేదు. చేతులు అడ్డంచాచి-"వద్దు వందనా! ఒక్కమాటకూడా చెప్పద్దు. ఇప్పటికి ఇకవెళ్ళిపో. రేపుగాని, ఎల్లుండిగాని....నీమనస్సు శాంత పడిన తరువాత.... ఆలోచించగల శక్తిచేకూరిన తరువాత....ఈ విష యాన్నిగురించి మాటాడుకుందాం. నీ పెత్తల్లి గారింట్లో సమకూడిన.... నీకు విపరీతంగా కనిపించేప్రవర్తనగల....వారే కాదు; ఇంకాకొందరు.... ధర్మమే ప్రధానమైనదిగా అంగీకరించేవారు కూడా ఈ ప్రపంచంలో ఉన్నా రని నీకే తెలుస్తుంది ముందు ముందు. అయినా ఇప్పుడు తర్కించే సమయం కాదు. వెళ్లు" అన్నాడు.

అనవహేళనీయమైన అతని ఆజ్ఞానుసారం వందనాదేవి లేచి వెళ్ళి పోయింది. అతని ఆజ్ఞలో ఏదో అనిర్వచనీయమైన శక్తి ఉంది. అందు కనే ఇంట్లో అతడంటే అందరికీ భయం.

## 19

మర్నాడు మూడుగంట లప్పుడు వందనాదేవి వచ్చి "విపిన్ బాబూ! నేను పెద్దమ్మగారింటికి మళ్ళీ వెడుతున్నాను. ఆమె నన్ను బొంబాయి ప్రయాణంచేసి పంపించేంతవరకూ అక్కడే ఉండాలి"

"అంటే?"

"అంటే— నాన్న దగ్గిరనించి అర్జంటు టెలిగ్రాం వచ్చింది. రేపు ఉదయమే పెద్దమ్మ నాకోసం బండీ పంపిస్తుంది"

"అంటే— బదులు తీర్చుకోవాలన్న రోషావేశం మీ పెత్తల్లిలో ఉన్నదన్నమాట ఆమె ఉత్తరం రాసి ఉంటుంది. దానికి ఈ టెలిగ్రాం జవాబు కావచ్చు. ఏదీ చూపించు"

"ఉహుం. మీకు చూపించను"

విప్రదాసు చిన్నబుచ్చుకున్నాడు. కాని వెంటనే మందహాసం తెచ్చుకుని — "భగవంతుడు మానవుని గర్వాన్ని అణుచేవరకూ ఊరు కోడు నామీద ఎవరూ నిందమోపలేరు.... అని గర్విస్తూ ఉంటాను. కాని ఇప్పుడు తెలిసి పోయింది: నన్ను నిందించేవాళ్ళుకూడా వున్నారని. మీ పెత్తల్లి నామీద ఎంతలావు అభియోగం మోపిందో చూస్తాను. ఏదీ?"- అంటూ చెయి చాచాడు.

వందనాదేవి టెలిగ్రాం కాగితం అందించింది. టెలిగ్రాంలో అనా ధరాయి చాలవాక్యాలు రాశాడు. విప్రదాసు ఆదినించి కడదాకా చదివి తిరిగి ఇచ్చివేశాడు. "ఇందులో మీనాన్న అనుచితమైన మాట ఏమీ రాయలేదు. ఔను విస్వార్థమైన పరోపకారంలో ఆపత్తు ఉంది. ఆత్మీ యులు అస్వస్థులై యున్నప్పుడు వారికి ఉపచారం చేసేందుకు వెళ్ళటం ప్రపంచంలో ఎబ్బెరికమైన పనే"

"మా పెద్దమ్మగారింటికి వెళ్ళిపొమ్మనేనా మీ అభిప్రాయంకూడా?"

"మీ నాన్నగారు అలాగే ఆజ్ఞాపిస్తున్నారు. నాదేమున్నది? విప్ర దాసు ఆజ్ఞ బలరామపురంలోని ముఖర్జీ పరివారంలో మాత్రమే. నిన్ను ఆజ్ఞపెట్టుటకు నీ పెత్తల్లిని కాదుగదా! మీ నాన్నగారిద్వారా ఆమె ఆజ్ఞ పంపింది. నువు మన్నించక తప్పదు మరి!"

"మానాన్న ఎక్కడో బొంబాయిలో ఉన్నారు. ఇక్కడి సంగ తులు ఆయనకు తెలియవు. ఆయన ఆజ్ఞ న్యాయమో, అన్యాయమో తెలుసు కోకండా గుడ్డిగా అనుసరించ వలసిందేనా? మా పెత్తల్లిగారింటి వ్యవ హారాలు మీకు తెలుసు కదా!"

"నాకేమి తెలుసు? నువు చెప్పావు.... అది మంచిస్థలం కాదని. నేను కులాసాగా ఉంటే.... నేనే స్వయంగా వచ్చి నిన్ను బొంబాయిలో దిగబెట్టి వచ్చేవాడిని కాని ఇంకా నీరసం వదలలేదు నాకు"

"మరి ఇలాంటి స్థితిలో మిమ్మల్ని విడిచి ఎలావెళ్ళను విపిన్ బాబూ! మా పెత్తల్లి సంగతి తెలిసివుండికూడా ఆమె మాయలో చిక్కుకోనా?"

"గత్యంతరం ఏమిటీ?"

"నేను వెళ్ళను"

"అలాగని మీ నాన్నగారికి టెలిగ్రాం ఇవ్వు. కాని నిన్ను తీసుకుపోయేందుకు మీ పెత్తల్లి వస్తుంది. ఆమెకు ఏమి చెబుతావు?"

"రానని చెప్పేస్తాను"

"అంతమాత్రాన ఆమె ఊరుకుంటుందా? ఈ సారి బలరామపురంలో మా అమ్మగారికికూడా టెలిగ్రాం ఇస్తుంది"

వందనాదేవి గాభరా పడ్డది. "ఔను, విపిన్‌బాబు! ఆమె అంత పనీ చెయ్యగలదు. ఇదివరకే చేసిందేమో కూడాను. అయినా ఆమెకింత పట్టుదల దేనికో! మీ రేమన్నా ఊహించగలరా?"

"ఊహించటం కష్టమే. కాని ఇందులో ఆమెకేదో స్వార్థం లేక పోదు. ఆమె మనసులో ఏదోఉండి ఉండాలని నాకు తోస్తున్నది"

"ఏ మున్నదో నాకు తెలుసు. బారిస్టరు పరీక్ష ప్యాసై ఆమె మేనల్లుడు వచ్చాడు. నా కాతడు యోగ్యవరుడని ఆమె విశ్వాసం. ఎందుకంటే - మా నాన్నకు నేను ఒక్కతెనేగా! మేనల్లుడు ప్రాక్టీసుపెట్టి సంపాదించినా, సంపాదించక పోయినా నా పిత్రార్జితంతో హాయిగా బ్రతుకుతాడు."

"మేనల్లుడి కళ్యాణం కోరటంలో తప్పేమీలేదు. ఎలా వుంటాడు వరుడు?"

"బాగానే ఉంటాడు"

"నాలాగ ఉంటాడా?"

"చాల అహంకారంగా మాటాడారే! మీలాటి అందగాళ్ళు ప్రపంచంలోనే లేరని కామాలు మీరనుకోటం. కాని పెళ్ళికొడుకు అందంగా ఉండాలని కోరుకునే ఆడపిల్లలు అజన్మ బ్రహ్మచారిణులుగానే ఉండిపోవలసివస్తుంది. అశోకబాబు అందంగానే ఉంటాడు. లోటుపాట్లు వెదకటం బాగుండదు"

"అయితే నీ కాతడు నచ్చాడన్నమాట! ఔనా?"

"ఒకవేళ నేనతన్ని వరించినా, వరించదగని వాడు మాత్రం కాదు లెండి" అంటూ వందనాదేవినవ్వి–"అయిదుగంట లయింది. మీరు బార్లీ గంజి తాగేవేళ, వెళ్ళి పట్టుకువస్తాను. ఈ లోగా అశోకబాబును గురించి ఇంకా ఆలోచిస్తూ ఉండండి" అని వెళ్ళిపోయింది. అయిదు నిమిషాల తరువాత బార్లీగంజి బాగా చల్లార్చి తీసుకువచ్చింది. నిమ్మకాయల రసం కూడా తెచ్చింది. "ఇవన్నీ మీరు తప్పక పుచ్చుకోవాలి. ఏమాత్రం పరిహరించినా నేను ఒప్పుకోను."

"భయపెట్టి తాగిస్తున్నావు. ఇంత అత్యాచారమా మరీను?" అంటూ విప్రదాసు అవి తాగేశాడు. ఖాళీగిన్నెలను తీసుకుపోతూ- "నేనొకటి అడుగుతాను చెబుతారా? విపిన్‌బాబూ!" అని అడిగింది వందనాదేవి.

"ఏమిటది?"

"ఈ ప్రపంచంలో మిమ్మల్ని అధికంగా ప్రేమిస్తున్నవ్యక్తి ఎవరో చెప్పండి"

"వందనాదేవి"

అది వినగానే వందనాదేవి కన్నుల్లో నల్లగుడ్లు విపరీతంగా చలించినవి. గబగబా వెళ్ళిపోయింది.

మరి పావుగంటకు ఆమె మళ్ళీ వచ్చింది. విప్రదాసు మంచందగ్గరకు కుర్చీ లాక్కొని కూచుంది.

"అలా పరుగుపెట్టి పారిపోయావేం?" అని అడిగాడు విప్రదాసు నవ్వుతూ.

వందనాదేవి వెంటనే జవాబు చెప్పలేకపోయింది. మెల్లిగా మాట తెచ్చుకుని ఇలా చెప్పింది–"మీ మాట ఎందువల్లనో నేను సహించలేకపోయాను. నా దొంగతనం ఏదో మీరు పట్టేసి నట్టనిపించింది"

"అందుచేత నేనా ఇప్పటికీ ముఖం ఎత్తి చూడలేక పోతున్నావు?"

"ఎందుకు చూడలేను" అంటూ బలవంతాన ముఖం ఎత్తింది. నవ్వింది. కాని సిగ్గుతో ఆమె ముఖ మంతా ఎర్రబడి పోయింది. నెమ్మదిగా తన్ను తాను సంబాళించుకుంది. "మీ రాసంగతి ఎలా కనిపెట్టారో కాస్త చెప్పండి"

"అంతమాత్రం తెలుసుకోలేననుకుంటావా? ఇంతవరకూ ఆవిషయంలో నాకేమైనా సందేహం ఉంటే....అది ఇప్పుడు నీముఖలక్షణాలు చూస్తోంటే నివృత్తి అయిపోయింది"

వందనాదేవి మళ్ళీ తలవంచుకుంది. విప్రదాసు అన్నాడు—" అలా చిన్నపుచ్చుకోకు వందనా ? ఏదీ, తలెత్తి చూడు. నువు సిగ్గుపడవలసిన పని యేమీ చెయ్యలేదు. నా సమక్షంలో నీకు సిగ్గెందుకు ? ఇదిగో, ఇటు చూడు, నామాట విను."

అది విప్రదాసు ఆజ్ఞ! వందనాదేవి ముఖం ఎత్తింది. " మీకు నా మీద కోపం వచ్చిందికాదూ! విపిన్ బాబూ!"

విప్రదాసు మందహాసం చేశాడు. " నాకు కోపం లవలేశం లేదు. ఎందుకూ కోపం ? ఏ నాటికైనా ఈ నీ పొరపాటు నీకే తెలిసి వస్తుందని నా ఆశ "

" ఎప్పటికీ తెలిసిరాకపోతే ? ఇది పొరపాటని నాకుతట్టకనేపోతే ?"

" తప్పకుండా తెలుసుకుంటావు. అందువల్ల ఎన్ని అనర్థాలున్నాయో నువు తెలుసుకోలేకపోతే .... నువు నిజంగా నన్ను ప్రేమిస్తున్నట్టు కానేకాదు. సుధీర్‌ను ప్రేమిస్తున్నానని భ్రాంతి పడ్డావుకాదూ! ఇప్పుడు నన్ను ప్రేమిస్తూన్న విషయంకూడా ఒక భ్రాంతిమాత్రమే "

" వందనాదేవి ముఖం ఎరుపువన్నెకు తిరిగింది. వ్యధిత కంఠ స్వరాన ఆమె ఇలా అన్నది- " ఇందుమూలాన అనర్థాలున్నాయని మీరన్నమాట ఒప్పుకుంటాను అది అమంగళకరమైనదే, అంతమాత్రాన నాప్రేమ అసత్యమైనదని నేను ఒప్పుకోను. అది అసత్యమే అయితే ఇంతగానేను మీ ప్రేమను చూరగొనగలిగే దాన్నేనా ? చూరగొన లేదంటారా ? "

ప్రశ్న ముగించి వందనాదేవి తలయెత్తి అతనిముఖంలోకి చూచింది.

" చూరగొన్నావు వందనా! నాప్రేమ నువు చాలభాగం అపహరించావు. లేకపోతే నీ చేతిమీదుగా నేను భోజనం చేస్తానా ? ఇంతగా నీ సేవ స్వీకరిస్తానా ? ఈ ప్రేమను పురస్కరించుకుని, అధర్మమార్గానపడి, నిన్ను అధఃపతితను చేస్తానా ? నామూలాన ఉన్నతికి రావలసిన వ్యక్తిని నాతోపాటుగా పాతాళానికి కృంగదీసుకుపోతానా ? ఏం వందనా ? నువు సూచించేమార్గం అదేనా ? "

" అయితే మీలో ప్రేమ లేదన్నమాట! మీరు 'ప్రేమ' అనుకుంటూన్నది కేవలం నేతి బీరకాయవంటిది. ధర్మం ఏమిటో అధర్మం ఏమిటో ఎవరు విర్ణయించగలరు ? అయినా ఈ విషేధాలన్నీ మీరు పాటించగలరేమో! నేను పాటించలేను "- అన్నది వందనాదేవి ఉత్తేజితయై.

"నువు పాటించలేకపోవచ్చు. నేను పాటిస్తాను. ధర్మము నిషేధించిన మార్గాన నేను అడుగుపెట్టను. నువు చాల ఆంగ్లగ్రంథాలు చదివావు. మీపెత్తల్లిగారింటిలోవరె నాగరిక సంఘాలలో తిరిగావు. ఆ సంస్కారాలన్నీ చప్పున వదలిపోవు."

"మీరు పరిహాసంగా మాటాడుతున్నారు. నేను మాటాడే మాటలు ఎగతాళికాదు. నాగుండెలో మాట చెప్పాను"

"ఈ పిచ్చి నీ కెవరు ఎక్కించారు?"

"మీరే"

"నేనా? నిన్నీ అధర్మమార్గంలో పెట్టింది నేనా?"

"మీరే. మీకు తెలియకపోవచ్చు. కాని మీరే చేశారు ఇంతపనీ"

విప్రదాసు ఆశ్చర్యాన్వితుడై ఆమెకేసిచూస్తూ ఉండిపోయాడు. నోటమాట రాలేదు.

"తమరు 'అధర్మ'మని చెబుతున్నది నిజంగా 'అధర్మమే' నని నేను ఒప్పుకోలేక పోతున్నాను. మీరు 'ధర్మ'మని విశ్వసిస్తున్నది కేవలం మీ సంస్కారం....అత్యంత దృఢమైన సంస్కారం అయి వుంటుంది. మీరు 'ధర్మ' మనుకుంటూన్నది ఆ 'అధర్మ' మనబడే దాని కన్నా ఉత్కృష్టమైనది కాదు" — అన్నది వందన.

"ఔను, కావచ్చు. నువు అన్నట్టు అది నా దృఢసంస్కారమే. కాని మానవధర్మము సంస్కార రూపాన మానవునిలో ప్రవేశించినప్పుడు అతని కర్తవ్యం సులభంగా సూచిత మౌతుంది: ఇక్కట్లు, ఇబ్బందులు లేకండా జీవితం ప్రశాంతనదీప్రవాహంలా సాగిపోతుంది. బుద్ధి శాంతంగా స్థిరంగా ఉంటుంది. ఈ సంగతే నీ కొకసారి చెప్పాను. అదే నాధర్మం. దాన్ని నేను త్యజించలేను. నేను మారను"

"ఎప్పటికీ మీలో మార్పురాదంటారా విపిన్ బాబూ!"

"నేనుమారగలనని నాకు తోచటం లేదు"

వందనాదేవి కన్నులు చెమరించినవి. విప్రదాసు ఇంకా ఇలా అన్నాడు - "అయినా నేను మారవలసిన అవసరం ఏముందీ? నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ ప్రేమ నాగుండెల్లో వెన్నెల కాస్తున్నది. ఈ ప్రేమనాకు దుఃఖసమయాల్లో ఓదార్పు ప్రసాదిస్తుంది. దుర్బలుడినైనప్పుడు బలాన్ని చేకూరుస్తుంది. ఈ ప్రేమను నేను ఒక్కడినే ఒంటరిగా మోయలేననిపించినప్పుడు నీకోసం కబురుచేస్తాను. నువురావా?"

వందనాదేవి కన్నీళ్ళు తుడుచుకుంది. "రాగలశక్తినాలో వుంటే వస్తాను. అప్పటికి మార్గం నిష్కంటకంగా వుంటే వస్తాను. లేకపోతే రాలేనేమో ?"

"మార్గం నిష్కంటకంగా వున్నా నువు అభిమానపడి రావేమో!"

వందనాదేవి మళ్ళీ కన్నీళ్ళు తుడుచుకుంది. "మీకొకసంగతి చెప్పాలి విపిన్‌బాబూ ! ఈ నాస్థితి మీరు ఎవరికీ తెలియజేయ వద్దని నా ప్రార్థన"

ఎవరికీ చెప్పను. నాగుండెలో మాట ఎవరికీ చెప్పనన నీకు తెలిసిన సంగతేగా !"

"ఔను"

కాసేపటి వరకూ ఎవరూ మాటాడలేదు. చివరకు —

"ఈ విశాల ప్రపంచంలో 'నేనుఒంటరిగాణ్ణి' అని నువు ఎలా కనిపెట్టావు వందనా ?"

"ఎలా కనిపెట్టానో నాకే తెలియదు. ఆనాడు బలరామ పురంలో నాకు కోపంవచ్చి భోజనం చెయ్యకండా బయలుదేరి వచ్చేశాను. మీరు కూడా మాతో వచ్చారు. స్టేషన్‌లో తప్పతాగిన రైల్వే ఉద్యోగుల మూలాన్ని ఎంతకాండ జరిగిందో మీకు జ్ఞాపకం ఉందిగా ! ఎటువంటి బాధ్యతనైనా మీరు వెరపులేక ఒక్కరే మొయ్యగల శక్తిమంతులని నాకు అర్థమైంది. మామూలు మానవశ్రేణికి మీరు అతీతులని తెలుసుకున్నాను. ద్విజబాబు కూడా మిమ్మల్నిగూర్చి అలాగే చెప్పాడు. మీరు ఇతర్లనించి ఏమీ ప్రతిఫలం ఎన్నడూ ఆశించరు. నాటిరాత్రి పడుకుంటే నిద్రపట్టలేదు. ఆలోచనలన్నీ మిమ్మల్ని గురించే. తెల్లవారుఝామున లేచి చూస్తే మీరు పూజా గృహంలో ధ్యానమగ్నులై ఉన్నారు. అలాగే చాలసేపు చూస్తూ నిల్చున్నాను. ఎవరైనా నౌకర్లు వస్తారేమోనని చివరకు తిరిగివచ్చి నా గదిలో పడుకున్నాను. నాటినించీ.... ధ్యానవిష్ఠలో ఉండిన ఆ మీమూర్తి నాకు మరపురాదు. కన్నులుమూస్తే అదేమూర్తి గోచర మౌతున్నది"

విప్రదాసు మందహాసం చేశాడు. "ఏమిటీ ? నేను భగవద్ధ్యానంలో ఉండగా నువు చూశావా ?"

"పూజ చేసుకుంటూఉంటే మీ అమ్మగారినికూడా చాలసార్లు చూశాను. కాని మీ పూజకూ, ఆమె పూజకూ భేదంఉంది. మీరు ఎవర్ని ధ్యానిస్తారు విపిన్‌బాబూ !"

విప్రదాసు మళ్ళీ మందహాసం చేశాడు. "ఎవర్ని ధ్యానిస్తానో తెలుసుకుని నువు ఏమిచేస్తావు? అలా నువుకూడా చెయ్యటానికి వీల్లేదు"

"వీల్లేకపోతే పోనీయండి. చెప్పకూడదూ?"

విప్రదాసు మాటాడలేదు.

"ఆనాడే నాకు అర్ధమైంది.... మీరు మా అందరితో కలసివుంటూ కూడా మాకు అతీతులని. ఇతరు లెవరూ స్పృశించలేని ఉన్నతస్థాయిలో మీరు ఉన్నారు. అక్కడ మీరు ఒక్కరే. మీకు తోడు ఎవరూలేరు. ఒక మాట అడగనా విపిన్‌బాబూ!"

"అడుగు"

"ఇప్పుడు మీకిక స్త్రీ ప్రేమ బడయవలసిన ఆవశ్యకత లేదను కుంటాను. ఔనా?"

"అంటే?"

"అంటే యేమిటో నాకే తెలియటంలేదు. విపిన్‌బాబూ! నేనడిగిన ప్రశ్న తుచ్ఛమైనదిగా భావిస్తున్నారు కాదూ?"

విప్రదాసు మాటాడలేదు. కేవలం ఆమెకేసి చూస్తూ కూచున్నాడు. ఇంతలో—

వీధిలో బండి ఆగిన చప్పుడైంది. మరి కాసేపటికి ద్విజదాసు కంఠస్వరం వినిపించింది. అన్నపూర్ణ వచ్చి "ద్విజు వచ్చాడు విపిన్ బాబూ!" అని చెప్పింది.

"ఒక్కడేనా? ఇంకెవరన్నా కూడా వచ్చారా?"

"ఒక్కడే వచ్చినట్టుంది"

వందనాదేవి విచలిత అయింది. "వెడతాను విపిన్‌బాబూ! ద్విజ బాబుకు భోజన పానాదుల యేర్పాట్లు చూస్తాను"- అంటూ ఆమె వెళ్ళిపోయింది.

* * *

మర్నాడు ఉదయం. ద్విజదాసువచ్చి అన్నగారికి పాదాభివందనం చేశాడు. వందనాదేవి ఆగదిలోనే పూజాసామగ్రితెచ్చి ఎక్కడి వక్కడ ఏర్పరుస్తోంది.

"చెరువు త్రవ్వించేందుకు రేపు పంచమి ముహూర్తం నిర్ణయించింది అమ్మ. పెద్ద వుత్సవం జరుగుతుంది అన్నయ్యా!" అన్నాడు ద్విజబాబు.

"అమ్మ తలపెట్టిన కార్యాలన్నీ ఉత్సవాల్లాగే జరుగుతాయి. అందుకు విచారపడవలసిన అవసరం ఏముందిరా ద్విజూ!" అంటూ విప్రదాసు నవ్వాడు.

"ఈసారి నీకు సుస్తీ నయం కావాలని ఆమె మ్రొక్కుకుంది. అందుకుకూడా ఒక అశ్వమేధయజ్ఞమంత ఉత్సవం జరుగనున్నది. సన్మానింపవలసిన పండితుల లిస్టు తయారౌతున్నది. బంధువులు, మిత్రులు, అతిధులు—విందులు కుడిచేవారి జాబితా చదివి వినిపించింది వదినె. ఈ దెబ్బతో చాలమంది బొర్రలు పెరుగుతాయి. నీడబ్బు ఖర్చు అయిపోక తప్పదు. తీరికవుంటే నువుకూడా బయలుదేరి రావాలి"

వందనాదేవి ముఖంతిప్పి ఆ యన్నదమ్ములకేసి చూడలేదు. కాని పకపకా నవ్వేసింది. విప్రదాసు విషయాసక్తుడు, లోభి అన్నభావం ద్విజు మాటల్లో ప్రకట మైందిగామరి!

విప్రదాసు కూడా నవ్వాడు. "ఈసారి ఖర్చు అయేది నీ డబ్బే తెలుసునా?" అన్నాడు.

"నా డబ్బా! అయినా నాకేమీ విచారం లేదులెండి. కాని కార్యక్రమం మాత్రం మార్చవలసివుంటుంది. సంస్కృత పండితులను సన్మానించటం నా కిష్టంలేదు. వస్తే వాళ్ళను వెళ్ళగొట్టేస్తాను."

"సంస్కృత పండితులంటే నీ కెందు కంతకోపం? వాళ్ళను నిందిస్తూండే నవనాగరికులమాటలు మాత్రమే నువు విన్నావు. కాని సంస్కృత పండితులను నువు చూచిందిలేదు; వారితో ప్రసంగించినది లేదు. వాళ్ళంటే అభిమానంగల నన్నుకూడా నువు వెళ్ళగొట్టేస్తావన్న మాట!" అంటూ విప్రదాసు నవ్వాడు.

మరి కాసేపటి వరకూ ఎవరూ మాటాడలేదు. చివరకు - "నేను చాలా జబ్బుపడ్డానని అమ్మకు తెలియలేదు కద!" అన్నాడు విప్రదాసు తమ్ముని కేసి తిరిగి.

"తెలిస్తే బాగానేవుండేది. ఈఉత్సవం ఇప్పుడు ఆరంభించేదేకాదు"

"బంధువు లందరికీ ఆహ్వానాలు వెళ్ళాయా?"

"భూత - భవిష్యద్వర్తమాన బంధువుల కందరకూ ఆహ్వానాలు వెళ్ళాయి. అక్షయబాబునూ, ఆయన కూతుర్నీకూడా తీసుకురమ్మని నన్ను ఆజ్ఞాపించింది అమ్మ. ఈ సారి మైత్రేయి అగ్ని పరీక్షకు నిలువవలసి వస్తుంది, తప్పదు"

"ఇంకెవరినైనా తీసుకు రమ్మన్నదా అమ్మ?"

"అన్నపూర్ణ అక్కయ్యనుకూడా తీసుకు రమ్మన్నది. ఇక్కడి విద్యార్థు లెవరేనా వచ్చేట్టయితే వెంటబెట్టుకు రమ్మన్నది"

"మీ వదినె ఏమీ కబురు చెప్పలేదూ?"

"లేదు"

ఇంతలో కింద మోటారు ఆగిన చప్పుడైంది. వందనాదేవి కిటికీలోవించి చూచింది. అది ఆమె పెత్తల్లిగారి మోటారు.

"నేను వెళ్ళి మాటాడతాను; మీరు పూజకానీయండి; ఆలస్య మౌతున్నది" అని చెప్పి వందనాదేవి వెళ్ళిపోయింది.

"నేనూ స్నానంచేసి ఒక అరగంట అయాక మళ్ళీ వస్తాను" అంటూ ద్విజదాసుకూడా వెళ్ళిపోయాడు.

విప్రదాసు పూజ ముగించుకున్నాడు. అన్నపూర్ణ పళ్ళు తీసుకు వచ్చి విప్రదాసుకు ఇచ్చింది ఫలహారం నిమిత్తం. వందనాదేవిని తీసుకు పోవటానికి పెత్తల్లిగారింటినించి ఎవరో అమ్మాయి వచ్చిందనీ, వందనాదేవి వ్యస్తచిత్తయై ఉన్నదనీ అన్నపూర్ణ కబురుచెప్పింది.

మరి కాసేపటికి ద్విజదాసువచ్చాడు. ఉత్సవంనిమిత్తం కలకత్తాలో ఖరీదుచేసి బలరామపురం తీసుకు పోవలసిన వస్తువుల జాబితా ఒకటి ద్విజదాసు చేతిలోఉంది. అన్నదమ్ము లిద్దరూ అది పర్యవేక్షిస్తున్నారు.

"విపిన్‌బాబూ! నేను లోనికి రావచ్చునా? నా కాళ్ళకు చెప్పులు ఉన్నాయి" అంటూ బైటినుంచి మాటలు వినిపించాయి.

"చెప్పులా? ఉంటే ఫరవాలేదు. రా"

వందనాదేవి లోనికివచ్చింది. ప్రప్రథమంలో బలరామపురం వచ్చిన నాటివేషంలో ఉంది. విప్రదాసు ఆశ్చర్యాన్వితుడైనాడు. "ఎక్కడికి ప్రయాణమైనావు వందనా?"

"మా పెద్దమ్మగారింటికి వెడుతున్నాను"

"మళ్ళీ ఎప్పుడు వస్తావు?"

"చెప్పలేను విపిన్‌బాబూ!" అంటూ ఆమె వంగి విప్రదాసుకు పాదాభివందనం చేసింది. కాని అతని పాదాల్ని స్పృశింపలేదు. తల వంచుకునే, దూరంనించే ఫాలభాగాన చేతులు జోడించి ద్విజబాబుకుకూడా నమస్కారంచేసి, గది విడిచి వెళ్ళిపోయింది.

# 20

"వందనాదేవి అకస్మాత్తుగా వెళ్ళిపోయిందేం? నే నిక్కడికి రావటం వల్లనా?" అని అడిగాడు ద్విజదాసు.

"ఎబ్బే, కాదు. బొంబాయికి తిరిగి ప్రయాణమై వచ్చేంతవరకూ మీ పెత్తల్లి గారింట్లోనే వుండమని వాళ్ళ నాన్న తంతి పంపాడు."

"ఈ పెత్తల్లి ఎక్కడినించి ఊడిపడిందబ్బా! ఈసారి నేను వచ్చినప్పటినించీ వందనాదేవి మాటాడనేలేదు. దాగి, దాగి తిరిగింది. ఇవాళ తెల్లవారేసరికే వెళ్ళిపోయింది. వెడుతూ ఒక నమస్కారం పారేసింది. కాని నా ముఖంకేసి చూడనన్నా లేదే. నా మీద ఆమె కెందుకంత కోపం?"

విప్రదాసు ఆప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేదు. అన్నాడు. "నేను జ్వరంవచ్చి పడివుంటే అన్నపూర్ణ వెళ్ళి ఆమెను తీసుకు వచ్చింది....నాకు కాస్త ఉపచారం చేస్తుందని. వొళ్లు దాచుకోకుండా పాపం ఆమె నాకు ఎంతో సేవచేసింది. మీ రామెయెడ కృతజ్ఞులై వుండటం ఉచితం"

"ఉచితం కాదని నేనటంలేదు. కాని మేము లేకపోవటంచేత నిన్ను సేవించగల అవకాశం లభించటం ఆమెకు పరమ సౌభాగ్యమే. నిన్ను సేవించి తత్ఫలితం పొందగలిగినందుకు ఆమె కూడా మా యెడల కృతజ్ఞురాలై ఉండవలసిందే.

విప్రదాసు నవ్వాడు. "నువు వట్టి దుర్మార్గుడివిరా"

"అయితే కావచ్చు. కాని వెర్రిపుల్లాయను మాత్రం కాదుకదా! ఆమె నీకు అంతగా ఉపచారంచేసిన సంగతి అమ్మకు తెలిస్తే ఆమె వందనాదేవిని ఎంత ఆదరిస్తుంది! ఆమె ఆదరణ పొందటం గొప్ప సంగతి కాదూ?"

విప్రదాసు మళ్ళీ నవ్వాడు. "ఇన్నాళ్ళకు నీవు అమ్మ సంగతి తెలుసుకున్నా వన్నమాట! ఏం?"

" ఒకవేళ నేను తెలుసుకున్నా.... ఆ సంగతి నీ మనసులో మాత్రమే ఉంచుకో. ఇన్నాళ్ళనించీ ఆమె దృష్టిలో నేనొక కుపుత్రుణ్ణి; కులపాంస నుణ్ణి. ఆమెను అలాగే అనుకుంటూ ఉండనీ. ఆమె అభిప్రాయం మార్చ వలసిన అవసరంలేదు "

" ఏం ? అమ్మచేత మంచివా డనిపించుకోటం.... ఆమె వాత్సల్యా నికి పాత్రుడు కావటం నీకిష్టంలేదా ? ఎందుకూ నీకంత అభిమానం ? దాని వల్ల లాభం ఏమిటి ? "

" లాభం ఏమిటో నాకు తెలియదు. కాని నాకు అటువంటి లోభం మాత్రం అంతగాలేదు. నీకు నామీద ప్రేమ ఉంది. మా వదినెకు నా మీద వాత్సల్యంఉంది. నా కదిచాలు. అదే నాకు సప్తద్వీప సామ్రాజ్యం. " అని పలుకుతూన్న ద్విజబాబు ముఖం లజ్జారుణమైంది. హృదయావేశాల్ని వ్యక్తంచేసే అలవాటు అతనికిలేదు. ఎప్పుడూ ఏదో నిస్పృహతో ఉండే మనిషి. అందుచేత వెంటనే విషయంమార్చి అడిగాడు—" వందనాదేవి హఠాత్తుగా వెళ్ళిపోయింది. ఏదో కోపంవచ్చినట్టు నాకు అనుమానంగా ఉంది. సంగతేమిటో నువుచెప్పాలి. "

" నువు వచ్చావు కాబట్టి ఇక తానిక్కడఉండి నన్ను సేవించవల సిన అవసరం లేదనుకొని వెళ్ళిపోయింది కాబోలు. ఇక నన్ను సేవించి శుశ్రూష చేయవలసిన బాధ్యత నీపై పడ్డది. " అంటూ విప్రదాసు నవ్వాడు.

" నువు పరిహాసంగా మాటాడుతున్నావు. ఆంగ్లేయ ఫేషన్లలో మునిగితేలే ఇలాంటి ఆడపిల్లలు కేవలం డాంబికంతో ఏడుస్తూంటారు. నీకు జ్వరంరావటం, నేను ఉపచారం చేయటం.... అటువంటి అవసరం ఈ జన్మలో రాకుండుగాక ! కాని అట్టి పరిస్థితే వచ్చిందంటే మా అన్న య్యను సేవించటంలో ఈ ద్విజబాబును ఓడించగలశక్తి పదిమంది 'వందన' లకు కూడా లేదు. అని ఆమెకు తెలియజెప్పాలి. "

స్నేహ పిచ్ఛిలమైన మందహాసం చేశాడు విప్రదాసు. " చెబు తాను. కాని ఆమె ఒప్పుకుంటుందో, లేదో నాకైతే తెలియదు. నిన్ను పరీక్షించవలసిన ఆవశ్యకత నాకేమీ లేదు. కాని అమ్మకు మాత్రం నీ మీద విశ్వాసం కుదిరేలాగు నీప్రవర్తన మారాలి. ఆమె పరీక్షకు నువు ఆగాలి. తెలిసిందా ? "

" ఊహుఁ. తెలియలేదన్నయ్యా ! ఏనాటికైనా అమ్మచేత నేను మంచివాడి ననిపించుకో గలనేమోలే. కాని ఇప్పుడే నే నామె పరీక్షకు

అగవలసిన అవసరం ఏమంత వచ్చిందీ ?" అని కాసేపు ఊరుకుని "నా అదృష్టం ఏమిటో....నాకథ అంతా అడ్డంగానేఉంది. నాన్నగారు నాకు జన్మ యిచ్చారు. కాని నాకు ఒక్క పైసా ఆస్తి యిచ్చిపోలేదు. ఏమైనా ఇస్తే నువ్వే యిచ్చావు. అమ్మ నన్ను నవమాసాలు మోసింది, కాని నన్ను పెంచింది అన్నపూర్ణ అక్కయ్య. తరువాత భారమంతా నెత్తిమీద వేసుకుని నన్ను పెద్దవాణ్ణి చేసింది మా వదినె. ఈ యిద్దరూ పరాయి ఇంటి నించి వచ్చినవారే. అటువంటప్పుడు 'పితాస్వర్గ పితాధర్మః ఏవం స్వర్గాదపి గరీయసీ' అన్నశ్లోకం నెమరువేస్తూ మనస్సును ఎలా సమాధానం చెప్పుకోమంటావు. నువ్వే చెప్పు అన్నయ్యా!"

"అమ్మ తరఫున నేనిప్పుడు వకాల్తా పుచ్చుకుని వాదించను. ఆమె మనస్సు ఎటువంటిదో ఎప్పటికైనా నీకే తెలుస్తుంది. కాని నాన్నగారిని గురించి నువు పొరపాటు పడ్డావు. మన ఆస్తిలో సగానికి నువు అధికారివి. అందులో సందేహంలేదు."

"సందేహం లేకపోవచ్చు. కాని నాన్నగారు మరణించిన తరువాత నువు విల్లునామా తగులబెట్టావుకాదూ!"

"అలాగని నీకెవరు చెప్పారు?"

"ఇన్నాళ్ళనించీ అన్ని వైపులనించీ నన్ను రక్షిస్తూవచ్చిన వదినె నోటినించే విన్నాను ఆమాట."

"తగులబెడితే తగులబెట్టానేమో! మీవదినె ఆ విల్లును చదువలేదు. నాన్నగారు సర్వసంపత్తి నీకే యిచ్చారు; నాకది నచ్చక తగులబెట్టేశాను; అలాగని నువ్వెందు కనుకోకూడదు? అది అసంభవమా?"

ద్విజదాసు పక పక నవ్వాడు. "అన్నయ్యా! నువు ఎప్పుడూ అబద్ధంచెప్పవు. ద్వాపరయుగంలోని యుధిష్ఠిరుని సత్యసంధత్వాన్ని వేదవ్యాసుడే కీర్తించాడు; ఈ కలియుగంలో నీ సత్యప్రవర్తనను నేనే గానం చేస్తాను. సరే, భాగ్యవశాత్తు ఏదైనా సంభవంకావచ్చు. కదూ!"

"మనకున్న ఆస్తి అంతా—ధనం, పొలాలు, సర్వమూ నువు అకళింపు చేసుకుని వ్యవహరిస్తూ ఉండు"

"ఎందుకని? ఈ భారమంతా నా నెత్తిమీద ఎందుకు వేసుకోవాలో కాస్త చెప్పు. నువు ఒక్కడివే నిర్వహింపలేక పోతున్నావా? ఊహుం! నేనది ఒప్పుకోను నేను వట్టిసోమరిని. అకర్మణ్యుణ్ణి అయిపోతున్నానని కామాలేం? ఊహుం. నువు వుండగా నాకీ భారమంతా వద్దు బాబో! నాకు డబ్బు మీద

ఆశలేదు. బీదవాడుగా ఉంటూనే నేను కాలంవెళ్ళబుచ్చగలను. ఈ జమీం దారీ నిర్వహణం అంతా వహించి నీకుమల్లే నేనుకూడా వట్టి నియమా సక్తుడినై పోనా ? నలుగురూ ఏమంటారు ? ' వీడి ధమనులలో రక్తం కాదు, రూపాయలు ప్రవహిస్తున్నవి ' అని ప్రజలు నన్నుగూర్చి అడి పోస్తారు. నేను భరించలేను. "

ఇలా అంటూనే ద్విజదాసు అన్నగారివైపు చూచాడు. కాని అతడు అన్యమనస్కుడై యున్నట్టు కనిపించింది. తన మాట లాయన వినిపిం చుకుంటున్నట్టులేదు. ద్విజదాసు ఆశ్చర్యపడ్డాడు. అన్నాడు - " అన్నయ్యా నిజంగా నేనీ భారమంతా మోయవలెననే నీకోరికా ? చిరకాలంగా నేను కలలు కంటూన్న నా దేశసేవకు తిలాంజలి విడువలసిన దేనా ? "

విప్రదాసు తమ్ముని ముఖంలోకి సూటిగా చూచాడు. " తిలాంజలి విడువుమని నే నెన్నడూ చెప్పను. ఎప్పటికీ అదే నీ ఆదర్శమై ఉండుగాక! అయినా మన గృహభారం నువు వహించక తప్పదు. "

" ఎందుకు వహించాలో చెప్పు. కారణం తెలియకుండా నేను ఏ మాటా చెప్పలేను. "

విప్రదాసు కాసేపు ఊరుకుని అన్నాడు.... " కారణం నిగూఢ మైన దేమీ కాదు. ఇవాళంటే నేను ఉన్నాను. రేపునేను ఉండకపోవచ్చు"

" నువుఉండకపోవట ఏమిటి ? అట్టిపరిస్థితి ఎన్నటికీ రాదు. నువు లేకపోతే....అన్న ఆలోచన నాకు కలలోకూడాలేదు " అన్నాడు ద్విజబాబు ఆవేశంగా.

తమ్ముని దృఢవిశ్వాసం విప్రదాసుకు బాధకలిగించింది. నవ్వుతూ అన్నాడు " ప్రపంచంలో ఎట్టిపరిస్థితులయినా సంభవించవచ్చును. అసంభవా లనుకున్నవికూడా సంఘటిస్తూ ఉంటాయి. ' సంఘటించవులే ' అని బేపర వగా ఉండటం ఆత్మమోసం. అదీగాక ఇన్నాళ్ళనించీ ఈ నిర్వాహకం మోసి, మోసి అలసిపోయాను. నాకు విశ్రాంతి కావాలి. ఇవ్వనంటావా ? "

" ఇవ్వలేను అన్నయ్యా ! అంతకన్నా నువు చెప్పినట్టు చేస్తూ ఉండడమే నాకు సుఖవుగా ఉంటుంది. కాబట్టి నేను ఎప్పుడు, ఏమి చెయ్యాలో.... అంతవరకే ఆదేశిస్తూ ఉండు. "

"ఇవాళనించే ఈ సమస్త గృహభారమూ నువు నిర్వహిస్తూఉండు"

" ఇవాళనించేనా ? అంతతొందరా ? సరే కానీ, ఏంచేస్తాను ? నీ ఆజ్ఞ ఉల్లంఘించలేను. " అంటూ ద్విజదాసు వెళ్ళిపోయాడు.

"ఆమాట నువు చెప్పుకోనక్కర్లేదు. నామాట నువు తీసి వెయ్యవని నాకు తెలుసులేరా" అన్న విప్రదాసుమాట తమ్మునికి వినపడక పోలేదు.

ఇంకేం, సమస్తభారమూ ద్విజదాసుపై పడ్డది. అమ్మగారు తల పెట్టిన తటాక నిర్మాణ ప్రారంభోత్సవానికి వలసిన యేర్పాట్లన్నీ అతడే స్వయంగా నిర్వహిస్తున్నాడు. అతని ఓర్పు, కార్య పరత్వము, జాగరూకత - అన్నీ చూచి విప్రదాసు ఆశ్చర్యపోయాడు. ద్విజబాబు అకర్మణ్యుడు, సోమరి, అని నలుగురూ అంటూన్నమాట అబద్ధ మనిపించుకున్నాడు. ఇంత కార్యకుశలత తమ్మునిలో ఉన్నదని విప్రదాసు ఎన్నడూ అనుకోలేదు.

కలకత్తాలో కొనవలసిన సరుకులన్నీ ద్విజదాసు ఖరీదుచేసి బళ్ళకెత్తించి బలరామపురం పంపించాడు. తనతోకూడా పట్టుకుపోవలసిన వస్తువులనుమాత్రం ఉంచుకున్నాడు. బంధువులను, మిత్రులను కలసికొని ఉత్సవానికి ప్రేమపురస్సరంగా ఆహ్వానించి, ఆదర సన్మానాలతో రైలెక్కించి పంపించాడు అన్నిపనులూ నిర్వర్తించి, అన్నగారి సెలవు తీసుకొని తానుకూడా ప్రయాణమై పోదామని విప్రదాసు గదిలోనికి వచ్చాడు.

అక్కడ వందనాదేవి కూచుని ఉంది. ఆ నాడనగా వెళ్ళిపోయింది; మళ్ళీ ఇవాళ కనిపిస్తున్నది. ఇన్నాళ్ళనించీ ఏవో పనులలో నిమగ్నుడై వున్నందున అతనికామె జ్ఞాపకమే రాలేదు. ఇవాళ అకస్మాత్తుగా ఆమె కనిపించే సరికి ఆశ్చర్యపోయాడు. కాని తనభావాన్ని పైకి కనిపింపనీయ లేదు. వచ్చి విప్రదాసుకు నమస్కారం చేశాడు. అన్నాడు - "నేను ఈరాత్రిబండికి వెడుతున్నాను అన్నయ్యా! అక్షయబాబు, ఆయనభార్య, కూతురుకూడా నాతోనే వచ్చేస్తున్నారు. ఇక్కడ మన కాలేజీ విద్యార్థులు రేపో ఎల్లుండో బయలు దేరుతారుట. అన్న పూర్ణ అక్కయ్యను నేవు వచ్చేటప్పుడు తీసుకురా. కాని మూడు నాలుగురోజుల్లో వచ్చేయాలిసుమీ!"

"నేను రావలిసిందేనా?"

"రావలిసిందే. రావటానికి వీల్లేక పోతే తమ పాదుకలను ఇప్పిస్తే భరతుడులా వాటిని మోసుకుపోయి సింహాసనం మీద ప్రతిష్ఠిస్తాను"

విప్రదాసు నవ్వాడు. "భేష్, పండితశ్రేష్ఠుడి వైనావు; ఇక పర వాలేదు. కాని మరి, అభయబాబు సంగతేమిటి? ఆయనకు సెలవుదొరకలే దన్నావు! ఆయన రాకపోతే ఎలా?"

"సెలవు దొరక్క పోవటం ఒక కారణం. ఇంకోకారణంకూడా ఉంది. కూతురి పెళ్ళి తలపెట్టాడు. గొప్పయింటి సంబంధమట! హడా విడిలో ఉన్నాడు. ధనవంతుడైన అల్లుడు ఎందుకయినా అసరాగా ఉంటాడు. అందుకూ ఆయన ఉబ్బి తబ్బిబ్బు లౌతున్నాడు."

ఆ మాటలకు విప్రదాసు కోపగించుకున్నాడు. "నీమాటలన్నీ కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్టు కటువుగా ఉంటాయిరా. మనిషి గౌరవం పాటించి మాటాడ్డం నీకు తెలియదు."

"తెలుసునో తెలియదో మా వదినెను అడిగి కనుక్కో. నేను సౌజన్యాన్ని అనవసరంగా వ్యయం చేసుకోను. అదీ నాలో ఉన్నలోటు. అంతే"

"విప్రదాసు నవ్వు ఆపుకోలేక పోయాడు. "దొరికిందిలే ఒక్క వదినె నీకు ఈ విశాల ప్రపంచంలో గౌరవనీయమైన వ్యక్తి! కల్లు తాగే వాడికి గౌండ్లవాడు సాక్షిట!"

"అలాగే అనుకోండి పోనీ; కాని నీమాటలుకూడా అంతమరీ అమృతధారలేమీ కావులే అన్నయ్యా! నేను త్రాగుబోతునుకాదు; మా వదినె కల్లు అమ్మే మనిషీకాదు. ఆమె అమృతం ఇచ్చేదేవత; అనేక మందికి చాటుగా అన్నదానం చేస్తూన్న మహాతల్లి. ఆమెకుసాటి ఎవరూ లేరు."

"ఎందుకు ఉంటారు? వ్యర్థంగా గారాబం చేసి మరిదిని ఒక దున్నపోతులా తయారు చెయ్యటం తప్పితే మరేమీ పనిలేదా ఇతర్లకు?"

వందనాదేవి తలవంచుకుని, ఆపుకుని, ఆపుకుని నవ్వింది. ద్విజ దాసుచూచాడు" సరే ఆవిషయమై నీతో ఇక చర్చించను. నీకువదినె అంటూ ఎవరూలేరు. బంగాళీ కుటుంబంలో వదినెచూపే వాత్సల్యం ఎలావుంటుందో నీకు అర్థంకాదు. చీకటే వెలుతురని అనుకున్నంతమాత్రాన లాభంలేదు." అంటూనవ్వి "వందనాదేవికి ఎందుకోనవ్వు ఆగటం లేదు మరీను, పెత్తల్లిగారి యిల్లు విడిచివచ్చి కొన్నాళ్ళు మా యింట్లో వుంటే తెలు స్తుంది: నామాటలు నిజమో, అబద్ధమో-సరే, ఈ మాటలకేంగాని, నువు మరి ఎప్పుడు బయలుదేరుతావు అన్నయ్యా! చెప్పు"

"నాకు వొంట్లో నీరసంగా ఉంటున్నదిరా ద్విజూ! అమ్మతో ఏదో చెప్పి నేను రావిలోటు కనిపించనీయకు."

విప్రదాసు కంఠస్వరం నిజంగా నీరసంగా, నిస్పృహా ద్యోతకంగా ఉంది. ద్విజబాబు విచలితుడైనాడు. ఏదో ఒక క్షణహాసరేఖ అన్నగారి పెదవులపై వెలిగింది. నిజంగా ఆయనలో ఏదో మార్పు ఉన్నదే!

"ఇంకానీకు బాగా నయం కాలేదేమిటి అన్నయ్యా?"

"బాగా కులాసా చిక్కలేదురా"

"అయితే అమ్మకు ఏమని సమాధానం చెప్పను? నువు రాకపోతే ఆమె ఆతృత పడుతుంది; వెంటనే తానే బయలుదేరి వచ్చేస్తుంది. ఉత్సవం ఆగిపోతుంది కూడాను"

విప్రదాసు క్షణం ఆలోచించి—"అయితే నన్ను ఎప్పుడు బయలుదేరమంటావు?" అని అడిగాడు.

"ఇవాళో, రేపో, ఎల్లుండో....ఎప్పుడైనాసరే. లేకపోతే నన్ను మళ్ళీ రమ్మంటే వచ్చి తీసుకుపోతాను"

విప్రదాసు నవ్వాడు. "సరే. నేనే వచ్చేస్తాలే; నువు మళ్ళీ రానక్కర్లేదు."

ద్విజబాబు వెళ్ళిపోయిన తర్వాత వందనాదేవి అడిగింది—"మీరు ఇంటికి వెళ్ళటానికి సంకోచిస్తున్నారేం విపిన్‌బాబూ!"

"కారణం నువు విన్నావుగా!"

"విన్నాను. కాని అది మీ తమ్ముడుగారితో చెప్పినమాట. ఇంటికి వెళ్ళటానికి ఎందుకు సస్తాయిస్తున్నారో....నిజం చెప్పండి నాతో"

"వొంట్లో బాగులేదు"

"ఊహుఁ. అది నిజమైన కారణం కాదు. కేవలం ఒక వంక. నాకు చెప్పకండి అలాటి మాటలు. అందర్నీ కన్నుమప్పినట్టు మాటలతో నన్ను మీరు మోసగించలేరు సుమీ! 'ఎప్పుడైనా మీకు రోగపరీక్షచేయవలసి వస్తే నాకు కబురు చెయ్యి' మని మా అక్కయ్యకు ఉత్తరం రాసి మరీ బొంబాయి వెడతాను."

"నా రోగపరీక్ష మీ అక్కయ్య చెయ్యలేదు; నువు చేస్తావు. ఆమాట విని ఆమెకు కోపం వచ్చేస్తుందేమో!"

"కోపం వచ్చినా, నాయెడల కృతజ్ఞురాలై వుండకతప్పదు. మా అక్కయ్య పూర్వకాలపు మనిషి. భర్తను వెతుక్కోవలసిన ఆవశ్యకత

ఆమెకు లేకపోయింది. భగవంతుడే ఆమెకు భర్తను ఇచ్చాడు. బలశాలి ధనాఢ్యుడు అయినభర్తను పడసి ఆమె ఆనందంగాకాలంగడుపుతూన్నది. అట్టి భర్తనునన్నుకూడా ఏనాడైనా విరిగిపోతుందేమో అన్న భయమే ఆమెకు లేకుండా ఉంది పాపం!"

విప్రదాసు ఏమీ మాటాడలేదు. కేవలం మందహాసం చేసి ఊరుకున్నాడు.

"నవ్వేశారేం విపిన్‌బాబూ!"

"నవ్వు దానంతట అదే వస్తోంది వందనా! ఆడ పిల్ల స్వయంగా వరుని ఎన్నుకోవలెనని మీ అభిప్రాయం. అలా ఎన్నుకుంటూన్న వాళ్ళను నువ్వు చాల మందిని చూచావు. ఈ యాచారానికి భిన్నంగా నడుచుకునే వాళ్ళుకూడా ఉంటారేమోనని మీరు కలలోకూడా అనుకోరు. మీరు కొన్ని సాధారణ నియమాలను మన్నిస్తారు. వాటి వ్యతిక్రమణాన్ని మీరు అంగీకరించరు. కాని అట్టి వ్యతిక్రమణములోనే ధర్మం ఉంది; పుణ్యం ఉంది. కావ్యశాస్త్రాల అస్తిత్వముకూడా అందులోనేఉంది. ఆ వ్యతిక్రమణమే లేనినాడు ఈ ప్రపంచమంతా ఒక మరుభూమి ఐపోతుంది. ఈ సత్యం నీకు ఇంతవరకు తెలిసి రాలేదు."

"అట్టి వ్యతిక్రమణము మూర్తిగట్టిన వ్యక్తులు కాబోలు తమరు. అయితే మరి ఆనాడు మీరు నన్నుకూడా ప్రేమిస్తున్నట్టు చెప్పారేం?" అన్నది వందన వ్యంగ్యంగా.

"ఆమాట నేను ఇప్పుడుకూడా అంటాను. 'ప్రేమ' అనేపదానికి మీరు ఒకేఒక అర్థం చెబుతారు. ప్రేమరీతులు అన్నీ మీకు తెలియవు. అందుచేతనే నాకు నీ మీదిప్రేమ ఎట్టిదో నీకు అర్థంకాలేదు. ద్విజుకూ, వాళ్ళవదినెకూ గల బాంధవ్యం కళ్ళారా చూడు. నీకు జ్ఞానచక్షువు తెరుచుకోగలదు. ఆదరం అభిమానం,వాత్సల్యం ఎలా ప్రేమగా పరిణతి చెందుతాయో నీకు తెలుస్తుంది. సరస సల్లాపాలలో, ఆమోదప్రమోదాలలో ఆమె అతనికి కేవలం వదినెమాత్రమేకాదు; తల్లికూడాను. అటువంటి బాంధవ్యమే నీకూ నాకూ కూడాఉంది. ఆ ప్రకారంగానే నువు నన్నెందుకు స్వీకరింపలేవు వందనా?"

గంభీర స్నేహ పిచ్ఛిలమైన అతనికంఠ స్వరంలో ఒక తిరస్కృతి కూడా వందనాదేవికి వినిపించింది. ఆమె నొచ్చుకుంది. మాటాడ కుండా నేలకేసి చూస్తూ కూచుంది. చివర కిలా అన్నది — "మీరు నిజంగా మా

అక్కయ్యను ప్రేమిస్తున్న వారైతే నాకు విచారంలేదు. ఏదో ధర్మానికి కట్టుబడి. కర్తవ్యాన్ని పాటించి కాపురం చేస్తున్నట్టు మాటాడారు. మీది చాల కఠోరమైన ప్రకృతి. మీరు ఎవర్నీ ప్రేమించలేరు. ఇవాల్టితో నా భ్రమ వీడిపోయింది. శూన్యంలో ఈ నా అన్వేషణ నేటితో అంతరించి పోవుగాక ! నన్ను అలాగే ఆశీర్వదించు విపిన్‌బాబు !"

విప్రదాసు నవ్వుతూ చెయిచాచి ఆశీర్వదించాడు— "నేటితో నీ వరాన్వేషణ ముగిసిపోవుగాక ! నీకు తగిన వరుని భగవంతుడే ప్రసాదిస్తాడుగాక !"

కాని ఈ ఆశీర్వాదం ఆమెకు హాస్యాస్పదంగా వినిపించింది. అవమానకరంగా తోచింది. "అయితే వరునికోసం వెతుక్కుంటూ తిరగటమే నా వృత్తి అనుకున్నారా ? అయినా హఠాత్తుగా ఆ వరుడు ఎక్కడినించి, ఎలా ఊడిపడతాడో చెప్పరేం ? మీ సాహచర్యం లభించి నప్పటినించీ నేనొక భ్రమలో పడిపోయాను. ఆ భ్రమ నేటితో వీడిపోయింది. అన్నపానాదుల విషయంలో మడి, మైల పాటించటం....పూజా పుష్పాలు సేకరించటం....గంధంతీయటం....ప్రార్థన శ్లోకాలు వర్లించటం.... ఇత్యాదులే నిజంగా పవిత్ర కార్యాలని అపోహ పడ్డాను. మా పెత్తల్లిగారింటికి వెళ్ళాక ఈ అపోహ, ఈ అజ్ఞానం తొలగి పోయినవి. ఇక్కడ ఉన్నన్ని నాళ్ళూ మీ ఆచార వ్యవహారాల్ని విశ్వసించి పిచ్చిదాన్ని అయిపోయాను" అంటూ వందనాదేవి నవ్వింది.

తనమాటలు వెళ్ళి విప్రదాసుకు శూలాల వలె తగులవలెనని ఆమె ఉద్దేశించింది. కాని విప్రదాసు ప్రసన్నాత్మకంగా నవ్వుతూ అన్నాడు— "ఈ యింటి ఆచార వ్యవహారాదులన్నీ నీవంటి వాళ్ళకు కాదు; వీటిని నువ్వు అభ్యసించేందుకు ప్రయత్నించకు—అని నేను నీకు ఎప్పుడో చెప్పాను కాదూ ! పోనీ, ఇప్పటికైనా నీమూర్ఖత, తెలుసుకోగలిగావు ; సంతోషం. నీమాటలు విని నేను విచారపడతానని నువ్వు అనుకున్నావు కాదూ ! ఎవ్వే, తనకు స్వాభావికములుకాని పనులను ఏవ్యక్తియైనా ఆచరించకపోతే నాకు విచారంకలగదు. నేను ఎవర్నిగురించి ధ్యానమగ్నుడినై ఉంటానో తెలుసుకోగోరి ఆనాడు అడిగావు, జ్ఞాపకంఉందా ? నేను చెప్పలేదు. ఎందుకనీ ? నోటిముత్యాలు రాలిపోతాయనికాదు—సరేగాని నీ బొంబాయి ప్రయాణం ఎప్పుడూ ?"

వందనాదేవి అభిమానంతో వేగిపోయింది. ముఖం కందగడ్డ అయింది. విప్రదాసు ప్రశ్నకు జవాబుచెప్పలేదు.

"ఆనాడు మీ పెత్తల్లిగారి మేనల్లుడు అశోకబాబును గురించి మాటాడుకున్నాం. బాగానే ఉంటాడని చెప్పావు. ఈలోగా అతన్ని గురించి ఇంకా వివరాలేమైనా తెలిసివచ్చాయా వందనా!"

"ఉహుం"

"నువు అతన్నే వివాహం చేసుకునేట్టయితే నా ఆశీర్వాదం మీకు లభిస్తుంది. కాని మీ పెత్తల్లిగారి బలవంతంమీదే నువు ఏ పనీ తొందర పడి చెయ్యకుసుమీ! జాగ్రత!"

వందనాదేవి కన్నుల్లో నీళ్ళు తిరిగాయి. కాని తలవంచుకుని, తిన్నగా తన్నుతాను సంబాళించుకుని - 'సరే' అని మాత్రం ఉచ్చరించింది.

"నేను ఎల్లుండి ఇంటికి వెడుతున్నాను. అయినా రెండు మూడు రోజులకన్నా ఎక్కువ ఉండను. నేను కలకత్తా తిరిగి వచ్చాక....అప్పటికి నువు ఇంకా ఇక్కడే ఉంటే....ఒకసారివచ్చి చూచి పోతావుకదూ!"

వందనాదేవి వంచినతల ఎత్తలేదు. ఏదో జవాబైతే చెప్పింది. కాని స్పష్టంగా వినిపించలేదు.

"నేను గృహనిర్వహణ బాధ్యతనించి సెలవు పుచ్చుకున్నాను: విన్నావుగా! మా నాన్నగారు ఈ సంసారభారాన్ని చిన్నప్పుడే నామీద వేశారు. ఎప్పుడూ, ఎక్కడికి వెళ్ళటానికీ తీరిక అనేది చిక్కకండా జైల్లో ఉన్నట్టు బాధపడ్డాను. ఇక సమస్తం ద్విజబాబు చూసుకుంటాడు. నాకు కావలసినంత విశ్రాంతి: విశ్చింత."

"నిజంగా మీకిప్పుడు విశ్రాంతి కావలసి వచ్చిందా విపిన్‌బాబూ! అంతగా అలసిపోయారా?" అన్నది వందన ఈ సారి తలెత్తి అతనికేసి చూస్తూ.

విప్రదాసు ఆ ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేదు. అన్నాడు - "వందనా! ఈ సారి నా జ్వరంలో నువు చాల సేవ చేశావు. ఆ సంగతే ద్విజదాసుతోచెప్పి 'అందుకు మీ రంతా ఆమెకు కృతజ్ఞులు' అన్నాను. ద్విజదాసు ఒప్పుకుంటూ అన్నాడుగదా: 'నన్ను సేవించటంలో తనతో పాటు పదిమంది 'వందన' లు కూడా తులతూగరు' అని"

"సరే, పరీక్షాసమయం రానీయండి; మా యిద్దరిఅంతరం తెలుసుకుందురుగాని."

విప్రదాసు నవ్వాడు. "ద్విజదాసు సామాన్యుడుకాదు వందనా! అతన్ని నువు బాగా ఎరగవు. సమయంవస్తే వాడు వెనుకడుగు వెయ్యడు సుమీ!"

"ఎరుగుదును విపిన్‌బాబూ! బాగానే ఎరుగుదును. మీ ఆజ్ఞలను పాలించటంలో అతనికి ఉన్నంతదీక్ష వందనాదేవికి లేదు, నిజమే."

భ్రాతృగర్వంతో విప్రదాసు ముఖం ఉజ్వలమైంది. "మా ద్విజూ చాల సాధు పురుషుడు."

"మీ కంటేనా?"

"ఔను. నా కంటే కూడాను. నీకు తనమీద కోపం వచ్చిందేమో నని వాడు భయపడ్డాడు. వాడితో నువు అసలు మాటాడలేదేం?"

"అవసరం లేకపోయింది విపిన్‌బాబూ!"

విప్రదాసు నవ్వాడు. "అయితే నీకు వాడిమీద కోపం వచ్చిందనే నేనుకూడా భావిస్తున్నాను, అయినా ఒక మాట చెబుతాను: పైకి వాడు చాల కఠినుడుగా కనిపిస్తాడు; మాటలుకూడా కటువుగానే ఉంటాయి. కాని అంత మధురవ్యక్తి మరెక్కడాలేడు. ఈ ప్రపంచమంతా వెదకినా నీకు అటువంటి విశ్వసనీయుడైన వ్యక్తి దొరకడు"

వందనాదేవి పక్కకుతిరిగి చూస్తూ కూచుంది. ఏమీ బదులు పలుకలేదు. చివరకు హఠాత్తుగాలేచి నిల్చుంది. "ఇక నేను వెడుతున్నాను విపిన్‌బాబు. నేను బొంబాయి వెళ్ళిపోకుండా ఉంటే.... మీరు తిరిగివచ్చాక మళ్ళీ కలుస్తాను. లేకపోతే ఇదే కడసారి నమస్కారం అనుకోండి" అంటూ వంగి అతని పాదధూళి గ్రహించి త్వరత్వరగా వెళ్ళిపోయింది. ఏమి మాటాడ్డానికీ విప్రదాసుకు అవకాశం చిక్కనీయలేదు.

వందనాదేవి వెడుతూ వెడుతూ వరండా దాటింది. ఇక మెట్లు దిగబోతూ ఉంది. ఎదురుగా ద్విజదాసు కనిపించాడు.

"ఏమైంది? మళ్ళీ వచ్చేస్తున్నావేం?" - అడిగింది వందనాదేవి నవ్వుతూ.

"నా ప్రార్ధన ఒకటి ఉంది. అన్నయ్యను తీసుకుని నువుకూడా ఒకసారి మా వూరు రావాలి"

"ఎందుకూ?"

" ఆ నాడు నీ యంతట నీవే వచ్చి నీ చరణధూళితో మా గృహం పావనం చేశావు. మళ్ళీ అట్టి దయారసాన్నే ఇంకొకసారి మాపై ప్రసరించవా ? "

వందనాదేవి కాసేపు ఆలోచించుకుంది. " అయితే నన్ను రమ్మని ఆహ్వానిస్తున్నది ఎవరు ? నీవా, మీ అన్నయ్యా, మీ అమ్మగారా ? "

" నేనే స్వయంగా ఆహ్వానిస్తున్నాను "

" కాని నువు మూడవ శ్రేణికి చెందినవాడివిగా ! ఇతర్లను ఆహ్వానించే అధికారం నీకు ఉన్నదామరి ! "

" ఏ అధికారం ఉన్నా, ఏ అధికారం లేకపోయినా ఆ యింట్లో నివసించే అధికారం నాకూ ఉందికదా ! ఆ అధికారంతోనే నిమ్నురమ్మంటున్నాను. నా ప్రార్థన మన్నించవా ? ఎంతో అవసరం ఉంటేనేగాని నేనెవర్నీ ప్రార్థించేవాణ్ణికాదు. "

వందనాదేవి చాలసేపు మరొకవైపుచూస్తూ నిల్చుంది. చివరికిలా అన్నది. " సరే వస్తాను. కాని అక్కడ నాకు జరిగే మర్యాదావమానాలకు నువు బాధ్యుడి వౌతావు. "

" నా శక్తి సాధారణమైనదే. అయినా ఆ బాధ్యత నువు కోరినట్టు నేనే వహిస్తాను. " అన్నాడు ద్విజదాసు కృతజ్ఞతాభావ సూచకమైన కంఠస్వరాన

" ఆడినమాట తప్పకూడదుసుమీ ! "

" ఊహుఁ. తప్పను "

# 21

ఒకనాడు విప్రదాసు ఉదయాన్నే స్నానంచేసి బైటిగదిలో కూచు న్నాడు. వ్యవహారకాగితా లేవో కట్టలు కట్టలుగా టేబిల్‌మీద పడివున్నవి. మనిషి చాల అలసినట్టుగా ఉన్నాడు. ఒక లావుపాటి ఖాతాపుస్తకం తెరచి పేజీలు తిరుగవేస్తున్నాడు.

ఇంతలో బైట మోటారు ఆగిన చప్పుడైంది. మరి కాసేపటికి వందనాదేవి గదిలో ప్రవేశించింది. ఈసారి ఆమె ఒంటరిగాలేదు. ఆమె తోపాటు ఒక యువకుడుకూడా ఉన్నాడు. సుమారు ముప్ఫయి సంవత్స రాల వయసు ఉంటుంది. ధోవతి కట్టుకున్నాడు. బంగాలీలాల్చీ తొడుక్కు న్నాడు. ఇంకా కొంచెం పొడుగ్గా ఉన్నట్టయితే అందగాళ్ళలో లెక్కవేయ వచ్చు. వచ్చిన వారికి స్వాగతమిచ్చే నిమిత్తం విప్రదాసు కుర్చీలోనించి లేచాడు.

"విపిన్‌బాబూ! వీరే మిస్టర్ చాయిడీ, బార్‌అట్‌లా. మీరు 'అశోకబాబు' అని పిల్చినా కోపగించుకోరులెండి. కోపగించుకోకండా ఉండేట్టు ఒప్పించే ఇక్కడికి తీసుకువచ్చాను." అంటూ వందనాదేవి తల మాత్రం వంచి నమస్కారంచేసి—"అశోకబాబు సమక్షంలో మీకు పాదాభి వందనం చేయదలచుకోలేదు. అలాచేస్తే నన్ను ఆయన తమ సంఘంలో అస్పృశ్యనుగా భావిస్తాడు. కాబట్టి మీరు అన్యధా భావించకండి. ఈకొత్త ఆచారం మా పెత్తల్లి దగ్గిర నేర్చుకువచ్చా ననుకోకండి"

"ఇలాగే నాగుణకీర్తనకూడా చేస్తూంటావన్నమాట మీ పెత్తల్లి గారిముందు!"—అంటూ విప్రదాసు అశోకబాబుకేసి తిరిగి అన్నాడు. "వందనాదేవి మిమ్మల్ని గురించి చాలా చాలా చెప్పింది. సుస్తీగాఉంటు న్నాను. లేకపోతే ఒకసారి నేనేవచ్చి మిమ్మల్ని చూద్దామనుకుంటున్నాను. ప్రథమ సందర్శనంలోనే మీరు నాకెంతో చిరపరిచితులుగా కనిపిస్తున్నారు. వందనాదేవి మిమ్మల్ని ఇక్కడికి తీసుకు వచ్చినందుకు సంతోషం"

అశోకబాబు ఏదో సమాధానం చెప్పబోతున్నాడు. కాని వందనా దేవి అడ్డువచ్చింది. తర్జనిచూపెడుతూ అన్నది. "ఇకచాలు ఊరుకోండి విపిన్‌బాబూ! అత్యుక్తులు, అతిశయోక్తులు దాటి అబద్ధాలకు దిగుతున్నారు."

"అంటే యేమిటి నీ ఉద్దేశం?"

"అంటే యేమీలేదు. మీరుకూడా అందరికి మల్లేనే అబద్ధాలు, సుబద్ధాలు కలిపి మాటాడేస్తూంటారని. ఔనుమరి! మీరు అసాధారణవ్యక్తులేమీ కాదుగా! మాకుమల్లేనే సాధారణ మనుష్యులే."

"కాదు. ఎవరినైనా అడుగు. నీమాట పొరపాటు అని అందరూ ఏకగ్రీవంగా అంటారు."

"ఒకసారి మిమ్మల్ని మావాళ్ళదగ్గరకు తీసుకుపోతాను ఉండండి. అక్కడ విప్రదాసుబాబు సింహానికి ఈ నా రెండుచేతులతో పైచర్మం వొలిచేస్తాను. అప్పుడు నిజరూపం బయటపడుతుంది. అంతా చూస్తారు. నన్ను ఆశీర్వదిస్తారు; 'నువు రాజరాణివి ఔతావుగాక' అని"

విప్రదాసు నవ్వాడు. "మీ వాళ్ళకు ఆశీర్వదించటం చేతకాదుగా! అయినా నువు కోరుకున్న ఆశీర్వాదం నేనే ఇవ్వటానికి సిద్ధంగాఉన్నాను. కాని మీరు స్వీకరించరు కామాలు! ఆశీర్వాదంలో మీకు నమ్మకంలేదు. అది ఒక కుసంస్కారం అని మీ అధిక్షేపం. కదూ!"

వందనాదేవి మరొకసారి తర్జని చూపెట్టింది. "అదుగో మళ్ళీ మమ్మల్ని తృణీకరిస్తున్నారు. మేము గురుజను ఆశీర్వాదాన్ని ఆశించమని మీకెవరు చెప్పారు? అది కుసంస్కారమని మేము అన్నామా? ఇప్పుడు నిజంగా నాకు కోపం వచ్చేస్తున్నది విపిన్‌బాబూ!"

"నిజంగా కోపం వచ్చేస్తున్నాదా? అయితే పోనీలే, ఈప్రసంగం మానేద్దాం. ఏదో తమాషాగా అన్నాలే, సరేగాని, పొద్దు పొడువగానే వచ్చావు, ఏం కథ?"

"చాలకథ ఉంది. మొట్టమొదట మీ మీద ఒకనేరం ఉంది, విచారించాలి. నా అజ్ఞలేకండా మీరు ఇలా మేడదిగివచ్చి ఇక్కడ మళ్ళీ పనిలో నిమగ్నులైనా రెందుకూ?"

"నేను పనియేమీ చెయ్యటంలేదు. చేద్దామా అని ఆలోచిస్తున్నాను. ఇక చెయ్యనులే" అంటూ విప్రదాసు ఖాతాపుస్తకం మూసి అలమారలో పెట్టేశాడు.

వందన ప్రసన్నురాలైనట్టు కనిపిస్తూ అన్నది. "అయితే మీతప్పు క్షమిస్తున్నాను. ఇక నెప్పుడూ నా ఆజ్ఞలేకండా ఏపనిలోనూ జొరబడకండి. జాగ్రత. నేను పోయి అన్నపూర్ణను కలుసుకుని సామాను అంతా సర్దించి ఉంచుతాను. రేపు ఉదయంబండికే బలరామపురం ప్రయాణం. చీకటిపడక ముందే ఇంటికి పోగలం. చలిసోకకండా ఉంటుంది. నేను మళ్ళీ వచ్చే వరకూ అశోకబాబుతో మాటాడుతూ ఉండండి; మీ ముఖర్జీ వంశీయుల ఐశ్వర్యం గురించో, మీ విరంకుశ ప్రజాపాలనను గురించో....మీ యిష్టం ఏవిషయం గూర్చియైనా సరే. మిస్టర్ చాయిడీ కూడా మనతో బలరామ పురం వస్తానంటున్నాడు. మీలాటి గొప్ప కుటుంబీకుల గృహాల్లో జరిగే యజ్ఞయాగాది క్రియా కలాపాలను, 'దీయంతాం - భుజ్యంతాం' ఇత్యాది కోలాహలాలను ఎన్నడూ చూడలేదుట. ఔనుమరి, ఎప్పుడు చూచాడు పాపం?"

"నువు చూచావేమిటి వందనా?"

"అశోకబాబు చూడలేదని చెబుతున్నాను గాని, నేను చూచా నని చెప్పటంలేదు. తమ ప్రశ్న అసంగతము, శిష్టజన నిందితమున్నూ. తెలి సిందా? అశోకబాబును కూడా మనతోపాటు తీసుకు వెడతానని మాట యిచ్చాను. దానితో వారు ఎంతో ప్రసన్నులై....నన్ను బొంబాయి తీసుకు పోయి దిగబెట్టే బాధ్యతను స్వీకరించారు."

"ఏమిటీ? గొప్ప త్యాగమేనే! అంతమహాత్యాగం మీరేగాని.... మా సంఘీయు లెవరూ చెయ్యలేరు సుమా! ఆశ్చర్యమే!"

"ఆశ్చర్యం కాదూమరి! మీ జపతపాలన్నీ హింసాత్మకాదూ!" అంటూ దృక్కాంతిని మెరుపులా వెలయించి, గిర్రున తిరిగి పోయింది. విప్రదాసు ఉండమని అపాడు. అన్నాడు— "కుక్కలు ఎక్కడ వచ్చి తినిపోతాయోనని తవుడుకు కాపలాకూచుండిట ఒక బుద్ధి మంతు రాలు. అలా వుంది నువు నాముందు మీ నవీనాచారలను సమర్థించుకోవటం చూస్తే"

"ఔను. మీరెక్కడ విమర్శిస్తారోనని అనవసరంగానే భయపడు తున్నాను. అసలు ప్రజలంతాకూడా మిమ్మల్ని చూచి అనవసరంగానే భయ పడుతూ ఉంటారు. అందరికి మల్లే మీరుకూడా సామాన్య వ్యక్తులే మళ్ళీను"

"ఈసారి నువుకూడా వస్తున్నావుగా మావూరు! వచ్చి ప్రజల భయం పోగొట్టుదువు గానిలే"

"అందుకనే వస్తున్నాను. ఊరికే వస్తున్నానేమిటి? అదీగాక తవుడు ఉపమానం తీసుకువచ్చిన ఆ దుర్బుద్ధి యేమిటోకూడా కనుక్కోకుండా వదలిపెట్టను" అంటూ మరొకసారి మెరుపులాచూచి గబగబా పైకి వెళ్ళిపోయింది.

విప్రదాసు సాదరంగా అశోకబాబుకేసి తిరిగాడు. "మిస్టర్ ...."

"వద్దు - వద్దు. అలా పిలవకపోతే వచ్చేయిబ్బంది యేమీలేదు. అందుకనే ధోవతి కట్టుకుని, లాల్చీ తొడుక్కుని వచ్చాను. వందనాదేవి ఉపదేశం చేసింది; ఏమనంటే -"

ఆ పలుకులకు విప్రదాసు ప్రసన్నుడైనాడు. "మా పల్లెటూరు వాళ్ళకు ఆ పేరు జ్ఞాపకంకూడా ఉండదు. సరిగా ఉచ్చరించలేరు కూడాను. మీరు మా గ్రామం రావాలని కుతూహలపడుతున్నారుటకాదూ! తప్పకండా రండి మీరు. నిజంగా నేను కృతార్థుడను. మా యింటి సర్వాధికారిణి మా అమ్మ. ఆమె తరపున నేను మిమ్మల్ని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను."

విప్రదాసు వినయపూర్వక వచనాలకు అశోకబాబు ఆనందించాడు. "వస్తాను, తప్పకండా వస్తాను. వచ్చి చూస్తాను లక్షలాది బీదలకు అన్నదానం, పండితులకు సన్మానం, ఉత్సవాలు, ఊరేగింపులు, ఆనంద కోలాహలం...."

విప్రదాసు నవ్వాడు. "వందనాదేవి అంతా....గోరంతలు కొండంతలుగా ఉత్ప్రేక్షించి చెప్పింది అశోకబాబూ! మమ్మల్ని పరిహాసం చేయాలని...."

"అబద్ధాలు చెప్పి ఆమెకేం ప్రయోజనం విపిన్‌బాబూ!"

"మీకు ఆశ్చర్యం కలిగించటమే. అదీగాక బలరామపురంలో ముఖర్జీ కుటుంబం అంటే ఆమెకు మంట. పైగా ఆమె ప్రధానోద్దేశం ఒకటి ఉంది: ఎలాగయినా తన్నుమీరు బొంబాయి తీసుకువెళ్ళి దిగబెట్టి వచ్చేందుకు మిమ్మల్ని ఒప్పించటానికి ఆమె పన్నిన తంత్రం అది.

"ఆమెను నేను బొంబాయి తీసుకుపోయి దిగడించి వస్తానని అంతకు ముందే మాటయిచ్చాను. అయినా ఆమెకు ముఖర్జీవంశం అంటే కోపం దేనికి? ఆమె మిమ్మల్ని అప్రతిష్ఠపాలు చెయ్యాలని చూస్తోందంటే

నేను నమ్మలేక పోతున్నాను. నిన్నటి వరకూ బలరామపురం ప్రయాణం నిశ్చయం చేసుకోలేదు. ఆ విషయం మీదే పెత్తల్లికీ, ఆమెకూ లడాయి అయింది. "విప్రదాసు తల్లి ప్రజలందరిక్షేమంకోసం చెరువు త్రవ్విస్తోంటే నాకూ సంతోషంగానే ఉంది. కాని ఉత్సవాలూ, పండితసన్మానాలూ - ఈ ఆడంబర మంతాదేనికో నాకు అర్థం కావటంలేదు. అదిఅంతా వట్టి కుసంస్కారం. అట్టి కుసంస్కారంలో మనంకూడా కలుగ జేసుకోటం తగని పని." అన్నది పెత్తల్లి. "గొప్ప గొప్ప వాళ్ళుఏమిచేసినా ఆడంబరం సహజంగా ఉంటుంది. అందులో ఆశ్చర్యంలేదు. అంత మాత్రాన మనం విమర్శించటం తప్పు" అన్నది వందనాదేవి. "ఔను గొప్పవాళ్ళ డబ్బు విచ్చలవిడిగా ఖర్చుచేస్తారు ఇటువంటి సమయాల్లో; నాకూతెలుసు. కాని అది కేవలం ఆడంబరమేకాదు, కుసంస్కారం కూడాను. కాబట్టి నువు వెళ్ళటం నాకిష్టంలేదు" అన్నది మా మేనత్త "కాని నేనది కుసంస్కారం అనుకోను.మనకు తెలియని విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చెయ్యకండా, తోచినట్టు విమర్శించి, నిందించటమే కుసంస్కారం" అన్నది వందనాదేవి. ఆ మాటవిని మా మేనత్తమొగం గంటుపెట్టుకుంది. అడిగింది. - "మీ నాన్నకు రాసి అనుమతి తెప్పించుకున్నావా ?" అని.

"'మా నాన్న వద్దనడు, నాకుతెలుసు. మా అక్కయ్య భర్తకు సుస్తీగా ఉంది ; ఆయన్ను బలరామపురం తీసుకు పోవలసిన బాధ్యత నామీద ఉంది' అన్నది వందనాదేవి. 'ఆ బాధ్యత నీమీద ఎవరు వేశారు? మీబావగారేనా ? చెప్పమ్మా వింటాను' అన్నది మా మేనత్త."

"ఆమాటవిని వందనాదేవి ఎందుకో కాసేపు నిరుత్తర అయింది. అలాగే ఆమెకేసి చూస్తూనిలుచుంది. ఆమె మెదడులో రక్తం విద్యుద్వేగంతో ప్రవహిస్తున్నట్టు తోచింది. ఆవేశంలో ఏదో అనరానిమాట అనేస్తుందనుకున్నాను. ఆమె మెల్లిగా, శాంతంగా జవాబుచెప్పింది. 'నోటికి ఏదివస్తే అది మాటాడే వారితో ఎక్కువగా ప్రసంగించే అలవాటు నాకు చిన్నతనంనించీ లేదు. ఎల్లుండి ఉదయం విపిన్‌బాబును తీసుకుని నేను బలరామపురం వెడతాను: అంతకన్నా ఎక్కువగా నీతో ఇప్పుడు ప్రసంగించటం నాకు ఇష్టంలేదు.' "

"దానితో మా మేనత్తకు కోపంవచ్చి వెళ్ళిపోయింది. 'నన్ను కూడా నీతోపాటు తీసుకు వెడతావా వందనా ? వాళ్ళ ఆచారాలు, అనుష్ఠా

నాలు అన్నీ నేనుకూడా కళ్ళారా చూస్తాను" అని అడిగాను నేను. 'ఎందుకులే అశోకబాబూ! అవన్నీ కుసంస్కారాలు. అవలోకించి నందు వల్ల మనజాతి భ్రష్టమై పోతుంది' అన్నదామె. 'నువు వెడుతున్నావుగా మరి! నీ జాతి భ్రష్టమై పోకపోతే నా జాతీ భ్రష్టంకాదు. పోతే మనిద్దరి జాతీ భ్రష్టమై పోతుంది. పోనీ నాకేం పరవాలేదు' అన్నాను. 'నువు వాళ్ళ ఆచారాలను విశ్వసించలేవు. చూచి లోలోపల నవ్వుకుంటావు' అన్నదామె. 'అయితే నీకు వారి ఆచారాల్లో విశ్వాసం ఉందా?' అని నే నడిగాను. 'విశ్వసించ లేకపోతున్నాను. కాని విపిన్‌బాబుకు బ్రహ్మాండమైన విశ్వాసం ఉంది. ఎప్పటికైనా నాకుకూడా అట్టి విశ్వాసమే చేకూరు గాక అని మనస్ఫూర్తిగా వాంఛిస్తున్నాను' అని ఆమె జవాబుచెప్పింది."

"నిజంగా విపిన్‌బాబూ! వందనాదేవి మిమ్మల్ని దేవుడులా పూజిస్తున్నది. ఆమెకు మీ యెడగల భక్తిశ్రద్ధలు అపారములు"

ఆ సంగతి విప్రదాసుకు తెలియకపోలేదు. అశోకబాబు ముఖతః ఆ మాటలువిని. ఆతడు కించిత్తు లజ్జితుడైనాడు.

"మరి మీ వివాహం సంగతి ఏమయింది? నిశ్చయమైనట్టేనా? వందనాదేవి ఒప్పుకుందా?" అని అడిగాడు విపిన్‌బాబు కాసేపు ఆగి.

"ఆమె చేసుకోనని మాత్రం చెప్పలేదు. చేసుకుంటాననీ అన లేదు"

"మౌనం అర్ధాంగీకారమేమో!"

"అనంగీకారం కూడా కావచ్చు. అసలు విషయం ఏమిటంటే నేను ధనవంతుడి నేమీకాదు. వందనాదేవి ధనవంతులపిల్ల. నాకు డబ్బు మీద ఆశలేదని నేను చెప్పుకోలేను. కాని మా మేనత్తకులాగా నాకు కేవలం 'ధనమే' పరమ లక్ష్యంకాదు. మా మేనత్తతో కలసి షడ్యంత్రం పన్ని నేనామెను వలలో చిక్కించుకోటానికి ప్రయత్నిస్తున్నట్టు భావిస్తున్నదో, ఏమిఖర్మమో!"

అశోకబాబు మాటల్లోని సరళత విప్రదాసును ఆకర్షించింది. అన్నాడు. "నిజంగా మీ మేనత్తగారి షడ్యంత్రంలో మీ కేమీ చెయిలేక పోయినట్టయితే .... సత్యం దాగదు. ఎప్పటికైనా వందనాదేవికి మీ హృదయశుద్ధి తెలియకపోదు. కేవలం ఈ ధనాధిక్యత, ధనన్యూనతవల్లనే వివాహం ఆగిపోదు"

"మీ రా మాట మనస్ఫూర్తిగా అంటున్నారా విపిన్‌బాబూ!" అని అడిగాడు అశోకబాబు ఉత్సుకుడై.

విప్రదాసు ద్వైధీభావంలో పడ్డాడు. "నాకు తెలిసినంతవరకు అలాగే కనిపిస్తున్నది" అన్నాడు కాసేపు ఆలోచించి

"నాకు ఎలా కనిపిస్తున్నదో చెప్పమన్నారా? ఆమె కటాక్షం కన్నా నాకు ముఖ్యంగా మీ దాక్షిణ్యం కావాలి. అది లభించిననాడు నేను పొందలేని వస్తువు ఉండదు"

విప్రదాసు నవ్వాడు "వందనాదేవి నేను ఎన్నుకోమన్న వరుడినే ఎన్నుకుంటుందని మీకీ అద్భుత విశ్వాసం ఎలా కలిగిందబ్బా! ఆమే అలా చెప్పిందా? ఒక వేళ చెప్పినా అది ఎగతాళిగా అన్నమాటేసుమీ అశోక బాబూ!"

"ఊహుం. అది ఎగతాళికాదు, నిజమే"

"ఎవరు చెప్పారు?"

అశోకబాబు కాసేపు ఊరుకుని ఇలా ఆరంభించాడు - "నోరువిప్పి చెప్పనక్కర్లేదు విపిన్‌బాబూ! ఒకనాడు వాళ్ళ పెత్తల్లితో పోట్లాడి వందనాదేవి నా గదిలోకి వచ్చింది. "నువు నన్ను బొంబాయి తీసుకు పోయి దిగబెట్టిరావాలి అశోకబాబూ!" అన్నది. "నువు ఎప్పుడు ఆజ్ఞా పిస్తే అప్పుడే తయారుగా ఉన్నాను" అని చెప్పాను. "బలరామపురం ప్రయాణం ఒకటిఉంది. తరువాత చెబుతాను" అన్నది. "సరే, అలా గేలే" అన్నాను. అంటూ "ఎందుకలా మీ పెద్దమ్మతో దెబ్బలాట పెట్టు కుంటావు? వాళ్ళ పూజా పునస్కారాల్లో, జపతపాల్లో, దేవతల్లో నమ్మకం లేదంటూనే ఉంటావు. 'నమ్మకం కుదిరితే బాగుండును, నా కష్టాలు ఈడేరుతాయి' అని కోరుకుంటూ ఉంటావు. ఏమిటి ఇదంతా? అని అడి గాను. "ఔను, నిజమే అశోకబాబూ! నేను చెప్పేదానిలో అబద్ధంలేదు. నిజంగా నాకు వాళ్ళ జపతపాల్లో, ఆచార వ్యవహారాల్లో విశ్వాసం సిద్ధించే ట్టయితే ధన్యురాలినై పోనూ! ఎప్పటికైనా అట్టివిశ్వాసం నాకు చేకూరేట్టు ఆశీర్వదించమని విప్రదాసుబాబును ప్రార్థిస్తాను. అందుకే ఆయన సేవా శుశ్రూషలు చేస్తూఉన్నాను" అన్నదామె. ఆ తరువాత మిమ్మల్నిగురించే చాలసేపు మాటాడుకున్నాం. ఆమెకు మీ యందున్న భక్తిశ్రద్ధలు, ఆ సేవాతత్పరత ప్రపంచంలో నే నెక్కడా చూడలేదు. ఉంటాయని కలలో కూడా అనుకోలేదు. ప్రసంగవశాత్తు ఆమె ఒక సంఘటన వివరించి

చెప్పింది. ఏమిటంటే ....మీరు సుస్తీగా ఉంటున్నారుట. ఉదయం మీ పూజా పునస్కారాలకోసం అమె అంతా సిద్ధంచేస్తుందిట. కొంచెం పొద్దు ఎక్కిందిట. ఆలస్యమౌతుందేమోనని గబగబా వస్తూంటే ఏదో మైల వస్తువు తొక్కిందిట. 'పరవాలేదులే, ఇంతమాత్రాన పూజ అపవిత్రమై పోతుందా యేమిటి?' అని మనస్సును సమాధాన పరచుకోటానికి ప్రయత్నించిందిట. కాని ఉహుం. ఆమెకు కాళ్లు ముందుకుసాగలేదుట. వెనక్కివెళ్ళి, మళ్ళీ స్నానంచేసి, శుచియై వచ్చిందిట. ఆలస్యమైనందుకు మీరు కోపగించుకుని - "వందనా! నీకు ప్రొద్దున్నే నిద్ర మెలకువ రాదని తోస్తే నా పూజకు అన్నీసిద్ధం చేసిపెట్టవలసినభారం అన్నపూర్ణకు ఒప్పజెప్ప కూడదూ!" అన్నారుట. ఆ సంఘటన మీకు జ్ఞాపకం ఉందా విపిన్‌బాబూ!"

"ఉన్నది" అన్నాడు విప్రదాసు తల ఊపి.

"ఆలాగే ఆనాడు మేము చాలవిషయాలు మాటాడుకున్నాం; రాత్రి చాలపొద్దుపోయింది. చివరకు ఆమె అన్నది - "పెద్దమ్మ అవన్నీ కుసంస్కారా లంటుంది. నేనుకూడా కొన్నాళ్ళు ఆ కుసంస్కారాలే ఆచరించాను. కాని ఈనాడు ఏవికుసంస్కారాలో, ఏవి సుసంస్కారాలో .... నేను ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను. ఇంతవరకూ నేను అన్నపానాదులలో మడి, మైల పాటించియుండలేదు. చిన్ననాటినించీ ఏదిపడితే అది తింటూ వచ్చాను. కాని ఇప్పుడు నా మనస్సు సంకోచిస్తూ ఉన్నది. ఏ పని చెయ్యాలనుకున్నా.... అది విపిన్‌బాబుకు ఇష్టం లేనిదని తోస్తే.... చెయ్యలేకపోతున్నాను. అని"

విబివిబి విప్రదాసు లజ్జితుడైనాడు. బలవంతాన నవ్వుతెచ్చుకుని అన్నాడు, "అయితే ఇప్పుడు వందనాదేవి అన్నపానాదులవిషయంలో మడి, మైలా పాటిస్తున్నదా యేమిటి? మొన్న వచ్చినప్పుడు అలా చెప్పిందేం మరి? వాళ్ళ పెత్తల్లి గారింటికి వెళ్ళాక మళ్ళీ తనకు సహజమైన బుద్ధి వచ్చేసిందనీ, మాయింట్లో అలవడిన ఈ అనేక కుసంస్కారాలన్నీ వదలిపోయాయనీ సంతృప్తి ప్రకటించిందే!"

అశోకబాబు ఆశ్చర్యాన్వితుడై ఏదో మాటాడబోయాడు. కాని ఇంతలో వందనాదేవి వచ్చింది. సామానంతా సర్దేశాను. రేపు ఉదయం తొమ్మిదిన్నర బండికే ప్రయాణం. విపిన్‌బాబూ! మీరు ఈలోపుగానే

పూజ, గీజ, ఇంకా ఇతర కొరమాలిన పనులు.... అన్నీ పూర్తిచేసుకుని సిద్ధంగా వుండండి."

"చిత్తం, అలాగనే" అన్నాడు విప్రదాసు నవ్వుతూ.

"ఈ జంజాటమంతా మీరు ఎంత తగ్గించుకుంటే అంతమంచిదని నాసలహా. రేపు ఉదయం నేనే వచ్చి మీకు భోజనం, అదీ తయారుచేసి పెడతాను. చలి తగలకండా బాగా దుప్పటీ అదీకప్పి మిమ్మల్ని తీసుకు వెడతాను. మీకు సుస్తీగా ఉందికాదూ! అందుకోసం – పద, అశోక బాబూ! మనం వెడదాం – కాని విపిన్‌బాబూ! వెళ్ళేముందుకూడా తమకు పాదాభివందనం చెయ్యాను. ఎందుకంటే – అది కుసంస్కారం. గౌరవ నీయులకు తగదు" – అంటూ వందనాదేవి నవ్వి, ఫాలభాగాన చేతులు జోడించి, నమస్కారం చెప్పి వెళ్ళి పోయింది.




# 22

మర్నాడు అందరూ కలిసి బలరామపురం ప్రయాణమై వెళ్ళారు. అక్కడ ద్విజదాసు ఒక రాజసూయ యజ్ఞోత్సవానికి వలె సర్వసన్నాహాలూ చేస్తున్నాడు. ఒక విశాలమైన మైదానంలో అనేక వరుసలుగా పాకలు వేయిస్తున్నాడు. కొన్ని తయారైనవి; కొన్ని తయారౌతున్నవి. పిల్చినవారు, పిలవనివారు, ప్రజలు చాలమంది వచ్చారు. ఇంకా ఎంత మంది రానున్నారో మరి!

విప్రదాసును చూచి దయామయి విచలిత అయింది. "అదేమిటిరా నాయనా! అలా సగమై పోయావేం?"

విప్రదాసు ఆమె చరణధూళిగ్రహించాడు. "పరవాలేదులే అమ్మా! ఈసారి త్వరలోనే స్వాస్థ్యం చేకూరుతుంది"

"నిన్ను మళ్ళీ కలకత్తా వెళ్ళనీయను. ఎన్ని పనులున్నా సరే. ఇక్కడ నాకళ్ళముందు ఉండవలసిందే"

విప్రదాసు నవ్వి ఊరుకున్నాడు. వందనాదేవి ముందుకువచ్చి పాదాభివందనం చేసింది. దయామయి 'రావే అమ్మాయి, రా' అంటూ ఆశీర్వదించింది. కాని ఏదో మామూలుగా మర్యాదకోసం ఆదరించినట్టు ఉన్నదేగాని.... అంతకన్న ఎక్కువ ఆప్యాయత ఏమీకనిపించలేదు.

ప్రసంగవశాత్తు దయామయి మైత్రేయిని గురించి చెప్పింది. పిల్ల గుణవంతురాలే. ఆమె గుణకీర్తన చెయ్యటానికి ఒక్కనోరుచాలదని ఆమెకు విచారం. తండ్రి అన్నివిషయాలూ నేర్పాడామెకు. అన్ని పనులూ చెయ్యగల నేర్పు ఉంది. సతీదేవికి ఒంట్లో బాగుండటం లేదు. అందుచేత ఇంటిభారమంతా మైత్రేయే నిర్వహిస్తోంది. "ఆమెను పిలవ నంపించటం మంచి దైంది రా విపిన్! లేకపోతే ఇంటి పనులన్నీ నానెత్తిమీదే పడేవి. ముసలిదాన్ని. ఎంతకష్ట మయ్యేది!"

విప్రదాసు ఆశ్చర్య పోయాడు.

"నిజమేరా, విపిన్! ఈ భారమంతా నేనే మోయవలసిన అవ సరం లేదిక. పెద్దకోడలికి చిన్నకోడలుకూడా తోడైతే ఇద్దరూ ఎలాగో సంసారం నెట్టుకు పోతారు. పరవాలేదు. ఈ యేడు కాకపోతే వచ్చేయేటి కైనా నా మానస సరోవరయాత్ర తప్పదు."

విప్రదాసు మౌనంగానే ఉన్నాడు. అమ్మ చెబుతూన్న మాటలు నిజమే కావచ్చు. మైత్రేయి యదార్థంగా అంతగా ప్రశంసనీయురాలే కావచ్చు. కాని గుణప్రశంసకుకూడా ఒక హద్దుఉంది; సమయం ఉంది. దయామయి అతని ముఖలక్షణాలు గమనించి తాను చేసిన పొరపాటు తెలుసుకున్నది. ఇంతలో అల్లంతదూరాన పనిపాటల్లో నిమగ్నుడై యున్న ద్విజదాసు.... అన్నగారు వచ్చిన కబురు తెలియగానే.... అక్కడికి వచ్చాడు.

"చాలా జంజాటం పెట్టుకున్నావు, ఎలా నిర్వహిస్తున్నావురా ద్విజూ!" అన్నాడు విప్రదాసు తమ్ముని చూచి.

"ఏం చెయ్యను మరి; నువు పట్టించుకోలేదు. భారమంతా నా మీదికి నెట్టేశావు. అయినా ఇప్పుడు వచ్చిన లోపం ఏమిటి?"

ఈ మాటకు వందనాదేవి జవాబిచ్చింది—"లోపం ఏమీ లేదు. మీ అన్నగార్ని బాధిస్తూన్న చింతయేమిటంటే—ఈ ఉత్సవానికయ్యే ఖర్చంతా ప్రజలనించి వసూలు చెయ్యకపోతే ఖజానా అంతా ఖాళీ అయిపోతుందే అని. తెలిసిందా ద్విజుబాబూ!"

ఆ మాటకు అంతా నవ్వేశారు. దయామయి కూడా ప్రసన్నురాలైంది. కపటపుకోపం నటించి—" నువు కూడా మీ అక్కయ్యలాగే మా వాణ్ణి లోభి యని నిందిస్తున్నావుటే వందనా! వాడు పరమ ధార్మికుడు. తెలుసునా! మీ రంతా కలిసి వాణ్ణి నిందిస్తూంటే నేను సహించలేను "

" నింద అబద్ధ మైనప్పుడు అది మనల్ని అంటదు. దానికి కోప గించుకోవటం ఉచితంకాదు " అన్నది వందన.

" వాడు కోపపడ డసలు. విని నవ్వేస్తాడు " అన్నది దయామయి.

" పొట్ట నిండితేసరి. వీపుమీద ఎన్ని దెబ్బలైనా సహిస్తాడు మీ అబ్బాయి. కోపపడటం మూర్ఖత అని ఆయన అభిప్రాయం. ఔను కాదూ విపిన్‌బాబూ! " అన్నది వందనాదేవి.

" ఔనౌను. మూర్ఖుల మాటలన్నిటికీ కోపం తెచ్చుకోవటం ఉచితం కాదు. అట్టి మూర్ఖులయెడ ప్రవర్తించవలసినతీరు శాస్త్రాల్లో ఇంకోవిధంగా చెప్పివుంది " అన్నాడు విప్రదాసు.

" మా అక్కయ్య నాకన్నా మూర్ఖురాలుకదా విపిన్‌బాబూ! ఎలా వేగుతున్నా వబ్బా ఆమెతో? ఏదో శాస్త్రం అండగా పెట్టుకుని అందర్నీ దబాయించి కొట్టుకుపోతున్నారల్లేఉంది " అంటూ వందనాదేవి పకపకా నవ్వింది. ద్విజదాసు పక్కకు తిరిగి నవ్వాపుకుంటున్నాడు. దయామయి కూడా నవ్వేసి అన్నది—" పిల్ల మహాచెడ్డ చిలిపి; మాటల్లో దాన్ని ఓడించటం ఎవరికీ చాత కాదు "

" కాని వందనా! మావాడు పరమ ధార్మికుడని నీకు చెప్పనే చెప్పాను. ప్రజలు వాణ్ణిచూచి భయపడటం లేదని నే ననను. అయినా వాడు చేసిన అన్యాయం ఏమీ లేదు. చేయరాని పనులు ఇంకా ద్విజూ చేస్తాడంటే నేను ఒప్పుకుంటానుగాని, మా విపిన్‌ను మీ రేమనటానికీ వీల్లేదు " అన్నది దయామయి కాసేపు ఊరుకుని.

" ద్విజూను గురించి నువ్వెప్పుడూ అంత అన్యాయంగా మాటా డకు అమ్మా! ప్రజల్ని ఎప్పుడైనా వాడు బాధించాడా చెప్పు! ప్రజలపక్షం వహించి మనతో కూడా వాడు విరోధించిన రోజులున్నాయి. నీకు తెలి యదూ? "

" తెలిసే మాటాడు తున్నానురా విపిన్! ప్రజలచేత మనకు రావల సిన బాకీలను ఎగబెట్టించినవాడే, ప్రజలదగ్గిర డబ్బు అన్యాయంగా వసూలు చేయగలడు. వాడిలో కరుణ ఉండవలసిన దానికంటే అధికంగా ఉన్నది;

నే నెరుగుదును. కాని ముమ్మందు చూస్తావుగా ! వాడి మూలాన్నే ప్రజల బాధలు పెరుగుతాయి "

"ఉహుం. నేను ఒప్పుకోను ; చుస్తావుగా ! "

"నువు పక్కన ఉన్నన్ని నాళ్ళూ ఏమీ పరవాలేదు. లేకపోతే వాణ్ణి మంచిదారిలో నడిపించగల మొనగా డెవరున్నారు ? నువు లేని నాడు వాడూ మునిగిపోతాడు, ప్రజల్నీ ముంచేస్తాడు "

ఇంతవరకూ మౌనంగానే ఉండిన ద్విజదాసు ఇప్పుడు నోరు చేసుకున్నాడు—" నువు చివర అన్నమాట సత్యం కాదమ్మా ! ఎప్పటికైనా నేను మునిగిపోతే మునిగిపోవచ్చు. కాని నాతో కూడా ఇతర్లను కూడా ముంచివేయను. తెలుసునా ? "

"అది మాత్రం ధీరోదాత్తుని లక్షణమా ఏమిటిరా ద్విజూ ! నేను చెప్పే దేమిటంటే - నిన్ను సరైన మార్గంలో నడిపించే నాధుడొకడు నిరంతరం నీపక్కన ఉండాలి ; తప్పదు. "

" చేశావుగా అలాంటి యేర్పాటే ఒకటి " అన్నాడు ద్విజబాబు కనుబొమలు కుంచించుకుని.

" చేస్తే నీ బాగుకోసమే చేశాననుకో "

ఈ తర్క వితర్కాల మూలతాత్పర్యం అందరికీ గ్రాహ్యమైంది.

" నువు ఇప్పుడు ఎంతభారీ ఏర్పాట్లు చేశావోచూడు. ఎవరిమాటా విన్నావుకాదు. 'అన్నయ్య చెప్పాడు చేస్తున్నా ' నంటూ ఎంతకాండ పెంచావో తెలుసునా ? మీ అన్నయ్య అశ్వమేధయజ్ఞం చెయ్యమని చెప్పాడా ? మైత్రేయి వచ్చింది కాబట్టి సరిపోయింది. లేకపోతే ఈ నిర్వాహకమంతా ఎవరు భరించేవారు ? " అన్నది దయామయి.

" ఇంకేం, ఈ ఉత్సవం అయిన తరువాత నీ కిష్టమైన వాళ్ళందరికీ బహుమానాలిచ్చి పంపించుదువుగానిలే. ఇప్పుడీ గందరగోళం అంతా దేనికీ ? " అన్నాడు ద్విజబాబు.

" అయితే ద్విజుబాబూ ! ఈ బహుమానాలను మంజూరు చేయవలసినది ఎవరు ? మూడవ తరగతికి చెందిన వ్యక్తికాదా ? " అన్నది వందనాదేవి

" ఎబ్బే. మూడోతరగతి వాడికి అంత అధికారం ఎక్కడపేడిసింది ? ప్రధమ-ద్వితీయ తరగతుల వారివే ఈ నాటికీ సర్వాధికారాలు " అంటూ ద్విజదాసు పకపక నవ్వాడు.

విప్రదాసు, దయామయి ఒకరి మొగం ఒకరు చూచుకుంటూ ఉండి పోయారు. వారికేమీ అర్థం కాలేదు.

ఇంతలో అన్నపూర్ణ అక్కడికివచ్చి వందనాదేవిని లక్షించి — " అమ్మాయిగారూ ! పెద్దబాబుగారికోసం తెప్పించిన మందుసీసాలు మీరు ఏ పెట్టెలో పెట్టారూ ? ఎంతవెదకినా నాకు కవిపించటంలేదు " అన్నది.

" కలకత్తాలోనే విడిచిపెట్టి వచ్చేశాం " అన్నది వందనాదేవి

" అరె, పెద్దపొరపాటే జరిగిందే ! ఇప్పుడెలా మరి ? " అన్నది దయామయి ఆతృతగా.

" పొరపాటేమీ కాదత్తా ! బుద్ధిపూర్వకంగానే విడిచిపెట్టివచ్చేశాం" అన్నది వందనాదేవి.

" అదేం ? " అన్నది దయామయి.

" విపిన్‌బాబు మందులు, మాకులు చాల సేవించాడు. ఇంకా ఎందుకా మందులు ? అమ్మగారి దగ్గర చేరుకున్నాడు. ఇక మందుల అవసరం లేకండానే కోలుకుంటాడు " అన్నది వందనాదేవి.

ఆ మాటలు దయామయి చెవికి ఇంపుగానే తగిలినవి. కాని అన్నది. " ఏం పనిచేశావువందనా ! ఈ పల్లెటూరులో వైద్యసహాయం దొరక దాయెను అవసరమైతే...."

" ఇక అవసరం లేదు లెండి అమ్మగారూ ! అవసరంవుంటే అమ్మాయిగారు తీసుకురాకండా ఊరుకుంటారా ? మన వందనాదేవికి చదువుకున్న డాక్టర్లకంటే ఎక్కువ తెలుసు " అన్నది అన్నపూర్ణ.

దయామయి వందనాదేవిని ప్రశంసాపూర్ణ దృష్టిని అవలోకించింది.

" అన్నపూర్ణ నన్నుగూర్చి ఉత్ప్రేక్షించి చెబుతున్నది అత్తా ! నిజానికి నాకేం తెలుసునూ ? నాకేమైన తెలిసిన విషయమంటూ వుంటే.... విపిన్‌బాబు శుశ్రూషచేసి నేర్చుకున్నదే " అన్నది వందనాదేవి

అన్నపూర్ణ అందుకుని ఇలాచెప్పింది — " ఆ శుశ్రూష ఎలాంటిదో నాకు ఒక్కర్తెకే తెలుసును అమ్మగారూ ! ఒకనాడు నేను ఎంత దిగులు బడి పోయాననుకున్నారు ? ఇంట్లో ఎవరూ లేరాయెను. మన వాసుకు జ్వరం వచ్చినట్టు టెలిగ్రాం రాగానే ద్విజబాబు వెళ్ళిపోయాడు. దత్తజీ ఢాకా వెళ్ళాడు. మొదట ఎలాగో రెండు మూడు రోజులు గడిపాను. నాలుగోనాడు విపిన్‌బాబుకు జ్వరంబాగా వచ్చింది. గాభరాపడి డాక్టర్ని పిల్చాను. డాక్టరువచ్చి మందు ఇచ్చాడు. కాని చాల జాగ్రతగా ఉండా

లన్నాడు. నేను వల్లెటూరిదాన్ని. నాకేంతోచలేదు. మీకు ఇక్కడికి కబురు చేదామంటే బాబు వద్దనేశాడు. ఏం చెయ్యనూ ? వ్యాకులపడుతూ తిన్నగా వందనాదేవికోసం ఆమె పెత్తల్లిగారింటికి పోయాను. "అమ్మాయిగారూ ! మా మీద కోపం సాధించకండి; పెద్దబాబు జ్వరంతో ఉన్నారు. మీరు రావాలి" అని ఏడుస్తూ చెప్పాను. వందనాదేవి నా మాట వినగానే ఉన్న పాళాన నాతో బయలుదేరి వచ్చేసింది. వచ్చేటప్పుడు పెత్తల్లిగారితో చెప్పనూలేదు. ఆమెగారి అనుజ్ఞ తీసుకోనూలేదు. వచ్చేసింది. విపిన్ బాబు రక్షణభారమంతా నాటినించీ ఆమేవహించి రాత్రింబవళ్ళు....క్షణంవిశ్రాంతి లేకండా .... ఎంతగా ఉపచారం చేసిందనుకున్నారు ? కేవలం మందు త్రాగించటమేకాదు; ఉదయం పూజాద్రవ్యాలు సిద్ధంచేయటం మొదలుకొని రాత్రి దోమతెరవేసి బాబును నిద్రపుచ్చేంతవరకూ .... సమస్తభారమూ ఆమే నిర్వహించేది. అట్టి వందనాదేవి ఇవాళ మందుసీసా దాచేసి వచ్చిం దంటే మనం విచారపడ నక్కర్లేదు అమ్మగారూ ! పెద్దబాబు త్వరలోనే కోలుకుంటాడు"

విప్రదాసుకూడా అన్నపూర్ణ చెప్పినదానికి అంగీకార సూచకంగా తల ఊపాడు. "నాకు వచ్చిన పరవాయేమీ లేదమ్మా ! ఇక నేను మందు తిననక్కర్లేదని వందనాదేవి నిశ్చయిస్తే .... అది సరియైన నిశ్చయమే. సుబుద్ధితో చేసిన నిశ్చయమే. "వందనాదేవి రాజారాణి యౌగాక ! త్రికరణశుద్ధిగా నేనామెను ఆశీర్వదిస్తున్నాను"

దయామయి వందనాదేవికేసి చూచినచూపులో మమత, వాత్సల్యం చిందులాడినవి.

ఇంతలో దాసీదివచ్చింది. "అమ్మా ! కలకత్తానించి వచ్చిన సామానులన్నీ ఏ గదిలో సర్దమన్నారో మిమ్మల్ని అడిగి కనుక్కు రమ్మ న్నారు కోడలుగారు."

దయామయి ఏమీ జవాబు చెప్పకముందే వందనాదేవి నోరు చేసు కుంది. "అత్తా ! కావలసినంత కార్యభారం ఉందాయెనుమరి ! మ్లేచ్ఛ బాలికను నేనెందుకూ ఉపయోగ పడనంటారా ? చేతులు కట్టుకుని ఊరికే కూచోనా ? నేను ముట్టుకున్నా మైలపడని వస్తువులుకూడా చాల ఉంటా యిగా ! అటువంటివన్నీ చక్కబెడుతూంటాను"

దయామయి ఆవేశంగా ఆమెచేయిపట్టుకుని లాగి వందనాదేవిని గట్టిగా కావలించుకుంది. కొంగునఉన్న తాళపుచెవుల గుత్తితీసి ఆమె చేతి

కిచ్చింది - 'ఊరికే ఎందుకు కూచోబెడతానే పిల్లా విన్నూ? ఈ తాళపు చేతులు మన భాండారపు కొట్టువి. ఈ తాళపుచేతులు నా కోడలికి తప్ప ఎవరికీ ఇచ్చేవికాదు. ఇవాళ నీకు ఇచ్చేస్తున్నాను"

"ఈ భాండారపు కొట్లో ఏమేమి ఉంటాయి?"

ఆ ప్రశ్నకు ద్విజదాసు జవాబు చెప్పాడు - "బంగారం, వెండి, రవికలు, చీరలు....ఎవరు ముట్టుకున్నా ఏమీ ఇబ్బందిలేని వస్తువులన్నీ ఉంటాయి. మవు ముట్టుకున్నా వాటిని తీసుకుపోయి పరమసనాతనులకిస్తే వారు కళ్ళకద్దుకుని, నెత్తిన పెట్టుకుంటారు. ఏం పరవాలేదు"

"ఏం చెయ్యాలి నే నక్కడ?" - వందనాదేవి అడిగింది.

"ఉపాధ్యాయులను, పండితులను సన్మానించటం; అతిధి - అభ్యాగతులను ఆదరించటం, వచ్చిన బంధుమిత్రులకు భోజనాదికాల యేర్పాట్లు చేయించటం, ముఖ్యంగా ఆ కుర్రవాణ్ణి జాగ్రతగా కనిపెట్టి వుండటం - ఇవీ నీ పనులు" అంటూ దయామయి ద్విజబాబునుచూపించి ఇంకా ఇలా చెప్పింది- "వాడురాసిన లెక్కా, డొక్కా నేనుచదువగలనా, పెట్టగలనా? అది కనిపెట్టి వాడు ఎంతడబ్బు వృధాఖర్చు చేస్తున్నాడో తెలుసునా? అందుకోసం వాణ్ణి నువు అజమాయిషీ చేస్తూండాలి."

"అన్నయ్య ఇక్కడ ఉండగా నువు అలాటి మాటలు అనకమ్మా. నిజమే ననుకుంటాడు. దేవికెంత ఖర్చు పెడుతున్నానో.... అంతా వివరంగా ఖాతాలో రాస్తున్నాను. చూస్తేతెలుస్తుంది." అన్నాడు ద్విజబాబు.

"నేనేం చూడగలను? ఖాతాలో నువు రాయటంలేదని నేనటం లేదు. వ్యర్థంగా ఔతూన్న ఖర్చులను గురించి పిల్లతో చెబుతున్నాను" అన్నది దయామయి.

"తెలిసి మాత్రం నేనేమి చేస్తానత్తా. నాడబ్బు నాయిష్టం వచ్చినట్టు దుర్వ్యయం చేసుకుంటానంటే.... నేనేం చేసేది?" అన్నది వందనాదేవి.

"ఏమైనా చెయ్యి నీయిష్టం. భారం ఒప్పజెప్పమన్నావు. ఒప్పజెప్పేశాను. నాపని అయిపోయింది. ఎప్పటికైనా నువుకూడా ఒక ఇంటిదాని వౌతావు కదా! గృహభారం నిర్వహించాలికదా? వృధాఖర్చులుచేసే మహనీయుడు దొరుకుతాడనుకో. 'నేనేం చేసేదీ?' అని ఊరుకుంటే గడుస్తుందా?" అన్నది దయామయి.

వందనాదేవి ద్విజదాసు కేసి చూచింది. "అమ్మగారేమంటున్నారో విన్నావా ?"

"విన్నానులే. కాని ఖర్చుచేసే అధికారం అన్నయ్య నాకిచ్చాడు. ఖర్చులు బందుచేసే అధికారం అమ్మ నీ కిచ్చింది. ఇది యుద్ధానికే దోవ తీస్తున్నది. అప్పుడు నన్నేమన్నా లాభంలేదు."

వందనాదేవి నవ్వింది. "విన్నా నేనెందుకంటాను. యుద్ధం వరకూ సాగదీస్తావాయేమిటి ? అయినా నీడబ్బు నువు ఖర్చుచేస్తూంటే అనవసరంగా నేనెందుకు నీతో దెబ్బలాడతానూ ? దెబ్బలాట వస్తుందని తోస్తే.... ముందుగానే తాళపుచేతులు అమ్మకిచ్చేసి వెనక్కు పోతాను"

వందనాదేవి మాటల్లో ధ్వనించిన స్వాభిమానం దయామయి గమనించి ఇలా అన్నది- "నీకిచ్చివేసిన భారం నేను మళ్ళీ గ్రహించను వందనా ! నువ్వే అభారం నిర్వహించుకో వలసిందే. పద, లోపలికి పద, అంతాచూపిస్తాను" అంటూ ఆమె వందనాదేవిని చెయిపట్టుకుని తీసుకు పోయింది.

వందనాదేవి ఆ నాడు వచ్చినప్పుడు ఆ యింట్లో ఒక్కరోజైనా ఉండలేదు. ఎక్కడ ఏమి వున్నదో ఆమె అప్పుడు సరిగా చూడలేదు. ఇప్పుడు ఆ విశాలమైన గృహం, అపారమైన వస్తుసామగ్రి చూచి ఆశ్చర్యపోయింది. ఆశ్రితులు, బంధువులు, మిత్రులు లెక్కకు మిక్కిలిగా వచ్చారు. ప్రతిపనికీ నౌకర్లు నియమితులై ఉన్నారు. ఒకవైపు కచేరి, తత్సంబంధమైన పరివారం ఉంది. దేవమందిరం, వంటయిల్లు మరొక వైపున ఉన్నవి. అపైని విశాలమైన గోశాల ఉంది. చుట్టూ పెద్దపెద్ద గోడలు గలిగి ఉద్యానవనంకూడా ఉంది. రెండో అంతస్తుమీద దయామయి గది ఉంది. అందులోనించే ఆమె వందనాదేవిని తీసుకుపోయి ఒక గదిముందు నిల్చి- "ఇదే నీగది వందనా ! ఇక్కడి దక్షత అంతా నీది" అన్నది.

ఆ పక్కనే వరండాలో సతీదేవి, మైత్రేయి కూచుని ఏవో వస్తువులు పరీక్షిస్తూ ఉన్నారు. దయామయి కంఠస్వరం విని తలెత్తిచూచారు. వందనాదేవికూడా కనిపించగానే ఇద్దరూ లేచి అక్కడికి వచ్చారు. ఆమె వస్తుందని ఎవరూ అనుకోలేదు. వందనాదేవి అక్కగారి పాదధూళి గ్రహించి మైత్రేయికి నమస్కారం చెప్పింది.

"ఈ నామ్లేచ్ఛ బాలిక ఏదో ఒక పని ఒప్పజెప్పమన్నది. ఊరికే కూచుంటే దీనికి దెబ్బలాడాలని బుద్ధిపోతుంది. అందుకని ఈ భాండారపు కొట్టు వందనాదేవికి ఒప్పగిస్తున్నాను." అన్నది దయామయి

"ఈ భాండారపుకొట్లో ఏముంటాయి?" అని ప్రశ్నించింది మైత్రేయి.

"మ్లేచ్ఛబాలిక ముట్టుకున్నా పరవాలేని వస్తువులన్నీ ఉంటాయి." అంటూ దయామయి సకౌతుకంగా నవ్వి గదితాళం తీసింది. అందరూ లోపల ప్రవేశించారు. అక్కడ వెండి పళ్ళేలు బొత్తులు బొత్తులుగా పేర్చిఉన్నవి. వాటితోనే బ్రాహ్మణ పండితుల సన్మానాలు జరుగవలసి ఉన్నది. కలకత్తావించి కొనితెచ్చిన విలువగల చీరలు, రవికలు, ధోవతులు చాలా ఉన్నవి. ఒక అలమారవేపు చూపిస్తూ దయామయి చెప్పింది. "నా సర్వస్వమూ అందులో ఉంది వందనా! ద్విజదాసుకు దానిమీద లోభం ఎక్కువ మవు జాగ్రతగా పహరాకాస్తూ ఉండాలి. నన్ను చాలసార్లు కన్ను మప్పాడు. నువుమాత్రం వాడి మోసంలో పడకు సుమీ!"

వందన తన గురుతర భారాన్ని గమనించి ఉదాసీనభావం ప్రకటించింది. అది కని పెట్టి సతీదేవి చెల్లెలి తరపున ఇలా అన్నది- "ఇంత భారం వందనాదేవికి ఒప్పజెప్పటం వల్ల ఏంలాభం అత్తా! ఇంత డబ్బు, ఈ ...."

అర్థోక్తిలోనే దయామయి అందుకుని- "ఇంతడబ్బుతో సంబంధించిన పని యని తెలిపే తాళపుచేతులు మీ చెల్లెలికిస్తున్నాను. లేకపోతే ద్విజుగాడు ఒకరోజులో నన్ను దివాలా తీయించెయ్యడూ?"

"కాని వందనాదేవి పరాయి యింటిపిల్ల!" అన్నది సతీదేవి.

దయామయి నవ్వింది. "నువ్వూ ఒకప్పుడు పరాయి యింటిపిల్లవేగా! నేనూ పరాయి యింటినించే వచ్చాను నీకన్నాముందు. అదొకపెద్ద అభ్యంతరం కాదులే. సరే నేనిక వెడతాను" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

"మీ యింటికివచ్చి చాలపెద్ద అవస్థలోనే పడ్డానే! ఊపిరి పీల్చటానికైనా వీలుంటుందా?" అని అడిగింది వందనాదేవి అక్కయ్యను.

"ఔను అలాగే కనిపిస్తున్నది" అంటూ సతీదేవి మందహాసం చేసింది.

# 23

మానవ జీవితంలో ఆపదలు ఎక్కడ దాగివుంటాయో, ఎప్పుడు వచ్చి మీదపడతాయో....ముందుగా ఎవరు చెప్పగలరు ? ఆలోచించినకొద్దీ దుర్భోధ్యమైన విషయమది.

తటాక ఖనన ఆరంభ ముహూర్తమందు జరుగవలసిన శాస్త్రీయ క్రియ ముగిసింది. దయామయి మంటపం విడిచి ఇంటికి వచ్చింది. రాగానే కూతురు కళ్యాణి ఎదురైంది.

"ఒక్క క్షణంకూడా ఇక్కడ ఉండటానికి వీల్లేదుట. బయలు దేరమంటున్నారు. రైలువేళ అయిందిట. ఉంటే స్టేషన్‌లో ఉందాం, ఈ యింట్లోవద్దు—అంటున్నా రాయన"

కూతురు దీనవదనయై చెప్పిన మాటలు దయామయికి పూర్తిగా అర్థంకాలేదు ; ఆమె విచలిత అయింది.

"ఎవరు బయలుదేర మంటున్నారు ? శశిధరుడా ? ఏమంత తొందర ?" అని అడిగింది దయామయి.

"పెద్దన్నయ్య వారిని అవమానించాట్ట ; ఇంట్లోవించి గెంటే శాట్ట"—అంటూ కళ్యాణి వెక్కి వెక్కి ఏడుపు ఆరంభించింది.

ఎక్కడ చూచినా ఉత్సవం చూడ్డానికి వచ్చిన మనుష్యులే మసలు తున్నారు ; కొందరు భోజనాలు చేస్తున్నారు ; కొందరు యాచక వృత్తి మీద వచ్చారు ; ఒకచోట పాటకచేరీ జరుగు తున్నది ; మరొక చోట బ్రాహ్మణ పండితుల శాస్త్రచర్చలు సాగుతున్నవి ; అంతా కోలాహలంగా ఉంది. అటువంటి సమయంలో ఈ అంతర్నాటకం ఏమిటి ?

సతీదేవి, మైత్రేయికూడా అక్కడికి వచ్చారు. భాండారపు గదికి తాళంపెట్టి వందనాదేవి కూడా అక్కడికి చేరింది. వచ్చిన బంధువులు చాలమంది కుతూహలంగా చూస్తున్నారు. శశిధరుడు వచ్చి దయామయికి నమస్కరించి—"అత్తగారూ ! మేము వెళ్ళిపోతున్నాం. మీరు పిల్చారు, వచ్చాం ; కాని మేమిక్కడ ఉండలేము" అన్నాడు.

"ఎందుకని నాయనా? ఏం కష్టం మీకిక్కడ?"

"విప్రదాసు బాబు మమ్మల్ని తక్షణం వెళ్ళిపొమ్మన్నాడు"

"ఎందుకనీ?"

"తాను జమీందారు కాబట్టి ధనమదం తలకెక్కితే కళ్ళు కనిపిస్తాయా, చెవులు వినిపిస్తాయా! ఇంటికి రప్పించుకుని, అవమానించి పంపిద్దా మనుకున్నాడు కాబోలు! నీ కొడుక్కి కాస్త తెలియచెప్పు అత్తా! మా నాన్నకూడా పెద్ద జమీందారే! మేము అడుక్కు తింటూన్న వాళ్ళ మేమీ కాదు."

దయామయి వ్యాకులచిత్త అయింది. "విపిన్‌బాబును పిల్చి సంగతేమిటో కనుక్కుంటాను ఉండు నాయనా! ఇంకా నాకు చాల పనులున్నవి. బ్రాహ్మణ భోజనాలు కాలేదు. వైష్ణవ భిక్షుకులు అలాగే ఉన్నారు. ఇప్పుడే మీరు కోపంవచ్చి వెళ్ళిపోయేట్టయితే....ఇప్పుడు వ్రవ్వటం ఆరంభించిన చెరువులోనే దూకి చచ్చిపోతాను."—అమె కన్నులు అశ్రుపూర్ణములైనవి.

అమె కన్నీళ్ళు కార్చినందువల్ల ప్రయోజన మేమీ లేకపోయింది. శశిధరుడు గొప్ప యింటపుట్టినవాడే. అయినా ఆకృతి-ప్రకృతులు కులీనులకు ఉండదగినవి కాదు. కోపంవచ్చి గుర్రుపెట్టే గండు పిల్లిలా వున్నాడా సమయాన. "విప్రదాసుబాబు కనుక ఈ అందరి ముందరా నా రెండు చేతులూ పట్టుకుని క్షమాపణ కోరుకుంటే ఉంటాను. లేకపోతే నేను ఉండేదిలేదు." అన్నాడు.

ఆమాట విని అందరూ ఆశ్చర్యపోయారు. నిరుత్తరులైనారు. విప్రదాసుబాబు వచ్చి చేతులు పట్టుకుని క్షమాపణ అడుగుతాడా? ఇంత మందిలోనా? సతీదేవి ముఖంలో నెత్తురుచుక్కలేదు. "ఇప్పుడు కాదు అన్నయ్యా! కాస్త ఓపికపట్టు. పనులన్నీ అయిపోనీ. రాత్రికి ఈవిషయం అత్తయ్య ఆలోచిస్తుందిలే. నీకు అవమానం జరిగితే ఊరుకుంటామా? అపరాధం జరిగివుంటే తప్పకుండా వారు క్షమాపణ కోరుకుంటారు." అన్నది సతీదేవి.

వందనాదేవి కనుగొలకులలో కూడా అశ్రుబిందువులు కూడినవి. "మీ వారు ఎప్పుడూ ఏ అపరాధమూ చెయ్యరే అక్కా!" అన్నది శాంతస్వరాన.

"నోరు మూసుకో వందనా! తప్పులు చేయనివా రెవరు?" అన్నది సతీదేవి.

"ఉహుం. విపిన్‌బాబు తప్పుచెయ్యడు" అని ఖచ్చితంగా అనేసింది వందన.

ఆ మాటకు మైత్రేయి మండిపడ్డది—"నీ కెలాతెలుసు? నువు అంతా స్వయంగా చూచావా? శశిధరబాబు అబద్ధం చెబుతున్నాడంటావా?" అన్నది తీక్షణస్వరాన.

వందనాదేవి మైత్రేయికేసి తదేకంగా కాసేపు చూచింది "వీరు అబద్ధంచెబుతున్నారని నేనవలేదు. విపిన్‌బాబు తప్పుచేసేమనిషి కాదంటున్నాను."

మైత్రేయి ఇదివరకులాగే వ్యంగ్యంగాఅన్నది — "తప్పులు అందరూ చేస్తారు. మనుష్యులు దేవతలా యేమిటి? మా నాన్నగారికికూడా అవమానం జరిగింది. కాని గమ్మున ఊరుకున్నారు."

"అయితే శశిధరబాబులాగే వెంటనే బయలుదేరి ఇక్కడినించి వెళ్ళిపోవటమే ఉచితం. ఇక్కడే పడివుండటం బాగులేదు" అన్నది వందనాదేవి.

"నీతో వాగుతూ కూచో వలసినఅవసరం మాకేమీలేదు. ఆహ్వానాలు పంపింది ద్విజబాబు ఆయినదగ్గర తేలవలె ఈ మీమాంస" అన్నది మైత్రేయి తీవ్రస్వరాన.

ఈ సంభాషణ అంతా సతీదేవికి కష్టం కలిగించింది. "ఒసే, వందనా! నీ కాళ్ళుపట్టుకుంటాను; నువు ఇక్కడ్ణించి వెళ్ళిపో, నీ పని చూచుకో" అన్నది.

శశిధరుడు దయామయిని లక్షించి ఇలా అన్నాడు — "మీ న్యాయాన్యాయ విచక్షణకోసం నేనిక్కడికి రాలేదు. మీ పెద్దకొడుకు వచ్చి నా చేతులు పట్టుకుని క్షమాపణ వేడుకుంటాడా లేదా? వేడుకోకపోతే నా దారిన నేను వెళ్ళిపోతున్నాను. ఒక్క నిమిషంఆగను. నీ కూతురు నాతోపాటు వస్తే వస్తుంది. ఇష్టంలేకపోతే రానక్కర్లేదు. ఆ మరణాంతమూ మళ్ళీ నా ముఖం చూడనక్కర్లేదు. ఇంతటితో మీకూ, మాకూ సంబంధం అఖరై పోయినట్టే."

శశిధరుడు ఎంతకైనా తగినవాడే. ఉత్సవం కదాఅని కూతుర్నీ అల్లుణ్ణీ ఇంటికి పిలిపించుకుంటే ఇలా జరిగింది. అక్కడే నిల్చుని కళ్యాణి

ఏడుస్తోంది. ఎవరూ పరామర్శించటం లేదు. దయామయి లజ్జావమానాలతో వేగిపోతున్నది. ఏమి చెయ్యాటానికి తోచటంలేదు. "కాస్త తాళు, నాయనా! విపిన్‌బాబును పిలిపిస్తా ఉండు. ఏదో పొరపాటు జరిగి వుంటుంది; ఇంతమందిలో నువు ఇలా గోలచేస్తూంటే నాకు ఆత్మహత్య చేసుకోవా లనిపిస్తున్నది."

"సరే, పిలిపించు చప్పున. అయినా ఏం లాభం? నే నేమీ ఎరగను — అవి అబద్ధం ఆడతాడు" అన్నాడు శశిధరుడు.

"వాడు ఎన్నడూ అబద్ధం ఆడడు నాయనా శశిధర్!" అంటూ దయామయి విప్రదాసుకు కబురు చేసింది. అయిదు నిమిషాలతరువాత విప్రదాసు వచ్చి నిల్చున్నాడు. మామూలుగా శాంతంగానే, గంభీరంగానే ఉన్నాడు. కన్నుల్లో మాత్రం ఏదో నీలినీడ కనిపిస్తున్నది. అంతకు తప్పితే అతని హృదయంలోని భావం దుర్గ్రాహ్యంగానే ఉంది.

"అరే విపిన్! శశిధర్ ఏమంటున్నాడో విన్నావా? నువు తన్ను ఇంట్లోనించి వెళ్ళిపొమ్మన్నావుటగా! ఇది విశ్వసించ తగినమాటేనా?"

"ఔను, విశ్వసించ తగిన మాటే."

"నిజంగా నువు నా అల్లుణ్ణి.... ఇంత ఉత్సవం జరుగుతూంటే.... ఇంట్లోనించి వెళ్ళిపొమ్మన్నావా?"

"ఔను, వెళ్ళిపొమ్మన్నాను. మళ్ళీ నా యింట్లో అడుగు పెట్టవద్దనికూడా చెప్పాను"

దయామయి కా మాట పిడుగు పడినట్టయింది. కాసేపు జడత్వం వహించి చివరకు అడిగింది - "ఎందుకనీ?"

"కారణం నువు తెలుసుకోకపోవటమే మంచిది"

సతీదేవి మరింత వ్యాకుల చిత్త అయింది. ఇక ఊరుకుండ లేక భర్తను ప్రార్థించింది - "కారణం మేము విన కుతూహలపడటం లేదు. మన కళ్యాణిని తీసుకుని ఇటువంటి ఉత్సవ సమయాల్లో ఉండకుండా శశిధరబాబు వెళ్ళిపోతా నంటున్నాడు. అలా జరిగితే ఇంతమందిలో మనకు ఎంత అప్రతిష్ఠో ఆలోచించండి. ఏదో పొరపాటయిందని చెప్పి, వాళ్ళను ఉండమని బ్రతిమాలండి"

విప్రదాసు క్షణమాత్రంగా భార్యముఖంలోకిచూచాడు. "నేనెప్పుడూ అన్యాయంగా ప్రవర్తించను సతీ!" అన్నాడు.

"అన్యాయం చెయ్యని వా రెవరుంటాలెండి ప్రపంచంలో. వాళ్ళను ఉండమని బ్రతిమాలరూ!"

"ఉహుఁ. నేనేమీ అన్యాయం చెయ్యలేదు"

భార్యా భర్తల మాటలువింటూ స్తబ్ధయై నిల్చుంది దయామయి. హఠాత్తుగా ఆమెలోనుంచి తీవ్ర కంఠస్వరం వెలువడింది. "న్యాయాన్యాయ విచక్షణ అలావుండనీ, ఈ దెబ్బతో నాకు కూతురూ, అల్లుడూ శాశ్వతంగా దూరమైపోతారు. నేను సహించలేను. శశిధరునికి క్షమాపణ చెప్పుకోరా విపిన్!"

"చెప్పుకోనమ్మా! అది అసంభవం"

"సంభవమో, అసంభవమో నాకైతే తెలియదు. నువు క్షమాపణ చెప్పుకో వలసిందే"

విప్రదాసు మాటాడలేదు. కాని స్థిరంగా నిల్చున్నాడు. అతని తీరు చూస్తే అసంభవం సంభవయ్యే సూచనలేమీ కనిపించలేదు. దయామయికి కోపం బాగా వచ్చేసింది. "ఈ యిల్లు నీ ఒక్కడిదేకాదు; ఇతర్లను వెళ్ళగొట్టే అధికారం మీ నాన్న నీకిచ్చిపోలేదు. వాళ్ళు ఈ ఇంట్లోవుంటారు"

"ఆ మాటే నువు నన్ను ఏకాంతంగా పిల్చి చెప్పి యున్నట్లయితే మారు మాటాడేవాణ్ణికాదు. కాని ఇప్పుడిక నేను ఊరుకోలేను. శశిధర్ ఇక్కడఉండే పక్షంలో నే నీ యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతాను. మళ్ళీ తిరిగిరాను. నీ యిష్టం."

విప్రదాసు ఎప్పుడూ ఇంత భయంకరంగా మాటాడి యుండలేదు. దయామయి విచికిత్సలో చిక్కుకుంది. ఒకవైపు కూతురు, అల్లుడు. మరొక వైపు ప్రాణాధికుడైన కొడుకు విపిన్‌బాబు. తన చేతులమీదుగా పెంచింది, పెద్దచేసింది; ఆత్మీయుడు. దుఃఖాల్లో స్వాంతనము. విపత్తులో ఆశ్రయము అయిన పుత్రరత్నము విపిన్‌బాబు. అతన్ని వొదులుకోవట మంటే తాను మరణించట మన్నమాటే. కాని తన సంకల్పాన్ని త్యజించ గలదా? తన పాదాలక్రింద తన్ను ఆహరించుకోనున్న ఒక అగాధగహ్వారం తయారౌతున్నది. తనకు తెలుసును. కాని ఈ సర్వనాశనమును అడ్డుకో గల ప్రతిక్రియ ఆమెకు తోచలేదు. అకస్మికంగా, దైవికంగా ఈ మహా విపత్తు ముంచుకు వచ్చేసింది. వస్తూన్నదని తెలిసికూడా ఆమె తన స్వాభిమానాన్ని అణచుకోలేకపోయింది; కోపాన్ని నిగ్రహించుకోలేకపోయింది. "నీ మొండిపట్టు అనుచితమైనదిసుమీ విపిన్! నీ మూలంగా కూతుర్నీ

అల్లుణ్ణి శాశ్వత శత్రువులను చేసుకోలేను. నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి - శశిధర్ ! నువు నాతో వచ్చేసెయ్యి. వాడి మాటలు వినవలసిన పనిలేదు. ఈ యిల్లు వాడి ఒక్కడిదేకాదు." - అంటూ కూతుర్నీ అల్లుణ్ణీ తీసుకుని ఆమె వెళ్ళిపోయింది. వాళ్ళ వెనకాలే మైత్రేయికూడా వెళ్ళింది .... వాళ్ళ సన్నిహిత బంధువే తానూ ఐనట్టు.

సతీదేవికి హృదయం విదారితమౌతున్నట్టుగా ఉన్నది. ఆమె వాలకంచూచి విపిన్‌బాబు, వందనాదేవి - ఇద్దరూ ఆశ్చర్యాన్వితులైనారు. ఆమె కన్నుల్లో అశ్రువులులేవు. కాని ముఖమంతా పాలిపోయింది. "శశిధరబాబు ఏం చేశాడో మా కైతే తెలియదు. కాని అకారణంగా మీ రింత గలభాచెయ్యరు. మీరు దోషులని నేను కలలోకూడా అనుకోను" అన్నదామె మెల్లిగా. విప్రదాసు ఏమీ మాటాడలేదు.

"ఇప్పుడే వెళ్ళిపోతున్నారా ?" - అడిగింది సతీదేవి.

"రేపు వెడతాను"

"మళ్ళీ ఈ యింటికి రారన్నమాటేనా ?"

"వస్తానన్న ఆశలేదు"

"నేనో ? వాసుబాబో ?"

మీరుకూడా రావలసిందే. రేపేరాకపోతే, మరొకరోజున"

"మరొకరోజు దేనికి. మేమూ రేపే వచ్చేస్తున్నాం" అంటూ సతీదేవి వందనాదేవికేసి తిరిగి - నీ సంగతేమిటి వందనా ? నువ్వూ రేపే వెళ్ళిపోతావా ?"

"నే నెందుకు వెడతానే అక్కా ! నేనేమీ దెబ్బలాడలేదుగా !"

"నేను మాత్రం దెబ్బలాడేనా ఏమిటి ? మీ బావగారూ దెబ్బలాడలేదు. వారికి స్థానంలేనిచోట నాకూ లేనట్టే. నీకూ వివాహమైన మర్నాడు ఆ రహస్యం అర్థమౌతుంది."

"వివాహం కాకపోయినా అంతమాత్రం తెలియని మూఢురాల్ని కాదులే. కాని మంచిచెడ్డల విచక్షణలేకుండా గుడ్డిగా భర్తను అనుసరించి వెళ్ళటంకూడా తప్పే."

సతీదేవికి అత్తగారియెడ గల భక్తి శ్రద్ధలు అపారములు. "భర్తను చేపట్టిననాడుగాని నీకుతెలియదులే" అంటూ సతీదేవి అచ్చోటు వీడి వెళ్ళిపోయింది.

"ఇంతగలభా చేశారేమిటి విపిన్‌బాబూ !" -వందనాదేవిఅడిగింది.

"అంతకంటే ఉపాయాంతరం లేకపోయింది వందనా ?"

"మాతృ వియోగం....కష్టంకాదా ?"

"కష్టమే మరి! ఏం చేస్తాం. కొత్తసమస్య ఉత్పన్నమైనప్పుడు కొత్తమార్గం అనుసరించక తప్పదు. మీ అక్కయ్య నాతోనే బయలుదేరి వచ్చేస్తుంది, సందేహంలేదు ఆమెను విలిపేందుకు ప్రయత్నించి లాభం లేదు. మరి నీవో! ఇంకా నాలుగైదు రోజులు ఉండే వెడదామను కుంటున్నావా ?"

"ఏమో, ఎన్నాళ్లు ఉంటానో నాకే తెలియదు"

"సరే, నేను వెడుతాను. మళ్ళీ కలుస్తాలే" అంటూవిప్రదాసు మందహాసం చేశాడు. ఆ మందహాసంలో ఏదో వేదన, నిరాశ తొణికిసలాడినవి.

వందనాదేవి కన్నులు అశ్రుసిక్తములైనవి. ఈ సారి కలిసినా మీకు దూరంనించే నమస్కారం చేస్తాను. మీ హృదయం పాషాణంవంటిది; మీలో ప్రేమలేదు, క్షమలేదు, ఈ సారి కలిసినప్పుడు అవకాశంచిక్కుతుందో చిక్కదో....ఇప్పుడే చెబుతాను. మీరు వెళ్ళిపోయాక మీరు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఇలా అనుకుంటాను - 'విపిన్‌బాబు పవిత్రుడు. నిష్పాపి, మహాత్ముడు. ఈ విశాల ప్రపంచంలో ఆయన ఒంటరిగాడు. ఆయనకు 'నా' అన్న, వ్యక్తి ఎవరూ లేరు' అని - వందనాదేవి పైటచెంగుతో కన్నులు మూడుసుకుని చరచరా వెళ్ళిపోయింది.

ఆ రాత్రే చాల పొద్దుపోయింది. అప్పుడుగాని పనులన్నీ పూర్తికాలేదు. పనిపాటల్లో అలసిపోయినవారు ఎక్కడి వారక్కడే పడుకుని కళ్ళు మూసుకున్నారు. భాండారపుకొట్లో తన పనులన్నీ ముగించుకుని వందనాదేవి తన గదిలో పడుకోటానికి వెడుతోంది. వరండాలోకి రాగానే ఆ పక్కన ద్విజదాసు గదిలో దీపం ఇంకా వెలుగుతూనే ఉన్నట్లు తలుపు సందుల్లోనించి కనిపించింది. ఇట్టి అకాలంలో ద్విజబాబుగదికి వెళ్ళటం ఉచితమా, కాదా ? అన్నప్రశ్న ఉత్పన్నమైంది. ఎవరైనాచూస్తే అపనింద వెయ్యరూ ? కాని శశిధరుని అంతర్నాటకం ఆమె మనస్సును కలచివేసింది. ఆ రోజంతా ఆమె హృదయానికి శాంతిలేదు. ఈ అశాంతికి, చంచలతకు కారణమైన ఉద్వేగమే ఆమెను నడిపించుకుని ద్విజదాసు గదివైపు తీసుకుపోయింది. తలుపుముందు నిల్చుని — "ద్విజబాబూ! ఇంకా మేలుకునే ఉన్నావా ?" అని కేకవేసింది.

"ఔను, మేలుకునే ఉన్నాను. కాని ఈ సమయంలో నువ్వు...." అంటూ లోపలినించి జవాబు.

"లోపలికి రావచ్చునా?"

"నిరభ్యంతరంగా"

వందనాదేవి తలుపులు తెరచుకుని లోన ప్రవేశించింది. కాగితాల కుప్పలు ముందు పోసుకుని పక్కమీద కూచుని వున్నాడు ద్విజబాబు.

"ఈ రోజున అయిన ఖర్చంతా రాసి, లెక్కవేస్తున్నావా? ఇంత పొద్దుపోయేంతవరకూ మేలుకుని ఈ పని చెయ్యకపోతే ఏం కొంప మును తుందీ? శరీర ఆరోగ్యం చెడిపోదూ?"

"చెడిపోతే బాగానే ఉండును. ఈ పీడా అంతా నాకు లేకండా పోతుంది"

"చాలా ఖర్చు అయిందనుకుంటాను. అన్నయ్యకు తగిన సమా ధానం చెప్పాలి కామాలేం?"

కాగితాల కుప్పను ఒక ప్రక్కకు త్రోసి ద్విజదాసు సరిగా కూచు న్నాడు. 'చక్రవత్ పరివర్తంతే దుఃఖానిచ సుఖానిచ' శ్రీ గురుకటాక్షం వల్ల.... అన్నయ్యను సమాధాన పలచవలసిన అవసరం నాకిక తప్పి పోయింది వందనాదేవీ! ఇకనించి ఆయనే నన్ను సమాధాన పరచవలసి ఉన్నది. 'ఖర్చు రాసి తీసుకురా' 'డబ్బు వసూలు చేసుకురా' అంటూ నేనే ఇక ఆజ్ఞాపిస్తాను."

ఆ మాటలకు వందనాదేవి ఆశ్చర్యపోయింది. "ఏం? అంత తారుమారై పోయిందాయేమిటి కథ?"

రెండుచేతులూ గుప్పెట్లు బిగించి, తలెత్తి ద్విజబాబు చెప్పాడు— "ఔను. భయంకర పరివర్తన! అమ్మ దయామయి నన్ను దయతో చూచింది. బావ శశిధర్ నాకు సాయమైనాడు. విప్రదాస్! జాగ్రత! ఈ సారి నిన్ను ప్రాణం తీసేస్తాను. మా చేతుల్లో చిక్కావు; తప్పించుకు పోలేవు" అంటూ నాటకరంగంమీద 'పోర్షన్' ఒప్పజెప్పినట్లు అభిన యించాడు.

వందనాదేవికి లోపల విచారంగా ఉన్నా.... నవ్వు ఆపుకో లేక పోయింది, "ఎప్పుడూ హాస్యమే; పరియాచకాలే. క్షణకాలమైనా గంభీ రంగా ఉండటం చాతకాదు కదా నీకు ద్విజబాబూ!"

"ఔను. చాతకాదు. కాని శశిధరుని పిలు. వద్దులే, పిలవద్దు ఈ హాస్యరసం కాస్తా సహారాయెడారిలో ఇంకిపోతుంది; గాంభీర్యం వచ్చి నా ఆకృతిని అరణ్యంలోని పనసచెట్టులా భయంకరంగా పరిణమిస్తుంది"

వందనాదేవి ఒక కుర్చీలాక్కుని కూచుంది. "అయితే సమాచారమంతా విన్నావన్నమాట!"

"అంతాతెలియదు. ఏదోకొంచెం మాత్రం విన్నాను. అన్నయ్యకు అంతాతెలుసు. కాని ఆయన ఒక నిబిడారణ్యంలాంటి మనిషి. శశిధరునికి కూడా సర్వం తెలుసు. కాని అతగాడు అబద్ధాలు కలిపి చెబుతాడు"

"నీకు తెలిసిందేమిటో నాకుకూడా చెబుతావా ద్విజబాబూ! నాకు చాల భయంగా వుంది" అన్నది వందనాదేవి వ్యాకుల కంఠాన.

"భయపడి లాభంలేదు. అన్నయ్య అన్నంతా చేసి తీరుతాడు. మేము ఆయన్ను చెంగనాడుకున్నాం"

ద్విజదాసు కన్నులు రెండూ అశ్రుసిక్తములైనవి. ముఖం త్రిప్పుకుని కన్నీళ్ళు తుడుచుకుని సరిగా కూచున్నాడు. దీపపుకాంతిలో వందనాదేవి అది గమనించింది.

"ఇంతహఠాత్తుగా ముంచుకు వచ్చిన ఈ యాపద త్రిప్పుకోలేమా ద్విజబాబూ!"— వందనాదేవి అడిగింది.

"ఊహుం. త్రిప్పుకోలేము. అనివార్యమై, అత్యంత భయంకరమై విద్యుద్వేగాన వచ్చింది ఈ ముప్పు. ఏడువ వలసినవాళ్ల ఏడుపక తప్పదు. చివరకు దానంతట అదే చల్లారి పోవాలి. అసలు విషయం ఏమిటో తెలుసుకోవాలని నీకు కోరిగ్గా ఉంది కాదూ! సంపూర్ణంగా నాకూ తెలియదు. తెలిసినంతవరకూ మాత్రం నీకే చెబుతాను ఏమైనా సహాయం కావాలసివస్తే.... ఎక్కడున్నాసరే నీదగ్గిరికే వచ్చి అర్థిస్తాను"

"నన్నే అర్థించటం దేనికి?"

"దేనికంటే—ఆశ్రయించవలసివస్తే, మహాత్ములనే ఆశ్రయించమని శాస్త్రం చెబుతున్నది."

"ఎవరు మహాత్ములు?"

"ఎవరూ మహాత్ములు నాకింతవరకు కనిపించలేదు; నిజమే. అన్నయ్య విషయంలో నేనిప్పుడేమీ చెప్పదలుచుకోలేదు. ప్రతీదానికి ఇన్నాళ్ళూ మావదినెనే ఆశ్రయిస్తూ వచ్చాను. నేటితో ఆ ఆశ్రయంకాస్తా వదిలిపోయింది. నువు ఆమె చెల్లెలివి. ఇక నిన్నే ఆశ్రయిస్తాను."

"మీ అమ్మగారు ఉన్నదిగా!"

"రథం వేగంగా నడిచిపోతున్నన్నినాళ్ళూ అమ్మే అసాధారణ సారధి. కాని చక్రాలు బురదలో దిగబడి రథగమనం ఆగిపోయినప్పుడు ఆమెకు ఉపాయం తోచదు. రథందిగి చక్రాల్ని బురదలోపించి తొలగించుకునేందుకు ఆమె ప్రయత్నం చెయ్యదు. అట్టి దుర్దినం సంభవించినప్పుడు నీదగ్గరకే వస్తాను. భిక్ష పెడతావా?"

"ఏం భిక్ష పెట్టాలి? అదికూడా ఇప్పుడేచెప్పు"

"ఏమి అడుతానో ఇప్పుడే నేనేమీ చెప్పలేను. సాధారణంగా నేను ఎవర్నీ ఏమీ అడిగేవాణ్ణికాదు. ఎక్కడా దొరక్కపోతేనే నీదగ్గరకు వస్తాను."

వందనాదేవి చాలసేపు నేలకేసి చూస్తూ కూచుంది "నేనడిగిన సంగతిమాత్రం చెప్పావుకాదు" అన్నది చివరకు.

"నాకు సంపూర్తిగా ఏమీ తెలియదు. తెలిసినది కాస్తా నిజమో, అబద్ధమో నాకే అనుమానంగాఉంది. కాని ఒక్క సంగతిమాత్రం నిశ్చయం. అన్నయ్య తన ఆస్తిఅంతా కోల్పోయాడు. సమస్తం కోల్పోయాడు. అదీ కథ"

వందనాదేవి ఉలికిపడ్డది. "ఏమిటీ? విపిన్‌బాబు తన సర్వస్వాన్ని కోల్పోయాడా? ఎలా సంభవించింది ఈ దుస్థితి?"

"చాల సహజంగా, శశిధరబాబు పన్నిన షడ్యంత్రం ద్వారా సంభవించింది. శాహచౌదరీ కంపెనీ దివాలా అయిననాడే ఆయన సర్వస్వం నాశనమైపోయింది. కాని అది పైకి కనిపిస్తూన్న ఘటన. అసలు రహస్యం వేరేఉన్నది"

"రహస్యం సంగతి అలా ఉంచులే. అసలు ఘటన యేమిటో.... అదే చెప్పు. సర్వనాశనం అయినమాట సత్యమేనా?"

"సత్యమే. సందేహం ఏమీలేదు."

"మా అక్కయ్య గతేమిటి? వాసుబాబు భవిష్యత్తు ఏమిటి? వాళ్ళకు ఏమైనా మిగిల్చాడా, లేదా?"

"లేదు. వదినెకు వాళ్ళ పుట్టింటివారు ఇస్తూన్న అయివేజు తప్ప మరింకేమీ రాబడి లేదు."

"కాని స్త్రీ ధనం విప్రదాసుబాబు ముట్టుకోడుకదా!"

"ఔను; ముట్టుకోడు. ఉపవాసాలు చెయ్యవలసిందే"

మరి కాసేపటివరకూ ఎవరూ మాటాడలేదు. "మరి నీ సంగతే మిటి?" అని అడిగింది వందనాదేవి చివరకు.

"నాకు వచ్చిన పరవా లవలేశంలేదు. నిర్భయంగా నిరుపద్రవంగా ఉన్నాను. అన్నయ్య తాను మునిగాడేగాని నన్నుమాత్రం పైకి ఎత్తి పట్టుకునే ఉన్నాడు. నా ఒంటికి ఒక్క నీటిచుక్క కూడా తగులనీయలేదు. నువు నమ్మలేక పోతున్నావుకదూ! ఇందులో అబద్ధంగాని, అతిశయోక్తిగాని ఏమీలేదు. అమ్మగారి సుబుద్ధి, అన్నయ్య సాధుత్వం, నాశుభగ్రహాల బలం—అన్నీకూడి నన్ను కాపాడినవి. ఈ శశిధరబాబు మా అన్నయ్యకు ఆ బాల్య మిత్రుడు, సహాధ్యాయి. పరస్పరం ఎంతో ప్రేమగా ఉండేవారు. పెద్దవాడైన తరువాత అన్నయ్య శశిధరబాబుకు కళ్యాని నిచ్చి వివాహం చేశాడు. శశిధరుని తండ్రి పెద్ద జమీందారు; ధనవంతుడు; పెద్ద వ్యాపారంకూడా ఏదో చేస్తూ ఉండేవాడుట. వివాహమైన నాలుగు సంవత్సరాలకు ఒకనాడు శశిధరుడు మా యింటికి వచ్చాడు 'జాగీరు, ఐశ్వర్యం, వ్యాపారం—అంతా తలక్రిందు లైపోతున్నది. రక్షించాలి' అన్నాడు. 'రక్షించవలసిందే: కాని ద్విజబాబు నోరెరగని కుర్రవాడు: వాడిడబ్బులో ఒక్క పైసా కూడా ముట్టుకోవటానికి వీల్లేదు' అన్నది మా అమ్మ. 'ఒక్క సంవత్సరం మీ డబ్బు అంతా తిరిగి ఇచ్చివేస్తాను' అన్నాడు శశిధరుడు. 'ఇచ్చివేస్తావు నిజమే. కాని మైనరు కుర్రవాని ఆస్తి ముట్టుకోవద్దని వాళ్ళ నాన్నగారు గట్టిగా శాసించి చనిపోయినారు' అన్నది మా అమ్మ. కళ్యాణి వచ్చి ఏడుస్తూ మా అన్నయ్య కాళ్ళమీద పడ్డది. 'అన్నయా, నువు నాకు పెళ్ళిచేసి అత్తింటికి పంపించావు. ఇవాళ నేనూ, నాపిల్లలూ అడుక్కు తింటూంటే చూస్తూ ఊరుకుంటావా? అమ్మకు మనసు కరక్కపోవచ్చు. నీకైనా దయలేదూ!' అన్నది. అన్నయ్య ధార్మిక వైరాగ్యభావాల్ని కదిలించి ఊపింది కళ్యాణి. 'నువు నిశ్చింతగా ఇంటికిపో అమ్మాయి! నీకేం పరవాలేదు' అంటూ అన్నయ్య అభయదానమిచ్చాడు. ఆ అభయమంత్రం జిరిపించుకుంటూ కళ్యాణి భర్తతో కలిసి వెళ్ళి పోయింది. ఆ తరువాతకథ ఊహించుకో వందనా! అదేమిటి? అప్పుడే తెల్లవారి పోయిందే" అంటూ కిటికీ వేపు చూచాడు ద్విజబాబు.

వందన లేచి నిల్చుంది. "నీచేతిలో ఉన్న కాగితం.... అదేమిటి?"

"నేను నిర్భయంగా ఉండగలందులకు కోర్టువారిచ్చిన ప్రమాణపత్రం కలకత్తానించివస్తూ అన్నయ్య తీసుకు వచ్చాడు. సరేగాని మమ్మల్ని విడిచి నువుకూడా ఇవాళే ప్రయాణమై వెళ్ళి పోతున్నావా ?"

"ఏమో, చెప్పలేను. వెడతాను; మళ్ళీ కలుసుకుని మాటాడదాం" అంటూ వందనాదేవి గది విడిచి వెళ్ళిపోయింది.

# 24

అక్కయ్యను బలవంతాన కుర్చీలో కూచోబెట్టి కాళ్ళకు పసుపు రాస్తున్నది వందనాదేవి. ఈ మంగళాచరణము వందనాదేవికి ఉపదేశించి అన్నపూర్ణ చాటున ఎక్కడో దాక్కుంది. ఆమె కన్నులు....ఏడ్చి. ఏడ్చి ఎర్ర బడిపోయినవి. వందనాదేవి ఎంతగానో అడిగిన మీదట ఆమె సంక్షిప్తంగా చెప్పింది. "కోడలు సతీదేవికి నాముఖంచూపించలేకపోతున్నాను." అని.

"నువు ముఖం ఎందుకు చూపించలేవు. నీకాసిగ్గెందుకు" అని అడిగింది వందనాదేవి.

"ఈదుర్ఘటన జరుగకముందే నా ప్రాణం ఎందుకు పోకండా ఉన్నాదా....అని అభిమాన పడుతున్నాను. నేను ఒక్క ద్విజబాబునేకాదు, విపిన్‌బాబునుకూడా ఈ చేతులమీదుగా పెంచాను పెద్దజేశాను, కన్నతల్లి చనిపోతూ రెండునెలల శిశువును ఎవరికి ఒప్పగించి పోయిందను కున్నావు? నాకే. అనాడు దయామయి ఎక్కడున్నదీ? కూతురెక్క డున్నది? అల్లుడెక్కడున్నాడు?" అంటూ పైట చెరగుతో కళ్ళు ఒత్తు కుంటూ అచ్చోటు వీడి పారిపోయింది.

అక్కయ్యపాదాలు తన మోకాళ్ళమీద పెట్టుకుని వందనాదేవి పసుపురాస్తున్నది. ఎంతకూ తెమలటంలేదావని.

టప్పుమని ఒక వేడి కన్నీటి చుక్క సతీదేవి పాదంమీద రాలింది. ఆమె తలవంచి చూచింది. కాని చెల్లెలి ముఖం కనిపించలేదు. అయినా

చెయిచాచి ఆమె కన్నీళ్ళు తుడిచి అడిగింది— "నువు ఎందుకే ఏడుస్తున్నావు వందనా?"

"అందరూ ఏడుస్తున్నారు; నేనొక్కర్తైనే ఏడవటంలేదు" అన్నది వందనాదేవి తలయెత్తకండానే.

"అందరూ ఏడుస్తున్నారని నువ్వూ ఏడుస్తున్నావా? ఇంత చదువుకుని ఎంత యుక్తియుక్తంగా మాటాదేవే!"

వందనాదేవి ఈసారి తలెత్తిచూచించి. "సకారణంగానే ఏడవాలి, అకారణంగా ఏడవకూడదు— అన్నమాట మీకు యుక్తియుక్తంగా ఉన్నదేం?"

సతీదేవి చెల్లెలితలనిమురుతూ అన్నది- "నువు తర్కవాగీశ్వరివి. నీతో వాదించి ఎవరు గెలుస్తారే! నే నామాట అన్నానా? అందరూ ఏడుస్తున్నారంటే-నాసర్వస్వం మంటగలిసి పోయిందని వాళ్ళనుకుంటున్నారు. కాని అది అపోహ. నాభర్త ఉన్నాడు; నా కొడుకు ఉన్నాడు. నా కాపురానికి వచ్చిన హాని ఏమీ లేదు. నాకోసం నువు ఏడువ నక్కర్లేదు. నాకేమీ ఉపద్రవం రాలేదు"

"నీకు వచ్చిన ఉపద్రవమేమీ లేకపోతే.... అంతకన్నా మాకు కావాలసిన దేమీలేదు. నీ ఒక్కతెకు మాత్రమే దుఃఖం కలిగితే ప్రపంచం ముంచుకు పోదు. నీకు వచ్చిన ఆపద యేమిటో నీకు తెలియక పోలేదు. కళ్ళు చీకట్లు కమ్మేలాగ ఏడుస్తూన్నవారిగాయం ఎవరు మాన్పేవారు, చెప్పు!"

కాసేపు ఆగి వందనాదేవి మళ్ళీ ఇలా అన్నది— "విపిన్‌బాబు పురుషుడు. ఇష్టంవచ్చినట్టు మాటాదేస్తూంటాడు. ఇంతమందిని దుఃఖపెట్టి నువు వెళ్ళటం బాగు లేదక్కా!"

"ఎవరే దుఃఖ పడేవారు వందనా?"

"ఎవరా? ఎవరో నీకు తెలియదూ? తొమ్మిది సంవత్సరాల యీడులో నువు ఈ యింటికి వచ్చావు. ఆదిలో నీకిది పరాయి గృహం. ఈ పరాయి గృహాన్ని కాలక్రమేణా నీ స్వగృహంగా చేసిన వాళెవరు? వారందర్నీ ఒక్క నిమిషంలో మరచి పోయావా? నీ అత్తగారు, నీ మరిది, నౌకర్లు, దాసీలు, ఆశ్రితపరిజనం, గురు, పురోహితులు — వీరందరూ లేని లోటు భర్త, పుత్రుడు ఉన్నంతమాత్రాన తీరిపోతుందా? ఈ ఇద్దరి కన్నా ప్రపంచంలో గణనీయులే లేరా? వీరే సర్వస్వమా? పతిభక్తి

ఒక్కటి తప్ప ఆరదానికి విచారణీయాంశము మరేమీ లేదని నువు అను కుంటున్నావు. అది శుద్ధ పొరపాటు. ఒకసారి కలకత్తాలో మాపెత్తల్లి గారింటికి వచ్చిచూడు, నీ అవజ్ఞత నీకు తెలిసి వస్తుంది "

వందనాదేవి ఉపన్యాసం హఠాత్తుగా ఆగిపోయింది. వెనకాల ఎవరో నిల్చి వింటూన్నట్టు ఆమెకు స్ఫురించింది. వెంటనే వెనక్కు తిరిగి చూచింది. ద్విజదాసు నిల్చుని ఉన్నాడు. ఎప్పుడు వచ్చి అలా నిల్చుని వున్నాడో ఎవరికీ తెలియదు. వందనాదేవి సిగ్గుపడి ఏదో మాటా డాలనుకుంది. కాని మాటరాలేదు. ద్విజదాసు ముందడుగు వేస్తూ అన్నాడు.

"అలా తడబిడ పడతావేం వందనా? ఏం భయంలేదు. మీ పెత్తల్లిగార్ని నేను చూడలేదు. ఆమెకు సంబంధించిన వారినీ నే నెర గను. నీ మాటలేవీ మా వదినెకు అర్థంకావు. కాని నువు పొరపాటు పడు తున్నావు చెప్పద్దూ. చీమలు, తేనెటీగలు మొదలైన కీటకాలు.... నక్కలు గొర్రెలు మొదలైన జంతువులు.... మందలు మందలుగా.... కొన్ని నిర్ణీత నియమాలను పురస్కరించుకుని.... సంఘాలుగా కూడి వుంటాయి. మను ష్యులు అలా కాదుగా! వ్యక్తిని ఒక సంఘానికి బలవంతాన కట్టివుంచే పాశాలు లేవు ఇవాళ ఉదయంనించీ నేను ఇదే విషయం ఆలోచిస్తు న్నాను. మీ పెత్తల్లిగారి మందలోనించి నువు మా అన్నయ్య మందలోనికి రావచ్చు. దయామయిగారి మందలోనించి మైత్రేయి స్వేచ్ఛగా మీ పెత్తల్లి గారి మందలో చేరవచ్చును. అభ్యంతర పెట్టే శక్తి ఏమీ ఉండదు. మానవ చిత్తము ధన్యము! మానవ ప్రకృతి ధన్య తరము!"

సతీదేవి ఆశ్చర్య పోయింది. "నీ మాటలు అర్థంకాలేదు ద్విజూ!"

ద్విజదాసు అంతకన్నా ఆశ్చర్యపోయాడు. "నీకు కూడా నా మాటలు అర్థం కాలేదా వదినా? అయినా నా పనులలో, నా మాటల్లో అర్థం ఉంటుందా అసలు? ఉంటే .... ఈ నాటి వరకూ దయామయి విప్రదాసు దర్బారులో నా దరఖాస్తులు నువ్వే అందించవలసిన అవసరం ఎందుకుంటుంది? ఇన్నాళ్ళనించీ నా ఆంతర్యం తెలుసుకోవాలన్న కుతూ హలం లేకండాచే నన్ను సమ్మానిస్తూవచ్చావు. ఇప్పుడుకూడా అలాగే పోనీద్దూ వదినా? నువు మమ్మల్ని విడిచి వెళ్ళిపోతున్నావు. ఉచితా నుచితాల విచారణ చెయ్యవలసిన సమయంకాదిది " - అంటూ ద్విజదాసు ముందుకు వచ్చి అమాంతం వదినెగారి పాదాలమీద వాలిపోయాడు.

ఆమె పాదాలమీద పసుపంతా అతని ముఖంనిండా అయింది. సతీదేవి తన పైటచెంగుతో తుడువబోయింది. ద్విజబాబు తుడువనీయలేదు. "నా అందంపాడై పోలేదులే వదినా? ఈ పసుపు దానంతట అదే చెరిగిపోకండా ఉంటుందా? ఒక్కరోజు ఉంటే ఉంటుంది; ఏం వుంటే. ఉండనీ" అంటూ నవ్వుతూ అన్నాడు. ఆ మాటల్లో విశేషం ఏమీలేదు. కాని వందనాదేవికి ఆ మాటలు వింటూంటే కన్నీళ్ళు తిరిగాయి. కనిపించకండా తలవంచుకుంది; మళ్ళీ ఎత్తలేదు.

"వేళ అయిందమ్మా వదినా! అన్నయ్య తొందరపడుతున్నాడు. సామానంతా అప్పుడే స్టేషన్‌కు పోయింది. లాగూ, చొక్కా తొడిగి వాసును బండిలో కూచోబెట్టి వచ్చాను. అన్నపూర్ణ ఎక్కడున్నదో ఎంత వెదకినా కనిపించటంలేదు. ఏ బావిలోనో దూకి ప్రాణం తీసుకుందేమోనని అనుమానంగాఉంది. అయినా నువు వెళ్ళిపోతున్న సమయంలో ఈ మంగళాచరణలన్నీ జరుగుతూండటంచూస్తే బ్రతికే ఉన్నదని ఆశ కలుగుతున్నది. అమ్మ గదిలోకిపోయి తలుపు వేసుకుంది. ఏమి చేస్తున్నదో ఏమో లోపల! శ్రీమతి మైత్రేయికి మాత్రం చెప్పి వెళ్లు. ఆ కబురు ఆమే అమ్మకు అందజేస్తుంది. నాతో ఏమీ చెప్పనవసరం లేదులే. తొందరగా రా మరి! నిన్ను బండీఎక్కించి వస్తేగాని నాకు...."

సతీదేవి నీరసంగా నవ్వింది. "నన్ను చప్పున పంపించి వెయ్యాలని తొందర పడుతున్నావేం ద్విజబాబూ!"

"నాకు చాల పనులున్నాయి; అందుకోసం"

"ఏం పనులేమిటి?"

"నువు వినతగినవి కాదులే. అయినా నా పనిపాటలను గూర్చి వినాలని నువు ఎప్పుడు కుతూహల పడ్డావు? ఎప్పుడూలేని కుతూహలం ఇప్పుడు మాత్రం ఎందుకూ? నేను ఏది అడిగితేఅది .... మారుప్రశ్న వెయ్యకండా .... ఇచ్చేస్తూవచ్చావు"

సతీదేవి, వందనా - ఇద్దరూ అతనికేసి తదేకంగాచూస్తూ నిల్చున్నారు.

"సరే. పద, ద్విజూ! ఆలస్యం చెయ్యనులే" అన్నది.

మరికాసేపటికి వందనాదేవితో ఇలా చెప్పింది. "నువ్వుకూడా ఇక్కడ ఎక్కువరోజులు పడివుండవలసిన పనిలేదు. నువు మళ్ళీ కలకత్తాలో మీ పెత్తల్లిగారింటికి వెళ్ళనవసరంలేదు. సరాసరి బొంబాయి

వెళ్ళిపో. అక్కడ బాబాయి ఒక్కడే ఉంటున్నాడు. ఎలావుంటున్నాడో, ఏమిటో మరి!"

ద్విజబాబు లాగే వందనాదేవికూడా ఆమె పాదాల్ని కన్నుల కద్దుకుంది. "ఇక నేను పెత్తల్లిగారింటికి వెళ్ళనే అక్కా! అక్కడినించి ఎలాగో బయటపడి వచ్చేశాను; మళ్ళీ ఎందుకు వెడతాను? బహుశః రేపే బొంబాయి వెళ్ళిపోతానేమో! మళ్ళీ నేను నిన్ను తొందరలోనే కలుసుకో గలిగేట్టుగా ఆశీర్వదించు"- అంటూ కొంగుతో కన్నీళ్ళు ఒత్తుకుంది.

సతీదేవి ఏమని ఆశీర్వదించిందో ఆమెకే తెలియాలి. చెల్లెలి చుబుకము పుణికి ముద్దు పెట్టుకుంది. "నువు బొంబాయి వెళ్ళాక బాబాయితో చెప్పి ఉత్తరం రాయించు. ఎక్కడున్నాసరే వచ్చివాలుతాను." అని చెబుదామా, వద్దా అని ఆలోచిస్తున్నట్టుగా కాసేపు ఊరుకుని ఇలా అన్నది-"నువుకూడా ఈ యింటి కోడలివి కావలెనని కోరాను. గృహభారం, మన వాసుబాబు సంరక్షణ—యావత్తు బాధ్యత నీపైని, ద్విజుబాబు మీద వేసి నేను అత్తగారితో కూడా మానస సరోవరయాత్ర వెడదాం అని ఆశపడ్డాను. కాని మనిషి ఒకటి తలుస్తే భగవంతుడు మరొకటి తలుస్తాడు. ఈ యింట్లో నాకు లభించినసుఖం, స్వేచ్ఛ ఏ ఆడదీ అనుభవించి వుండదు. అన్నిటికన్నా ముఖ్యంగా నాకు అత్తగారి ప్రేమ లభించింది. నేడు ఆమెనే విడిచిపోవలసి వచ్చింది. వెడుతూ పాదాభివందనం చేసే యోగ్యత కూడా నాకు లేకపోయింది. తలుపువేసిఉంది. గడపమీదనే తల మోపి....అక్కడ ఆమె పాదధూళి పడివుంటుంది....అదేనాకు...." సతీదేవి వాక్యం పూర్తి చెయ్యలేకపోయింది. కంఠం గాద్గదికం వహించింది. కళ్ళవెంట కన్నీళ్ళప్రవాహం! రెండు మూడు నిమిషాల తరువాత గొంతు సవరించుకుని మళ్ళీ ఇలా చెప్పింది—"అన్నపూర్ణ వదినె ఎక్కడెక్కడ వెదకినా కనిపించింది కాదు. ఆమె మా అత్తగారికన్నా పెద్దది వందనా! మేము వెళ్ళాక ఆమెతోచెప్పు 'సతీదేవి నీమీద చాలకోపం తెచ్చుకుని వెళ్ళిపోయింది.' అని"

మళ్ళీ ఆమె కన్నులు రెండూ అశ్రుపూర్ణములైనవి. ఆమె ఒక పిల్లిని పెంచింది. దానిపేరు 'సీమూ' ఉదయం నించీ అదికూడా ఎక్కడా కనిపించలేదు. ఇప్పుడు సతీదేవికి ఆ పిల్లి జ్ఞాపకం వచ్చింది. "సీమూ ఏ బావిలోపడి చచ్చిందో పాపం!" అన్నది. కొన్ని నిమిషాల

ముందు ఆమె....తనకు భర్త. కుర్రవాడు ఉన్నారనీ, తన సంసారానికి వచ్చిన కష్టం ఏమీ లేదనీ విబ్బరంగా చెప్పుకున్నమాట వట్టి మిధ్య అని ఋజువై పోయింది వందనాదేవికి.

"ఇంకా ఏంజేస్తున్నావమ్మా వదినా!" అంటూ బైటినించి ద్విజబాబు కేక పెట్టాడు.

"వచ్చేస్తున్నాను" అంటూ సతీదేవి ఇల్లు విడిచి బైటికి వచ్చేసింది.

* * *

ద్విజదాసు స్టేషన్‌నించి ఒక్కడే ఇంటికి తిరిగి వచ్చాడు. బాగా చీకటి పడింది. నౌకరువచ్చి గదిలో మామూలుగా దీపం వెలిగించి పోయాడు. అంతా యధాపూర్వంగా తమ పనులలో తాము విమగ్నులై వున్నారు. ఇంట్లో ఏదో ఒక మహావిప్లవం జరిగిన సంగతి ఎవరికీ తెలిసినట్టులేదు. మామూలుగా విప్రదాసు కూచుని వుండే గదికిటికీలన్నీ మూసి ఉన్నవి. ఆ గదిచుట్టూ మాత్రం చీకటి వ్యాపించిఉంది. విప్రదాసు కలకత్తాలో ఉంటూన్నన్నినాళ్ళూ ఆగదిలో దీపంపెట్టేవారు కాదు. అందుచేత ఈ నాడుకూడా దీపం వెలిగించకపోయినందువల్ల ఎవరికీ కొత్తగా కనిపించటం లేదు.

మెట్ల వరుసకు ఎడమవైపు గదిలో అశోకబాబు ఉంటున్నాడు. ద్విజదాసు కిటికీవైపు చూచాడు. పడకకుర్చీలో పడుకుని ఉన్న అశోకబాబు కిటికీగుండా కనిపించాడు. ఏదో పుస్తకం దీక్షగా చదువుతున్నాడు.

అక్షయబాబుకూడా ఉద్యోగంలోకి వెళ్ళలేదు. ఇంకా ఇక్కడే ఉన్నాడు. ఆయన గదికూడా ఆ వరండాచివర ఉన్నది. ఆయన గదిలోనే ఉన్నాడో, షికారు వెళ్లాడో ద్విజబాబుకు తెలియదు.

మోటారు దిగగానే ద్విజబాబు చూపులు మేడమీది లైబ్రరీగది వైపు వెళ్ళాయి. సాధారణంగా సాయంత్రంకాగానే ఆ లైబ్రరీ తలుపులు వేసేస్తారు, కాని ఇవాళ లోపల దీపపు వెలుగు కనిపిస్తోంది. కిటికీలు తెరచివున్నవి. బహుశః అక్కడ వందనాదేవి ఉందేమో! అని ద్విజబాబు ఊహించాడు. పుస్తకాలు చదువుకునేందుకుకాదు. ఏడ్చి ఏడ్చి కన్నీళ్ళు తుడుచుకునేందుకు ఎవరికీ కనిపించకుండా ఆమె ఆ గదిలో పడిఉంది. ఎలాగో ఈ రాత్రి గడిపేస్తుంది. రేపు బొంబాయి ప్రయాణమై వెళ్ళిపోతుంది. చిన్నప్పటినించీ ఆమె అక్కడే పెరిగింది. వాళ్ళనాన్న ఉన్నాడు.

ఇంకా కావలసినంత మంది స్నేహితురాళ్ళు ఉంటారు. అయినా ఆమె ఈ యిల్లు. ఇక్కడి పరిచయాలూ తేలిగ్గా మరచిపోతుందని తోచదు. విచిత్రమైనదిగదా ప్రపంచం! అద్భుతమైన, అనుకోని సంఘటనలు హఠాత్తుగా జరుగుతూ ఉంటాయి. వందనాదేవి వచ్చిననాటినించీ నేటివరకూ జరిగిన సంఘటనలన్నీ ఒక్కొటొక్కటిగా ద్విజబాబుకు జ్ఞాపకం వచ్చాయి. ఆమె రావటం అకస్మాత్తుగా వచ్చింది; కోపంవచ్చి ఆనాడే వెళ్ళిపోయింది. ఈ లోగా ఒక్క అంగంటసేవు మాత్రమే తాను ఆమెతో మాటాడేడు. ఆనాడు ఆమె చెప్పింది—"కేవలం నిన్ను ఇప్పుడే చూస్తున్నాననుకోకు ద్విజబాబూ! మా అక్కయ్య నిన్నుగురించి ఎన్నో ఉత్తరాలు రాసింది. ఆమె ఏ విషయమూ దాచలేదు. నాకు అంతా తెలిసిపోయింది." అని.

అలాగే నవ్వుతూ చాలవిషయాలు మాటాడుకున్నారు. ద్విజదాసును గురించి సతీదేవి అనేక ఉత్తరాలు వందనాదేవికి రాయటంలో ఆమె ఉద్దేశంమాత్రం ఆ నాడు ఆ యిద్దరికీ బోధ పడలేదు. వందనాదేవికి ద్విజబాబుపై మమత పుట్టించటమే సతీదేవి యుద్దేశమైనట్టు ఇప్పుడు తెలిసింది. కాని ఆమె ఉద్దేశము నెరవేరలేదు. ఆమె వెళ్ళిపోయింది. ఆమె మనసులో కోరిక మనసులోనే దాగిపోయింది.

తిన్నగా ద్విజదాసు మేడమీదికి వెళ్ళాడు. వందనాదేవి తెరచిన పుస్తకం ఒకటి ఒడిలో పెట్టుకుని కూచుంది. పుస్తకం మాత్రం చదవటం లేదు. కిటికీలోనించి బైట శూన్యంలోకి తదేకంగా చూస్తున్నది.

"ఏం పుస్తకమది, చదువుతున్నావు?" అని అడిగాడు ద్విజబాబు....ఆమె పుస్తకం చదవటం లేదన్న సంగతి పూర్తిగా ఎరిగివుండి కూడా....కేవలం సంభాషణ ఆరంభించాలన్న తలంపుతో.

వందనాదేవి వెంటనే పుస్తకం మూసేసి, టేబిల్‌మీదపెట్టి, లేచి నిల్చుంది. "ఇంత ఆలస్యంగా తిరిగి వచ్చావేం? కలకత్తా ప్యాసెంజరు చాల సేపైందిగా కూతకూసి!"

"ఆలస్యమైనా తిరిగివచ్చాను; నయంకాదూ?"

"తిరిగి రాకూడదనికూడా బుద్ధిపుట్టిందా?"

"వాసు కిటికీలోనించి ముఖంబెట్టి నాకేసి చూస్తూ చెయి ఊపుతున్నాడు. ప్లాట్‌ఫారంమీద నిల్చుని దిగాలుబడి చూస్తున్నాను. కుర్రవాని

సుకుమార హస్తం క్రమేణా నాకంటికి కనిపించకండా అదృశ్యమై పోయింది. నేనుకూడా వాళ్ళతోపాటు రైలెక్కితే ఎంతబాగుండిపోయేది?"

"నీకు వాసు అంటే చాలప్రేమ. కాదూ ?"

ద్విజదాసు మందహాసం చేశాడు. "నీ ప్రశ్నకు నేనేమి జవాబు చేప్పేది ? ప్రేమో, పాడో నాకేమీ తెలియదు. వట్టినీరసమైన ప్రకృతినాది. సహారా యెడారిలాంటి మనిషిని. ప్లాట్ ఫారంమీద విల్చున్నాను. కళ్ళ వెంట అశ్రువులు కారుతున్నాయి కాని అంతలోనే ఆ కన్నీళ్ళన్నీ ఇగిరి పోయాయి. కన్నీటి చారకూడా మిగల లేదు"

"అదికూడా ఒక విధమైన భగవదాశీర్వాదమే"

"ఔనేమో; నాకైతే తెలియదు. వాసుకోసమే బెంగపెట్టుకుని అమ్మ గదిలో గడియవేసుకుని ఏడుస్తూ పడుకునివుంది విన్నటివించీ. కొడుకు గురించిగాని కోడలుగురించిగాని ఆమెకేమీ భయంలేదు. అమ్మ వాసును పెంచింది. కాని ఆమె మాటిమాటికీ తీర్థయాత్రలు వెడుతూ ఉంటుందిగా! ఆ సమయాల్లో వాసు ఎప్పుడూ నా దగ్గిరే మసలుతూ ఉండేవాడు. వాడికి టైఫాయిడ్ జ్వరం వచ్చినప్పుడు ఎనిమిది రాత్రులు కంటికి కూరుకు లేకండా దగ్గిరఉండి ఉపచారం చేశాను నేను. వాడి చొక్కా ఒకటి లాగు ఒకటి నా అలమారలో ఉన్నాయి. వాడి పలక నా టేబిల్ మీదఉంది. రాత్రిళ్ళు నా దగ్గిరే పడుకుని నిద్రపోయేవాడు. ఒక్కొక్కరోజున నిద్రపోయాక వాళ్ళమ్మ వచ్చి తీసుకుపోయేది. కాని తెల్లవారి నిద్రలేవగానే మళ్ళీ నా మంచంమీదికి పరుగెత్తుకు వచ్చేవాడు."

"అయినాకూడా వచ్చిన కన్నీళ్ళు అంత త్వరగానే ఇగిరిపోయి నవా ?"

"ఔను. నా స్వభావం అలాంటిదీ మరి! ఇప్పుడు వాడు కేవలం తల్లిదండ్రుల పోషణలోనే ఉంటాడు. అదేనన్ను పట్టుకున్న చింత ఇప్పుడు. 'పిల్లలు తల్లిదండ్రుల పోషణలో ఉండటం సహజమేకదా! అందులో విచారించవలసిన విషయం ఏముందీ?' అని నీవు అనచ్చు. కాని సహజమైన విషయం కాబట్టే అది ఒక విపత్తు. ఈ తల్లకిందు మాట నీకు సరిగా బోధపడేట్టు చెప్పలేక పోతున్నాను"

నిజానికి ద్విజబాబు అన్నమాట వందనాదేవికి అర్థంకాలేదు. తల్లి దండ్రులు తమ బిడ్డల్ని సరిగా పోషించుకోలేరూ! కాని వందనాదేవి తర్కించలేదు. మాటాడకండా ఊరుకుంది.

"వదినె ఉన్నదిలే. కుర్రవాడికేమీ పరవాలేదు; అది ఒక్కటే నాకు ఊరట కలిగిస్తూన్న అంశం. కేవలం అన్నయ్యే అయితే....కుర్ర వాణ్ణి ఆయనకు ఒప్పజెప్పి నేను నిశ్చింతగా ఉండలేను."— అన్నాడు ద్విజదాసు తాను ఇతఃపూర్వం అన్న వాక్యానికి వ్యాఖ్యానంగా.

"నువు నిర్వికారమూర్తివి. వాసునుగూర్చి నీకు ఇంత ఆందోళన దేనికీ? విధి ఎలావుందో అలా జరుగుతుంది"

ద్విజదాసు ముఖంలో ఒక గంభీరవేదన ద్యోతకమైంది. అతడు జవాబు చెప్పలేదు.

"మీ అన్నయ్యమీద నీకెంతో భక్తి శ్రద్ధలున్నట్టు ఆనాడు చెప్పావు. ఆయన అలా ఇల్లు విడిచి వెళ్ళిపోతోంటే కూడా నీకు కన్నీళ్ళు రాలేదా! లేకపోతే....స్వకీయాపరాధం చేతనే ఇంతముప్పు కొనితెచ్చు కున్నాడని ఆయన మీద నీభక్తి అంతా నశించిపోయిందా?" అని అడిగింది వందనాదేవి.

ద్విజదాసు కన్నుల్లో ఆశ్చర్యము; వ్యథ తొంగిచూచాయి. కాసేపు మౌనంగా ఉన్నాడు. చివరకు రెండుచేతులూ ఫాలభాగాన జోడించి— "ఎబ్బెబ్బే! నేనామాట అనలేదు. నేనన్నది ఏమంటే—ఎండమావులు కావలసినవారు సముద్రంముందు నిల్చుని చేతులు చాచకూడదు. అన్న య్యనుగురించి నేను చెప్పదలచిన మాటలన్నీ ఇతర్లకు అర్థం కావు."

ఆమాట వందనాదేవిని గాయపరచింది. అందుకు ప్రత్యుక్తి సమ యానికి స్ఫురించలేదు. మౌనంగా ఉండిపోయింది.

ద్విజదాసు విషయం మార్చాడు. "నువు బొంబాయికి రేపే వెడ తావా?"

"ఔను"

"అశోకబాబునే వెంట తీసుకుపోతావా?"

"ఔను."

"బొంబాయి మెయిలు మన స్టేషనుకు రాత్రి చాల పొద్దుపోయాక గాని రాదు. నేనూవచ్చి స్టేషన్‌దాకా మిమ్మల్ని సాగనంపుతాను. కాని పగలు కనిపించను; పనిఉంది"

"మా నాన్నకు నేను వస్తూన్నట్టు తంతి...."

"ఇస్తాను" అని రెండు నిమిషాలు సంకోచించి, కంఠం సరిచేసుకుని—"చాల రోజులనించీ నిన్నొక విషయం అడుగుదామని అనుకుంటున్నాను. కాని రోజులు దాటి పోతున్నాయి. అవకాశం చిక్కలేదు. రేపు వెళ్ళిపోతున్నావాయెను. మళ్ళీ ఎప్పటికి కనిపిస్తావో! నీకు కోపంరాదంటే ఒక విషయం అడుగుతాను" అన్నాడు.

"అడుగు"

"అడగలేక పోతున్నాను."

"నాకేమీ కోపంరాదు. నిర్భయంగా అడుగు"

"ఆనాటి సాయంత్రం....జ్ఞాపకం ఉందా....కలకత్తాలో....మా అమ్మ, కోపం వచ్చేసి వదినెను తీసుకుని లేచి వచ్చేసింది...."

"ఔను; మరచిపోలేదు"

"మా అమ్మకు ఎందుకు కోపం వచ్చిందో....అలా అకస్మాత్తుగా ఎందుకు ప్రయాణమై వెళ్ళిపోయిందో....అర్థంగాక నువు ఆశ్చర్యపోతూ నాగదికి వచ్చావు. నేనప్పుడు చాల నీరసంగా ఉన్నాను. నన్ను నువు ప్రేమిస్తున్నా నన్నావు. జ్ఞాపకం లేదూ?"

"జ్ఞాపకం లేకేం? కాని అప్పుడలా ఎందుకు అన్నానా అని సిగ్గు పడుతున్నాను."

"అయితే ఆ మాటకు విలువయేమీ లేదా?

"లేదు."

ద్విజదాసు కాసేపు మౌనంగా ఉండి అన్నాడు—"ఔను. నేనూ అంతే అనుకున్నాను. ఆమాటకు విలువలేదు."

"నిన్ను అశోకబాబుకిచ్చి వివాహం చెయ్యాలని మీ పెత్తల్లి ఉద్దేశమైనట్టు మా వదినె చెప్పింది. మీ పెళ్ళి నిశ్చయ మైనట్టేనా?"

"అది మా పారివారిక సంబంధమైన విషయం. అందులో ఇతర్ల ప్రమేయం కల్పించుకోవటం మంచిది కాదు."

"ప్రమేయం కల్పించుకుందామని కాదు. ఊరికేనే అడుగుతున్నాను, తెలుసుకుందామని"

"నువు ఆ ప్రశ్న నన్ను అడగ తగినంత ఆత్మీయ సంబంధం ఏమి వున్నదనీ? ద్విజబాబూ! చదువుకున్న వాడివి; సుశిక్షితుడివి. అలాటి ప్రశ్న వెయ్యటానికి సిగ్గు ఎలా లేకపోయిందీ?

ద్విజదాసు నిజంగానే లజ్జితుడైపోయాడు. ముఖంలో పావం నెత్తురుచుక్కలేదు. "పొరపాటయింది వందనా! ఇతర్ల విషయాలు తెలుసుకోవాలన్న కుతూహలం నాకు వస్తుతః తక్కువ. అయినా ఏది అడగాలన్నా ఇతర్ల వద్దలేని స్వాతంత్ర్యం నాకు నీవద్ద ఉన్నదను కున్నాను. ఆ భావం నాకెలాకలిగిందో నాకే తెలియదు. ఆపత్సమయంలో ఎవర్నీ ఆశ్రయించలేని నా హృదయం నీ ఆసరాకోసమే తహతహ లాడుతుంది."

వందనాదేవి నవ్వింది. "ఇంతకుముందే నువు చెప్పావుగా — మీ అన్నయ్యగార్ని గురించి పరాయివాళ్ళముందు ప్రసంగించననీ. దాని అర్థం నేను పరాయివాన్ని అని కాదేం?"

"'మీ అన్నయ్యయెడ నీ భక్తిశ్రద్ధలు నశించిపోయాయా?' అని నువు అడిగావెందుకూ మరి? ఇంత జరిగినందుకు నేను పాతాళానికి ఎలా క్రుంగిపోతున్నానో నీకు తెలియదూ?" - ద్విజదాసు కనుగొలకు లలోనించి కన్నీటిబిందువులు రాలాయి. దీపపు వెలుగులో స్పష్టంగా కనిపించింది.

ఆ సమయాన మైత్రేయి అక్కడికి వచ్చింది. "ద్విజుబాబూ! మీరు స్టేషన్‌నించి తిరిగివచ్చిన సంగతి మా కెవరికి తెలియలేదు."

ద్విజదాసు వెనక్కుతిరిగిచూచాడు. "తెలుసుకోవాలసిన ఆవశ్యకత ఏమైనా ఉందేమిటి?"

"నిన్నటినించీ మీరు భోజనమే చెయ్యలేదు. ఎవరికి తెలియక పోయినా నాకన్నా తెలియదూ! అమ్మగారి గదిలోకి ఒకసారి రండి"

"లోపల తలుపు వేసుకున్నదిగా!"

"తలుపు వేసుకున్నదని నేను ఊరుకోలేదు. తల పగుల గొట్టుకుని తలుపు తీయించాను. ఆమెగార్ని స్నానం చేయించాను. సంధ్యాపూజ చేయించాను. పండ్లు ఫలాహారం చేయించాను. ద్విజబాబు భోజనం చెయ్యకపోతే నేనూ చెయ్యను - అని ఆమె మారాం చేస్తున్నది. మీ కోసం ఎదురుచూస్తూ కూచున్నాం. రండి; వడ్డించి వచ్చాను."

మైత్రేయి ఇన్నిమాటలు మాటాడగలదని ద్విజబాబుకు ఇంత వరకూ తెలియదు. "వస్తున్నా పద" అన్నాడు.

"నువ్వూ రావాలి. అత్తయ్య నిన్నూ తీసుకు రమ్మంది" అన్నది మైత్రేయి వందనాదేవిని లక్షించి.

ముగ్గురూ గదివిడిచి వెళ్ళారు.

గదిలో దయామయి మంచంమీద పడుకుని ఉంది. ఆమె ముఖం శోకవివర్ణమై ఉన్నది. కన్నులు జ్యోతుల్లాఉన్నవి. తలగడ దగ్గిర కళ్యాణి కూచున్నది. కొంచెం దూరాన కుర్చీలో శశిధరబాబు కూచునిఉన్నాడు. ద్విజదాసు లోనికిరాగానే దయామయి పక్కకు తిరిగి ముఖం కప్పుకుంది. వెక్కి వెక్కి యేడ్చింది. వందనాదేవి వచ్చి ఆమె పాదాలదగ్గిర కూచుంది. ఇంతటి విషాదదృశ్యము ఆమె ఇదివరకెన్నడూ చూచియుండలేదు. చాల సేపటివరకూ ఎవరూ మాటాడలేదు.

" నిన్నటినించీ నువు ఉపవాసం ఉన్నావు. కాస్త ఎంగిలిపడు " - అన్నాడు శశిధరబాబు చివరకు.

" అలాగే " అన్నాడు ద్విజబాబు.

మైత్రేయి స్థలం శుభ్రపరచి భోజనం వడ్డిస్తోంది.

" స్టేషన్‌నించి ఇంత ఆలస్యంగా తిరిగి వచ్చావేం? వాళ్ళు రెండు గంటల బండికే వెళ్ళారేమో!"

" ఔను. "

శశిధరుడు మందహాసంచేస్తూ - " అయినా కలకత్తాలో యిల్లు నీ వాటాలోదేగా!" అన్నాడు.

" నా యిల్లు అయితే అన్నయ్య ఉండటానికి వీల్లేదా? "

" ఆ మాట నేనన్నానా? అటువంటిబావం మీ అన్నయ్యే ప్రకటించి వెళ్ళిపోయాడు. ఈ యిల్లుమాత్రం ఆయన విడిచిపెట్టి పోవలసిన అవసరం ఏమి వచ్చిందీ? సమరసపడి ఉండిపోకూడదూ!"

"సమరసపడే మార్గమే ఉన్నట్టయితే తమరే సమరస పరచక పోయారా? "

" నేనా! అదేమిమాట? అతడు నన్ను అవమానించేవాడున్నూ; నే నాయన్ను సమరస పెట్టేవాడినీనా? భలేమాట!" అంటూ శశిధరుడు పకపక నవ్వాడు.

ఆ నవ్వు ఆగేవరకూ ఊరుకుని ద్విజదాసు అన్నాడు - " భలే మాట కాకపోతే చెడ్డమాటేమీకాదు శశిధరబాబూ! 'కొండలాంటి అండ' అని సాధారణంగా ఆడవాళ్ళు చెప్పుకునే సామెత విన్నావుగా! అన్నయ్య కొండలాంటి మనిషి. ఆయన అండన దాక్కుని హాయిగా బ్రతికావు.

ఇక నువ్వూ నేనూ ఎదురెదురుగా ఉన్నాం. అవమానగాథ ముగిసి పోయిందనుకోకు. ఆరంభమే అయింది సుమీ !"

"అంటే ?"

"అంటే ఏమిటంటే ?— నేనెవరో తెలుసా ? నీ ఆబాల్యమిత్రుడు విప్రదాసు కాదు. నేను ద్విజదాసును !"

శశిధరబాబు పెదవిమీది చిరునవ్వు అంతర్హితమై పోయింది. "నీ మాటలు అర్థంకావటంలేదు. టతెల్లంగా చెప్పవోయి" అన్నాడు భయం కర గంభీర కంఠస్వరాన.

"ఔను. నువు అడిగినట్టు ఈ క్షణాన్నే తేటతెల్లంగా చెప్పి వెయ్యటమే మంచిది. కొందరు మహానుభావులు సత్యవాక్పరిపాలన కోసం తమ సర్వస్వాన్ని త్యజించగలరు ; శరణాగత రక్షణకోసం స్వశ రీరాన్నీ ముక్కలు కోసి ఇస్తారు ; ఆదర్శం కోసం వారు చెయ్యలేని త్యాగం ఉండదు. అదిగో అటువంటివారిలో చేర్చదగినవాడు మా అన్నయ్య. ఆరకం వారంతా ఒకరకమైన పిచ్చివాళ్ళు. అందుకనే ఇటువంటి ఆపత్తు లలో చిక్కుకుంటారు. కాని నేను అలాటి మనిషినికాదు. మామూలు అందరిలాటి వ్యక్తిని. నీకూ, నాకూ ఎక్కువభేదం ఏమీలేదు. నీలాటి వాడినే నేనూ. నీకులాగే నాలోకూడా ద్వేషం ఉంది ; ప్రతిహింసాబుద్ధి ఉంది. నువు మా అన్నయ్యను మోసగించి డబ్బు కాజేసినందుకు నిన్ను నేను ముద్దుపెట్టుకుంటాననుకోకు. జైల్లో పెట్టిస్తాను. మన యిరుపక్షాల వారికీ బొచ్చెపట్టుకుని అడుక్కోవలసిన గతి పట్టినాసరే నేను ఊరుకోను"

"చూదావా అత్తా ! మీవాడి మాటలు యెలావున్నాయో విన్నావా ? నోటికి వచ్చినట్టు ప్రేలుతున్నాడు. నువ్వైనా కాస్త మందలించకపోతె ఎలా ?"— అన్నాడు శశిధరబాబు దయామయిని ఉద్దేశించి.

"మా అమ్మతో ఫిర్యాదు చేసుకున్నందువల్ల నీకు వచ్చేలాభం ఏమీ లేదు శశిధరబాబూ ! నేను విపిన్‌బాబును కాదన్న సంగతి అమ్మకు బాగానే తెలుసు. మాతృవచనం నాకు వేదవాక్యం కాదు. ద్విజబాబు. తాటాకు చప్పట్లకు బెదరడు. అమ్మకు తెలుసు నా విషయం."

ఎవరినోటా ఏమాటారాలేదు. ఇలా వాదప్రతివాదాలు జరుగుతాయని ఎవరూ అనుకోలేదు. అందరూ భయపడుతూ స్తబ్ధచిత్తులై ఉన్నారు. ద్విజబాబుమాటలు పరిహాసాలు కావు. ఆసంగతి శశిధరుడు గుర్తించాడు.

కాని జవాబు చెప్పే సార్థ్యం లేకపోయింది అన్నాడు - "చాలు చాలు బాగానే అయింది. ఇక ఈ యింట్లో నేను పచ్చిమంచినీళ్ళు పుచ్చుకోను"

"ఇంతవరకూ ఎలా తాగారో మరి! అదే నాకు ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు ద్విజబాబు.

కళ్యాణి ఏడుపు సాగించింది. "చిన్నన్నయ్యా! నువ్వేమమ్మల్ని చంపి పారేయాలని చూస్తున్నావా? తోడబుట్టిన వాడివికదా! మా సర్వ నాశనం కోరతావురా?"

"మాటిమాటికీ ఏడ్చి కన్నీళ్ళుగార్చి సర్వనాశనం నించి తప్పించు కోవచ్చునని నువు అనుకుంటున్నావేమో! ఇంతవరకూ ప్రతీవిషయం లోనూ మీదే పైచేయిగా ఉంటూ వచ్చింది. నీకు తినటానికి కూడులేకండా పోయిననాడు నాదగ్గరకురా, నీయేడుపు వింటాను. అన్నయ్యలేడని అను కోవలసిన పనిలేదు."

దయామయి ఇంతవరకూ సహించి ఊరుకుంది. కాని ఇక ఓపిక పట్టలేకపోయింది. "నువు ఇక్కడినించి వెళ్ళిపోరా, ద్విజూ! ఇలా ఇష్టంవచ్చినట్టు వాగమని విపిన్ చెప్పి పంపించాడా?"

"ఏమిటీ? విపిన్ చెప్పి పంపించాడంటున్నావా?"

"ఔను, వాడే. తప్పకండా వాడే నేర్పి పంపించాడు"

ద్విజదాసు పెదవి కంపించింది. "అమ్మా! ఎంతనీచానికి ఒడి కట్టావు. ఛీ. కాని ఇంకా మరీ నీచానికి దిగకు" అంటూ ద్విజదాసు అక్కడి నించి వెళ్ళిపోయాడు.

వెళ్ళి తనగదిలో కూచున్నాడు. ఒక గంటదాటింది. మైత్రేయి వచ్చింది. ఆమె చేతిలో భోజన పళ్లెం ఉంది. "భోజనం మళ్ళీ వండి తీసుకు వచ్చాను. ఈ గదిలోనే భోజనం చేద్దురుగాని. పీట వేస్తాను" అన్నది మైత్రేయి.

"భోజనం ఇక్కడికి తీసుకు పొమ్మని నీకెవరు చెప్పారూ?"

"ఎవరూ చెప్పలేదు. ఎవరు చెప్పాలి? నాకు తెలియదూ? విన్నటి నించీ మీరు భోజనం చెయ్య లేదాయెను"

"ఇంతమంది ఉండగా నీవొక్క దానివే తెలుసుకోవాలసిన అవసరం ఏమి వచ్చిందీ?"

మైత్రేయి నిరుత్తరయై తలవంచుకుని నిల్చుంది.

"సరే, అక్కడ ఎక్కడేనా పెట్టి వెళ్ళు. ఇప్పుడు ఆకలి వెయ్యటం లేదు. ఆకలివేసినప్పుడు తింటాను." అన్నాడు ద్విజబాబు.

మైత్రేయి అక్కడ ఒక పీటవేసి, పళ్లెంపెట్టి వెళ్ళిపోయింది. ఏమీ బలవంతం చెయ్యలేదు "చల్లారితే చవి ఉండదు" అని కూడా చెప్పలేదు. వెళ్ళిపోయింది.

రాత్రి పన్నెండు గంటలైంది. ద్విజదాసు కుర్చీలో పడుకుని ఉన్న వాడు లేచాడు. కాస్త ఎంగిలిపడి, పడుకుందామనిపించి కాళ్ళూ చేతులూ కడుక్కు రావటానికై బైటికి వచ్చాడు తలుపావల ఎవరో కూచుని వున్నారు. ఆ చీకటిలో ద్విజదాసు గుర్తుపట్టలేదు. "ఎవరది?" అని అడిగాడు.

"నేను మైత్రేయిని"

"ఇంత రాత్రివేళ యిక్కడ ఉన్నావెందుకూ?" - ద్విజదాసు ఆశ్చర్యాన్వితుడైనాడు.

"మీరు భోజనానికి కూచుంటే.... ఏమైనా కావలసివస్తుందేమోనని ఇక్కడే ఉన్నాను"

"అన్యాయం! ఏం అవసరం వస్తుందీ? అవసరం వస్తేమాత్రం ఈ యింట్లో ఇక మనుష్యులులేరూ?"

"అంతా పనిపాటల్లో అలసిపోయారు. ఎవరూ మెలకువతో లేరు. అంతా నిద్రపోతున్నారు."

"నువుకూడా చాల కష్టపడిన దానివేగా! నిద్రపోలేదేం?"

మైత్రేయి జవాబు చెప్పలేదు. తలవంచుకుంది.

"ఇలాగ నువుఇక్కడ బైట నా కోసం కూచోటం ఏమీబాగులేదు. లోపలకు వెళ్ళి కూచో. వచ్చి భోజనం చేస్తాను" అంటూ కాళ్ళుచేతులు కడుక్కు రావటానికి స్నానాల గదిలోకి వెళ్ళాడు.

ఇదివరకెప్పుడూ ద్విజదాసు మైత్రేయితో ఎక్కువగా సంభాషించి వుండలేదు. సంభాషించాలన్న కోరికలేదు; అవకాశమూ చిక్కలేదు. ఇప్పుడు ఆమెతో ఎలా ప్రసంగం ఆరంభించాలో ఆలోచించుకుంటూ తిరిగి గదిలోకివచ్చిచూస్తే అక్కడ భోజన పళ్ళెమూ లేదు, మైత్రేయీ లేదు. కాని మరు నిమిషంలోనే ఆమె మరొకపళ్ళెం చేతపట్టుకుని రానే వచ్చింది. "పళ్ళెంలో అంతా చల్లారిపోయింది; మళ్ళీ వెళ్ళి పట్టు కొస్తు న్నాను. పీటమీద కూచోండి" అన్నది.

"పొగలు కక్కుతున్నదే! ఇంత వేడియన్నం నీకీ అర్ధరాత్రి ఎక్కడ దొరికిందీ?"

"ఇప్పుడు భోజనం చెయ్యనని చెప్పారుగా. అందుచేత నేను పొయ్యి చల్లార్చలేదు."

ద్విజదాసు భోజనానికి కూచున్నాడు. వడ్డించటంలో, వంట చెయ్యటంలో నేర్పుగల పిల్లే; సందేహం లేదు. పదార్థాలు చాలవరకు ఆమె తయారు చేసినవిలాగే ఉంది. మాటిమాటికీ అడిగి వడ్డించి, చాల తినిపించింది. ఆ విద్యలో ఆమెకు నిపుణత ఉన్నది.

"ఎక్కువతింటే రోగం వస్తుంది" అన్నాడు ద్విజబాబునవ్వుతూ.

"ఏమీరాదు; నిన్నటినించీ ఉపవాసం చేశారాయెను!"

"నేనొక్కడినే కాదు. ఈ ఇంట్లో చాలమంది భోజనం మానేశారు"

"అందరి సంగతీ నాకైతే తెలియదు. అమ్మగారిచేత ఎలాగో కొంత తినిపించాను. నేను ఈ సమయాన ఇక్కడ లేకపోయి నట్లయితే ఆమె ఎన్నాళ్ళు ఆ గదిలో తలుపు బిగించుకుని పడుకుని ఉండేదోకదా?"

"మా అన్నపూర్ణ అక్కయ్య ఎక్కడేనా కనిపించిందా?"

"ఏమైంది దానికి? అదికూడా ఉపవాసం చేస్తోందా?"

ఇంతవరకూ మైత్రేయి మాటలు ఆతనికి ఇంపుగానే వినిపిస్తూ వచ్చాయి; దుఃఖదశలో ఉన్న ఆతనికి ఆశ్వాసనములుగానే ఉన్నాయి. కాని అన్నపూర్ణనుగురించి మైత్రేయి పలికినతీరు అతని మనస్సును గాయ పరచింది. అన్నాడు - "అన్నపూర్ణ ఈ ఇంట్లో కేవలం ఒక దాసీది అనుకుంటున్నావు కాబోలు. ఆమెనుగూర్చి నువు అలా మాటాడ్డం ఏమీ బాగుండలేదు. ఆమె మమ్మల్ని అందర్నీ తన చేతులమీద పెంచింది, పెద్ద వాళ్ళను చేసింది."

"ఔను, ఆ సంగతికూడా విన్నాను. అనేకుల యిళ్ళలో దాసీలు పిల్లల పాలన - పోషణభారం వహించరూ అయితే? అందులో కొత్త ఏముందీ? సరే, మీ భోజనం అయాక ఆమెను వెదకుతాను."

ద్విజబాబు నిరుత్తరుడై క్షణమాత్రం ఆమెకేసిచూస్తూ ఉండి పోయాడు. "అన్నపూర్ణ ఇంతవరకూ భోజనం చెయ్యకపోతే .... ఇంత అర్ధరాత్రివేళ ఏమీ తినదు. ఇప్పుడు ఆమెకోసం నువు అయాస పడ నక్కర్లేదు."

మరికొన్ని నిమిషాలవరకూ ఎవరూ మాటాడలేదు. చివరకు ద్విజ బాబు అడిగాడు - "ఇతర్లకు సేవచేసే ఈ విద్య ఎవరిదగ్గిర నేర్చుకున్నావు మైత్రేయీ! మీ అమ్మదగ్గిరేనా?"

"కాదు మా అక్కయ్యదగ్గిర. ఆమెలాగ అంత యెక్కువగా పతిసేవచేసిన స్త్రీలను నేను చూడలేదు."

"భర్త పరాయివాడా యేమిటి? ఇతర్లకు సేవచేయటంగురించి నేను అడిగాను."

"ఓహో!" అంటూ మైత్రేయి లజ్జాన్వితయై తలవంచుకుంది.

"మీ అక్కయ్యనుగురించి చెబుతున్నావు. ఏమిటీ ఆమె సమాచారం?"

"ఆమె చనిపోయింది. మూడుసంవత్సరాలయింది. ఒక కొడుకూ ఇద్దరు కూతుళ్ళూ ఉన్నారు. కాని చౌదరిగారు సంవత్సరం తిరక్కుండానే మళ్ళీ పెళ్ళి చేసేసుకున్నాడు. ఎంత అన్యాయమో చూడండి"

"పురుషుడు అలాగేచేస్తాడులే. అన్యాయ మనుకోడు."

"మీరూ అలాగే చేస్తారా?"

"ఒక పెళ్ళికానీ; ఆ తరువాత కదా రెండో పెళ్ళి ఆలోచన!"

"ఇన్నాళ్ళూ మీవదినెగారు ఉందికనుక సరిపోయింది. ఇక ముందు మీ అమ్మగార్ని ఎవరు కనిపెట్టి ఉంటారూ మీరు పెళ్ళి చేసుకోకపోతే?"

"ఎవరుకనిపెట్టి ఉంటారో నాకైతే తెలియదు. బహుశః అల్లుడూ కూతురు ఆమెను కనిపెట్టుకుని వుంటారేమో! ఈ ప్రపంచంలో అసంభవాలనుకునేవి కూడా సంభవిస్తూ ఉంటాయి. మా విషయానికేమిలే: నీ సమాచారం చెప్పు"

"నా సమాచారం ఏమీలేదు"

"ఏమీ లేదూ?"

మైత్రేయి మొట్టమొదట కాస్త తడబడ పడ్డది. వెంటనే చిరునవ్వునవ్వి— "ఓహో, జ్ఞాపకం వచ్చింది; చౌదరి విషయం చెబుతున్నాను కదూ! ఛీ ఛీ ఎంత సిగ్గుమాలిన మనిషి! మా అక్కయ్య చనిపోతే.... మళ్ళీ పెళ్ళికి నన్ను ఇస్తారేమో తెలుసుకుందామని కూడా కబురు చేశాడు"

"తరువాత?"

"చౌదరికి బాగా డబ్బు ఉంది మా నాన్నా, మా అమ్మా ఒప్పు కున్నారు, మా అక్కయ్య బిడ్డలు ఉన్నారుగా! వాళ్ళ పోషణ పాలన నాద్వారా అయితే బాగా జరుగుతాయని వాళ్ళ ఉద్దేశం. కాని అక్కయ్య బిడ్డల్ని పోషించటం కంటే నాకి జీవితంలో మరేమీ లేదన్నమాట! ఈ సంబంధం చేశారంటే ఉరిబెట్టుకు చస్తానని ఖచ్చితంగా చెప్పేశాను."

"ఏం? ఏమంత ఆపద వచ్చిందనీ?"

"ఆపదకాదూ మరి? అంతకన్నా అశాంతి వేరేఉందా?"

"ఈ నీమాట నేను ఒప్పుకోను. ప్రపంచంలో అన్ని విషయా ల్లోనూ అశాంతిలేదు. మా అమ్మ అన్నయ్యను పెంచింది, పెద్దవాణ్ణి చేసింది."

"చివరకు ఏమైంది? నేటివలె ఈ యింట్లో దుఃఖదేవ ఎన్నడైనా ఇలా నాట్యం చేసిందా?"

ద్విజదాసు స్తబ్ధచిత్తుడైనాడు: ఆమాట అబద్ధంకాదు. ఎందునా సత్యబద్ధమూకాదు. రెండుమూడు నిమిషాలు అలాగే భూతంలా చూస్తూ కూచున్నాడు చివరకన్నాడు—"మైత్రేయీ! నేను నీతో వాదించను. మా అందరికీ నిజంగా పెద్ద దుఃఖమే వచ్చిపడింది. అయినా నువు అన్న మాట సామాన్య తుచ్ఛకుటుంబాలకు వర్తించేటువంటిది మాత్రమే." అంటూ ద్విజదాసు లేచాడు....భోజనం పూర్తిచేసి.

మర్నాడు రెండు గంటలప్పుడు ద్విజబాబు ఇంట్లోనించి ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఎక్కడికో, ఏమి పనిమీదనో....అతనికే తెలియాలి. ప్రొద్దుకూకిన తరువాత తిరిగివచ్చాడు. వచ్చినవాడు సరాసరి వందనాదేవి గది దగ్గరకుపోయ "లోపలికి రావచ్చునా?" అని కేక వేశాడు.

"ఎవరు? ద్విజబాబా! రావచ్చు"

ద్విజదాసు గదిలో ప్రవేశించి చూచాడు. పెట్టె, పరుపు అంతా సర్దుకుంది. "ఏమిటి? వెళ్ళిపోవలసిందేనా! ఇంకొక్క రోజు ఉండ కూడదూ!"

వందనాదేవి ద్విజబాబు ముఖవైఖరి గమనించింది. "ఇంకొక్క రోజు నేనిక్కడ ఉంటేమాత్రం — ఏమిలాభమో కాస్తచెబుదూ!"

"లాభాలమాట నేను ఆలోచించటం లేదు. అందరూ వెళ్ళిపోతు న్నారు. ఇంత పెద్దకొంపలో నా అన్నవాళ్ళెవరూ లేరే అని ఏడుస్తున్నాను"

"పాతస్నేహితులు పోతారు; కొత్తస్నేహితులు వస్తారు. అది ప్రపంచ ధర్మం ద్విజబాబూ! ఆ ఆశతోనే ధైర్యంగా ఉండు. నిరుత్సాహ పడితే లాభంలేదు."

ద్విజదాసు మారుపలుకలేదు; ఊరుకున్నాడు.

"కళ్యాణిని తీసుకుని శశిధరబాబు వెళ్ళిపోయాడు, విన్నావా?" అని అడిగింది వందనాదేవి.

"వినలేదు. కాని వెళ్ళిపోతాడనే అనుకున్నాను."

"అన్నట్టుగానే వాళ్ళు ఒక్క నీటిచుక్క కూడా పుచ్చుకోలేదు. ఇద్దరూవచ్చి మీ అమ్మగారికి నమస్కారం చేసి 'వెళ్ళిపోతున్నాం' అని చెప్పారు 'వెళ్ళండి' అన్నది మీ అమ్మ. అని అటువైపుతిరిగి పడు కుంది" — వందనాదేవి, అంతవరకు చెప్పి ఊరుకుంది.

"మా అమ్మకు గుండె ముక్కలైనట్టుగా ఉంది పాపం!"

"ఔను, పాపం! చూస్తే జాలివేస్తుంది. ఇతర్లకు తనముఖం చూ పించలేని స్థితిలో ఉన్నది. అస్తమానం పాపం మైత్రేయి ఆమెను కనిపెట్టు కుని ఉంటున్నది. మైత్రేయి చేస్తున్న సేవ కన్నకూతురు కూడా చేయదు. మీఅమ్మకు బాగా స్వస్థత చేకూర గలిగితే.... అది మైత్రేయి సేవా ఫలి తమే ఆమెను ఇక్కడ ఇంకా కొన్నాళ్ళు ఉంచుకోండి"

"అలాగే!"

"ద్విజబాబూ! నేను ఇంకోమాటకూడా నీకు చెప్పాలను కుంటు న్నాను"

"చెప్పు."

"నువు పెళ్ళి చేసుకోవాలి!"

"ఎందుకూ?"

"లేకపోతే మీ గృహవ్యవహారాలన్నీ ఛిన్నాభిన్నమై పోతాయి. ఏదో కొంత నష్టపడ్డారనుకో. అయినా ఇంకా కావలసినంతఉంది, మీ దానాలు, సత్కార్యాలు ఇంతటితో ఆగిపోవటానికి వీల్లేదు. ఎందరో ఆశ్రితులున్నారు, మీమీద ఆధారపడి బ్రతుకుతూన్న బీద జనులెందరో ఉన్నారు. మీకు కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించిపెట్టిన మీ సాంప్రదాయాలు ముమ్ముందుకూడా యథాపూర్వంగా సాగిపోవలసినదే. మీ అన్నయ్య పొర పాటువల్ల కలిగిన నష్టం ఎక్కువే. కాని ఈ మిగిలినదే నీకు అక్షయ మౌగాక! భగవంతుడు మీ కేమీలోటు రానీయకుండా కాపాడుతాడుగాక!"

ద్విజదాసు కన్నులు చెమ్మగిల్లినవి.

"మీ నాన్నగారు గార్హస్థ్యభారమంతా మీ అన్నయ్యపై పెట్టి పరమ పదించారు. కాని మీ అన్నయ్య ఇప్పుడిక్కడ లేడు. ఆయన లేనికారణం వల్ల ఏమి లోపం జరిగినా .... జరగవలసిన పుణ్యకార్యాలు జరక్కపోయినా.... విపిన్‌బాబు ఎక్కడ ఉన్నా చాల బాధపడతాడు. అట్టి అశాంతి ఆయనకు కలుగజేయకుండా ఉండటమే నీ కర్తవ్యం."

ద్విజదాసు దుఃఖం ఆపుకున్నాడు. "అన్నయ్యనుగురించి నువు ఇప్పుడు ప్రస్తావించిన విషయాలు నేనుకూడా ఎన్నడూ ఆలోచించి ఉండ లేదుసుమీ! ఆశ్చర్యంగా ఉందే!"

దీపపు కీనీడ పడటంవల్ల వందనాదేవి చహరా ద్విజబాబుకు కని పించలేదు. అప్పుడామె ముఖంలో గులాబిపూల యెరుపు చెంగలించింది.

"అన్నయ్య కోసమని ఈ భారమంతా ఎలాగో నెత్తిమీద వేసు కుంటాను. కాని ఆయన పనులన్నీ....అంత చక్కగా .... నే నెలా నిర్వ హించగలను? నాలో అంత సాహసం ఉన్నట్టులేదు. ఇవాళ పగలంతా వెళ్ళి చూచివచ్చాను అన్నయ్య నెలకొల్పిన పాఠశాల, సంస్కృత విద్యా లయం, మహమ్మదీయ పాఠశాల .... అన్నీను. ఒకటీ, రెండూ కాదు. అనేకం ఉన్నాయి అలాటి విజ్ఞాన సంస్థలు అన్నయ్య స్థాపించినవి. వ్యవ సాయ సౌకర్యం కోసం ఒక కాలువ త్రవ్వించాలని సంకల్పించాడు. అందుకు చందా లిచ్చినవారి పేర్లపట్టీ ఒకటి కనిపించింది. వాళ్ళంతా వచ్చి ఇప్పుడు డబ్బు అడిగితే ఏమి జవాబు చెప్పాలో నాకేమీ తోచటం లేదు."

"ఇస్తాననే చెప్పు. ఇవ్వద్దామరి! కాని ఈ సంగతి గురించి విపిన్ బాబు మీతో ఎన్నడూ ప్రస్తావించనేలేదా?"

"లేదు"

"ఎందుచేత"

"పుణ్యకార్యం ఏది తలపెట్టినా అది రహస్యంగా చేయటమే ఆయనమతం. అయినా ఎవరితో చెబుతాడు? ఈ ప్రపంచంలో ఆయన కెవరూ మిత్రులులేరు. దుఃఖంవచ్చినా, సంతోషం వచ్చినా ఒక్కడే అనుభవించి ఊరుకుంటాడు. అథవా ఎవరితోనన్నా చెప్పవలసివస్తే-" ద్విజదాసు ఆకాశంవైపుచూచి- "అదిగో ఆయన ఆ పరమేశ్వరుడికి మాత్రమే నివేదించుకుంటాడు. ఇక చుట్టాలకు, ఆత్మీయులకు - ఎవరికీ

నరమాత్రుడికి తెలియదు. ఆయనకే తెలుసు; ఆ తరువాత ఆయన అంతర్యామికే తెలుసు అంతే."

ఆ మాటలతో వందనాదేవికి కుతూహలం హెచ్చింది.

"అయితే ద్విజబాబూ! మీ అన్నయ్య ఎప్పుడూ, ఎవర్నీ .... మానవ మాత్రుని ప్రేమించనేలేదా?"

"ఉహుం. లేదు. అది ఆయన ప్రకృతికే విరుద్ధం. ఇంత విశాల మానవ ప్రపంచంలో ఆయన ఒంటరిగాడు, నిస్సంగి."

మరి తరువాత చాలసేపటివరకూ ఎవరూ మాటాడలేదు.

"మీ అన్నయ్య చేస్తూఉండిన పనులన్నీ నువు నెత్తిమీద వేసుకుని నిర్వహించక తప్పదు. ఒక్కపనికూడా నువు విడిచి పెట్టకూడదు" అన్నది వందనాదేవి చివరకు.

"కాని నేను ఒక్కడినే ఎలా నిర్వహిస్తాను?"

"ఒక్కడివేకాదు. మీ రిద్దరూ కలిసి భారం ఎత్తుకోండి. అందుకోసమనే వివాహం చేసుకోమని చెబుతున్నాను"

"ప్రేమించకండా ఎలా పెళ్ళిచేసుకోమంటావు?"

వందనాదేవి ఆశ్చర్యంగా చూచింది. "అదేంమాట ద్విజబాబూ! ప్రేమించి పెళ్ళిచేసుకోవట మనేది మానవీసుల ఆచారంగాని మీ సాంప్రదాయం కాదే! మీ పెద్దలు ఎవరు ప్రేమించి వివాహమాడారు చెప్పు. నువుమాత్రం పూర్వపద్ధతిని విడిచిపెట్టడం ఎందుకు?"

"ప్రేమించి వివాహం చేసుకోవటం మా సాంప్రదాయంకాదు; నిజమే. కాని ఆ పాత ఆదర్శన్నే అనుసరించి సుఖపడగలనన్న విశ్వాసం నాకులేదు."

"విశ్వాసాన్ని జారవిడుచుకుని తర్కాన్ని ఆశ్రయించి నందువల్ల ప్రయోజనంలేదు. స్వచ్ఛమైన సుఖం నా కెక్కడా కనిపించలేదు. దానికోసం అన్వేషించటం కూడా అనవసరమైన శ్రమే. వివాహానికి పూర్వం కాస్త కంటికి ఇంపుగాఉన్న వ్యక్తిని చూచినప్పుడల్లా ఉత్పన్నమౌతూండే మోహం ఎలాటిదో నేను బాగా ఎరుగుదును. బంగారు మాయలేడి ఏ వనంలో మేస్తూ తిరుగుతూ ఉంటుందో....అక్కడే ఉండనీ. ఆదర పూర్వకంగా దాన్ని తీసుకువచ్చి ఇంట్లో పెట్టుకో నవసరంలేదు."

ద్విజదాసు మృదువుగా మందహాసం చేశాడు. "సుధీరబాబు నీ బుద్ధిని పాడుచేసి వదలిపెట్టాడు"

వందనాదేవి కూడా నవ్వింది–ఆ తరువాత నువు వచ్చి పూర్తిగా పాడుచేసి విడిచిపెట్టావు. ఇకపోతే ఆయనగారు కూడా వదలిపోతే నాకు విశ్రాంత."

"ఆయన అంటే అశోకబాబేనా! అతనంటే నీ కెందుకూ భయం?"

"అకస్మాత్తుగా ఆయనగారు కూడా ప్రేమించటం మొదలు పెట్టాడు మరి! భయంకాదూ!"

"అయితే ఎవరూ నిన్ను ప్రేమించకూడ దన్నమాట!"

"ఔను. సుఖపడతానన్న ఆశతో వివాహం చేసుకుని చివరకు నిరాశపడి క్రుంగిపోవటం నా మతంకాదు. అందుకనే నిన్న ఆశోకబాబుతో చెప్పేశాను–' నువునన్ను ప్రేమించటం ఆరంభించావంటే పరిగెత్తి పారి పోతాను జాగ్రత!' అని."

"అందుకు అశోకబాబు ఏమన్నాడు?"

"ఏమీ అనలేదు బిక్కమొగం వేసుకుని చూచాడు. నాకే జాలి అయింది."

"నీకు జాలి కలిగిందంటే....అశోకబాబు నిరాశపడి పోనక్కర లేదు. సరేగాని నాకు నీ అంతిమ ఉపదేశం ఏమిటో చెప్పు. వేళ మించి పోతున్నది."

వందనాదేవి ఆలోచిస్తున్నట్టుగా పైకీ, కిందికీ తల నాలుగుసార్లు ఊపి–"నిజంగా నీకు ఉపదేశం కావాలా?" అని అడిగింది.

"ఔను, కావాలి. నేను మా అన్నయ్యలాటి మనిషినికాదు. నాకు మిత్రుల ఆవశ్యకత ఉంది. వివాహం చేసుకోమని చెబుతున్నావు. సరే చేసుకుంటాను. నాకు ప్రేమ లభించకపోతే మానె. మైత్రి అయినా లభిస్తే ఈ భారమంతా ఎలాగో నెత్తిన వేసుకుని మోస్తాను."

ద్విజదాసు పరిహాసంగా అన్నమాటలు కావు అవి. అతని కంఠ స్వరం వందనాదేవిని విచలితను చేసింది. "భయ పడనక్కర్లేదు: ద్విజ బాబూ! మిత్రురాలు నీకు దొరుకుతుంది. సమయం వచ్చినప్పుడు భగవంతుడే ఆమెను నీయింట్లో తెచ్చి దిగబెట్టి పోతాడు. విశ్వాసం ఉంచు."

ద్విజదాసు ఏదో జవాబు చెప్పబోయాడు. కాని ఇంతలో బైటి నించి మైత్రేయి కంఠస్వరం వినిపించింది—" ద్విజబాబూ! అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు."

ద్విజబాబు లేచి నిల్చున్నాడు. "పన్నెండింటికి వస్తుంది రైలు. పదకొండున్నరకు బైలుదేరి వెడదాం. నేనేవచ్చి పిలుస్తాను." అంటూ వెళ్ళిపోయాడు.

## 25

తాను సురక్షితంగా బొంబాయి చేరుకున్నట్టు వందనాదేవి రాసిన ఉత్తరానికి ద్విజదాసు కొంచెం ఆలస్యంగా జవాబు రాశాడు. పనుల ఒత్తిడివల్ల వెంటనే జాబు రాయటానికి వీల్లేక పోయిందని తెలుపుతూ మరో కొన్ని సంగతులు కూడా వివరించాడు. అక్కడ ఇంటి పరిస్థితులు యథాపూర్వంగానే ఉన్నాయిట. ఎక్కువ మార్పేమీ లేదు. అక్షయబాబు కలకత్తా వెళ్ళిపోయాడు. మైత్రేయి బలరామపురంలోనే ఉన్నది. శ్రద్ధాభక్తులతో అమ్మగారికి ఏమీ లోటురాకుండా జాగ్రతగా కనిపెట్టి చూస్తున్నది; గృహ వ్యవహారాలన్నీ కూడా నిర్వహిస్తూనే ఉన్నది. అందరూ ఆమె యెడల ప్రసన్న చిత్తులై ఉన్నారు. ఇలాగే మరికొన్ని సంగతులు తెలియజేస్తూ వందనాదేవియొక్క, ఆమె తండ్రియొక్క క్షేమాన్ని ఆకాంక్షిస్తూ ఉత్తరం ముగించాడు.

తరువాత మరిమూడు మాసాలు గడిచిపోయినవి. మళ్ళీ ఉత్తర ప్రత్యుత్తరాలేమీ లేవు. అక్కయ్య, విప్రదాసు, వాసుబాబు, ఎక్కడ ఉన్నారో, ఎలా వున్నారో....ఏ సమాచారమూ తెలియలేదు. ద్విజదాసుకు రాసి కనుక్కోవాలని ఆమె ఉత్సహించేది. కాని తీరా రాయాలని కూచునేసరికి సిగ్గనిపించి వూరుకునేది.

ఇలా ఉండగా ఒకనాడు పంజాబునించి పెత్తల్లి వచ్చింది. ఆమెకు ఒంట్లో ఆరోగ్యంగా లేదుట. బొంబాయి నీళ్లు మంచివని ఏడాక్టరో చెప్పాట్ట. ఆరోగ్యం కోసమని బొంబాయి వచ్చేసింది. వందనాదేవి బలరామపురంనించి కలకత్తారాకండా సరాసరి బొంబాయి వచ్చేసింది. ఆకోపంకూడా పెత్తల్లి హృదయంలో ఉంది. పైగా తన మేనల్లుడు చాలా ఖిడియస్థుడు. అతని తరపున వకాల్తా పుచ్చుకుని అనాధరాయితో వాదించి వివాహం నిశ్చయం చేసుకపోదామన్న తలంపుకూడా ఉన్నది. ఒకనాడు భోజనాలముందు ఇలా ప్రసంగం ఆరంభించింది-

"మిస్టర్ రాయ్! కొందరు పిల్లలు తల్లిదండ్రుల మాటవినకండా హద్దు మీరి హఠం చేస్తూంటారుసుమీ! నువు గమనించావో లేదో!

"మా అమ్మాయిలాగే కదూ! ఒకసారి 'ఊహుఁ' అంటుంది! మరొకసారి 'సరే' అంటుంది. పసిపిల్లప్పటినించీ ఇదే వరస....!" అన్నాడు అనాధరాయి.

"అందుకేనా నాన్నా! నీకూతురిమీద నీకు ప్రేమ లేదు?"

"ఎబ్బెబ్బే! నువు నాగయ్యాళి కూతురివి కానేకాదు. ఎవరంటారో అనమను."

వందనాదేవి నవ్వింది. "ఇప్పుడు నువ్వే అన్నావుగా!"

"నేనా? ఛీ!"

పెత్తల్లికూడా నవ్వు ఆపుకోలేక పోయింది.

"సరేగాని నాన్నా! నీకు మల్లేనే మా అమ్మకు కూడా నేనంటే అపేక్ష ఉండేది కాదా?"

"చిన్నప్పుడు నువ్వొకసారి నా గడియారం పగులగొట్టావు. మీ అమ్మ కోపం తెచ్చుకుని నీచెవులు మెలేశింది. నువు ఏడుస్తూ నాదగ్గిరికి వచ్చావు. ఆరోజంతా మీ అమ్మతో నేను మాటాడలేదు." అన్నాడు అనాధరాయి.

"చిన్నప్పుడు లాగే ఇప్పుడుకూడా నన్నెందుకు ప్రేమించవు నాన్నా?"

"విన్నావా మా పిచ్చితల్లిమాటలు!" అన్నాడు అనాధరాయి పెత్తల్లివైపు చూస్తూ.

"నాకు పెళ్ళిచేసి అత్తింటికి పంపించేవరకూ నీకు ఆందోళనగానే ఉంటుందంటూ చాలసార్లు అన్నావు. ఏం? నీకంటికి నేనంత కంటకమై పోయానా?" అన్నది వందనాదేవి.

"వింటున్నావా దాని మాటలు?" అని మళ్ళీ ఒకసారి అనాధ రాయి పెత్తల్లిని హెచ్చరించాడు.

"కాదుటే మరి! ఈడు వచ్చిన కూతురు ఇంట్లో వుంటే తల్లి దండ్రులకు ఎలా వుంటుందో.... నీకూ ఒక కూతురు పుడితేనే గాని అర్థం కాదు." అన్నది పెత్తల్లి.

"అర్థంచేసు కోవలసిన అవశ్యకత నాకు లేదు."

"కూతుర్ని ఒక అయ్య చేతిలో పెట్టి పంపించటం కన్నవారి కర్తవ్యం. తల్లిదండ్రులు ఎల్లకాలం బ్రతికి వుండరు. బిడ్డల భవిష్యత్తును గురించి ఆలోచించక పోవటం తప్పు. నిన్నుగురించి మీనాన్న పడుతూన్న ఆందోళన ఆడపిల్లలను కన్నవారందరికీ ఉన్నదే. నీచెల్లెలు ప్రకృతికి పెళ్ళిచేసి పంపించేంతవరకూ నేను సరిగా అన్నం తిన్నానా? రాత్రిళ్లు సరిగా నిద్రపోయానా? నీకేం తెలుస్తుంది? ఈనాడు మీ అమ్మ బ్రతికి వున్నట్టైతే నాకుమల్లేనే నిత్యం ఆందోళన పడుతూనే ఉండేది" - అన్నది పెత్తల్లి.

"బాగా చెప్పావు" అన్నాడు అనాధరాయి.

"వందనాదేవి తల్లి బ్రతికివుంటే అస్తమానం మిమ్మల్ని గోరా డుతూ ఉండేది కాదూ! నేను మావారిని ఎలా తొందర చేసేదాన్ని! తలుచుకుంటే ఇప్పుడు నాకే సిగ్గువేస్తున్నది"— అన్నది పెత్తల్లి అనాధ రాయిని ఉద్దేశించి.

"ఔనౌను. నువ్వే అన్నమాటేమిటి? ఎవరైనా అంతే" అన్నాడు అనాధరాయి.

"పెద్దవాళ్ళం అయాము. ఎప్పుడు రాలిపోతామో ఎవరికి తెలుసు. బ్రతికి వుండగానే బిడ్డల వ్యవహారం జాగ్రత చేసి పోతేమంచిది. లేక పోతే ఎట్టి దుర్ఘటనలు సంప్రాప్తమౌతాయో ఏమి చెప్పగలం?" అన్నది పెత్తల్లి.

వందనాదేవికి ఆమాట రుచించ లేదు. తన కోసంగాను తండ్రి సరిగా భోజనం చెయ్యక, నిద్రపోక ఎంత ఆందోళన పడుతున్నాడో ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నది. అన్నది— "నువు ఊరికే మానాన్నను

భయపెట్టకు పెద్దమ్మా! మానాన్న ఇంకా చాలా యేళ్లు బ్రతుకుతాడు. ఏమీ పరవాలేదు. కూతురి భవిష్యత్తును గురించి ఏదో సరియైన వ్యవస్థ నిర్మించే పోతాడు. నువ్వేమీ చింతపడ నక్కర్లేదు."

"మీ పెత్తల్లి మాటలు నిజమేనమ్మా! నాకూ ఒంట్లో ఏమీ బాగుండటంలేదు. శరీరాలు శాశ్వతాలుకావు. మీ పెద్దమ్మ మనకు ఆత్మీయురాలు: చెప్పవలసినమాట చెప్పింది. తప్పులేదు." అన్నాడు అనాథరాయి.

పెత్తల్లి వందనాదేవికేసి కోపంగా చూచింది. "ఒకవేళ నేను పొరపాటుమాట అని వుంటే క్షమించు మిస్టర్‌రాయి! నువు నూరేళ్ళు జీవించవలె ననే నా కోరిక నేను చెప్పదలచినది ఏమంటే—'

అర్థోక్తిలోనే అనాథరాయి అందుకున్నాడు—"నువు చెప్పినమాట సత్యమే; తప్పేమీలేదు. నిజానికి నాకూ ఆరోగ్యంగా ఉండటంలేదు. నా కర్తవ్యాన్ని నేను నెరవేర్చకుండా ఉపేక్షించటం అన్యాయంకాదూ!"

వందనాదేవి కోపం అణచుకుంది. "ఇవాళ మానాన్న భోజనం చెయ్యడు పెద్దమ్మా!"

"సరే ఈ సంబంధమైన ఆలోచనలు కట్టిపెడదాం. నువు భోజనం చెయ్యకపోతే నాకు కష్టంగా ఉంటుంది సుమీ మిష్టర్ రాయ్!"

ఆ తరువాత కొంత సేపటివరకూ ఎవరూ మాటాడలేదు.

"నీ మేనల్లుడి ప్రాక్టీసు ఎలా ఉందేమిటి?"—అనాథరాయి అడిగాడు పెత్తల్లిని.

"మొన్ననేగా ఆరంభించాడు! అయినా బాగానే ఉందట!"

మరి కాసేపటిదాకా ఎవరూ మాటాడలేదు. చివరకు పెత్తల్లి ఇలా అన్నది. "ప్రాక్టీసు ఎలావుంటే యేం? మనిషిలో నడవడి చూడాలి మనం. నడవడి మంచిదికాని పురుషుని కట్టుకుని ఆడది ఏం సుఖపడుతుందీ?"

"ఔనౌను. నిజమే" అన్నాడు అనాథరాయి.

"అశోక్ మంచి నీతిగల మనిషి. చిన్నప్పుడు నాలాలన—పోషణలో ఉన్నవాడు. మా నాన్నలాగ. మా అన్నయ్యలాగ మంచి సౌజన్యం గలవాడుగా తయారైనాడు. నెమ్మదస్థుడు, ఉదారుడు."

అనాథరాయి అంగీకరించాడు. "నేనూ అలాగే అనుకున్నాను. చాల మంచివాడే. అయిదారు రోజులు ఇక్కడ ఉన్నాడుగా! అతని

ప్రవర్తనా అదీచూచి చాలా సంతోషించాను - ఔను కాదుటే వందనా! అతడు వెళ్ళిపోతే....ఆ రోజంతా నాకు ఎలాగో ఉంది"

"ఔను, నాన్నా చాలమంచివాడు; వినయశీలి; భక్తుడు. నేను ఏమిచెప్పినా 'కాదు' అనేవాడుకాదు అతడు నన్ను తీసుకువచ్చి బొంబాయిలో దిగబెట్టకపోతే ఏమయేదాన్నో!"

"నువు ఇంకో విషయంకూడా గమనించే ఉంటావు. అతడు మంచి ప్రేమికుడు." అన్నది పెత్తల్లి.

"నిజమైన ప్రేమికునిగాని, ప్రేమికినిగాని మీ పరివారంలో నే నెక్కడా చూడలేదు పెద్దమ్మా!" అన్నది వందనాదేవి.

పెత్తల్లి నవ్వింది. "చూచేవుంటావు వందనా! అంత బుద్ధిశాలివి; అంతమాత్రం కనిపెట్టలేకుండా ఉంటావా?"

అనాధరాయికూడా నవ్వాడు "నువు అన్నట్టు మా అమ్మాయి తెలివితేటలు అసాధ్యమైనవి. తండ్రిని నేనా మాట అంటే గర్వోక్తిగా ఉంటుంది. కాని అబద్ధంకాదు."

"ఇక ఈ ప్రసంగం ఆపివేద్దాం పెద్దమ్మా! నా తప్పులు నువు చూచావు. కాని ఏకమాత్ర పుత్రికపట్ల తండ్రి ఎట్టి ఉత్కృష్ట అభిప్రాయాలతో ఉంటాడో నీకు తెలియక పోవచ్చు. తన కూతురులాంటి పిల్ల ప్రపంచంలో ఇక ఉండదని మా నాన్న అభిప్రాయం" అన్నది వందనాదేవి.

"మీరు నా మాటలు డాంబికాలనుకుంటే అనుకోండి. కాని నా కూతురును చూచుకుని నేను సౌభాగ్య శాలినని గర్విస్తున్నాను. వందన లాంటి కూతురు అందరికీ ఉండదు" అన్నాడు అనాధరాయి.

వందనాదేవి విషయం మార్చింది. "ఇవాళ నువు మిఠాయి ఏమీ తినలేదు. రుచిగా లేదా?"

వెంటనే అనాధరాయి పళ్ళెంలోనించి చేతినిండా మిఠాయి అందుకుని నోటిలో తురుముకున్నాడు. అన్నాడు-"ఈ మిఠాయిలన్నీ మాపిచ్చిపిల్ల తయారు చేసినవే. కలకత్తానించి తిరిగివచ్చిన తరువాత ఆమె భోజనవిధానం పూర్తిగా మారిపోయింది. వంటకూడా బంగాళీదేశపు పద్ధతిని తయారు చేస్తున్నది. విదేశాలకు వెళ్ళి వచ్చినందువల్ల అలవాటైన కూరలిప్పుడు మా యింట్లో వండటమేలేదు. నే నెన్నడూ కనీ, వినీ యెరుగని పిండివంటలు నేర్చుకు వచ్చింది. ఈమె చేస్తున్న యీ కొత్త

వంట మూలాన్ని నాకు ఆరోగ్యంగా ఉంటున్నది; వేళకు ఆకలి ఔతున్నది. హాయిగా ఉంటోంది."

"పెద్దమ్మగారికి నా వంట రుచించటం లేదుకామాలు!"

వందనాదేవి విసిరిన వ్యంగ్యవాక్యం పెత్తల్లికి అర్థమైంది. "రుచించకేం? చాల బాగున్నది నీ వంట. గాలి, నీళ్లు మార్చుదామని బొంబాయి వచ్చాను. నువు భోజనంకూడా మార్చావు. నా ఆరోగ్యం తొందరలోనే బాగుపడ్డది"

"అయితే ఇంకా కొన్నాళ్ళు ఉండు. ఇంకా బాగుపడుతుంది" అన్నది వందనాదేవి.

"అయినా ఎక్కువరోజులు ఉండటానికి వీల్లేదు వందనా? అశోక బాబు ఈ నెలాఖరుకు పంజాబు వస్తానని ఉత్తరం రాశాడు. అతడక్కడికి చేరుకునేలోగా నేను వెళ్ళిపోవాలి"

భోజనాలైనవి. అనాధరాయి లేవబోతున్నాడు. ఇంతసేపటినించీ పెత్తల్లి ఏదో మనసులో పెట్టుకునే సంభాషణ సాగించింది. ఇప్పటికి అనుకూలవాతావరణం సృష్టించగలిగింది. అవకాశం జారవిడుచుకోరాదని ఇలా అన్నది. "మిస్టర్ రాయి! ఒక్కమాట అడగాలనుకుంటున్నాను...."

"అయ్యయ్యో. సంకోచం ఎందుకు? అడుగు" అన్నాడు అనాధరాయి.

"వందనాదేవి ఇష్టపడిందనే నేనూ విన్నాను. అశోకబాబు ధనవంతుడు కాని మాట వాస్తవమే. తన సత్ప్రవర్తన వల్ల ఏనాటికైనా ఉచ్చస్థితికి రాగలడు. సందేహం లేదు. నీ కూతురికి అతడు తగిన వరుడు కాదని నీ అభిప్రాయమైతే...."

అనాధరాయి చాలసేపు ఆలోచించి ఇలా అన్నాడు. "అశోక బాబును నేను చూచాను. అతన్ని గురించి వందనాదేవిద్వారా విన్నాను. అయోగ్యుడేమీ కాదు. పిల్లదానిపెళ్ళి త్వరలో చెయ్యవలసిందే. దాని అంగీకారం కూడా తీసుకోవాలిగా మరి!"

"నువు సిగ్గుపడకండా నీ తలపు ఏమిటో మీనాన్నకు చెప్పవే వందనా!" అంటూ పెత్తల్లి స్నేహపూర్వకంగా వందనాదేవిని ప్రోత్సహించింది.

ప్రథమంలో వందనాదేవి ముఖం వాడువారింది. మరుక్షణమే సుస్పష్టస్వరాన ఇలా చెప్పింది— "వివాహం విషయంలో నా స్వాతంత్ర్యాన్ని వొదులుకున్నాను. నా తలపు తెలుసు కోవలసిన అవసరం లేదు"

అనాదరాయి ఆశ్చర్యపోయాడు - "అదేంమాట ?"

"నామాటలలోని భావం మీకు స్పష్టంగా విడదీసి చెప్పలేనేమో నాన్నా! కాని మీ యిష్టానికి నేనడ్డు చెప్పటమంటూ ఉండదు. సతీదేవి అక్కయ్యకు తొమ్మిదిసంవత్సరాలప్పుడు వివాహమైంది. తల్లిదండ్రులే ఆమెను ఒక అయ్యచేతిలో పెట్టారు అతన్నే ఆమె తనభర్తగా స్వీకరించి సేవిస్తున్నది. అంతేగాని ఆమె తనభర్తను స్వయంగా ఎన్నుకోలేదు. అదృష్టవశాత్తు ఆమెకు లభించినటువంటి భర్త ప్రపంచంలో అందరికీ దొరికేటువంటి వాడు కాదు. విప్రదాసుబాబు సాధుపురుషుడు. 'ఎక్కడ నీకు వివాహం కావలసి వుందో అక్కడికే నిన్ను భగవంతుడు తీసుకు వెడతాడు' అని నన్నాయన ఆశీర్వదించాడు. ఆయనమాట ఎన్నడూ అబద్ధం కాజాలదు. నువు ఎలా ఆజ్ఞాపిస్తే అలాగే నడుచుకుంటాను. ఏమీ వెను కాడను"

అనాధరాయి ఆర్చర్యంగా ఆమెకేసి చూస్తూ విల్చున్నాడు. నోట మాటరాలేదు.

"వివాహమప్పుడు మీ అక్కయ్య చాల చిన్నపిల్ల. అందుచేత ఆమె యిష్టాయిష్టాలు ఎవరూ అడగలేదు. నువు చిన్నపిల్లవు కాదుగా! వయసు వచ్చినదానివి; నీ మంచిచెడ్డలు నువే ఆలోచించుకోవాలి. కళ్ళు మూసుకుని భగవంతుడి మీద భారం వేసి ఊరుకోటం నీవంటిదానికి తగని పని." అన్నది పెత్తల్లి.

"తగిన పనో, తగని పనో నాకైతే తెలియదు. మా అక్కయ్యలాగే భగవంతుడిచ్చిన వరుడినే స్వీకరిస్తాను."

"కాని ఇలానువు ఉదాసీనంగా ఉండిపోతే మీనాన్నగారు ఒక నిర్ణయానికి ఎలారాగలరు ?"

"మానాన్న అన్నగారు సతీదేవి వివాహం ఎలా చేశారో.... వారి పూర్వులంతా తమతమ కూతుళ్ళ పెళ్ళిళ్ళు ఎలా చేశారో.... నాపెళ్ళి కూడా మానాన్న అలాగే చేస్తారు."

"నువుస్వయంగా ఏమీ ఆలోచించవు ; ఏమీచెప్పవు ; అంతేనా?"

"నేను స్వయంగా ఆలోచించటం అయిపోయింది ; చాలా చాలా ఆలోచించాను ; ఇక ఆలోచించ దలచుకోలేదు. మానాన్నమీదే భరోసా పెట్టేస్తున్నానిక. అదృష్టం ఎలా వుంటే అలా ఔతుంది."

"అదృష్టాన్ని మేమూ ఒప్పుకుంటాము. కాని కొన్నాళ్ళపాటు ముఖర్జీపరివారంలో ఉండివచ్చినంతమాత్రాన నీ శిక్షణసంస్కారాల్నీ మట్టి గలిసి పోయాయి. ఇంతగా మారిపోతావని మేమెన్నడూ అనుకోలేదు సుమా ! నువు పూర్వపు వందనాదేవివి కానేకాదు. మారించి దూరమై పోయావు—" అన్నది పెత్తల్లి నీరసంగా హతాశయై.

"నేనుకూడా ముఖర్జీ పరివారంలో కలిసిపోయినంత మాత్రాన మీకు పరాయిదాన్ని అయిపోను. నన్నుగూర్చి మీ రేమీ విచారించ నక్కర్లేదు."

"అయితే అశోకబాబును వెంటనే బయలుదేరి రమ్మని టెలిగ్రాం ఇవ్వనా ?"

"ఇవ్వు; నాకేం పరవాలేదు." అంటూ వందనాదేవి అచ్చోటు వీడి వెళ్ళిపోయింది.

"మిస్టర్ రాయ్ ! తంతి నీ పేరుతోనే ఇస్తాను." అంటూ పెత్తల్లి తలెత్తి చూచింది. అనాధరాయి నేత్రాలు అశ్రుసిక్తము లైనవి. అందుకు కారణమేమో ఊహించుకోలేక పెత్తల్లి తెలతెల బోయింది.

"ఇవాళే టెలిగ్రాం ఇవ్వనక్కర్లేదులే" అన్నాడు మెల్లిగా.

"ఇస్తేయేం ? వందనాదే 'సరే' నన్నదిగా !"

"ఇవ్వాళ కాదులే." అని అనాధరాయి ఊరుకున్నాడు.

అతని మౌనము పెత్తల్లికి కోపం తెప్పించింది. పైగా అతని కన్నీళ్లు ఆమెకు దుర్బోధ్యంగా ఉన్నవి. అంత పెద్దవాడు ; చదువు కున్నాడు. నలుగురిలో తిరుగ నేర్చినవాడు; అలా ఊరికే కంట తడి పెడతాడెందుకూ ?

మరి రెండు మూడు నిముషాలయాక - "కూతురియెడల తండ్రి కర్తవ్యం ఎంతవరకో అంతే నేను ఊహించుకుని నిర్వహించగలను. దానికి తల్లిలేదు. ఇప్పుడు మాతృభారంకూడా నేనే వహించక తప్పదు. కాబట్టి నాకు ఇంకా కొంత వ్యవధి కావాలి" అన్నాడు అనాధరాయి.

పెత్తల్లికి ఆ మాట నచ్చలేదు. ముసలాడికి మతిపోయింది - అని ఆమె అనుకుంది. నీరసంగా నవ్వింది. "పిల్లదాని మాటలు మన కర్థం

కావటంలేదు. ఇవాళేకాదు; బంగాళంనించి తిరిగివచ్చిన దాదిగా ఆమె పూర్తిగా మారిపోయినట్టే నాకు తోస్తున్నది. అనటానికి 'సరే' అన్నది. కాని - ఆమె ఈ నవీన ధర్మం ఏమిటో అర్థం కావటంలేదు"

"నాకూ సరిగా అర్థం కావటంలేదు. బలరామ పురంనించి ఏవో కొత్త సమస్యలు వెంట తెచ్చుకున్నట్టు కనిపిస్తున్నది. వాటిని గురించే ఆమె రాత్రింబగళ్ళు ఆలోచిస్తున్నదేమో! అక్కడినించి వచ్చాక ఆమె భోజన పానాదులలోకూడా మార్పు వచ్చింది. మాట, ప్రవర్తనకూడా మారినవి. ఉదయాన్నే శిరస్నానం చేస్తుంది. నా గదిలోకివచ్చి నా కాళ్ళకు నుదురు సోకేట్టు మ్రొక్కుతుంది. 'అదేమిటే పిచ్చిదానా!' అంటే 'ఇదివరకల్లా నాకు తెలియలేదు నాన్నా. ఉదయాన్నే నీ పాదధూళి గ్రహించి పనిలోకి పోవాలి' అంటుంది. రోజల్లా నా పనుల్లోకూడా ఏదో సహాయం చేస్తూనేఉంది" మళ్ళీ అతని కన్నులు అశ్రుసిక్తములైనవి.

పెత్తల్లి లోలోపల కంటగించుకుంది. "ఈ కొత్త పద్ధతులన్నీ ముఖర్జీ యింట్లో నేర్చుకు వచ్చినవే. వాళ్ళు ఎంత సనాతనులో తెలుసునా? కాని అది ధర్మంకాదు; కుసంస్కారం అంటారు. పూజా పునస్కారాలుకూడా ఆరంభించిందా?"

"ఏమో, నాకు తెలియదు. చెయ్యటం లేదనుకుంటాను. అవన్నీ కుసంస్కారాలనీ నాకూతెలుసు. 'వద్ద'ని హెచ్చరించాను. కాని ఆమె ఇదివరకులా ఏ విషయమూ తర్కించటం మానివేసింది. ఊరికే చూస్తూ కూచుంటుంది. నేనూ ఏమీ మాటాడ లేక పోతున్నాను"

"అది నీ దౌర్బల్యం. నీ కూతురు 'సూపర్‌స్టిషన్'లో పడి పోయింది. అది ధర్మంకాదు. ఆమెను ఇప్పుడు రక్షించలేకపోతే మనదే అపరాధ మౌతుంది"

అనాథరాయి ద్వైధీభావంలో పడ్డాడు. "'ధర్మ' మనే పదాన్ని మనమంతా మాటిమాటికీ ముఖతః ఉచ్చరించటమేగాని దాని స్వభావం ఎట్టిదో, రూపం ఎట్టిదో మనకు తెలియదు. తెలుసుకోటానికి ప్రయత్నించటమూలేదు. ఒక్కసారిగా అమ్మాయి ఇలా మారిపోవటం నాకే ఆశ్చర్యంగా ఉంది. పూర్వపు ఆటకాయ తనమంతా ఏమయిందో! ఆ నవ్వులూ, ఆ పరిహాసాలూ ఏమైనాయో! వానకు తడిసిన వికసిత పుష్పంలా ఉంటున్నాది. 'ఏమిటే అమ్మా! నాకు దాచకండా చెప్పు. ఏమైనా నీకు సుస్తీగాఉంటోందా?' అని అడిగాను. 'అబ్బే, ఏమీ జబ్బు

లేసునాన్నా! కులాసాగానే ఉన్నానుగా!' అంటూ నవ్వేసి తన పనిలో నిమగ్న లౌతుంది. నా గుండె మాత్రం దిగాలు పడిపోతున్నది. ఒక్కతే కూతురు. తల్లిలేదు. ఈ చేతులతో పెంచుకున్నాను; పెద్దజేశాను నా సర్వస్వం పోయినాపరే నా పిల్ల మళ్ళీ పూర్వంలాగా...."

"ఏం పరవాలేదు మిస్టర్ రాయ్! ఏదో తాత్కాలికంగా ధర్మోన్మాదం ఆవేశించి సట్టుంది. అది విస్పారమైంది. వాళ్ళతో కొన్నాళ్ళు కలిసి వున్నందువల్ల కలిగిన ఒక వికారం. పెళ్ళి కావటంతోనే అది మాయమైపోతుంది. ఆదినించీ మనం ఇచ్చిన సంస్కారం, శిక్షణ - అవే విలుస్తాయి. మధ్య వచ్చిన ఈ వికారం మధ్యలోనే నశిస్తుంది. నువు చింత పడనక్కర్లేదు."

కాని ఆ మాటలవల్ల అనాథరాయికి పూర్తిగా ధైర్యం చిక్కలేదు. అన్నాడు— "కాని ధర్మోన్మాదం ఆవేశించినట్టయితే ఒక పట్టాన విడువదని అంటారు. తమ్ములాన చిరకాల అభ్యాసాలు కూడా క్షణమాత్రంగా మారి పోతాయిట. ఆ ధర్మోన్మాదం ఇక మళ్ళీ జీవితాంతం వరకూ విడిచి పెట్టి పోదు. అదీ నా భయం"

పెత్తల్లి ఎగతాళిగా నవ్వింది. "వట్టిమాట. ఇలాంటి వేషాలు నేను చాల చూశాను. ఇదంతా మూన్నాళ్ళ ముచ్చట. కాని మన మల్లా ఇప్పుడు చెయ్యవలసిన దేమంటే—ఈ పిచ్చి ముదరనీయ కూడదు. ఇవ్వాళే అశోక బాబుకు తంతి ఇస్తాను. వచ్చేస్తాడు."

"ఇవాళేనా?"

"ఔను. ఇవాళే తంతి కూడా నీ పేరుతోనే ఇస్తాను"

అనాథరాయి అంగీకారం సూచించాడు. "సరే నీ యిష్టం. అశోక బాబు మంచివాడే. నే నెరుగుదును. మంచి నడవడి కలవాడు కాక పోతే ....తన్ను బొంబాయిలో దిగబెట్టి పోవటానికి అతన్నే కోరదు వందనా దేవి."

ఆ మాటనే ఇంకా వ్యాఖ్యానించి అశోకబాబు గుణ కీర్తన చేదామను కుంది పెత్తల్లి. కాని - ఇంతలో వందనాదేవి అక్కడకు వచ్చింది. "నాన్నా! ఇవాళ హాజీసాయిబుగారి కూతుళ్ళు నన్ను 'టీ' కి రమ్మని కబురు చేశారు. రెండు గంటలకు వెడతాను. సాయంత్రం నువు ఆఫీసు నించి వచ్చే టప్పుడు అక్కడికి వచ్చి నన్నుకూడా తీసుకుని ఇంటికి రావాలి."

"వాళ్ళ యింటికి వెళ్ళి నువు అక్కడ తినేది ఏమీ లేదుగా!"

"ఔను, తినను."

"ఎందు కనీ?"

"నా కిష్టం లేదు. మరచిపోకు నాన్నా!"

"మరిచిపోను. నిన్ను పిల్చుక రావటం మరిచిపోతానా?"
అంటూ అనాధరాయి నవ్వి— "అశోకబాబు వచ్చేస్తాడు. తంతి ఇస్తున్నా" అని కూడా అన్నాడు.

"మంచిదే, ఇవ్వండి"

"నే నే బలవంతంచేసి పిలిపిస్తున్నాను. తీరావచ్చాక అతనికేమీ అవమానం జరుగ కూడదు సుమీ!"
అన్నది పెత్తల్లి.

"నువ్వేమీ భయపడ నవసరంలేదు. మేము ఎవరినీ అవమానించే మనుష్యులం కాదు. మా సంగతి అశోకబాబుకు తెలియక పోలేదు."

ఆ మాటకు అనాధరాయి ప్రసన్న చిత్తుడైనాడు. "ఇవాళే తంతి పంపుతున్నానమ్మా! రేపు సోమవారం అతడిక్కడికి వచ్చేస్తాడు.

నౌకరు టపాతెచ్చాడు. వార్తా పత్రికలూ, ఉత్తరాలూ చాల వచ్చాయి. కొన్నాళ్ళ నించీ వందనాదేవికి టపా చూడాలన్న ఉత్సాహం లేకండా పోయింది. రోజూ ఉత్తరం కోసం ఎదురు చూస్తూండటము వ్యర్థమని ఆమె అనుకుంది. తన్ను జ్ఞాపకం పెట్టుకుని ఉత్తరాలు రాసే వాళ్ళు ఎవరున్నారూ?

వెళ్ళిపోతూన్న వందనాదేవిని అనాధరాయి పిల్చాడు. 'ఇవిగో నీకు రెండు ఉత్తరాలు వచ్చాయి.' అంటూ చేతికిచ్చాడు. పెత్తల్లిగారికి కూడా ఒక ఉత్తరం వచ్చింది.

తనకు వచ్చిన ఉత్తరాల మీదకన్నా ఇతర్లకు వచ్చిన జాబులమీదే పెత్తల్లికి ఉత్సుకత మెండు. ఆమె వందనాదేవి దగ్గిరకు వచ్చి— 'ఒకటి అశోకబాబు రాసిన ఉత్తరం; ఆ రెండవది ఎవరు రాశారూ?' అని అడిగింది.

ఈ అకారణ ప్రశ్నకు వందనాదేవి జవాబివ్వలేదు. తన రెండు ఉత్తరాలూ తీసుకుని గదిలోకి వెళ్ళిపోయింది.

అనాధరాయి నవ్వాడు. "అశోకబాబుతో ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా సాగుతూ ఉన్నాయన్నమాట! సరే, టెలిగ్రాం ఇచ్చేద్దాం; వస్తాడు.

కుర్రవాడు మంచివాడే. అతనిలో విశ్వాసం కుదరకపోతే వందనాదేవి ఉత్తరాలు రాయదు."

అందుకు ప్రత్యుత్తరంగా పెత్తల్లి ఒక రకంగా నవ్వింది. ఆ నవ్వులో భావం ఆమెకే తెలియాలి.

* * *

సాయంత్రం ఆఫీసునించి ఇంటికివస్తూ అనాధరాయి హాజీ సాహెబుగారింటికి వెళ్ళాడు. కాని వందనాదేవి అక్కడికి రానేలేదుట. ఒంటరిగానే ఇంటికి వచ్చేశాడు. రాగానే పెత్తల్లి కనిపించింది.

"ఉత్తరాలు పుచ్చుకుని వందన తనగదిలోకి ఏం వెళ్ళిందో, మళ్ళీ బయటకు రాలేదు." అని అనాధరాయితో ఆమెచెప్పింది.

అనాధరాయి గాభరా పడ్డాడు. "భోజనం చేసిందా?"

"ఊహుఁ. ఉదయాన్నే రెండుపళ్ళు ఫలహారం చేసింది. ఇంత వరకూ ఉపవాసమే"

అనాధరాయి ఆతృతగా కూతురి గదిదగ్గిరకు వెళ్ళి పిల్చాడు.

వందనాదేవి గడియ తీసింది. ఆమెముఖం చూచి అనాధరాయి స్తబ్ధుడయినాడు.

"నాన్నా; ఈ రాత్రిబండికే బలరామపురం వెడతాను"

"బలరామపురమా! ఎందుకూ?"

"ద్విజదాసుబాబు ఉత్తరం రాశాడు. చదువుతావా నాన్నా!"

"నువు చదువు వింటాను" అంటూ ఆయన ఒక కుర్చీలో కూల బడ్డాడు. కుర్చీ ఆనుకుని వందనాదేవి నిల్చుంది. ఉత్తరం విప్పి చదువ నారంభించింది.

"సు శీ లా!

ఆ నాడు నువు బయలుదేరివెడుతున్నావు. బండీ వాకిట్లోఉంది. 'అప్పుడప్పుడు కాస్త మీ క్షేమసమాచారాలు తెలుపుతూవుండు' అన్నావు. 'కాని నేను వట్టి అశ్రద్ధ మనిషిని. ఉత్తరాలు రాసే అల వాటు నాకు లేదు. సరిగా రాయటం చాతకాదు కూడాను. ఆపని ఇంకెవరికన్నా వొప్పజెప్పిపో' అన్నాను నేను.

నువు దానికేమీ జవాబు చెప్పలేదు; వెళ్ళి బండీలో కూచు న్నావు. 'ఇటువంటి సమయంలోకూడా కటువైన మాటతప్పితే

సౌజన్యంగా మాటాడ్డం తెలియని వీడితో ఎక్కువమాటలు దేని కిలే ' అని నీవు అనుకుని ఉంటావు.

నిజానికి నేనటువంటి దురాత్ముడినే. అయినా ఏవైనా మామూలు కన్నా విశేషమైన సంగతులు ఉంటే రాద్దామనే అను కుంటూ ఉన్నాను.

మానవులకు ఎప్పుడూ అనుకోని దుఃఖాలు సంభవిస్తూ ఉండటమేగాని, సుఖాలు కోరుకున్నా రావు ! ఆకస్మికంగా అసలే రావు. జరగరాని సంఘటనలెన్నో జరుగుతున్నప్పటికి మా అన్నయ్య ఇష్టదైవము ఇంకా కళ్ళుమూసుకునే ఊరుకున్నాడు. దీనికి అంతములేదా ? ఈ విధి వైపరీత్యాన్ని తప్పించే ఉపాయం లేదా ?

లేనట్టేతోస్తున్నది. అంతసామర్థ్యం ఎవరికీలేదు. ఉంటే భగవంతుని ఎక్కువ ఏముందీ ? నివాత నిష్పంద దీపశిఖ ఆ భగవ జ్యోతి ఈనాడు కూడా అలాగే ప్రకాశిస్తున్నది. ఆ ప్రకాశం లేశ మాత్రమూ తగ్గలేదు.

మూడురోజులైంది ; అన్నయ్య తిరిగి వచ్చాడు. ఉద యాన్నే ఇంటిముందుబండీ దిగాడు. తరువాత వాసు దిగాడు. అన్నయ్య కాళ్ళకు చెప్పులుకూడా లేవు. బండీ వెళ్ళిపోయింది. బండిలోనించి ఇ కెవరూ దిగలేదు. నేను మేడమీద నిల్చుని చూస్తు న్నాను. నాచుట్టూ ప్రపంచమంతా చీకటిమయమై పోయింది. అంతా అమావాస్యనిశి. రెండుమూడు నిమిషాలవరకూ అలాగే ఉంది. మళ్ళీ నాకళ్ళకు చూపు వచ్చింది. నా స్థితి నాకే ఆశ్చర్య మైంది.

నేను మేడదిగి వచ్చాను. " చిన్న ఉదయం మీ వదినె చని పోయిందిరా ద్విజూ ! నాదగ్గిర డబ్బులేదు. పెద్ద ఎత్తులకు పోకుండా ఏదో సాధారణ రీత్యా ఆమె శ్రాద్ధం వెళ్ళదీయాలి. అమ్మ ఏదీ ? " అన్నాడు అన్నయ్య.

" ఢాకాలో కూతురు దగ్గిర ఉంది "

" ఢాకా ! " అని ఉచ్చరించి కొంతసేపటి వరకూ అన్నయ్య మౌనంగా ఉండి ఇలా అన్నాడు. " అమ్మరాదేమో ! అయినా

తల్లిశ్రాద్ధం అవి తెలియజేస్తూ వాసు ఉత్తరం రాస్తే వస్తుంది. ఆ పనిచేయించు"

"అలాగే" అన్నాను నేను.

వాసు పరుగెత్తుకు వచ్చాడు. వచ్చి నామెడ కావిలించుకున్నాడు. వాడి యేడుపు ఎలాఉందో చెప్పటానికి నాకు వచ్చిన భాష చాలదు. వేటగాడి చేతికిజిక్కి చనిపోయేముందు మృగము విన్నవించుకునే కడసారి విజ్ఞాపనలా ఉంది వాడి రోదనం నేను మనసులో అనుకున్నాను. "ఒరే వాసూ! ఇది సామాన్యమైన ఆపదకాదు. దుస్సహమైనదే. కాని నీ కొక్కడికేకాదు ఈ గాయం. ఇంకా చాలమందికి తగిలింది. నీకన్నా ఎక్కువగా బాధపడుతూన్న వాడు ఇంకొకడు కూడా ఉన్నాడు. నీకు ఎవరో ఒకరు ఓదార్పు ఇస్తారు; వాడికిమాత్రం ఓదార్చేవారులేరు."

చివరకు కన్నీళ్ళు తుడుచుకుని, కుర్రవాణ్ణి ముద్దు పెట్టుకుని ఓదార్చాను. "భయంలేదులేరా నాన్నా! మీ అమ్మ లేకపోతేయేం? మీ నాన్న లేకపోయినా పరవాలేదు. నేను లేనూ? వాళ్ళఋణం నేను తీర్చుకోలేననుకో. కాని బాకీ ఎగవేసేవాణ్ణి మాత్రం కాదు. ఈ మహాపదలో, ఈ మహాదుఃఖంలో ఇదే నీ బాబాయి చేస్తూన్న ప్రతిజ్ఞ!

ఇలా ఇంకా పెంచిరాసి విన్ను విసిగించను. చిన్నప్పుడు మానాన్న నన్ను 'పోకిరి వెధవ' 'దిప్పకాయ' అని చివాట్లు వేస్తూ ఉండేవాడు. అన్నయ్యకూడా అనేకసార్లు నా మీద కోప్పడేవాడు. అటువంటి సమయాల్లో నాకీయింట్లో ముళ్ళమీద ఉన్నట్టుగా ఉండేది. మా వదినెదగ్గరకు పోయేవాణ్ణి. 'ఏం నాయనా! ఏం కావాలి' అని ఆమె ఎంతో అపేక్షగా అడిగేది. నేను మూతి ముడుచుకుని కోపంగా—'నాకేమీ అక్కర్లేదు. ఈ యింట్లో ఉండలేను; వెళ్ళిపోతున్నాను' అనేవాణ్ణి.

"ఎప్పుడు వెడతావు?"

"ఈ క్షణమే"

ఆమె నవ్వేది. "ఉహుఁ. నువు వెళ్ళటానికి నా ఆజ్ఞలేదు. నామాట కాదని వెళ్ళు, చూస్తాను" అనేది.

నేను వెళ్ళలేకపోయేవాణ్ణి. కాని వెళ్లే రోజు వచ్చింది; ఆమె దాటిపోయింది. ఆమె నన్ను పోకండా ఆపింది; ఆమెను పోకండా అడ్డు పెట్టగలిగినవారు లేకపోయారుకదా!

" ఈ కర్మ ఎలావచ్చింది?" అని అన్నయ్యను అడిగాను.

"కలకత్తాలో ఉండగానే ఆమె ఆరోగ్యం చెడిపోయింది. బహుశః మనసులో ఏదో విచారం పెట్టుకున్నది కామాలు! తరువాత ఆమెను తీసుకుని పడమటి ఊళ్ళకు వెళ్ళాను. ఎక్కడా ఆమె ఆరోగ్యం బాగుపడలేదు. చివరకు హరిద్వారం వెళ్ళాం. అక్కడ ఆమెకు జ్వరం పట్టుకుంది. తరువాత కాశీ వెళ్ళాం. అక్కడే ఆమె మరణించింది."

అదీకథ! అన్నాడు అన్నయ్య.

"మందు ఇప్పించావా?" అని అడిగాను.

"వీలైనంతవరకు లోటు జరుగలేదు"

ఆ 'వీలైనంతవరకు' అన్నమాటకు అర్థం ఏమిటో ఆయన ఒక్కడికే తప్ప మరెవరికీ తెలియదు.

"నాకు ఇంతశిక్ష ఎందుకు విధించావు? నేనేమి మహాపరాధం చేశాను?" అని అడుగుదామనుకున్నాను. కాని అప్పుడాయన ముఖం చూచాక నానోట మాట రాలేదు.

"వదినె ఎవరికన్నా ఏమైనా చెప్పిపోయిందా?" అని అడిగాను."

"ఇంకా అయిదారు గంటలకు ప్రాణం పోతుందనగా బాగేనే తెలివి ఉంది. 'సతీ! అమ్మ కేమన్నా కబురు చెబుతావా?' అని అడిగాను.

'ఉహుఁ' అన్నది.

'నాకో?'

'ఉహుఁ'

'ద్విజుబాబుకు?'

'ఔను. అతన్ని నాహృదయ పూర్వకంగా ఆశీర్వదించానని చెప్పండి!' అన్నది.

ఇక నేనక్కడ ఉండలేక మావదినె గదిలోకి పరుగెత్తుకుని పోయాను. ఫొటో తీయించుకోటమంటే ఆమె కెంతో సిగ్గని

పించేది. ఒకే ఒక ఫొటో ఉంది ఆమెది. ఆమె దాన్ని అలమారలో దాచి పెట్టింది. ఆ ఫొటో నేనే తీశాను. నేనా ఫొటోముందు పల్చుని విన్నవించుకున్నాను—"వదినా! నీ ఆజ్ఞనాకు అర్థమైంది; కృతార్థుడను. ఇంత తొందరగా నువు దాటిపోతావని నేను కలలోకూడా అనుకోలేదు. నువు ఇప్పుడు ఎక్కడ ఉన్నావో నాకు తెలియదు. ఎక్కడ ఉన్నాసరే; నీ ఆజ్ఞ నేను ఉల్లంఘించినది ఎప్పుడూ లేదు. నువు లేకపోతివే అని పొర్లి పస్తున్న ఈ దుఃఖాన్ని ఆపుకోగలిగిన శక్తి నాకు దయచేసి ప్రసాదించు." అని అర్థించాను.

ఇక నాసంగతి : వెడుతూ వెడుతూ నన్ను పెళ్ళిచేసుకోమని ఆజ్ఞాపించి వెళ్ళావు నీవు.... ఈ భారమంతా నేను ఒక్కడినే నిర్వహించలేనన్న కారణంచేత చేదోడు ఉండవలసినదే. ఆ సహచారిణి మైత్రేయి కాగలదని నువు ఊహించావు. నీమాటకు నేను అడ్డు చెప్పలేదు. సరే, ఈ సంసారంలో పదిహేను అణాలవంతు సుఖమే లభించే పక్షంలో ఒక్క అణావంతు దుఃఖం సహించలేకపోతామా? అనుకున్నాను. కాని ఇప్పుడు ఆ ఆశకూడా లేదు. పైగా మా వదినె చచ్చిపోయింది. గడవరాని దుఃఖ సముద్రంలో మునిగాను. ఏమిటా దుఃఖం? మైత్రేయి ఈ సమస్త భారాన్నీ తలకెత్తుకో గలదు; కాని మోయలేదు. ఈ భారమంతాచూస్తే నా గుండె నీరై పోతున్నది. కాని ఈ విపత్సమయంలో మైత్రేయి మాకు చాల సేవచేసింది. ఆమెకు నేను కృతజ్ఞుడను ఆమె ఋణం నేను మరచిపోను.

నిన్నటిరాత్రి చాల పొద్దుపోయింది. వాసు హఠాత్తుగాలేచి ఏడవటం మొదలుపెట్టాడు. వాణ్ణి సముదాయించి మళ్ళీ నిద్రపుచ్చి అన్నయ్య గదిలోకి వెళ్ళాను. ఆయన పడుకోలేదు. కూచుని పుస్తకమేదో చదువు కుంటున్నాడు. "ఏం పుస్తకం అన్నయ్యా అది?" అన్నాను. ఆయన పుస్తకం మూసేసి అవతల పెట్టాడు. "ఎందుకు వచ్చావు? ఏమైనా పనిఉందా నాతో?" అన్నాడు నవ్వుతూ. ఆయన ముఖం చూస్తొంటే నేను అడగాలని వచ్చిన మాట గొంతుకలోనే ఆగిపోయింది. అనుకున్నాను - "నిద్రలో హఠాత్తుగా లేచి వాసు ఏడిస్తే విప్రదాసు కేం కష్టం?" అని.

"శ్రాద్ధం అయిన తర్వాత నువు ఎక్కడ ఉంటావు అన్నయ్యా! కలకత్తాలోనా ?"

"కాదురా తీర్థయాత్ర వెడతాను."

"మళ్ళీ ఎప్పుడు వస్తావు ?"

"మళ్ళీరాను" అన్నాడు చిరునవ్వుతో.

స్తబ్ధ చిత్తుడనై ఆయన ముఖంలోకిచూస్తూ నిల్చున్నాను. ఆయన తన నిర్ణయం మార్చుకునే మనిషికాదు. అన్నయ్యా సంసారం త్యజించేశాడు.

నా బాధ ఎవరితోచెప్పుకోను. పోయి ఎవరిముందుఏడ్చేది ? ఈవిష్ఠుర సన్యాసి యెదుటనా? ఏం ప్రయోజనం? అవమానంకాదూ ?

"మరి వాసు మాటేమిటి ?" అని అడిగాను.

"ఎక్కడో ఒక ఆశ్రమం ఉన్నట్టు తెలిసింది. అక్కడ ఉపాధ్యాయులు చిన్నచిన్న పిల్లల్ని చదువు సంధ్యలు చెప్పి వృద్ధిలోకి తీసుకువస్తారుట. పిల్లలపాలన - పోషణభారమంతా వాళ్ళే వహిస్తారుట. వాసును అక్కడికే పంపిస్తాను" - అన్నాడు అన్నయ్యా.

"కుర్రవాణ్ణి తీసుకుపోయి ఎక్కడో. ఎవరి చేతుల్లోనో వొప్పజెప్పి పోతావా ? ఇన్నాళ్ళనించీ, పెంచి పెద్దజేసిన నేను చచ్చిపోయానా ?" అంటూ రెండు చెవులూ మూసుకుని నా గదిలోకి వచ్చేశాను. ఆయన ఏం జవాబు చెప్పాడో నేను వినుపించుకోలేదు.

వాసు పక్కలో కూచుని తెల్లవార్లూ ఆలోచించాను. ఎంత బుర్ర చించుకున్నా ఒక దరి, దోవ కనిపించలేదు. నువు జ్ఞాపకం వచ్చావు. ఆ నాడు నువు వెళ్ళిపోతూ - "అవసరమైనప్పుడు మిత్రరత్నాన్ని భగవంతుడే నీ యింటికి పంపిస్తాడు" - అని చెప్పి వెళ్ళావు. ఆ మిత్రరత్నం ఎవరు ? ఎప్పుడు వస్తుంది ? నాకు అగోచరంగా ఉంది. అయినా నీ మాటమీద విశ్వాసం పెట్టుకుని ఉన్నాను. అత్యంత అవసరమైన ఈ స్థితిలో మిత్రరత్నం వస్తుందనే ఆశతోనే ఉన్నాను.

ద్విజదాసు

ఉత్తరం చదవటం ముగించి వందనాదేవి తండ్రికేసి చూచింది. ఆయన కన్నులవెంట అశ్రువులు ప్రవహిస్తున్నవి. చేతి రుమాలతో కళ్ళు అద్దుకుంటూ - "ఈ రాత్రికే బయలుదేరి వెళ్ళిపో అమ్మా! నేను అడ్డు చెప్పను. మన నౌకరు ముసలి హిమూను వెంట తీసుకుపో" అన్నాడు.

వందనాదేవి తండ్రికి పాదాభివందనంచేసి ప్రయాణసన్నాహంలో నిమగ్న అయింది.

## 26

మేనేజరు దత్తజీ మోటారు తీసుకుని స్టేషన్‌కు వచ్చాడు. వందనాదేవి రైలు దిగగానే ఆయన గౌరవపూర్వకంగా స్వాగతంఇచ్చాడు. ఆమె మోటారులో కూచుంది.

"ఇంకా అమ్మగారు ఇంటికి తిరిగి రాలేదా?"- వందనాదేవి అడిగింది.

"రాలేదమ్మా!"

"మైత్రేయి?"

"రాలేదు. ఆమెను తీసుకు వచ్చేందుకు ఎవరూ వెళ్ళలేదు."

"వాసు కులాసాగా ఉన్నాడా?"

"ఆఁ"

"విపిన్‌బాబు, ద్విజుబాబు...."

"పెద్దబాబు కులాసాగానే ఉన్నారు. కాని చిన్నబాబుకు మాత్రం ఒంట్లో కులాసాగా ఉన్నట్టులేదు."

"జ్వరం రావటం లేదుకద!"

"సరిగా తెలియదమ్మా! ఆ పనీ, ఈ పనీ చేస్తూ తిరుగుతూనే ఉన్నాడు మళ్ళీ"

వందనాదేవి కాసేపు ఊరుకుని అన్నది - "ఇటువంటి దుఃఖ సమయంలోకూడా అమ్మగారు రాదేమో: ఏడుస్తూ, మొత్తుకుంటూనైనా శ్రాద్ధం పెట్టాలిగదా?"

"ఔనమ్మా! అందుకే అన్నిపనులూ చేస్తున్నారు. విపిన్‌బాబు తండ్రిపోయినప్పుడులాగే పెద్ద ఎత్తునే చేస్తారు"

వందనాదేవి ఆశ్చర్యపోయింది.

"ఔనమ్మా! గొప్పగానే చేస్తారు. పెద్దబాబు వచ్చి — ఒరే, ద్విజూ! ఏమిటిరా నీకీపిచ్చి? దేనికైనా ఒకహద్దు ఉండాలి" అన్నారు. 'నాకుతెలుసు కాని 'హద్దు' అంటే అందరికీ ఒకేభావం ఉండదు అన్నయ్యా' అన్నాడు చిన్నబాబు. పెద్దబాబు నవ్వుతూ - 'నువు అందరి హద్దులూ దాటి పోయావు" అన్నారు. "అయితే మీరంతా నన్ను క్షమించాలి. మీ హద్దుల్నిమీరాను. వదినెకు జరుగవలసిన మర్యాదను మీరలేను" అన్నాడు చిన్నబాబు మరి మాటాడలేదు. కనీసం ఇరవై, ఇరవై అయిదు వేల రూపాయల ఖర్చు ఉన్నది"

"ఈ ఖర్చంతా చిన్నబాబు దేనా?"

"ఔనమ్మా!"

"ఆయనస్థితికి మించిన ఖర్చు అంటావా?"

"కాదు. కాని ప్రస్తుత పరిస్థితులు మారిపోయాయి. జాగ్రతగా ఉంటే తప్ప లాభంలేదు. పైగా ఇంకో ఆపద కూడా...."

"ఇంకో ఆపద ఏమిటీ?"

"నువు వినలేదా అమ్మా! శశిధరబాబుమీద వ్యాజ్యం వేశారు కోర్టులో. దాని పరిణామం ఎలా ఉండబోతుందో ఏమి చెప్పగలం?"

"మరి ఇంత ఖర్చుచేయ వద్దని మీరు మందలించక పోయారు?"

"మందలించాను, మందలి స్తేమాత్రం ఏం లాభం? పెద్దబాబు కనుకనా వినేందుకు? ఒక వదినెగారి మాట తప్పితే చిన్నబాబు ఎవరి మాటా వినేవాడు కాదు. ఆమె గారేమో ఇప్పుడు స్వర్గంలో ఉంది"—

వందనాదేవి మరేమీ ప్రశ్న లడగలేదు. మోటారు వచ్చి ఇంటి ముందు ఆగింది. అక్కడ ఖాళీస్థలంలో కట్టెలు కుప్పలుగా పెట్టివుంచారు. ప్రాంగణంలో ఒక మంటపం నిర్మితమై ఉంది. అనేకమంది అనేక పనులలో నిమగ్నులై ఉన్నారు. మామూలుగా దయామయి తలపెట్టిన వ్రతోద్యాపనాది ఉత్సవాలలో వలె కోలాహలంగా ఉంది.

మోటారు దిగి వందనాదేవి మేడమీదికి వెళ్ళింది. ఏకాఏకి ద్విజదాసు గదిలోకి పోయింది. ఎత్తయిన దిండుమీద తలపెట్టుకుని పడుకున్నాడు ద్విజబాబు. అడుగుల చప్పుడు విని తలెత్తి చూచాడు.

లేచి పక్కమీద కూచున్నాడు. " మిత్రరత్నం సరాసరి నాయింట్లోకి వచ్చే సింది. " అన్నాడు.

" ఔను. వచ్చాను. కాని ఇలాటి వేళ పడుకున్నారేం ? "

" కళ్ళు మూసుకుని విన్నే ధ్యానిస్తూ పడుకున్నాను. ' వందనా ! నా దుఃఖానికి అంతులేకండా ఉన్నది. శరీరంలో బలంలేదు. ధైర్యం విలోల మైంది. మధ్యలోనే పడవ మునిగి పోయేట్టుగా ఉంది. అవలియొడ్డు చేరదు ' అని తలపోస్తున్నాను "

" అవలియొడ్డు చేరవలసిందే. మీకు విశ్రాంతి ఇచ్చి ఇక నావ నేను నడుపుతాను "

" నీయిష్టం. కోపం వచ్చి పారిపోకు సుమీ ! "

వందనాదేవి అతన్ని సమీపించి వంగి పాదాభివందనం చేసింది. అప్పుడా యిద్దరి కన్నుల్లోనించి అశ్రువులు ప్రవహించినవి. అలాప్రణామం చేయటం ఆమె జీవితంలో అదే మొదటి సారి.

" మీకు కూడా కన్నీళ్ళు వస్తాయన్న సంగతి నేనెరగనే " అన్నది వందనాదేవి.

" నేనూ ఎరగను. ఇన్నాళ్ళనించీ అవిసరిగా ప్రవహించకండా ఆనకట్ట ఏదైనా ఉండికావాలు ! మైత్రేయిమీద గృహనిర్వహణభారం వేయమని నువు ఉపదేశించి వెళ్లావు. అనాటితో ఆ ఆనకట్ట తెగిపోయింది. ఆ నాడు పొంగి పొర్లిన కన్నీళ్ళు ఆపుకుని అనుకున్నాను- " భారం మైత్రేయిమీదవేసి తాను తప్పించుకు పోవాలని చూస్తున్నది. నాగుండెకింత బాధ కలిగించి వెడుతూన్న ఈమెను చెయిచాచి ఇక యాచించను " అని. కాని ఆ ప్రతిజ్ఞమీదే ఉండలేక పోయాను. వదినె స్వర్గస్థురాలైంది. శశి ధరుని మీద దావా ఆరంభమైన నాటినించీ అమ్మ వెళ్ళి కూతురింట్లో ఉంటున్నది. అన్నయ్య సంసారత్యాగం చేసి పోయేట్టుగా కనిపిస్తున్నాడు. ఏదో భూకంపం వచ్చి ఈ సమస్తం ఆహరించుకు పోతుందా .... అనిపిం చింది నాకు. కాని ఏ భూకంపం వచ్చినా, ఏ అగ్నిపర్వతం పగిలినా, అన్నిటికీ సిద్ధమైయే ఉండగలను. కాని వాసుబాబును ఎక్కడికో ఒక అజ్ఞాత ఆశ్రమానికి పంపిస్తానని అన్నయ్య అనే సరికి నాకు పాతాళానికి కృంగిపోతున్నట్టని పించింది. ఛీ, ఎందుకీ సంపద ? ఉన్నదంతా కళ్యా ణికీ, ఆమె పిల్లలకూ ఇచ్చివేసి, ఇల్లువిడిచి వెళ్ళి పోదామనుకున్నాను.

ఇంతలో నువు చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. 'అవసరం వచ్చిన ప్పుడు మిత్రరత్నం నీ యింటికే స్వయంగా వస్తుంది. విశ్వసించు' అని నువు చెప్పావు. ఇదే ఆమె రావలసిన సమయం అని నాకు తోచింది. నీకు జాబు రాశాను. మనస్సు సందేహించినప్పుడల్లా బలపూర్వకంగా విశ్వాసం తెచ్చుకుని స్థయిర్యంతో ఉన్నాను. నీమాట అబద్ధంకాదు; వదినె యిచ్చిన ఆశీర్వాదం వ్యర్థంకాదు - అని ధైర్యం తెచ్చుకున్నాను."— ద్విజబాబు కన్నుల్లోనించి రెండు అశ్రుబిందువులు రాలినవి.

"మరి మీరే స్వేచ్ఛావిహారులనీ, ఒక్క వదినెగారి మాట తప్ప మరెవరి పలుకూ లక్ష్యం చెయ్యరనీ.... అందరూ అంటున్నారు"

"అదా నీమనసులో భయం? అలా ఎందుకు ఉండేవాడినో ఇప్పుడు మా వదినె బ్రతికివుంటే ఆమే సమాధానం చెప్పేది" అంటూ ద్విజదాసు కన్నీళ్ళు తుడుచు కున్నాడు.

వందన మరికాసేపటి వరకూ అతని ముఖంలోకి చూస్తూనిల్చింది. "సరే. నాకింకేమీ సందేహం లేదు" అంటూ ద్విజదాసు చెయిపట్టుకుని- "భూకంపం కేవలం మీ ఒక్కరి హృదయంలోనేకాదు, నా హృదయంలో కూడా రేగింది. దాని ధాటికి పశ్వరములైన కుసంస్కారాలన్నీ కొట్టుకు పోయినవి. అచంచలమైన శాశ్వత సత్యంమాత్రం నిల్చింది. తత్ఫలితంగా మిమ్మల్ని పొందాను. ఇక వెళ్ళి పెద్దబాబుకు కనపడివస్తాను ఆ నాడు నన్నా యన ఆశీర్వదించాడు-'వందనా! నీ భర్త కాదగినవాడు.. వాడే స్వయంగా నీ చేతిలోకివస్తాడు' అని. ఆయన సాధుమూర్తి. ఆయనమాట నిజమై తీరుతుందని విశ్వసించాను. కాని ఇట్టి దుఃఖదినాల్లోనే ఇల్లా ఆయన ఆశీ ర్వాదం ఫలిస్తుందని మాత్రం నేననుకోలేదు. వెళ్ళి ఆయనకు పాదాభి వందనం చేసివస్తాను" అన్నది.

"ద్విజూ! వందనాదేవి వచ్చిందిటగా!" - అంటూ అన్నపూర్ణ అక్కడికి వచ్చింది.

"వచ్చాను అన్నపూర్ణవదినా!" అంటూ వందనాదేవి వెనక్కు తిరిగి చూచింది.

అన్నపూర్ణ ముఖం శోకాచ్ఛన్నమై ఉంది. చూచి వందనాదేవి విచలిత అయింది. గబగబావెళ్ళి ఆమెను కావిలించుకుంది. "అలా అయి పోయావేమిటి వదినా?" - అంటూ ఏడ్చింది. అన్నపూర్ణకు కన్నీళ్లు

కాలువలు కట్టినవి. తలవిమురుతూ - "హఠాత్తుగా కోపంవచ్చి వెళ్ళిపోకు సుమీ! కొన్నాళ్ళపాటు నువు ఇక్కడ ఉండిపోవాలి. నీకు నేను చెప్పే దేముందీ? అన్నది.

"వాసు ఏడీ వదినా?" వందనాదేవి అడిగింది.

"స్నానం చేయించి తీసుకు రావటానికి నౌకర్లు చెరువుకు తీసుకు పోయారు."

"వాడికి అన్నం ఎవరు తినిపిస్తున్నారు?"

"ఎవరున్నారు? ద్విజుబాబే. ఇద్దరూ ఒకసారే భోజనం చేస్తారు; ఒక మంచం మీదే పడుకుంటారు"— అంటూ అన్నపూర్ణ కన్నీళ్ళు ఒత్తు కుంది. చనిపోయినఆమె ఒక్కవాసుకే కాదు తల్లి; ద్విజబాబుకు కూడాను. సతీదేవి అకాలమృత్యువు వాతపడి, చనిపోయింది; ఆమె శ్రాద్ధానికి ఈ భారుభూరు లన్నీ దేనికి? అని అంటూన్నారు చాలమంది. వారికేమి తెలుసును. సతీదేవి మా ద్విజబాబుకు ఏ పూర్వజన్మలోనో మాతృదేవత యన్న సంగతి? ఆమె అంత్యక్రియలు యధావిధిగా గౌరవబద్ధంగా జరక్క పోతే చిన్నబాబుకు కష్టంగా ఉండదూ?"

"అన్నపూర్ణ అక్కా! ఇక భయంలేదు. వందనాదేవి వచ్చేసింది. ఈ సమస్తభారమూ ఆమె తల మీదపెట్టి నేను తప్పుకుంటాను"— అన్నాడు ద్విజదాసు వందనాదేవిని చూపుతూ.

"పరాయి ఇంటి పిల్ల ఈ భారమంతా ఎందుకు మోస్తుంది తమ్ముడూ?"

"పరాయి ఇంటి పిల్లే మోయాలి మోస్తే. ఆమెతో చెప్పేశాను— ఈ దుఃఖభారమంతా నేను వహించలేను. పైగా దానుకూడా ఇక్కడ లేకండా వెళ్ళి పోయాడంటే— ఇక ఇక్కడ మిగిలేదేమీ ఉండదు. ముఖర్జీ వంశస్థుల యిల్లొకటి మాత్రం ఉంటుంది; మా యేడు తరాలవారి గౌరవ ప్రతిష్ఠలు ఉంటాయి. అంతే. శశిధరుని పిల్లలను పిల్చి ఈ సమస్త సంపదా వారికి ఇచ్చివేస్తాను. ఆ ఉదారం అన్నయ్యకే కాదు; నాకూ ఉంది. సన్యాసం మాత్రం పుచ్చుకోను; అసలు సన్యాసమంటే యేమిటో నాకు తెలియదు. కాని ఈ సిరి, సంపద చెల్లా చెదరుగా వెదజల్లి పారిపోతాను' అని"

అన్నపూర్ణ వందనాదేవి చేతులు రెండూ పట్టుకుంది. "నువు వాసును ఇంట్లోనే ఉంచుకుని పోషించ లేవూ?"

"పోషిస్తాను వదినా!"

"శశిధరబాబు మీద దావాకూడా ఆరంభమైంది. అది సర్వనాశన హేతువు. దాన్ని ద్విజబాబు ఉపసంహరించుకునేట్టుగా చెయ్యవూ?"

"ఆ పనికూడా చేస్తాను. ఎన్నడూ నా మాట జవదాటనని వారు మాట యిచ్చిన తరువాతనే నే నీ యింటి చిన్న కోడలిని కావటానికి ఒప్పు కున్నాను."

అన్నపూర్ణ కామాట పూర్తిగా అర్థం కాలేదు. అందుచేత మాటాడ కుండా ఊరుకుంది.

"ఇంత వరకు అయిందేదో అయింది; అమ్మగారిని కూడా పోగొట్టుకుంటామా? దావా ఉపసంహృతం కాకండా ఆమెను ఎలా ఇక్కడికి రప్పించు కోగలనూ?" అన్నది వందనాదేవి.

ద్విజదాసు దిండు కింద తాళపుచెవుల గుత్తి తీసి వందనాదేవి పాదాలముందు విసిరి వేశాడు. "తీసుకో. ఇక నేను స్వేచ్ఛా విహారిని కాదు."

వందనాదేవి తాళపు చెవుల గుత్తి తన పైటచెంగుకు ముడివేసు కుంది.

ఇప్పుడు అన్నపూర్ణకు అంతా అర్థమైంది. వచ్చి వందనాదేవిని అమాంతం కావిలించుకుంది. ఆమె కళ్ళు ఆనంద బాష్పాలతో వెల్లు విరి శాయి.

తరువాత వందనాదేవి విప్రదాసు గదికి వెళ్ళి ఆయనకు నమస్కారం చేసింది — 'వచ్చాను బావగారూ!' అంటూ.

'బావగారూ!' అన్న పిలుపువిని విప్రదాసు చకితుడైనాడు. ఆమె ఇది వరకెన్నడూ తన్ను అలా పిలువలేదు. కాని ఆ విషయమై అతదేమీ ప్రశ్నించలేదు. అన్నాడు—"వచ్చావని తెలిసింది. మీ నాన్నగారిచ్చిన తంతి అందింది. వెంట ఎవరు వచ్చారు?"

"మా నౌకరు హిమూ"

"మీ నాన్నగారు కులాసాగా ఉన్నారా?"

"ఆఁ"

కాసేపు ఊరుకుని విప్రదాసు అన్నాడు — "చూచావుగా! ద్విజ బాబుకు ఏమిటీ పిచ్చి అంతాను! నాకేం అర్థం కావటం లేదు.

"శ్రాద్ధానికి ఇంత భారుభూర్లుగా ఏర్పాట్లు చేస్తున్నారనేనా? చేయకపోతే ఎలాగ? చెయ్యవలసిందే. చనిపోయిన పతివ్రతకు జరుగవలసినంత గౌరవం జరుగవలసిందే."

"కాని వా డొక్కడూ ఇదంతా ఎలా ఈదుకు పోగలడు?"

"వారికి చాతగాకపోతే నేను లేనూ?"

విప్రదాసు నవ్వాడు. "నీ కంత శక్తిఉంది; నాకు తెలుసు. కాని నీ వెనుకటిగుణం తలుచుకుంటే నాకు భయం వేస్తున్నది. హఠాత్తుగా కోపంవచ్చి పారిపోయావంటే వాడిగతి ఏం కావాలి?"

"ఆ నాడంటే మీ యింటికి పరాయిదానిహోదాలో వచ్చాను. ఇప్పుడు నే నీ యింటి చిన్నకోడల్ని. ఒకవేళ కోప్పడితే కోప్పడతాను. కాని పారిపోను" అంటూ కొంగున తాళపు చెవుల గుత్తి చూపించి - "చూచారా! ఇంట్లో అన్ని బీరువాల - సందూకా పెట్టెల తాళపు చేతులు కూడా నేనే స్వయంగా తీసుకుని కొంగున కట్టుకున్నాను."

విప్రదాసు ఆనందాశ్చర్యాలతో ఆమెకేసి చూచాడు.

"మీతో చెప్పుకోటానికి నాకు సిగ్గువేస్తున్నది. అయినా దాపరిక మెందుకు? భగవంతునికి తెలియకండా ఎవరేమి దాచగలరు? ఆ నాడు మీరు నా కిచ్చిన ఆశీర్వాదం జ్ఞాపక మున్నదా? 'యదార్థంగా భగవంతుడు నీ కోసం ఉద్దేశించిన భర్తనే నువు పొందగలవు' అని మీరు ఆశీర్వదించారు. ఆ నాటితో నా చాంచల్యం నశించిపోయింది. జితేంద్రియులు, ఆ జన్మ సత్యవాదులు, సాధుపురుషులు అయిన మీ ఆశీర్వాదం సుఖ సంపన్నమే ఔతుంది. అని విశ్రాంతగా ఉన్నాను" - వందనాదేవి కన్నులు బాష్పాకులములైనవి.

విప్రదాసు ఆమెను సమీపించి, తల నిమురుతూ ఆశీర్వదించాడు. ఆమె, అతని పాదాలమీద నుదురుమోపి చాలసేపు అలాగే ప్రణామం చేస్తూ ఉండిపోయింది.

ఇవాళ నువు పొందినవ్యక్తినిమించిన సంపద ఈ ప్రపంచములో ఏదీలేదు వందనా! నా ఈ మాట సర్వదా నువు జ్ఞాపక ముంచుకోవాలి.

"ఎన్నటికీ మరచిపోను" - మీకు జ్వరం వచ్చినరోజుల్లో నేను సేవచేశాను. బహుమానం ఇవ్వాలను కున్నారు. కాని నే నప్పుడు తీసుకోలేదు. జ్ఞాపకం ఉందా?"

"ఉన్నది"

"పారిపోయాడు; పిరికికుంక" అంటూ విప్రదాసు నవ్వాడు.

వందనాదేవి చెయి పట్టుకుని వాసునిల్చున్నాడు. "మళ్ళీ ఎప్పుడు వస్తావు నాన్నా! దబ్బున రావాలి!" అంటూ.

విప్రదాసు మందహాస పూర్వకంగా కుర్రవాడి తల నిమిరాడు. ఏమీ మాటాడలేదు.

వందనాదేవి అత్తగారి పాదధూళి గ్రహించింది.

"అమ్మా కోడలా! వాసునూ, నీ అత్తగారి కులదైవతం రాధా గోవిందునీ, నీకు వొప్పజెప్పి వెడుతున్నాను. ఎప్పటికైనా నేను తిరిగివస్తే ఈ యిద్దరినీ నువు నాకు తిరిగి వొప్పజెప్పాలి." అంటూ దయామయి పైటచెంగుతో కన్నీళ్ళు ఒత్తుకుంది.

వందనాదేవి దూరంవించే విప్రదాసుకు నమస్కారం చేసింది. తరువాత తిన్నగా దగ్గరకు వచ్చింది. "ఆనాడు కలకత్తాలో పూజా గృహంలో ధ్యానవిష్ఠలో ఉండిన మీ మూర్తి నా హృదయంలో దాగి ఉంది. ఇవాళ మళ్ళీ అదేమూర్తిని మీలో చూస్తున్నాను. ఇకముందు మీ క్షేమసమాచారాలు తెలిసినా, తెలియకపోయినా నేను విచారపడను. నేను మిమ్మల్ని మనసా తలుచుకుని ఎప్పుడు పిలుస్తానో తక్షణం మీరు తిరిగి రావలసిందే. 'రాను, రాను' అని మీరు ఎంతగా హఠంచేసినాసరే, నా మాట అబద్ధం కాజాలదు" అన్నది బాష్పరుద్ధ కంఠస్వరాన.

విప్రదాసు కేవలం ఒక చిరునవ్వు ప్రదర్శించాడు....పసిపిల్లల మాటలకు జవాబు చెప్పకండా తప్పించుకోవాలని సాధారణంగా పెద్దవాళ్ల ప్రదర్శిస్తూండే అల్పహాసం వంటిది.

మోటారు సాగిపోయింది.

